# పీఠిక.

వైశ్యులకు వేదవిహితకర్మలయందు తగినయాదరణయు, విధ్యుక్త. ధర్మములు గోత్రప్రవరలు దెలియజేయు సాధనము లేకపోవినియు, ఇంకసేలముమైసూరు, కర్నూలు ఇత్యాదిస్థలవాసులు కోరుటం జేసియు, వానినియత్యంత సులభశైలితో దెలియజేయుటకై ఏతద్వైశ్యధర్మప్రకాశికయనుగ్రంథభూజము పూర్వోత్తరశాఖలచేచెన్నొంది; కన్యకాపరమేశ్వరి, శంకర, రామానుజ, మధ్వాచార్యాది చరిత్ర ద్వాదశాధ్యాయములనెడి పుష్పంబులచే నుత్తరశాఖయు; వైశ్యఋషులు, వైశ్యచక్రవర్తులు, వైశ్యధర్మములు, వైశ్యగోత్రప్రవరలాదిగ ద్వాదశాధ్యాయములనెడి పుష్పంబులచే నుత్తరశాఖయు; వికసించి కర్మఫలములను ద్విజులచేపొంద ప్రకాశింపచేయబడినది. ఈద్విజత్వము షోడశకర్మాచరణంబుచే గలుంగును. అదిలేనిచో మానవులందరు "జన్మనాజాయతేశూద్రః కర్మణాజాయతేద్విజః" ఇత్యాది ప్రమాణములచే శూద్రులుగ నెంచబడుచున్నారు. గావున నీద్విజత్వసిద్ధికొరకు బ్రహ్మక్షత్రియ వైశ్యులు షోడశకర్మలను (౧. గర్భాదానము, ౨. పుంసవనము, ౩. సీమంతము, ౪. జాతకర్మను, ౫. నామకరణము, ౬. అన్నప్రాశనము, ౭. చౌలము, ౮. ఉపనయనము, ౯. ప్రాజాపత్యము, ౧౦. సౌమ్యవ్రతము, ౧౧. ఆగ్నేయవ్రతము, ౧౨. వైశ్వదేవవ్రతము, ౧౩. గోదానము, ౧౪. స్నాతకము, ౧౫. వివాహము, ౧౬. పితృమేధము)* యథావిధిగ యథాకాలములయం దనుష్ఠించవలయును. ఈకర్మలనరుదుగ బ్రహ్మక్షత్రియ వైశ్యులాచరించుచున్నను కలిప్రాబల్యంబున యాయాకర్మల నాయాకాలములయందు జరుప నసమర్థులై

---

* ఈకర్మలనుగురించి స్మార్తానుక్రమణికయను గ్రంథమందు వివరింపనగును.

భిన్న కాలములయందు జరుపుకొనుచున్నారు. అయితే ౯, ౧౦, ౧౧, ౧౨, ౧౩, కర్మలను సతరము నిప్పుడు నాచరించుటయే లేదు.

కన్యకాపరమేశ్వరి గుండప్రవేశమగునపుడు గుండప్రవిష్టులైన గోత్రజులకును ఫలాయితులైన వైశ్యులకును సంబంధ బాంధవ్యము లేకుండుటకై నిర్ణయించుకొనిన సంకేతనామములనే గోత్రములుగ భ్రమించుచున్నారు. గావున సంకేతనామంబులను, గోత్రములను, ప్రవరలను, సుఖబోధకమగునటుల యిందు ముద్రింపించి యాయాగోత్రములకుసంబంధించిన ఇండ్లపేర్లను, లేనివారు వ్రాసుకొనందగిన స్థలమును గలుగంజేసియున్నారము (పుట ౨౭౯). గావున నేతద్గ్రంథంబును గైకొని యందలి సారమునుగ్రహించి ధర్మములనాచరింపుచునాచంద్రార్కస్థాయిగవర్ధిల్లెదరని మనంబుననెమ్మి నమ్ముచున్నాడను.

ఈగ్రంథము ముద్రించుస్థలమొకచోటును మేముండునది మఱియొకచోటగుటంజేసియిందనేక స్ఖాలిత్యదోషంబు లుండవచ్చుంగావున వానిం, యిందు కోరవడినవిషయములం ఎవరేనిదెలియజేసిన శుద్ధప్రతిచేగాని రెండవకూర్పుయందుగాని సవరణచేయంబడును.

ఈగ్రంథము ద్విజులకత్యంతావశ్యకమగుననియెంచి యిందలిక్రియమందరికి నతిసులభముగ నుండునటుల టపాచార్జి సహితము ౧-౮-౦ ఏర్పరచినారము గావున వలయువారిక్రింద చెప్పియుం వారిపేర వ్రాసి దెప్పించుకొనందగును.

౧౮౯౦-వసం॥ ఆగష్టునెల ౩౦-వ తేది

ఇట్లు
ఆ. లక్ష్మీనరసింహం

# అ వ తా రి క.

వసుదేవకులోద్భూతం వామనాదిస్వరూపిణం । గౌతమాఖ్య పురాధీశం వం
దే శ్రీకృష్ణమూర్తినం ॥౧॥ పూతనాప్రాణహంతారం మధ్యగేహాపాంత్యవాసినం।
దేవకీతపసోద్భూతం కృష్ణమూర్తిమహంభజే ॥ ౨ ॥ గోగణానాంవరారూఢం గోపు
రాంతరవాసినం । గౌతమాఖ్యపురాధీశం వందే శ్రీనగరేశ్వరం ॥ ౩ ॥ నగరేనగరే
వాసంనరాణాం ముక్తిదాయకం । నగరేశమహంవందే నారీదేహార్ధధారిణం ॥ ౪ ॥
దండకామహదరణ్యావాసినౌ వల్కలేనకృతచిత్రరూపిణౌ । పాతుమాంమునివరేణ్య
వందితౌరాజరూప ధృతరామలక్ష్మణౌ ॥ ౫ ॥ వేదార్థ తత్వనిపుణోఖిలవేదరాశి
రాలోచనే నిఖిలతత్వవిశాలబుద్ధిః । న్యాయాధికారబల దర్శితచిత్తవృత్తిః లక్ష్మీనృ
సింహవిభురేవ విదాంవరిష్ఠః ॥ ౬ ॥ ఆజన్మలక్ష్మీ పరిపుష్టితాంగః సదాకరైర్దానవి
భూషితాంగః । యశోదయాలం కృతపుణ్యమూర్తిః నాథోరఘూణామథవాయదూ
నాం ॥ ౭ ॥ కలాయుగేకలిపయే వత్సరేసుగతేషుచ । అనావృష్ట్యాదిదోషేణ దు
ర్భిక్షభయసంయుతాః । బ్రాహ్మణాబహవస్తత్ర విచారంచక్రురుత్తమం ॥ ౯ ॥
తపోధనోగౌతమోస్తిసనః ఖేదంహరిష్యతి । సర్వైర్భిరిత్యాగంతవ్యం గౌతమస్యా
శ్రమేధునా ॥ ౧౦ ॥ సుఖితుంశ్రూయతేతత్ర ప్రాచీనోబహవోగతాః । ఏవంవిమృ
శ్యభూదేవాః సాగ్నిహోత్రాఃకుటుంబినః ॥ ౧౧ ॥ సగోధనాసదాసాశ్చ గౌతమ
స్యాశ్రమంయయుః । బృహదద్రింపరిత్యజ్య భాస్కరాచార్యసంయుతాః ॥ ౧౨॥
విట్కులైస్సహచాగత్య కన్యకాపరమేశ్వరీ । గౌతమాశ్రమమాశ్రిత్య సింహాసన
యుతాసతీ ॥ ౧౩ ॥ దేవీభాగవతేచైవ ద్వాదశస్కంధసంజ్ఞకే । అధ్యాయేద్వా
దశేచైవ ఏతత్సర్వముదాహృతం ॥ ౧౪ ॥ తదాదిగౌతమపురీ సింహాసనయుతాభ
వత్ । తదాస్తోతుంప్రచక్రామ భాస్కరాచార్యసంయమీ ॥ ౧౫ ॥ లలితాంబాం
విశాలాక్షుం నవరత్నసుభూషణాం । కన్యాంకుమారీంలోకేశాం సదావిట్కులపావ
నీం ॥ ౧౬ ॥ శ్రీగౌతమాఖ్యపురనివాసీ శ్రీభాస్కరాచార్యవంశ వర్ణనంప్రకటయా
మి ॥ తంత్రోటకార్య వంశస్య తోటపల్లీతికథ్యతే । తోటపల్ల్యాఖ్యవంశేయేజా
తాః గౌతమగోత్రిణః ॥ ౧౭ ॥ బ్రహ్మంశేనైవతాస్తె భాస్కరాచార్యసంజ్ఞకాః।
శ్రీగౌతమాఖ్యవంశాబ్ధౌరాకాచంద్ర ఇవోదితః ॥ ౧౮ ॥ నందార్యస్సకలానంద శి
ష్యసందోహదేశికః । తస్మాద్రామప్రసాదేన రామయజ్వావిశుద్ధధీః ॥ ౧౯ ॥ ఆచా
రేవా విచారేవా ప్రాయశ్చిత్తెనియంతృతా । యథాశాస్త్రం యథాన్యాయ్యం శి
ష్యాణ్రక్షతిసర్వదా ॥ ౨౦ ॥ రామస్వామ్యాఖ్యయజ్వానః పుత్రోఅభూద్భూరి
విశ్రుతః । ఈశ్వరార్యఇతిఖ్యాతః వైశ్యానాంకులదేశికః ॥ ౨౧ ॥ కన్యాకుమారీ
పూజాయాం నిత్యంభక్తిసమన్వితః ॥ ౨౨ ॥ వాసవాంబార్చనేనిత్యం సదాభక్తి
యుతోభవత్ ॥ సర్వధార్యాఖ్యవర్షేతు ఆశ్వీజెశుక్లపక్షగే । నవమ్యాంసప్రదోషేచ
పూజాకాలేవిశేషితః ॥ ౨౩ ॥ మామాహూయసుసంతుష్ట స్మితపూర్వమభాషత।

దేవీవృత్తాంతమఖిలం శ్రోతుమిచ్ఛతి మేమనః । వదలోకోపకారార్థం వసిష్ఠో మేదయాపరః ॥ ౨౪ ॥ శంకరాచార్యవృత్తాంతం రామానుజకథామృతం । మధ్వాచార్యస్యవృత్తాంతం వాసవాంబాకథామృతం ॥ ౨౫ ॥ వర్ణాశ్రమాణాంవృత్తాంతం సంక్షేపీకృత్యమేవద । పురోహితోసి మేబ్రహ్మన్ దయాంకురుమహామతే ॥ ౨౬ ॥ భాస్కరాచార్యవర్యేణ ప్రార్థితస్సపురోహితః । వక్తుమారభత శ్రీమాన్ భాస్కరార్యకవిర్ముదా ॥ ౨౭ ॥ భారద్వాబ్ధిచంద్రేణ భాస్కరార్యేణధీమతా । కృతాధర్మార్థ సహితావిశాంధర్మప్రకాశికా ॥ ౨౮ ॥

## దేవపూజాకాలే వైశ్యవర్యకృత । భాస్కరాచార్యస్తుతిః

## గురుధ్యానశ్లోకాః.

వందేశ్రీభాస్కరార్యం వరగుణసహితం బ్రహ్మవంశప్రసూతం వంద్యం వేదాంతవేద్యం ప్రథితవరవచోవశ్యవైశ్యాగ్రజాతిం । భస్మచ్ఛన్నత్రిపుండ్రప్రకటితవిలసత్ఫాల రుద్రాక్షమాలం హస్తాబ్జేధారయంతం స్ఫటికమణియుతం చాక్షమాలాంజపంతం ॥ ౧ ॥ ప్రాతస్స్మరామిసకలాఘనివృత్తిహేతోః ప్రజ్ఞాప్రభావపరిరక్షితవైశ్యకోటిం । రుద్రాక్షబిల్వతులసీకృతమాలికాభిః ప్రఖ్యాతదివ్యతనుశోభితమార్యవర్యం ॥ ౨ ॥ వదావదాస్పదే పదేపదేపదేసుధాకిరంగిరంప్రపంచయత్యహోసభాస్కరార్యదేశికే । జడాననష్టడాననః సపద్మభూరుపద్రుతః । ఫణీశితాతృణీకృతో బృహస్పతిఃప్రహాస్యతే ॥ 3 ॥

తాత్పర్యము ॥ లోకోపకారార్థము గౌతమపురి సింహాసనారూఢులైన శ్రీభాస్కరాచార్యులవారి కోరిక ప్రకారము వారి వసిష్ఠులైన భాస్కరశాస్త్రిలవారిచే ఈగ్రంథము రచియింపంబడెను ఈగ్రంథమందుండు ధర్మములను వైశ్యులు ముఖ్యముగ అవలంబించుచు వారు షోడశకర్మములను వేదోక్త మంత్ర సహితముగ నాచరించ వలయునని శ్రీభాస్కరారుచ్యాలవారి ఆజ్ఞా.

# విషయసూచికా.



## పూర్వభాగః.



## ఉత్తరభాగః.

ఓమ్
పరబ్రహ్మణేనమః.

# అథవైశ్యధర్మప్రకాశికాయాం

## ప్రథమోఽధ్యాయః.

### పరమేశ్వరస్తుతిః.

శ్లో॥ ఓం నమోభగవతేతస్మైయతయేతచ్చిదాత్మకం।
పురుషాయాదిబీజాయ పరేశాయాభిధీమహి ॥

తా॥ ప్రపంచమునకు కారణకర్తయు జ్ఞాన స్వరూపుడున్ను షడ్గుణైశ్వర్య సంపన్నుడగు ఆ భగవంతునికొరకు నమస్కారమని గ్రంథకర్త నమస్కారరూపమయిన మంగళమును చేయుచున్నాడు.

౨. క్లేశేభ్యోవ్యతిరిక్తస్త్వం నిర్గుణోనిరుపాశ్రయః।
నిర్వికల్పోనిరాధారో నిర్వికారోనిరాశ్రయః ॥

తా॥ దుఃఖములకు వెలిగానుండునట్టి గుణాకార ఆశ్రయములచే భగవంతుడు అపరిచ్ఛేద్యుడని వికార రహితుడని తెల్పుచున్నాడు.

3. యస్మాదిదంజగదజాయత యత్రతిష్ఠత్యంతే సమస్తమిదమస్తముపైతియత్ర। తస్మైనమస్సదసదాదివికల్పశూన్య చైతన్యమాత్రవపుషే పురుషోత్తమాయ॥

తా॥ ఎవనివలన ఈప్రపంచము ఉత్పత్తిస్థితిలయములను చెందుచున్నదో అట్టి సదసద్వికల్ప రహితుడగు పరమ పురుషోత్తమునికొరకు నమస్కారము.

౪. యోధారయతిభూతాని ధరాంచైవసపర్వతాం।
ధ్యానయోగేనవిత్తాస్య తంవదంతిమహారాజసం ॥

తా॥ పంచభూతములనున్ను పర్వతములతో కూడినభూమినిన్ని ఎవడుధరించునో ధ్యానముచే ఎవనిని తెలుసుకొననగునో ఆయనను మహాబలముగలవానినిగా జనులుచెప్పుచున్నారు అనగా అట్టివాడెవడో ఆయనే దేవుడని తాత్పర్యము.

౫. బ్రహ్మావిష్ణు శివాఖ్యాభిః కల్పనాభిరుదీరితః। అనాఖ్యేయస్వ రూపాత్మ న్ననాఖ్యేయప్రయోజనః ॥ అనాఖ్యేయాభిధానం త్వాంనతోఽస్మిపరమేశ్వర॥

తా॥ ఓ దేవుడా నీవు బ్రహ్మ, విష్ణు, శివ అను కల్ప నామములచే చెప్పబడితివి. నీకు స్వరూపము, కార్యము, పేరు, ఫలానదని నిర్ధారములేదు. అట్టి నిన్ను నమస్కరించెదను.

ఇతి వైశ్యధర్మప్రకాశికాయాం పరమేశ్వర స్తుతిర్నామ
ప్రథమోఽధ్యాయః
సంపూర్ణం.

---

## అథ ద్వితీయోఽధ్యాయః.

—*(దేవీ స్తుతిః)*—

౧. అస్తుస్వస్తికృతేవస్తు నిస్తులానందనిర్భరం ।
వస్తుతచ్ఛాంకరంనస్తా దీప్సితార్థసమృద్ధయే ॥

తా॥ నిస్సమానమయిన సంతోషముగల శంకరుడను వస్తువమాకిష్టములగు కోరికలిచ్చి శుభములు కలుగజేయునని ప్రార్థన.

౨. విఘ్నేశం విమలాశయంచ విభుధాన్విద్యాధరాదీన్। తథావాగ్దేవీం గ్రహనాయకాన్ వరమునీన్ నత్వాహృదబ్జేసదా ॥
నిత్యంమేహృదివాసినం రఘుపతిం జ్ఞానాశ్రయం శ్రీయుతం నిత్యానందమజం భజామిసతతం స్వాభీష్టసిద్ధ్యర్థయే ॥

తా॥ గ్రంథము నిర్విఘ్నముగ పరిపూర్తిచెందుటకై మంచిమనస్సుగల విఘ్నేశ్వరుని దేవతలను విద్వాంసులను శ్రీరాములను ప్రార్థించుచున్నాడు.

3. సమస్తభువనాధారాం సర్వాభరణభూషితాం ।
మహాదేవీంనమస్కృత్య గ్రంథమేతత్కరోమ్యహం॥

తా॥ సకలలోకాధారమై సర్వాభరణభూషితయైన దేవినినమస్కరించి ఈగ్రంథము చేయుచున్నానని దేవీప్రార్థన.

౪. శ్రీకన్యాం జన్మధన్యాంశుభవిడభిజనప్రాప్తకల్పాఖ్యవన్యాం మాన్యామార్యై స్తథార్యై ర్మధురిపుమహిమ ప్రోషితార్తి యద్దైన్యాం । వందేబాలాబ్జహస్తాం వరగతికనిశాచూర్ణఫాలప్రశస్తాం శాంతామైశ్వర్యరూపాం కమలనయనగాంఖ్యాత వైశ్యానురాగాం ॥

తా॥ పుట్టినదిమొదలు ధన్యురాలును ఆర్యులకుకల్పవృక్ష వనమున్న ఆర్యులైన గుప్తులచే సన్మానింపబడినట్టిన్ని లేతకమలములనుధరించినట్టిన్ని విష్ణుమహిమవల్ల తనసంకటము పోగొట్టుకొన్నట్టిన్ని పసుపుచే మనోహరమగు ముఖముగలిగినట్టిన్ని ఐశ్వర్య రూపయగుకన్యను నమస్కరించుచున్నాను.

౫. లక్ష్మీంకరోతుసతతం మయివాసవీశ్రీర్దాక్షిణ్య రక్షణవిచక్షణదక్షభూమిః । అక్షీణధైర్య పరిరక్షితవైశ్యజాతిస్సాక్షాద్ధనేంద్ర సహజప్రతిమానభూతిః ॥

తా॥ అత్యంత విశ్వాసముచే రక్షించునట్టియు అధిక ధైర్యముచే ఆర్యులను సంరక్షించునట్టియు ప్రత్యక్షముగా కుబేరునివంటి ఐశ్వర్యముగల కన్యకాంబ మాకు నిరంతరైశ్వర్యము లిచ్చునుగాక.

౬. అరుణాంకరుణామూర్తిం కుమారీంనవయవ్వనాం ।
సర్వశృంగారవేషాఢ్యాం మందస్మితముఖాంబుజాం ॥

తా॥ నూతనమయిన యవ్వనము గలిగినట్టియు, చిరునవ్వుగలకమల సదృశ్యముఖము గలిగినట్టియు, ఎఱ్ఱనైనదియునగు కరుణాదేవతయైనట్టి సమస్త శృంగారవేషముచే నొప్పుచున్న (ఆదేవిని) నమస్కరించుచున్నాను.

౭. కృతేతురేణుకాదేవీం త్రేతాయాంజనకాత్మజాం ।
ద్వాపరేద్రౌపదీదేవీం కలౌవాసవకన్యకాం ॥

తా॥ కృతయుగమందు రేణుకాయనిన్ని, త్రేతాయుగమందుసీతయనిన్ని, ద్వాపరమందు ద్రౌపదియనిన్ని, కలియుగమందువాసవకన్యయని, యుగానుసారము గా దేవికిపేళ్లున్నవి.

౮. నిరంతరంభజామ్యేవ సాక్షాత్త్రిపురసుందరీం ।
ధర్మార్థకామమోక్షార్థం త్రిలోకజననీంశివాం॥

తా॥ ధర్మార్థ కామమోక్షములను పురుషార్థములకై మూడులోకములకు తల్లియగు త్రిపురసుందరిని ప్రత్యక్షముగా భజించుచున్నాను.

౯. బ్రహ్మేంద్రాదిస్తుతాసాహి త్సర్వలోకైకనాయకీ ।
సృష్టిస్థితివినాశాయ కారణాజగదాత్మికా ॥
స్తువంతియేనిత్యమగణ్యరూపాం దేవీంస్వతోభక్తఫలప్ర
దాయినీం । సదర్యవర్యాన్ పరిపూర్ణకామాన్‌కరోతి దే
వీకరుణాయుతాతాన్ ॥

తా॥ బ్రహ్మ, రుద్ర, ఇంద్ర మొదలగు వారిచే నుతింపబడి సర్వలోకములకు నాయకురాలయిన యీదేవిని ఎవరు స్తోత్రముజేసెదరో వారికిన్ని ముఖ్యముగా ఆర్యులకున్ను కావలసిన ఇష్టములనిచ్చుచున్నది.

౧౦. యఇదంశృణుయాన్నిత్యం దేవీమాహాత్మ్యముత్తమం।
యఃపఠేత్సతతంభక్త్యాసర్వ పాపైఃప్రముచ్యతే ॥

తా॥ ఈ ఉత్తమమగు దేవీమహాత్మ్యమును ఎవడుచదువునో ఎవడువినునో, ఎవడుచక్కగా స్మరించునో వాడు సకల పాపములవల్ల విడువబడుచున్నాడు.

ఇతి శ్రీగౌతమపురినిలయ భాస్కరకవినామధేయ ప్రణీ
తాయాం వైశ్యధర్మప్రకాశికాయాం
దే వీ స్తు తి ర్నా మ
ద్వితీయోఽధ్యాయః
సం పూ ర్ణం.

---

## అథతృతీయోఽధ్యాయః.

—*(దేవతాసంమంత్రణం.)*—

౧. పురాశ్రీనైమిశారణ్యే మునయోవీతికల్మషాః ।
శృత్వాసూతముఖాత్సర్వా న్పురాణాన్ధర్మసంయుతాన్॥

దేవతలయొక్క సమావేశము.

తా॥ పూర్వము నైమిశారణ్యమందు పరిశుభ్రమైన మునులుసూతునివల్ల సకలధర్మములను తెలుపునట్టి పురాణములను విని, మందరిశ్లోకముతో నన్వయము.

౨. ఋషయస్సూతసామీప్యమాగత్యేదంవచోబ్రువన్ ।
సూతసర్వార్థతత్వజ్ఞ ప్రాజ్ఞోసివిమలాశయ ॥

తా॥ మునులు సూతుని సమీపమునకువచ్చి మంచిమనస్సుగలిగినట్టియు సమస్తకార్యములయొక్క నిశ్చయము తెలిసిన యోసూతుడా అని సంబోధనముతో అడుగుచున్నారు.

3. బ్రాహ్మణక్షత్రియాణాంతు శ్రుతంధర్మంత్వయేరితం ।
వైశ్యాచారాన్వదస్వేతి పప్రచ్ఛుఃప్రీతిపూర్వకాః॥

తా॥ (అయ్యా) బ్రహ్మక్షత్రియులయొక్క ధర్మములను మీరుచెప్పగవింటిమి. వైశ్యుల ధర్మములు చెప్పుమని సంతోషపూర్వకముగా అడిగిరి.

౪. శ్రుత్వాసూతోవచస్తేషాం ధ్యాత్వాదేవంజనార్దనం।
ఊచేమధురయావాచా హర్షపర్యాకులేక్షణః॥

తా॥ సూతుడు ఆమునులయొక్క వాక్కునువిని విష్ణువునుధ్యానించుకొని ఆనందభాష్పములచే చెదరినదృష్టిగలవాడై మధురమైన వాక్కుచే పలికెను.

౫. ఉక్తంపురామయాచైతద్ధర్మంవైశ్యకులోచితం ।
బ్రంహాండేచోత్తరేఖండే పురాణేప్రతిపాదితం ॥

తా॥ ఈకథ పూర్వము బ్రహ్మాండపురాణోత్తరఖండలో నాచేచెప్పబడినది.

౬. విస్మృతంతద్భవద్భిః కింప్రత్యేకంశ్రోతుమిచ్ఛథాః।
పురాస్యాలంకాయనాయ ఋషయేప్రోక్తవానహం॥

తా॥ (ఇప్పుడు) మీచేత ఆకథ మరువబడినదేమో (లేక) ప్రత్యేకముగా విన నిచ్ఛయించితిరేమో పూర్వము శ్యాలంకాయనుడను (ఆర్య) ఋషికి నేను చెప్పియుంటిని.

౭. సోపివైశ్యాన్ముషీన్దృష్ట్వా కథయామాసధార్మికః।
తదేవధర్మంవక్ష్యేహం శృణుతానన్యమానసాః॥

తా॥ ఆ శ్యాలంకాయనుడు వైశ్యఋషులనుగూర్చి ఈకథచెప్పియుండెను అదే ధర్మమేచెప్పుచున్నాను. మనస్కరించివినుడు.

శ్యాలంకాయనః.

౮. కదాచిన్నారదోయోగీ పరానుగ్రహకామ్యయా।
పర్యటన్సకలాన్లోకాన్మర్త్యలోకముపాగమత్ ॥

తా॥ (శ్యాలంకాయనుడు వైశ్యమునులకు చెప్పినట్టు సూతుడుమునులకు చెప్పుచున్నాడు) ఏమనగ పూర్వము నారదయోగిపరులకనుగ్రహము చేయవలయును ననుయిచ్ఛతో సకలలోకములను తిరుగుచు భూలోకమునకువచ్చెను.

౯. క్షేత్రాణిచవిచిత్రాణి తీర్థానిశుభదానిచ।
పశ్యన్విశ్వేశ్వరాదీని దైవతానిసమంతతః॥

తా॥ చిత్రములైన క్షేత్రములను, శుభములైన తీర్థములను ఈశ్వరుడు మొదలైన దేవతలను అంతట చూచుచు (వచ్చెను)

౧౦. శృతిస్మృతిపరిభ్రష్టాన్ మిథ్యాచారపరిగ్రహాన్।
అద్వైతార్థపరిజ్ఞానా ద్విమోహితధియోధికం॥

తా॥ వేదము ధర్మశాస్త్రము ఈ రెంటి మార్గములనుంచి తప్పిపోయినట్టిన్ని దంభాచారము చేయుచున్నట్టిన్ని (కేవల) అద్వైతసిద్ధాంతము తెలుసుకోనక అజ్ఞానబుద్ధి గలిగినజనులను (చూచి)

౧౧. దురాచారరతాన్సర్వానసత్యహింసాపరాయణాన్।
పరాపవాదనిరతాన్ పరద్రవ్యాభిలాషకాన్॥

తా॥ దురాచారములు చేయుచున్నట్టియు అసత్యమందాసక్తులైనట్టియు, పరాపవాదమందే ఇష్టముగలిగినట్టియు పరద్రవ్యాభిలాషగల సర్వవర్ణములనున్ను.

౧౨. బ్రాహ్మణక్షత్రియవిశాన్ శ్రౌతకర్మవగర్హితాన్।
దృష్ట్వాసర్వాన్మహాఘోరాన్విస్మయంపరమంగతః॥

తా॥ వేదవిహిత కర్మలచే నిందితులున్ను, పాపిష్ఠులున్ను అగుసమస్త బ్రాహ్మక్షత్రియ వైశ్యులనుచూచి మిక్కిలి ఆశ్చర్యముచెందినవాడగుచు.

౧౩. సౌరాన్శాక్తాన్పాశుపతాన్గణేశమతగానపి।
వైష్ణవాన్భైరవీయాంశ్చతత్తచ్చిహ్నసమంచితాన్॥

తా॥ సౌరమతస్తులను పాశుపతమతస్తులను గాణాపత్యులను వైష్ణవులను శక్తిమతస్థులను ఆయా మతచిహ్నములతోకూడినవారినిచూచి.

౧౪. మనస్యచింతయద్ధీమాన్ జనాఃపాషండినోభవన్।
ఇత్యేషాంనష్టబుద్ధీనాం పరలోకఃకథంభవేత్॥

తా॥ జనులందరు పాషండులైరి బుద్ధిలేని యీజనులకు పరలోకమెట్లు దొరకును అని బుద్ధిమంతుడగు నారదుడు (తన) మనస్సునందాలోచించెను.

౧౫. ఇతిచింతాకులోభూత్వా నారదోదివ్యదర్శనః।
బ్రహ్మలోకమగాత్తూర్ణం పిత్రేసర్వంనివేదయత్॥

తా॥ దివ్యదృష్టిగల నారదుడు పై శ్లోకమందు చెప్పినట్టుచింతించి శీఘ్రముగా బ్రహ్మలోకమునకుబోయి తమతండ్రియగు బ్రహ్మకొరకు వృత్తాంతమంతయుంజెప్పెను.

౧౬. చతుర్ముఖస్తతద్వాక్యం శృత్వానారదభాషితం।
వైకుంఠమగమద్దివ్యం నిత్యముక్తైర్విరాజితం।

తా॥ నారదుడుచెప్పిన పైవృత్తాంతమునువిని నిత్యముక్తులచేప్రకాశించుచున్న వైకుంఠమునకు వెళ్లెను.

౧౭. పితామహోవిష్ణుమాద్యందృష్ట్వా సంప్రీతమానసః।
శంఖచక్రగదాపద్మవన మాలావిరాజితం॥

తా॥ ఆదిపురుషుడైనట్టియు శంఖచక్ర గదాద్యాయుధములచేతను వనమాలయనుహారముచేతనుప్రకాశించుచున్న విష్ణువునుచూచి బ్రహ్మసంతోష మనస్కుడాయెను.

౧౮. శ్రీయాభూమ్యాచసహితం శేషశాయినమచ్యుతం।
నత్వాభూలోకవృత్తాంత మఖిలంచాబ్రవీత్స్వయం॥

తా॥ శ్రీదేవి భూదేవులతో శేషశయనుడైన విష్ణునిజూచి నమస్కరించి భూలోకసమస్త వృత్తాంతమంతయు బ్రహ్మచెప్పెను.

౧౯. సర్వంబ్రహ్మాఖాచ్ఛృత్వావిష్ణురూచేకుమారకం॥
రుద్రమాహ్వాయశీఘ్రంత్వంగత్వాకైలాసవాసినం॥

తా॥ బ్రహ్మవల్ల భూలోక వృత్తాంతమంతయు విని విష్ణువు తనకుమారుడయిన బ్రహ్మనుగూర్చి చెప్పినదేమనగా, నీవు కైలాసమందుండు ఈశ్వరుని త్వరగా పిలువమనిచెప్పెను.

౨౦. తతఃకైలాసమాగచ్ఛద్బ్రహ్మలోకపితామహః।
తందదర్శమహాబ్రహ్మాగిరిం చంద్రసమప్రభం॥

తా॥ అనంతరం బ్రహ్మదేవుడు కైలాసపర్వతమునకు వచ్చి చంద్రునివంటి కాంతిగల ఆపర్వతమును చూచెను.

౨౧. తస్మిన్నచతుర్ముఖోరుద్రం నత్వాహేద్ధంసుభాషితం।
సామ్నిన్విష్ణోరాజ్ఞయాహ మాగతోస్మితవాంతికం॥

తా॥ ఆపర్వతమందు చతుర్ముఖబ్రహ్మ భూతపతినిచూచి నమస్కరించి ఓస్వామీ నేను విష్ణ్వాజ్ఞవల్ల నీసమీపమునకు వచ్చితిని.

౨౨. లోకానుగ్రహకామ్యేనవిష్ణునాలోకజిష్ణునా।
తదేహితత్రగంతవ్యంప్రేరితోస్మివిశారద॥

తా॥ లోకమునకు అనుగ్రహముచేయుకోరికగల విష్ణువుచే ప్రేరేపింపబడి తిని గనుక ఆయనసమీపమునకు పోవలయును.

౨౩. ఇతివిజ్ఞాపితశ్శంభుర్బ్రహ్మ్రాసాకంముదాన్వితః।
ఇంద్రాద్యైస్స్వగణైశ్చైవయయౌవైకుంఠపత్తనం॥

తా॥ ఈప్రకారముగా బ్రహ్మచే విన్నపించబడిన శివుడు ఇంద్రాది దిక్పాలకులచేతను తనయొక్క ప్రమథగణములచేతనుకూడి మిక్కిలి సంతోషముతో వైకుంఠమునకు వెళ్లెను.

౨౪. చండాదిద్వారపాలాద్యైఃవిష్ణుంసముపసేవితం।
మహాశేషేసమాశీనంసంప్రణమ్యాభివాదయత్ ॥

తా ॥ అక్కడ చెండప్రచండులను ద్వారపాలకులచేత సేవింపబడి శేష శయనమందుండిన విష్ణువును ఈశ్వరుడు అభివాదన పూర్వకముగా నమస్కరించెను.

౨౫. సర్వేచపరమాత్మానం బద్ధాంచలిపుటాస్థితాః।
దృష్ట్వావిష్ణుర్మహాప్రాజ్ఞోచతుర్ముఖముదాచసః॥

తా ॥ ఇంద్రుడే మొదలగు అందరు పరమాత్మయగు ఆవిష్ణువునుగూర్చి చేతులు జోడించుకొని యుండిరి. పిదప - సర్వజ్ఞుడయినవిష్ణువు బ్రహ్మనుగూర్చి పలికెను.

౨౬. వదసర్వంశంకరాయ మద్భక్తాయజితారయే।
ఇత్యాజ్ఞప్తఃపరేణాయం విష్ణునాకమలోద్భవః॥

తా॥ (అయ్యా) నాకు భక్తుడయి శత్రువులను జయించినట్టిలోకములకు సుఖకరుడయిన శివునికి భూలోక వృత్తాంతమంతయుచెప్పమని బ్రహ్మవిష్ణువుచే ఆజ్ఞాపితుడయి.

౨౭. ప్రణమ్యపరమాత్మాన మభివాద్యచసాదరం।
ఈశ్వరాయమహాప్రాజ్ఞే జ్ఞాపయామాసపూర్వశః॥

తా॥ పరబ్రహ్మస్వరూపుడగు ఆవిష్ణువును అభివాదన పూర్వకముగా నమస్కరించి ప్రాజ్ఞుడయిన ఈశ్వరునకు వృత్తాంతమంతయు చెప్పెను.

౨౮. శ్రుత్వాబ్రహ్మముఖాత్సర్వం సంప్రణమ్యపరాత్పరం।
బద్ధాంజలిపుటాఆసన్ మానితా స్తేనవిష్ణునా ॥

తా ॥ ఈశ్వరుడున్ను ఇతర దేవతలున్ను బ్రహ్మవల్ల చెప్పిన దాన్ని విని పరుడగు విష్ణువును నమస్కరించి ఆయనచే సన్మానింపబడి అంజలిబద్ధులైయుండిరి.

౨౯. హర్షేణమహతాయుక్తా లోకానాంసుఖమీప్సవః ।
హరేరాజ్ఞాంప్రతీచ్ఛంతస్తత్రైవసంస్థితాః ॥

తా ॥ (నేడు విష్ణుదర్శనమాయెనని) గొప్పసంతోషముతో లోకములకు సుఖమపేక్షించు వారలయి విష్ణ్వాజ్ఞను ఇచ్ఛయించుచూ నచ్చటనే సమస్త దేవతలుండిరి.

౩౦. ధాతాకేవలమాహైనం శంభుంలోకవివృద్ధయే ।
కలౌయుగేనరాస్సర్వే సర్వధర్మవివర్జితాః ।
తస్మాత్తాన్శిక్షితుంసమ్యగవతారంకురుప్రభో ॥

తా ॥ ( అప్పుడు ) బ్రహ్మ మాత్రము రుద్రుణ్ణి చూచి లోకానుగ్రహము కొరకు ఓ ప్రభువా కలియుగమందుండు జనులు సర్వ ధర్మములను విడిచియున్నారుగాన వారలను శిక్షించి సన్మార్గ ప్రవర్తకులను చేయుటకై అవతారముచేయుము అని చెప్పెను.

౩౧. ఇదానీంభూతలేకశ్చిద్బ్రాహ్మణోనియతేంద్రియః ।
త్వాముద్దిశ్యతపఃకుర్వన్సంతానార్థీసతిష్ఠతి ॥

తా ॥ ఇప్పుడు లోకమందు సంతానాపేక్షగల నియతేంద్రియుడగు బ్రాహ్మణుడు నిన్నుగురించి తపస్సుచేయుచున్నాడు.

౩౨. ఆర్యానామ్న్యాంతస్యపత్న్యాం మవతారయసాంప్రతం ।
అవతార్యద్విజక్షత్ర వైశ్యసూద్రాదికాన్క్రమాత్ ॥

తా ॥ ఇప్పుడు ఆయనభార్యయగు ఆర్యాంబయందు నీ వవతరించుము. అవతరించి బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులను వరుసగా (ముందరి కన్వయము.)

33. తత్తద్ధర్మేషునిరతాన్ కురుష్వదయయావిభో ।
ఇత్థమభ్యర్థితోదేవః చతుర్వక్త్రేణధీమతా ॥

తా ॥ ఆయా ధర్మములయందుండునట్లు చేయుము అని చతుర్ముఖ బ్రహ్మచే యాచింపబడి ప్రత్యుత్తరమిచ్చెను.

శంకరోవాచ.

౩౪. తథాస్త్విత్తిమహాదేవో పరమానందనిర్భరః ।
ఉవాచవచనంచేదం గంభీరార్థయుతంసమం ॥

తా ॥ నేను అదేరీతినసే భూమియందు అవతరించెదనని ఈశ్వరుడు గంభీరార్థముగల యీపయిమాటను సంతోషయుక్తుడయి బ్రహ్మతో పలికెను.

ఆదిశేషోవాచ.

౩౫. ఆదిశేషస్తతఃప్రాహ వైష్ణవానాంసమృద్ధయే ।
అహంరామానుజోభూత్వా భూమింగచ్ఛామిసాదరం ॥

తా ॥ అనంతరమందు ఆదిశేషుడు చెప్పినదేమనగ నేను రామానుజుడై భూలోకమునకు విశ్వాసముగా బోవుచున్నాననెను.

౩౬. విశిష్టాద్వైతసిద్ధాంతం జనానాంసందిశామ్యహం ।
భూమ్యాంశ్రీవైష్ణవద్వేష్యాన్ జిత్వాతేషాంమ్మతానిచ ॥
ఖండయిత్వాపునస్సర్వాన్ ద్రక్ష్యేభాగవతానహం॥

తా ॥ భూమియందు విశిష్టాద్వైతము అందరికి బోధించి వైష్ణవ శత్రువులను వారల మతములను సహాజయించి మరల భగవత్ భక్తులయిన మిమ్ములను చూచెదనని ఆదిశేషుడు చెప్పెను.

౩౭. తతోవాయుస్స్వయంప్రాహ ద్వైతానాంమతసిద్ధయె ।
ద్వైతానామప్యహంనిత్యం భవేయముపదేశికః ॥

తా ॥ అనంతరము వాయువు భూలోకమందు ద్వైతమతస్థులకు (మధ్వులకు) ద్వైతమతముపదేశించి వారలకాచార్యుడ నయ్యెదను.

౩౮. ప్రథమోహనూమాన్నామ ద్వితీయోభీమనామచ।
మధ్వాఖ్యేతిచ తార్తీయం ధృత్వానామకలౌయుగే।
నివసామిచమద్భక్తా వైష్ణవాన్‌కారయామ్యహం॥

తా॥ కలియుగమందు హనుమంత, భీమ, మధ్వ అనుపేళ్లచేనాభక్తులనందరిని వైష్ణవులజేయుచు భూమియందుండెదను.

3౯. తతోదేవీస్వయంప్రాహ భక్తానుగ్రహకామ్యయా।
అహంతావద్యుగేతుర్యే నరలోకేత్రిలింగకే॥

తా ॥ పిదపపార్వతీదేవి తన భక్తుల కిష్టార్థమిచ్చునట్టి ఇచ్చతో నేనున్ను కలియుగమందు భూలోకములో ఆంధ్రదేశమందు (ముందరి శ్లోకమును చూడుడు)

౪౦. దేశేద్రవిణసంపన్నే బృహత్పర్వతపట్టణే।
కుసుమశ్రేష్ఠినఃపత్న్యాం సంభవామివిశాంకులే॥

తా ॥ ద్రవ్యసంపన్నమగు పెనుగొండ పట్టణమందు కుసుమశ్రేష్ఠియను ఆ ర్యవర్యుని భార్యకు పుత్రినైయుండెదను.

౪౧. వాసవాంబేతికన్యేతి నామ్నాఖ్యాతింభజామిచ।
విష్ణువర్ధననామానం మత్సౌందర్యవిమోహితం॥

౪౨. రాజానంనాశయామ్యేవ తేజసామద్గతేనచ।
తతోవైశ్యానహంరక్షే మద్భక్తాంస్తుదృఢవ్రతాన్॥

తా ॥ భూలోకమునందు వాసవ కన్యకయను పేరుచే నాసౌందర్య మోహితుడగు విష్ణువర్ధనరాజును నాతేజస్సుతో నసింపజేసి నాకు భక్తులైన వైశ్యులను రక్షించు చున్నాను.

౪3. కన్యకాచేతినామ్నైవ తాన్రక్షామిసమంతతః।
మమపూజానిమిత్తంతు వైశ్యానాంకర్మవృద్ధయె॥

తా ॥ కన్యకాంబయను పేరుచే ఎల్లప్పుడు వైశ్యులను రక్షించెదను నాపూజానిమిత్తమును వైశ్యులకు పురోహిత కర్మాభివృద్ధికొరకున్ను (ముందరి శ్లోకము చూడుము.)

౪౪. చతుర్ముఖోభాస్కరార్య నామ్నా తేషాంహితంవదన్।
పురోహితోగురురితి జాయతాంధరణీతలే॥

తా ॥ చతుర్ముఖ బ్రహ్మ పౌరోహితుడని గురువని పేరుపెట్టుకొని వైశ్యులకు హితముచెప్పుచు భూమియందు భాస్కరాచార్యుడుగాపుట్టని.

౪౫. ఇతిదేవ్యావచఃశ్రుత్వా బ్రహ్మాతద్వదనాచ్యుతం।
ఉవాచదేవతామధ్యే మధురంధర్మసంయుతం॥

తా ॥ ఈప్రకారముగ దేవియొక్క వచనమునువిని బ్రహ్మ ధర్మయుక్తమైన వాక్కును ఆదేవతల మధ్యమందు మధురముగాబలికెను.

౪౬. భాస్కరాచార్యేతినామ్నైవ విశాంధర్మాన్వదన్భువి ।
దేవ్యాఃపూజాంసదా కుర్వన్నివసామిదృఢవ్రతః ॥

తా ॥ భూలోకమందు వైశ్యులకు ధర్మములు చెప్పుచు ఎల్లప్పుడు దేవీ పూజచేయుచు భాస్కరాచార్యులను పేరుచే నుండెను.

౪౭. ఇతిసర్వేసమామంత్ర్యబ్రహ్మావిష్ణుశివాదయః ।
హర్షేణమహతాయుక్తాస్తేభిజగ్ముర్యథాగతం ॥

తా॥ ఈరీతిగా బ్రహ్మ విష్ణు శివాదులాలోచించి అధికసంతోషముతో వెళ్లిరి.

ఇతి శ్రీమద్గౌతమపురనిలయకవికులవర్య భాస్కరార్య
ప్రణీతాయాం వైశ్యధర్మ ప్రకాశాఖ్యాయాం
బ్రహ్మాది దేవతా సమ్మంత్రణం నామ
తృ తీ యో ఽ ధ్యా యః.

సంపూర్ణం.

## అథచతుర్థోఽధ్యాయః.

—*(శంకరావతారకథనం)*—

౧. తతస్సభగవాన్శంభుః జటామండలభూషణః।
ధ్యాత్వాతపశ్చరంతం సద్విప్రంశివగురుంహృది॥

తా ॥ అనంతరము జటలె భూషణముగల శివుడు తన మనస్సునందు తనను గూర్చి తపస్సుజేయుచున్న శివగురువు తలచుకొని.

౨. కేరళేషుచదేశేషుకాలటీతివిరాజతె ।
నగరీధనసంపూర్ణా శిష్టద్విజవిభాసితా॥

తా ॥ కేరళదేశమందు ధనముచేతను శిష్టులైన ద్విజులచేతను కూడుకొని యుండిన కాలటీయను పట్టణముగలదు.

3. స్వావతారంభూతలేచ కర్తుంగత్వామహామతిః ।
అనపత్యోశివగురు ర్ద్విజోశైవమనోహరః ।
తపఃపూర్తింశివరోద్గాతుంతన్మందిరంగతః ॥

తా ॥ ఆపట్టణమందు తన అవతారము భూమియందు చేయవలెనని న్ని తప స్సుచేయు శివగురువునకు తత్ఫలమివ్వవలెనని ఆయనకు ప్రత్యక్షమై ఆయన ఇంటిని గూర్చి వెళ్లెను.

౪. పుత్రోభూత్వాతస్య పత్న్యామార్యాంబాయామజాయత।
కరుణారససంయుక్తో భక్తరక్షణతత్పరః॥

తా ॥ భక్తరక్షణపరుడైనట్టియు కరుణారసముతో కూడుకొన్న ఈశ్వరుడు ఆశివగురువు భార్యయగు ఆర్యాంబయందు పుత్రుడై జన్మించెను.

౫. దివసేమాధవర్తౌచనోచ్చస్థేగ్రహపంచకే।
మధ్యాహ్నేచాభిజిన్నామముహూర్తేచాంద్రయాయికే॥
ఉదయాచలవేలేవభానుమంతంమహాజనం।
ప్రాసూతతనయంసాధ్వీగిరిజేవషడాననం॥

తా ॥ వైశాఖమాసమందు ఐదు గ్రహములుచ్చయందుండగా కటక లగ్నమందున్న అభిజిన్నక్షత్రమందును తూర్పు దిక్కు సూర్యునివలెను కుమారస్వామిని పార్వతివలెను ఆర్యాంబయున్ను శంకరులనుగనెను.

౬. తతఃపిత్రైకాదశేహ్ని నామకర్మమనోహరం।
పుత్రస్యకారయామాస శంకరేతిశుభాక్షరం॥

తా ॥ అనంతరం తండ్రి ఏకాదశ దివసమందు మనోహరమైన శంకరుడనే పేరు బెట్టెను.

౭. తతఃపంచాబ్దపర్యంతం క్రమాద్వృద్ధిముపాగమత్।
తదబ్ద ఏవమౌంజీంతు కారయామాసతత్పితా॥

తా ॥ పిదప ఐదు సంవత్సరముల వరకు క్రమముగా వృద్ధి చెందెను ఐదవ సంవత్సరమే తండ్రి ఉపనయనముచేసెను.

౮. వ్యరాజితమహాప్రాజ్ఞో బ్రహ్మతేజస్సమావృతః।
భాస్వద్భాస్కరదత్తేన తేజసాపావకోయథా॥

తా ॥ అశేషప్రజ్ఞుడగు ఆచిన్నవాడు బ్రహ్మతేజస్సుచే సూర్యకాంతిచే అగ్నివలెనే చక్కగా ప్రకాశించెను.

౯. సర్వలోకేషువిఖ్యాతిం గతవాన్ శంకరోద్విజః।
సర్వశాస్త్రార్థతత్వజ్ఞో సర్వధర్మవినీతవాన్॥

తా ॥ పిదప శంకరుడు సర్వలోకములయందు సర్వశాస్త్రములు తెలిసిన వాడని ప్రసిద్ధిచెందెను.

౧౦. అనంతరంతస్యతాతేది వంయాతేమహాత్మని ।
సకృత్వాచోర్ధ్వదేహాఖ్యం పుణ్యకర్మపితుస్తదా ।
మాతురాజ్ఞాంవహన్స్వార్థ్యా న్యవసత్సుహితోగృహే ॥

తా ॥ అనంతరమందు ఆయనతండ్రి చనిపోగా నతనికి పవిత్రమైన అపరకర్మనుచేసి తల్లియొక్క ఆజ్ఞను సిరసావహించి ఇంటియందు సుఖముగా ఉండెను.

౧౧. సకదాచిత్స్నాతుకామో చూర్ణీనామనదీంగతః ।
తస్యాంకశ్చిద్గ్రాహవత్య పాదావస్యపరిగ్రహీత్ ॥

తా ॥ ఆశంకరుడు ఒకనాడు స్నానముచేయుటకై చూర్ణీయను పేరుగల నదికి స్నానమునకు పోగా అందులో నొక మొసలి ఈయనయొక్క పాదములను పట్టుకొనెను.

౧౨. తస్యసంస్పర్శమాత్రేణ గ్రాహరూపంవిహాయసః ।
గంధర్వాకారమాలంబ్య స్వస్యవృత్తమవేదయత్ ॥

తా ॥ ఆయనయొక్క స్పర్శమాత్రముతో వాడు మొసలిరూపమును విడిచి గంధర్వాకారము నవలంబించి తన వృత్తాంతమంతయుం జెప్పెను.

౧౩. మహాదేవ నమస్తేస్తు శృణుష్వవచనంమమ ।
అనుగ్రహేణభవతో ముక్తోస్మిగ్రాహరూపతః ।

తా ॥ ఓ మహాదేవా నీయొక్క అనుగ్రహము వలన మొసలి యాకారము వలన విడువ బడితిని గనుక నాయొక్క వాక్యము వినవలయును.

౧౪. నామ్నాపుష్పరథఃఖ్యాతోగంధర్వాణామధీశ్వరః ।
అహంశప్తః పురాధాత్రాతదాజ్ఞాపరిలంఘనాత్ ॥

తా ॥ నేను ప్రసిద్ధమైన పుష్పరథుడను గంధర్వ రాజును పూర్వ బ్రహ్మచేత ఆయన ఆజ్ఞమీరుటవలన అయనచే శాపించబడి ఉంటిని.

౧౫. ప్రార్థితస్సచభూయోపి శాపస్యాంతమభాషత ।
చతుర్భిః పార్షదైస్సాకంభగవాన్నీలలోహితః ।
శృతిస్మృతిప్రతిష్ఠార్థం మానుషత్వముపాశ్రితః ॥

తా ॥ పిదప నాచేత ప్రార్థింపబడినవాడై శాపముయొక్క అవమానమును చెప్పెను (ఎట్లనగా) నలుగురు శిష్యులతో సహాశ్రుతి స్మృత్యుద్ధారణము కొరకై ఈశ్వరుడు మనుష్యరూపముతో నవతరించి.

౧౬. దుర్మతానివినిర్జేతుం శంకరాచార్యసంజ్ఞయా।
కలౌయుగేమహాప్రాజ్ఞో మహేశోవతరిష్యతి ॥

తా ॥ దుర్మతములను జయించుటకు శంకరాచార్యులను పేరుచే కలియుగమందు అవతరించును.

౧౭. తదాతత్పాదపాథో జరజోలేశావమర్శనాత్ ।
త్వంశాపాన్మోక్ష్యసేతూర్ణ మిత్థమాహపితామహః॥

తా ॥ అప్పుడు ఆయన పాదకమలము రజస్సు తగులుటవలన నీవు శాపము వలనత్వరగా విడువ బడుదువని బ్రహ్మపలికెను.

౧౮. అతస్త్వద్దర్శనాయత్త చిత్తశ్చూర్ణీజలాశయే।
నక్రీభూయనిలీనస్సన్నవసంద్విజపుంగవ ॥

తా ॥ అందువలన నీదర్శనమందు తగిలిన చిత్తముగలవాడై చూర్ణీ నదియందు మొసలియై అణగియుంటిని.

౧౯. ఇదానీంత్వత్పదాంభోజ రజస్సంగాద్వికల్మషః।
జాతోస్మిభగవన్సాక్షా త్వమేవపురశాసన ॥

తా ॥ ఇప్పుడు నీపాదకమలముల ధూళిసంగము వలన నాయొక్క స్వరూపముగల వాడనైతిని గనుక నీవేఈశ్వరుడవు.

౨౦. కృతార్థోహంతయ్యానూనం యాస్యామిత్రిదివంపునః।
అనుగృహ్ణీష్వమామద్య బాలిశంబ్రాహ్మణోత్తమ ॥

తా ॥ అయ్యా నేను నీవలన కృతార్థుడనైతిని గనుక స్వర్గమునకు మరల వెళ్లుచున్నాను మూర్ఖుడైన నన్ను ఇప్పుడనుగ్రహింపుము.

౨౧. ఇతివిజ్ఞాప్యగంధర్వ స్సజగామత్రివిష్టపం ।
తతస్తీరముపాగమ్య చూర్ణ్యాస్తూర్ణంసశంకరః ।
మాతరంప్రణిపత్యాహ దేహ్యాజ్ఞాంప్రవ్రజామ్యహం ॥

తా ॥ అని విజ్ఞాపన చేసి గంధర్వుడు స్వర్గమునకు వెళ్లెను. పిదప శీఘ్రముగా శంకరులున్ను చూర్ణీనదీ తీరమునకు వచ్చి తల్లినిగూర్చి నమస్కరించి తల్లీ నేను సన్యాసము తీసుకొనెదను అనతిమ్ము.

౨౨. ఇత్యర్థితా తేనమాతా దదావస్యాశ్రమాప్తయే ।
ఆలంబ్యతాశ్రమంశ్రీమ చ్ఛంకరోలోకశంకరః ॥

తా ॥ ఈప్రకారము శంకరులచే పలుకబడి ఆశ్రమమునకొఱ కాజ్ఞనిచ్చెను. వెంటనే శంకరుడున్ను ఆశ్రమధర్మము నవలంబించెను.

౨౩. అనంతరంశంకరార్యో మాతాథమిదమబ్రవీత్ ।
యాహిసద్మనిరాశంకా శంకరంహృదిచింతయ ।
ధ్యాయతీపరమాత్మానం తమేవశరణంవ్రజ ॥

తా ॥ పిదప శంకరాచార్యులు తల్లినిగురించి చెప్పినదేమనగ నీవు భయపడక ఇంటికి పోయి ఈశ్వరుని మనస్సునందు ధ్యానించుచూ ఆయననే రక్షకుడుగా వేడుము.

౨౪. ఇత్యుక్త్వామాతరంసోయం ప్రణిపత్యపదంస్పృశన్ ।
నిర్గమయ్యతదాసద్మ జననీంసాంత్వవాదనైః ॥

తా ॥ అని తల్లిని నమస్కరించి ఆమెను మంచి మాటతో నింటికి కంపించి (ముందరి కన్వయము.)

౨౫. నిర్జగామస్వయంతూర్ణం క్రమసన్న్యాసలబ్ధయె ।
అన్విష్యన్ శంకరాచార్యో గురుంసర్వత్రభూతలే ॥

తా ॥ తానుశీఘ్రముగా క్రమసన్యాస ప్రాప్తికొరకు భూమియందు గురువును వెతుకుచూ శంకరాచార్యులు వెళ్లెను.

౨౬. క్రమేణబదరీంప్రాప యత్రవిష్ణుస్తపస్యతి ।
దేవైర్మునిభిరాకీర్ణాం సౌవర్ణాభ్యర్ణవేదికాం ॥

తా ॥ ఇట్లుతిరుగుచూ క్రమముగా ఎచ్చట విష్ణువు తపస్సు చేయుచున్నాడో అట్టిబదరికాశ్రమమును చెందెను.

౨౭. వేదశాస్త్రకథాలాప విలసదృషిరాజితాం ।
నిర్వైరంవిహరత్సత్వ జాతిజాతసముత్కటాం ॥

తా ॥ మరియు వేదశాస్త్రపురాణా సక్తులైన ఋషులచేతను ద్వేషములేక సంచరించెడు మృగములచేతను ప్రకాశమైనది.

౨౮. సదానిర్వేద నిర్విష్టతపస్యత్సన్మునివ్రజాం ।
చంపకాశోకపున్నాగ కింశుకాదితరువ్రజాం ॥

తా ॥ సమీపమందుండు ఆశ్రమములందు తపస్సు చేయుచుండు గొప్ప ఋషులు కలిగినట్టియు చంపక, అశోక, పున్నాగ, మొదలగు వృక్ష సమూహము గలిగినట్టిన్ని.

౨౯. సరోభిర్విమలై ర్వ్యాప్తాం ఫుల్లకల్హారసౌరభైః ।
బదర్యోభూరుహాయత్ర ఫలంతిస్వద్రుమాఇవ ॥

తా ॥ మరిన్ని స్వచ్ఛమైన జలములతో నున్ను, వికశించిన కమలములతో నున్ను, ప్రకాశమైనది మరియు రేగుచెట్లు కల్పవృక్షములవలె ఎచ్చట ఫలించునో అట్టి బదరికాశ్రమమని అన్వయము.

౩౦. తత్రైకత్రసమాసీనముటజాభ్యంతరాంగణే ।
ధ్యాయంతంపరమీశానంవ్యాఘ్రకృత్తికృతాసనం ॥

తా ॥ ఆబదరికాశ్రమమందుఒకస్థలమందు ఆశ్రమమందుకూర్చుకొని యుండినట్టియు, ఎక్కువైన ఈశ్వరుని ధ్యానించునట్టియు, పులిచర్మమును ఆసనముగా వేసుకొనినట్టియు, ముందరికన్వయము.

౩౧. భూత్యుద్భాసితసర్వాంగంపౌండరీకోత్తరచ్ఛదం ।
రుద్రాక్షమాలికాజాలసమాకలితవిగ్రహం ॥

తా ॥ విభూతిచాత ప్రకాసించెడు సర్వావయవములుగలిగినట్టియు, వ్యాఘ్రచర్మమును కప్పుకొని నట్టియు, రుద్రాక్షమాలికలు గుంపుగా వేసుకొనినట్టి శరీరము గలిగినట్టియు, (ముందరి కన్వయము.)

౩౨. నిస్తరంగమివాంభోధిం నిర్వికారమివాశుగం ।
నిర్మేఘరదమివాదిత్యం భాస్వంతమివపావకం ॥

తా॥ తరంగములులేని సముద్రమువలెను, వికారములేని గాలి వలెను, మోదములేని సూర్యునివలెను, ప్రకాశమైన అగ్నివలెను ఉండేటటువంటి.

33. గోవిందభగవత్పాదదేశికేంద్రమలక్షయత్ ।
విలోక్యాతిముదంప్రాప్య కించిదేవమచింతయత్ ॥

తా ॥ గోవిందాచార్యులను చూచి మిక్కిలి సంతోషించి కొంచెము ఆలోచించెను.

3౪. అహోమదర్థమేవాయమవతీర్ణోధరాతలే ।
ఉపదేష్టుంవసిష్ఠోవాశుకోవాకాస్యపోథవా ॥

తా ॥ నాకొరకే ఈయన భూమియందవతరించినాడు ఉపదేశించుటకు శుక ఋషియో లేక వశిష్ఠుడో ఇచ్చట ఉన్నాడు చాలా ఆశ్చర్యము.

౩౫. పారాశరిరిహాస్తీతి శృణుమఃఖలుసర్వదా ।
సఏవాయమిహాస్త్యేవ నాత్రకార్యావిచారణా ॥

తా ॥ వ్యాసులు ఇక్కడ నున్నాడని వినుచుంటిమి ఆయనే ఇచ్చటను న్నాడు గనుక ఇచట ఆలోచించ నక్కరలేదు.

౩౬. యోవాకోవాస్తుమహాసాభాస తేభానుమానివ ।
అనేనైవ్రారరీకుర్మః క్రమసన్యాసలక్షణం ॥

తా ॥ ఎవరు కాంతిచేత సూర్యునివలె ప్రకాశించుచున్నారో ఆయనచే తనే క్రమమైన సన్యాస లక్షణములను వృద్ధిపరచెదను.

౩౭. ఇత్యాలోచ్యమహాప్రాజ్ఞో తత్సమీపభువంగతః ।
తస్యప్రదక్షిణంకృత్వా ప్రణమ్యపురతస్థితః॥

తా ॥ అని ఆలోచించి బాగాతెలుసుకొన్నవాడై ఆయన సమీపమునకు వెళ్లి ప్రదక్షిణముగాచుట్టి నమస్కరించి ఆయన ముందరనిలువబడెను.

౩౮. తందృష్ట్వాశంకరంవిప్రం తోషితస్సమహామునిః ।
శ్రీమద్గోవిందభగవ త్పూజ్యపాదోబ్రవీత్తతః ।

తా ॥ ఆశంకరుణ్ణి గోవిందాచార్యులు చూచి సంతోషించి ఆయనతో ఒక మాట బలికెను.

౩౯. కోభవాన్కుతఆయాతః కుత్రత్యఃకిన్నునామ తే।
కింకారణమిహాయాతః వదసర్వంసవిస్తరం॥

తా ॥ అయ్యా నీవెవరు ఎచ్చటనుండి ఎందుకుఇక్కడికి వొస్తివి నీపేరేమి ఎందుకు ఇక్కడకు వచ్చితివి నీవృత్తాంతమంతయు విస్తారముగా జెప్పుము.

శ్రీ శంకరో వాచ.

౪౦. శుశ్రూషతేభవచ్చిత్తం యదితచ్ఛ్రూయతాంవిభో ।
జాతోహంకేరళేదేశే శ్రీమచ్ఛివగురోర్ద్విజాత్॥

తా ॥ అప్పుడు శంకరులుచెప్పిన దేమనగా స్వామీమీమనస్సు నావృత్త మును విననిచ్ఛయించిన యెడల చెప్పుచున్నాను వినుము నేను కేరళదేశమందు శివ గురువను బ్రాహ్మణుని వలన ఉద్భవించినాను.

౨౨. ఇత్యర్థితా తేనమాతా దదావస్యాశ్రమాప్తయే।
ఆలంబ్యతాశ్రమంశ్రీమ చ్ఛంకరోలోకశంకరః॥

తా॥ ఈప్రకారము శంకరులచే పలుకబడి ఆశ్రమముకొఱ కాజ్ఞనిచ్చెను. వెంటనే శంకరుడున్ను ఆశ్రమధర్మము నవలంబించెను.

౨౩. అనంతరంశంకరార్యో మాతారమిదమబ్రవీత్।
యాహిసద్మనిరాశంకా శంకరంహృదిచింతయ।
ధ్యాయతీపరమాత్మానం తమేవశరణంవ్రజ॥

తా॥ పిదప శంకరాచార్యులు తల్లినిగురించి చెప్పినదేమనగ నీవు భయపడక ఇంటికి పోయి ఈశ్వరుని మనస్సునందు ధ్యానించుచూ ఆయన నేరక్షకుడుగా వేడుము.

౨౪. ఇత్యుక్త్వామాతరంసోయం ప్రణిపత్యపదంస్పృశన్।
నిర్గమయ్యతదాసద్మ జననీంసాంత్వవాదనైః॥

తా॥ అని తల్లిని నమస్కరించి ఆమెను మంచి మాటతో నింటి కంపించి (ముందరి కన్వయము.)

౨౫. నిర్జగామస్వయంతూర్ణం క్రమసన్న్యాసలబ్ధయె।
అన్విష్యన్ శంకరాచార్యో గురుంసర్వత్రభూతలే॥

తా॥ తానుశీఘ్రముగా క్రమసన్న్యాస ప్రాప్తికొరకు భూమియందు గురువును వెతుకుచూ శంకరాచార్యులు వెళ్లెను.

౨౬. క్రమేణబదరీంప్రాప యత్రవిష్ణుస్తపస్యతి।
దేవైర్మునిభిరాకీర్ణాం సౌవర్ణాభ్యర్ణవేదికాం॥

తా॥ ఇట్లుతిరుగుచూ క్రమముగా ఎచ్చట విష్ణువు తపస్సు చేయుచున్నాడో అట్టిబదరికాశ్రమమును చెందెను.

౨౭. వేదశాస్త్రకథాలాప విలసదృషిరాజితాం।
నిర్వైరంవిహరత్సత్వ జాతిజాతసముత్కటాం॥

తా॥ మరియు వేదశాస్త్రపురాణా సక్తులైన ఋషులచేతను ద్వేషములేక సంచరించెడు మృగములచేతను ప్రకాశమైనది.

౨౮. సదానిర్వేద నిర్విష్టతపస్యత్సన్మునివ్రజాం।
చంపకాశోకపున్నాగ కింశుకాదితరువ్రజాం॥

తా ॥ సమీపమందుండు ఆశ్రమములందు తపస్సు చేయుచుండు గొప్ప ఋషులు కలిగినట్టియు చంపక, అశోక, పున్నాగ, మొదలగు వృక్ష సమూహము గలిగినట్టిన్ని.

౨౯. సరోభిర్విమలై ర్వ్యాప్తాం ఫుల్లకల్హారసౌరభైః ।
బదర్యోభూరుహాయత్ర ఫలంతిస్వద్రుమాఇవ ॥

తా ॥ మరిన్ని స్వచ్ఛమైన జలములతో నున్న, వికశించిన కమలములతో నున్న, ప్రకాశమైనది మరియు రేగుచెట్లు కల్పవృక్షములవలె ఎచ్చట ఫలించునో అట్టి బదరికాశ్రమమని అన్వయము.

30. తత్రైకత్రసమాసీనముటజాభ్యంతరాంగణే ।
ధ్యాయంతంపరమీశానంవ్యాఘ్రకృత్తికృతాసనం ॥

తా ॥ ఆబదరికాశ్రమమందుఒకస్థలమందు ఆశ్రమమందుకూర్చుకొని యుండినట్టియు, ఎక్కువైన ఈశ్వరుని ధ్యానించునట్టియు, పులిచర్మమును ఆసనముగా వేసుకొనినట్టియు, ముందరికన్వయము.

3౧. భూత్యుద్భాసితసర్వాంగంపౌండరీకోత్తరచ్ఛదం ।
రుద్రాక్షమాలికాజాలసమాకలితవిగ్రహం ॥

తా ॥ వీభూతిచాత ప్రకాసించెడు సర్వావయవములుగలిగినట్టియు, వ్యాఘ్రచర్మమును కప్పుకొని నట్టియు, రుద్రాక్షమాలికలు గుంపుగా వేసుకొనినట్టి శరీరము గలిగినట్టియు, (ముందరి కన్వయము.)

3౨. నిస్తరంగమివాంభోధిం నిర్వికారమివాశుగం ।
నిర్నీరదమివాదిత్యం• భాస్వంతమివపావకం ॥

తా॥ తరంగములులేని సముద్రమువలెను, వికారములేని గాలి వలెను, మోదములేని సూర్యునివలెను, ప్రకాశమైన అగ్నివలెను ఉండేటటువంటి.

33. గోవిందభగవత్పాదదేశికేంద్రమలక్షయత్ ।
విలోక్యాతిముదంప్రాప్య కించిదేవమచింతయత్ ॥

తా ॥ గోవిందాచార్యులను చూచి మిక్కిలి సంతోషించి కొంచెము ఆలోచించెను.

3౪. అహోమదర్థమేవాయమవతీర్ణోధరాతలే ।
ఉపదేష్టుంవసిష్ఠోవాశుకోవాకాస్యపోధవా ॥

తా ॥ నాకొరకే ఈయన భూమియందవతరించినాడు ఉపదేశించుటకు శుక ఋషియో లేక వశిష్ఠుడో ఇచ్చట ఉన్నాడు చాలా ఆశ్చర్యము.

౩౫. పారాశరిరిహాస్తీతి శృణుమఃఖలుసర్వదా ।
సఏవాయమిహాస్త్యేవ నాత్రకార్యావిచారణా ॥

తా ॥ వ్యాసులు ఇక్కడ నున్నాడని వినుచుంటిమి ఆయనే ఇచ్చటనున్నాడు గనుక ఇచట ఆలోచించ నక్కరలేదు.

౩౬. యోవాకోవాస్తుమహసాభాన తేభానుమానివ ।
అనేనైవైరారరీకుర్మః క్రమసన్యాసలక్షణం ॥

తా ॥ ఎవరు కాంతిచేత సూర్యునివలె ప్రకాశించుచున్నారో ఆయనచేతనే క్రమమైన సన్యాస లక్షణములను వృద్ధిపరచెదను.

౩౭. ఇత్యాలోచ్యమహాప్రాజ్ఞో తత్సమీపభువంగతః ।
తస్యప్రదక్షిణంకృత్వా ప్రణమ్యపురతస్థితః॥

తా ॥ అని ఆలోచించి బాగాతెలుసుకొన్నవాడై ఆయన సమీపమునకు వెళ్లి ప్రదక్షిణముగాచుట్టి నమస్కరించి ఆయన ముందరనిలువబడెను.

౩౮. తంద్రుష్ట్వాశంకరంవిప్రం తోషితస్సమహామునిః ।
శ్రీమద్గోవిందభగవత్పూజ్యపాదోబ్రవీత్తతః ।

తా ॥ ఆశంకరుణ్ణి గోవిందాచార్యులు చూచి సంతోషించి ఆయనతో ఒకమాట బలికెను.

౩౯. కోభవాన్కుతఆయాతః కుత్రత్యఃకిన్నునామతే।
కింకారణమిహాయాతః వదసర్వంసవిస్తరం॥

తా ॥ అయ్యానీవెవరు ఎచ్చటనుండి ఎందుకుఇక్కడికి వొస్తివి నీపేరేమి ఎందుకు ఇక్కడకు వచ్చితివి నీవృత్తాంతమంతయు విస్తారముగా జెప్పుము.

శ్రీ శంకరోవాచ.

౪౦. శుశ్రూషతేభవచ్చిత్తం యదితర్హ్యాయతాంవిభో।
జాతోహంకేరళేదేశే శ్రీమచ్ఛివగురోఃద్విజాత్॥

తా ॥ అప్పుడు శంకరులుచెప్పిన దేమనగా స్వామీమీమనస్సు నావృత్తమును విననిచ్ఛయించిన యెడల చెప్పుచున్నాను వినుము నేనుకేరళదేశమందు శివగురువను బ్రాహ్మణుని వలన ఉద్భవించినాను.

౪౧. కై శోరకదశాయాంమె తాతోలోకాంతరంగతః।
మాత్రైవపాలితోనూనం న్యవసంసుఖతోగృహే॥

తా ॥ నాయొక్క బాల్యమందే నాతండ్రి చనిపోయెను పిదప తల్లిచేత పాలితుడనై గృహమందు సుఖముగానుంటిని.

౪౨. యథోచితంయథాశాస్త్రం నియమాన్నిఖిలాఃకలాః ।
అధీతాస్సకృవాహం మాత్రాస్నాతుంకదాచన ॥

తా ॥ నాకు ఉచితమగునట్టుగా శాస్త్రప్రకారముగా సకల విద్యలు సకృదావృత్తిగానే అధ్యయనముచేసి ఒకానొక సమయమందు మాతల్లితో సహాస్నానముచేయుటకై (ముందరికన్వయము.)

౪౩. చూర్ణింతరంగిణీంయాతః స్పర్శమాత్రసుఖావహాం ।
తస్యాంగ్రాహోయాథజగ్రాహ మామకంపాదయుగ్మకం ॥

తా ॥ స్పర్శచేతనే సుఖకరమగుచూర్ణియనుపేరుగలనదికి వెళ్లితిని ఆనదియందు ఒకముసలి నాపాదములను పట్టుకొనెను.

౪౪. నాజహాచ్చరణౌసోపి నక్రఃక్రోధసమన్వితః।
వపుర్మేనిష్ఫలంయాతి సన్యాసంచేత్తుసార్థకం॥

తా ॥ అప్పుడా నక్రము క్రోధముగలదియై నాకాళ్లను వదలకపోయెను. (ఆసమయమందు నేనాలోచించిన దేమనగా) నాశరీరము వ్యర్థముగాపోవుచున్నది. గనుక సన్యాసము తీసుకొనిన సార్థకమగును.

౪౫. ఇతినిశ్చిత్యవేగేన సన్యాసంమనసాశ్రితం ।
తేనాహంసత్వరంముక్త స్సోపిశాపేనతత్క్షణాత్ ॥

తా॥ ఈప్రకారమాలోచించి త్వరగా సన్యాసము మనస్సులో నవలంబించితినిఅంతట ఆముసలిచేత్వరగావిడువబడితిని అదిన్నీతనశాపమువలనవిడువబడెను.

౪౬. తతస్తత్క్రమసన్యాసలాంఛనంతద్విచక్షణం ।
అన్విష్యన్మేదినీంసర్వాం క్రమాదిహసమాగమం ॥

తా ॥ . అనంతరమందు క్రమసన్యాసలక్షణమును వెదుకుచు భూమినంతట తిరిగి యెందును తగినవారినిగానక ఇక్కడికి వొస్తిని.

౪౭. అస్మత్ప్రాక్తనజన్మీయసుకృతాతిశయాదిహ ।
నిరీక్ష్యభగవత్పాదపంకజంసాంకుశధ్వజం ॥

తా ॥ నాయొక్క పూర్వజన్మ పుణ్యాతిశయముచేత నిచ్చటి కొస్తిని నీయొక్క అంకుశ ధ్వజాదిరేఖలుగల పాదకమలములను చూచి (ముందరి కన్వయము.

౪౮. అన్యత్రగమనేవాంఛాపూర్వపక్షోవ్యజాయత ।
అనుజానీహిమేసర్వం శర్వప్రతిమసద్గురో ॥

తా ॥ మరియొక ప్రదేశమునకు వెళ్లుట కిష్టములేదు నా వృత్తాంతమును ఈశ్వరసమానుడగు నీవే తెలుసుకొనుము.

౪౯. కృతార్థంకురుమామద్యత్వత్కటాక్షనిరీక్షణాత్ ।
ఇత్యుక్త్వాపురతస్తస్థౌబద్ధాంజలిరతంద్రితః ॥

తా ॥ గనుక నన్ను ఇప్పుడు కృతార్థునిగా జేయుము అని చెప్పి అంజలి బద్ధుడై కంపము లేనివాడై ఎదుటనిలువ బడెను.

౫౦. తదాగోవిందయతిరాడ్వీక్ష్యతంప్రణతంముదా ।
ఇహాముత్రఫలత్యాగంనిత్యానిత్యవివేకతాం ॥

తా ॥అప్పుడు గోవింద యతి(ఆశంకరుల)సంతోషముతో చూచి ఇహలౌక పరలోక ఫలత్యాగమున్ను నిత్యానిత్యవస్తుత్యాగమున్ను (ముందరికన్వయము.)

౫౧. శమాదిగుణసంపత్తింముముక్షుత్వమతంద్రితాం ।
దేహాభిమానరాహిత్యమీషణత్రయమోక్తృతాం॥

తా॥ శమదమాది గుణముల అతిశయమున్ను నిశ్చంచల మోక్షభావమున్ను. దేహాభిమానము లేకుండుటయున్ను దారేషణ ధనేషణ పుత్రేషణముల లేమియు చూచి ముందరికన్వయము.

౫౨. దృష్ట్వాసన్యాసయోగ్యోయమితినిశ్చిత్యమానసే ।
దాతుంసక్రమసన్యాసం సమీపంహూతవాన్గురుః ॥

తా ॥ సన్యాసాశ్రమయోగ్యుడీనయని మనస్సునందు నిశ్చయించి ఆచిన్న వానిని తన సమీపమునకు పిలిచెను.

౫౩. గోవిందభగవత్పాదదేశికేంద్రోముదాన్వితః ।
తమాహూయనిజాభ్యర్ణమాలింగ్యప్రణతంముహుః ॥

తా ॥ అప్పుడు గోవిందాచార్యులు సంతోషము గలవాడై ఆయనను సమీపమునకు బిలిచిన వృద్ధైనయాశంకరుణ్ణి ఆలింగనము చేసికొని ముందరికన్వయము.

౫౪. మూర్ధ్న్యాఘ్రాయనివేశ్యాంకేసాదరఃఘృణయాన్వితః ।
మహావాక్యానిదివ్యాని తత్వమస్యాదికాన్యపి ॥

తా ॥ శిరము మూర్కొని తొడమీద కూర్చుండ పెట్టుకొని విశ్వాసముతో కూడినవాడై తత్వమసి అనెడు మంచిమాటలనున్ను.

౫౫. ముముక్షుభిస్సదాధ్యేయంరహస్యంయద్యదస్తితత్ ।
ఉపాదిశత్తతస్సర్వంవేదాంతార్థవినిశ్చితం ॥

తా ॥ మోక్షాపేక్షగల వారలచే నిరంతరమందున్ను ధ్యానించతగ్గ యేయే రహస్యమంత్రములున్నవో అవి అన్నియు నిశ్చయించి ఉపదేశించిరి.

౫౬. సన్యాసిభిర్విధేయాంస్తువిశ్వేశస్సప్రతిచోదితాన్ ।
దత్వాధక్రమసన్యాసంబోధయామాసతత్వవిత్ ॥

తా ॥ సన్యాసులచే జరప తగిన ధర్మశాస్త్రములను చక్కగాబోధించెను.

౫౭. సోహమస్మీతిమత్వైవ సర్వత్రసమదర్శనః ।
నబ్రూహ్యన్యకథాలాపో నాలోక్యావామలోచనాః ॥

తా ॥ మరిన్ని సోహమస్మి అని తెలుసుకొని అందరియందు సమబుద్ధి గలిగి భగవద్వ్యతిరిక్త కథలు చెప్పకను పరస్త్రీలను జూడకుండ (ఉండవలెను.)

౫౮. పుత్రమిత్రసువస్త్రాదౌ ధనేధాన్యేమణావపి ।
మృత్స్నాయామశ్మకాష్ఠేషు సమదృగ్భవసర్వదా ।

తా ॥ పుత్ర, మిత్ర, వస్త్ర, ధన, ధాన్యములయందుగాని, మణియందుగాని, మృత్తికయందు, పాషాణమందుగాని, కట్టెయందుగాని, ఎల్లప్పటికిన్ని సమదృష్టిగలవాడవై యుండవలయును.

౫౯. అత్యాహారంనిరాహారం హింసామనృతభాషణం ।
పరిగ్రహమసూయాంచ దేహేమానావమానతా॥

తా ॥ మిక్కిలి ఆహారమున్ను, నిరాహారమున్ను, అబద్ధపుమాటయున్ను, ఓర్వలేమియున్ను, మానావమానములనూన్ను, (ముందరికన్వయము.)

౬౦. విసృజ్యనిర్మమోభూత్వా విహరత్వమహర్నిశం ।
జీవన్ముక్తస్తనూందగ్ధ్వా చరదగ్ధపటోపమాం ॥

తా ॥ విడిచి మమకారము లేనివాడై యుండుము. మరియు రాత్రింబగళ్లు

యందు జీవన్ముక్తుడై కాలినగుడ్డవలె శరీరమును చూస్తూ అభిమానవర్జితుడవై సంచరించుము.

౬౧. కౌపీనంకటిసూత్రంచ ధత్స్వదండకమండలూ ।
కాషాయవల్కలంవాపి సీతాతపనివృత్తయె ॥

తా ॥ (మరియునీవు) కౌపీనమున్ను, కట్టిసూత్రమున్ను, దండమున్ను, కమండలమున్ను, ధరించుము. చలిగాలి ఎండ వీటిని పోగొట్టుటకుగాను కాషాయవస్త్రమునుగాని, నారవస్త్రమునుగాని ధరించుము.

౬౨. నైకత్రనగరేవాసో భిక్షాచైకత్రసద్మని ।
నకర్తవ్యాత్వయానిత్య మంతేవాసిజనాగ్రణీ ॥

తా ॥ శిష్యులలో శ్రేష్ఠమగు ఓశంకరుడా ఒకయింటియందుగాని ఒకపట్టణమందేగాని నివసించి భిక్షణచేయకూడదు.

౬౩. యదుక్తంతత్వరిజ్య భిక్షామాత్రకృతాశనః ।
ధనసంపాదనోద్యుక్త స్సయతిఃపరినిందితః ॥

తా ॥ శాస్త్రమందుచెప్పిన ధర్మమునువిడిచి భిక్షమాత్రముచాత తృప్తుడై సంపాదనపరుడగునో అట్టియతినిందితుడగును.

౬౪. నిర్గుణంనిష్కళంబ్రహ్మ నిర్వికల్పంనిరంజనం ।
తద్బ్రహ్మాహమితిజ్ఞాత్వా విహారస్వయథాసుఖం ॥

తా ॥ సర్వగుణశ్రేష్ఠుడై అధికకాంతిగలిగి వికారరహితుడైఎవడున్నాడో అట్టిబ్రహ్మ నేననుబుద్ధితో తెలిసి సుఖముగా విహరింపుము.

౬౫. అనాదిమధ్యాంతమజం వృద్ధిక్షయవివర్జితం ।
తద్బ్రహ్మైవేతినిశ్చిత్య విసృజ్యేతరకాంక్షితాః ॥

తా ॥ ఆదిమధ్యాంత రహితుడైనట్టిన్ని, వృద్ధిక్షయములులేనట్టిన్ని, ఆబ్రహ్మయేగతియని నిశ్చయించి ఇతరాపేక్షలనువదలి.

౬౬. ఆత్మక్రీడశ్చాత్మరతిః క్రియావాన్దేశికేశ్వరః ।
ఆత్మానమభయంశుద్ధం మత్వాధీరోనశోచతి ॥

తా ॥ పరమాత్మచేక్రీడించుచు పరమాత్మయే గతియని తన్ను ఎవడు తెలుసుకొనునో ఆధైర్యవంతుడు శోకించడు.

౬౭. ఇత్యాద్యుపనిషద్వాక్యైస్సంబోధ్యాత్మానమీశ్వరం ।
ధ్యాయన్నంతస్సదాత్తస్థేనిస్తులానందతుందిలః ॥

తా ॥ ఈలాటి ఉపనిషద్వాక్యములచేత ఆశంకరులను బోధించి బ్రహ్మానందముతో ఉండెను.

౬౮. అనంతరంశంకరోసౌ శ్రుత్వాగురుముఖాద్వచః।
ప్రణమ్యపునరుద్ధాయ ప్రాహసంతోషతోసుధీః ॥

తా ॥ పిదప గురుముఖమువల్ల వచనమునువిని వారికినమస్కరించి సంతోషముగలవాడై ఆయననుగూర్చి పల్కెను.

౬౯. స్వామిన్విజ్ఞాతతత్వార్థ నిర్మలోజ్వలమానస ।
శిష్యసందేహసందోహ మోహావారణభాస్కర ॥

తా ॥ స్వామీ సకలతత్వములను తెలిశిన మహానుభావుడా శిష్యులకు గల సందేహమను అంధకారమునకు సూర్యుని వంటివాడా అనిస్తుతి.

౭౦. శ్రోతుంవాంఛతిమేచిత్తం దేశికేంద్రపరంపరాం।
కథయిత్వాపునీహిమం త్వామేవశరణంగతం॥

తా ॥ (అనిస్తుతించి) గురుపరంపర వినవలెనని నామనస్సు నిచ్చయించుచున్నది గనుక నిన్ను శరణము పొందిన నన్ను ఆగురు పరంపర చెప్పి పునీతుడగునట్లుజేయుము.

౭౧. తతఃప్రోవాచతుష్టాత్మా గోవిందభగవద్గురుః ।
సావధానేనమనసా శృణువక్ష్యామితేధునా ॥

తా ॥ అనంతరమందు గోవిందాచార్యులు చక్కగా మనస్సు చేత వినుము చెప్పెదనని చెప్పెను.

౭౨. ఈశానస్సర్వదేవానామీశ్వరస్సర్వదేహినాం ।
బ్రహ్మాబ్రహ్మాధిపస్సోయం సర్వేషామాదిదేశికః ॥

తా ॥ సకలమైన జంతువులకున్ను అన్నిటికి ప్రథమ దేవుడెవ్వడో ఆ ఈశ్వరుడు మొదటి ఆచార్యులు.

౭౩. వేదాంతశాస్త్రసారజ్ఞో నియతవ్రతతత్పరః ।
ఆదిశత్తత్వమఖిలం మాధవంగిరిజాధవః ॥

తా ॥ ఆ ఈశ్వరుడు సకలమైన బ్రహ్మజ్ఞానమును విష్ణువునకుపదేశించెను.

౭౪. శ్రీధవ్రోపితతోవాదీ త్తనయాయస్వయంభువే ।
వసిష్ఠాయావదత్రస్టా వరిష్టాయతపస్వినే ॥

తా ॥ ఆవిష్ణువు తనకుమారుడగు బ్రహ్మకుచెప్పెను ఆయన తపస్వియగు వసిష్ఠునకుపదేశించెను.

౭౫. వసిష్ఠోమునయేప్రాహ శక్తియేనఘశక్తయే ।
శక్తిఃపరాశరాయోచే వినయానతచేతసే ॥

తా॥ ఆవసిష్ఠుడుశక్తిఋషికుపదేశించెను. ఆశక్తిపరాశరులకుపదేశించెను.

౭౬. తనూభవేధవ్యాసా యత్రయీవిద్యాంశుభాశుభాం।
ఉవాచవిధివత్సోపి యయావిద్యాశ్చవాగతాః ॥

తా ॥ ఆపరాశరులు తన కుమారుడగు వ్యాసులకు విధిప్రకారముగా నుపదేశించిరి.

౭౭. శుకాయప్రజగౌసోపి వినయోజ్వలతేజసే।
సఏవగౌడపాదార్య దేశికేంద్రముపాదిశత్॥

తా ॥ ఆవ్యాసులు శుకులకు ఉపదేశించిరి. శుకులు గౌడపాదునకుపదేశించిరి.

౭౮. సాక్షాత్సఏవభగవా నస్మాకంగురురీరితః ।
శ్రీగౌడపాదయతిరా డ్ద్విబాహురపరస్స్వభూః ॥

తా ॥ ఆగౌడపాదులు సాక్షాద్భగవంతునివలెనే మాకు ఆచార్యులు.

౭౯. వేదవేదాంగతత్వజ్ఞో నిర్మాతానిఖిలశ్రుతేః ।
జైమినియ్యానిసూత్రాణి సార్థానిత్రిరధీతవాన్ ॥

తా ॥ ఆగౌడపాదార్యులు సకల వేదవేదాంగములను తెలిసినవారుజైమినియ్యసూత్రములను మూడుమార్లు చదివియున్నారు.

౮౦. దివ్యోపనిషదాంవేత్తా సాభిప్రాయకృతోపయః ।
పారాశరీయ్యసూత్రాణా మపితత్వార్థవిత్తమః ॥

తా ॥ బ్రహ్మజ్ఞానము తెలిసిన దివ్యమగు ఉపనిషత్తుల దెలిసినవారున్ను పారశరసూత్రముల కర్థము తెలిసినవారున్ను.

౮౧. నిర్మంథ్యశాస్త్రవారాశిం యుక్తిమంథేననిత్యశః ।
. అద్వైతామృతమాసాద్య జీవన్ముక్తశ్చరత్యసౌ ॥

తా ॥ ఆయనశాస్త్ర సముద్రమును యుక్తియను కవ్వపుకొండచే మదించి అద్వైతమనెడు వెన్నసుదీసుకొని జీవన్ముక్తుడై చరించినాడు.

౮౨. జగత్సంరక్షణాయైవ మూర్ఖధ్వాంతనివృత్తయే ।
చరంత్యేవమహాత్మాన స్త్వాదృశోధరణీతలే ॥

తా ॥ అట్టిమహాను భావులు మూర్ఖుల అజ్ఞానమును పోగొట్టుటకై భూమియందు తిరుగుచుందురు.

౮౩. బుద్ధిమానసభోశిష్య విజ్ఞాతాఖిలదర్శన ।
పారాశరీయ్యసూత్రాణాం దశోపనిషదామపి ॥

తా ॥ గనుక ఓశిష్యుడానీవు బుద్ధిమంతుడవైతివి ముందుపారాశరీయ్య సూత్రములకున్ను దశోపనిషత్తులకున్ను.

౮౪. గీతాసహస్రనామ్నాంచ రుద్రాధ్యాయస్యతత్వతః ।
అర్థాకోపిప్రజానంతి వ్యత్యస్తాన్కథయంత్యహో ॥

తా ॥ భగవద్గీతలకున్ను శ్రీవిష్ణు సహస్ర నామములకున్ను అర్థమెవ్వరు తెలియక వ్యత్యస్తమగు అర్థములను చెప్పుచున్నారు.

౮౫. తేషాంరచయభాష్యంత్వ మద్వైతార్థప్రకాశకం ।
ఇత్యుక్త్వాచంద్రమౌళీశం రత్నగర్భంగణాధిపం ॥

తా ॥ (గనుక) పైగ్రంథము లన్నిటికిన్ని అద్వైత పరమగు భాష్యమును చేయుమని రత్నగర్భగణపతినిన్ని చంద్రమౌళీశ్వరునిన్ని (ముందరి కన్వయము.)

౮౬. శివాత్క్రమాదిహాయాతం దదౌతస్మైసదేశికః ।
అనంతరంశంకరోపి పునస్తుష్టావతంగురుం ॥

తా ॥ శివునివల్ల క్రమముగా వచ్చినవాటిని ఈశంకరులకిచ్చెను. పిదపశంకరుడున్ను గురువును స్తోత్రము చేసెను.

౮౭. దేసికేంద్రకరుణాదృశాత్వ యాంపాలితోస్మిశివతత్వదర్శనాత్ । త్వాదృశోగురురనేకజన్మనాం పుణ్యత స్త్విహతులభ్యతేజనైః ॥

తా ॥ ఓగురువాకరుణా దృష్టికల నీచేత తత్వోపదేశము చేయుటవలన నే
ను పాలింపబడితిని నీవంటిగురువును లోకమందనేక జన్మపుణ్యా ఫలమువల్ల పొందత
గినదేను.

౮౮. ఇత్యుక్త్వాసంపరిక్రమ్య ప్రదక్షిణావిధానతః ।
తదాజ్ఞాంసిరసాధృత్వా సజగామయథేప్సితం ।

తా ॥ ఈప్రకారము శంకరుడు ఆయననుస్తుతించి ప్రదక్షిణములిరిగి (నమ
స్కరించి) ఆయన ఆజ్ఞను సిరసాధరించి తన యిచ్ఛవచ్చినట్టు శంకరుడు వెళ్లి
పోయెను.

౮౯. గురురాజప్రబంధంయ శృణోతిపఠతోపివ ।
అద్వైతామృతశిద్ధించ పరంమోక్షమవాప్నుయాత్ ।

తా ॥ గురుప్రబంధమునున్ను అద్వైత సిద్ధినిన్నీ వినినవారు చదివినవారు
మోక్షమును పొందుచున్నారు.

ఇతి కవికులవర్య భాస్కరార్య విరచితాయాం
వైశ్యధర్మప్రకాశికాయాం
శంకరావతారకథనంనామ
చతుర్థోఽధ్యాయః
సంపూర్ణం.

## అథ పంచమోఽధ్యాయః.

—*(శంకరచరిత్రం)*—

౧. తతస్సద్గురుసందేశా లబ్ధవిజ్ఞానశేవధిః ।
శంకరాచార్యగురురా డ్రాకావిధురివాబభౌ ॥

తా ॥ అనంతరమందు సద్గురూపదేశము వలన శంకరులు యతిపూర్ణిమా
చంద్రునివలె ప్రకాశించిరి.

౨. భాష్యంచోత్తరమీమాంస సూత్రాణామతివిస్తరం ॥
దశోపనిషదాందివ్యం చకారాతిమనోహరం ॥

తా ॥ ఉత్తరమీమాంస సూత్రములకు విస్తారముగు భాష్యమునున్ను దశోప
నిషద్భాష్యమున్ను దివ్యముగాచేసెను.

3. తథైవభగవద్గీతా భాష్యంభూష్యంసురైరపి ।
విష్ణోఃసహస్రనామ్నాంచ శ్రీరుద్రస్యచనిర్మలం ॥

తా ॥ అటులనే దేవతలచే పొగడతగిన గీతాభాష్యమున్ను విష్ణుసహస్రనా
మ భాష్యమున్ను రుద్రసూక్త భాష్యమునుచేసెను.

౪. సౌందర్యలహరీస్తోత్రం స్తోత్రాణాముత్తమోత్తమం ।
స్తోత్రాణ్యన్యానిదివ్యాని కారయామాసతైఃగురుః ॥

తా ॥ పిదప సౌందర్యల హరీస్తోత్రమున్ను దివ్యములైన మరికొన్నిస్తోత్ర
ములున్ను చేసెను.

౫. అపాఠయచ్ఛిష్యాం స్స్వభాష్యంస్వేనవిర్మితం ।
ప్రవివిచ్యతదీయార్థా నబోధతసయత్నతః ॥

తా ॥ అనంతరమందు తనశిష్యులకు తనచే చేయబడిన భాష్యమును విస్త
రించి ప్రత్నముగా అర్థము తెలియచేశి పాఠముచేయించెను.

౬. ఆవర్తతనివృత్తాశో యత్రకుత్రాపివస్తుని ।
ప్రమనావిమలానంద సంధానితనిజాంతరః ॥

తా ॥ బ్రహ్మానందము గలవారై ఏవస్తువయందు ఆశలేకుండిరి.

౭. ఏతస్మిన్నంతరేవిప్రో విదితాఖిలదర్శనః ।
నిర్ణేతుంసతదావర్ణి బ్రహ్మనిత్యంనిరంజనం ॥

తా ॥ ఇంతలో ఒకబ్రహ్మచారి బ్రహ్మవిద్యను తెలుసుకొనుటకై సర్వజ్ఞుడై
ఒకబ్రాహ్మణుడు.

౮. యత్రాస్తేశంకరాచార్య దేశికేంద్రవిచక్షణః ।
తంప్రదేశసమాసాద్య భక్తిభారసమావృతః ॥

తా ॥ యోగ్యుడగు శంకరులెచ్చట ఉన్నాడో అచ్చటికి వచ్చికేవలభక్తి
తో కూడినవాడై.

౯. ప్రదక్షిణంపరిక్రమ్య ప్రణమ్యవినయాన్వితః ।
తందృష్ట్వాశంకరాచార్య దేశికేశ్వరపుంగవః ॥

తా ॥ ఆశంకరులవారికి ప్రదక్షిణ నమస్కారముచేశి ఉండగా వానిని శంకరాచార్యులుచూచి (ముందరి కన్వయము.)

౧౦. కిమర్థమాగతోఽసిత్వం కిశోరఇవలక్ష్యసే ।
పితరౌ తేకుతోయాతౌ మతఃకింతేప్రయోజనం ॥

తా ॥ ఎందుండిచటికొస్తివి చూడగా చిన్నవానివలె ఉన్నావు నీతల్లిదండ్రులెచటికి బోయిరి నావలన నీకేమిపని ఉన్నదిచెప్పుము.

౧౧. ఇతిపృష్టస్తథోవాచ స్వీయోదంతమశేషతః ।
శృణుష్వసర్వవక్ష్యామి స్వామిన్ సత్వగుణాకర ॥

తా ॥ అనిఅడుగబడినవాడై తనవృత్తాంతము పూర్తిగా చెప్పుటకారంభించెను. స్వామీ సత్వగుణాకరుడా నావృత్తాంతమంతయుం జెప్పెదవినుము.

౧౨. అహోబిలేమహాక్షేత్రే నివాసోమమసాంప్రతం ।
మాధవోమత్పితుర్నామ సుశీలాజననీమమ ॥

తా ॥ మహాక్షేత్రమగు అహోబిలమందు నానివాసము నాతండ్రి పేరుమాధవాచార్యులు నాతల్లిపేరుసుశీలాదేవి.

౧౩. అస్మిన్ క్షేత్రేమహాపుణ్యే పితరౌమేతపశ్యతాం ।
నృసింహందేవముద్దిశ్య పుత్రార్థప్రీతమానసౌ ॥

తా ॥ వారలిరువురు పుత్రులులేక ఆమహాక్షేత్రమందు నృశింహస్వామిని గూర్చి తపస్సు సంతోషమనస్కులై (చేసిరి)

౧౪. తయోస్తపస్తోషితాత్మా దేవఃప్రత్యక్షమభ్యగాత్ ।
తౌదృష్ట్వాతంనమస్కృత్య స్వాభిష్టంజగతుస్తదా ॥

తా ॥ వారల తపస్సుచేత సంతుష్టిజెందిన మనస్సుగల భగవంతుడు వారల నేత్రములకు ప్రత్యక్షమాయను అప్పుడు వారాదేవుని నమస్కరించి తమయిష్టమును చెప్పుకొనిరి.

౧౫. తథేతిదేవస్తుష్టాత్మా వరంపుత్రకరంపరం ।
గత్వాచాంతర్ధథేపశ్చా జ్జాతోయంబాలకస్తయోః ॥

తా ॥ అటులనేకానిమ్మని పుత్రకరమైన మంచివరమునిచ్చి అంతర్థానముజెందెను పిదపవారిరువురకు పుత్రుడనై నేనుదయించితిని.

౧౬. గతవంతౌస్వర్గలోకం పితరౌమేమహాగురో ।
తందృష్ట్వావిలయంపిత్రోః సర్వస్మై రాశ్యతత్పరః ॥

తా ॥ ఓమహానుభావా నాతల్లిదండ్రులు స్వర్గలోకగతులైరి. ఆవిలయము చూచి సర్వవిషయములందు ఆశలువదులుకొని.

౧౭. కింకర్తవ్యమితిధ్యాత్వా నిద్రాంప్రాప్తోస్మి దేశిక ।
స్వప్నేమమసమాగత్య నారసింహోదయాన్వితః ।
శంకరాచార్యమన్వేహి సతుత్వాంపాలయిష్యతి ॥

తా ॥ ఓగురుడా ఏమిచేయవలెనని నిద్రపోగా నాస్వప్నమందు నరసింహుడు ప్రత్యక్షమై శంకరులను వెదుకుము ఆయననిన్ను సంరక్షించును.

౧౮. ఇత్యుక్త్వాంతర్దధే దేవః స్త్వత్సమీపంతతోభ్యగాం ।
పవిత్రితజనజ్ఞాత శరణాగతవత్సలా ॥

తా ॥ ఇట్లుచెప్పి ఆదేవుడంతర్ధానమాయెను పిదపనేను నీసమీపముసకై ఇచ్చట వొచ్చితిని.

౧౯. జ్ఞానవిజ్ఞానవారాశే శ్రీమాన్శంకరదేశిక ।
త్వమేవశరణందేవ నాన్యంజానేపరంతప ।

తా ॥ నీవేగతిగనుక నీకంటే రెండవవాడున్నాడని నేనుయెరుగను.

౨౦. ఇతితూష్ణీంస్థితస్తుత్వా శంకరోలోకశంకరః ।
తంబాలంపురతఃస్య స్నప్తసప్తిసముప్రభం ॥

తా ॥ ఈప్రకారము విజ్ఞాపించి నిల్వగా శంకరులు సూర్యునివలె ప్రకాశించె ఆచిన్నవానింజూచి.

౨౧. విరక్తతామతీవాస్య ప్రతిభామప్యనీదృశం ।
నిరీక్ష్యప్రదదౌతస్మై సన్యాసంక్రమసంగతం ।

తా ॥ విరక్తిగుణమున్న మంచిప్రజ్ఞయుగల ఆచిన్నవానినిజూచి సన్యాసాశ్రమమిచ్చెను.

౨౨. దదౌసనందనాభిఖ్యాం సర్వలోకైకవిశ్రుతాం ।
తేనప్రథమశిష్యేణ రరాజయతిపుంగవః ॥

తా ॥ ఆయనకు సనందన యోగియని పేరుబెట్టి సర్వలోకము లందును ప్రసిద్ధిచేసి ఆప్రథమశిష్యునితోనున్ను.

౨౩. తదాగురుస్స్వగురవే స్వకృతాంభాష్యసంతతిం ।
ప్రదర్శితేనతుష్టేన గురుణాతీవమానితః ॥

తా ॥ అప్పుడు తాముచేసిన భాష్యాదులన్ని ఆయనకుపదేసించిరి.

౨౪. స్వామిన్నాజ్ఞాంప్రదేహ్యా ద్యచకీర్ష ష్యతిమనోమమ।
అటితుక్షేత్రతీర్థాని పవిత్రాణిసమంతతః ॥

తా ॥ ఆసమయమందు సునందనుడు స్వామీ క్షేత్రములు తీర్థములు తిరగ పలెనని ఇచ్ఛగలిగినది గనుక ఆజ్ఞయివ్వవలయునని అడిగెను.

౨౫. ఇత్యుక్తవంతంప్రణత ముద్ధాప్యాంలింగ్యసాదరం ।
జానేత్వదింగితంసాంగం వత్సమేశృణుభాషితం ॥

తా ॥ ఈప్రకారముపలికి నమ్రుడైన యాశిష్యునిలేపి ఆలింగనము చేసుకొని అయ్యాన్నమనోభిప్రాయము తెలుసును నామాటవినుమని చెప్పిరి.

శ్రీ గు రు ఉ వా చ.

౨౬. గురుపాదోదకంతీర్థం పుణ్యక్షేత్రంతదాశ్రయః ।
మంత్రోపదేశ స్తద్వాక్య శ్రుతిరేవనచేతరేత్ ॥

తా ॥ ఆచార్యపాదోదకమే సర్వతీర్థములు వారినాశ్రయించుటయే పుణ్య క్షేత్రదర్శనము వారివాక్యములను వినుటయే మంత్రోపదేశము.

౨౭. స్నానంనిర్మలతాబుద్ధేః శౌచమింద్రియనిగ్రహః ।
జీవన్ముక్తిరిహైవాసా విముక్తిర్వ్యపయేషుయా ॥

తా ॥ నిర్మలబుద్ధిన్ని ఇంద్రియనిగ్రహమున్ను స్నానమున్ను కలిగియుంటే ఈలోకమందు జీవన్ముక్తిఅని చెప్పుదురు.

౨౮. నియమోనిగ్రహఃకష్టం చిత్తవృత్తేరనుక్షణం ।
క్షేత్రయాత్రాదికంయద్య త్కాయంయాసఫలప్రదం ॥

తా ॥ నియమము నిగ్రహము కష్టము పుణ్యక్షేత్రయాత్ర శరీరాయాసము.

౨౯. వేద్యతాంధ్యానసేనూనం సోహమిత్యేవభావనాం ।
జ్ఞానమేవహితత్సర్వం విమలీకురుతేమనః ।

తా ॥ గనుక సోహమనుజ్ఞానమును మనస్సునందుంచుకొనుము జ్ఞానమేస మస్తమున్ను స్వచ్ఛముజేయును.

3౦. నహిజ్ఞానేనసదృశం త్రిషులోకేషువిద్యతే ।
సర్వవ్యాపిచతద్బ్రహ్మ సర్వలోకేషుతిష్ఠతి ॥

తా ॥ గనుకమూడులోకములందు జ్ఞానముతోసరియైనదిలేదు ఆ జ్ఞానస్వరూపుడగు బ్రహ్మ అన్నిలోకములయందు వ్యాపించి ఉన్నాడనుకొనుము.

3౧. సగుణోపాసనంయద్య త్క్రమనిశ్శ్రేయసాప్తయే ।
ఆత్మజ్ఞానపరోభూత్వా విసృజ్యనిఖిలవ్యథాః ॥

తా ॥ సగుణబ్రహ్మ నుపాశించుట క్రమమగు మోక్షము దొరకుట కొరకే గనుక ఆత్మజ్ఞానరహితుడవై సకలమైన వ్యధలను విడిచిపెట్టుము.

3౨. బ్రహ్మైవాహమితిధ్యాయన్నవసాత్రైవసంతతం ।
ఇత్యాజ్ఞాప్యజగామాసౌస్వసిద్ధాంతమహోత్సుకః ॥

తా ॥ నేనేబ్రహ్మనని తెలుసుకొని ఇచ్చటనే యుండుమని చెప్పితాను తమ సిద్ధాంతస్థానోత్సుకుడై వెళ్లిపోయెను.

33. సనందనోసురేశశ్చత్రోటిపుటకఏవచ ।
ఆనందగిర్యామలకముఖైశ్శిష్యైశ్చసంయుతః ॥

తా ॥ సనందనుడు సురేశ్వరాచార్యులు త్రోటీపుటాచార్యులు ఆనందగిరి మొదలగుశిష్యులతో కూడినవాడై.

3౪. తదారభ్యచరందేశాన్ స్థాప్యాద్వైతంమతంస్వకం ।
కాస్యాంమండనమిశ్రంతు జిత్వాతత్రైవసంస్థితః ॥

తా ॥ సన్యాసాశ్రమము దీసుకున్నది మొదలు అక్కడక్కడ దేశములనుతిరిగి అన్నిమతములనుగెల్చి కాశికి బోయిమండనమిశ్రుడను గొప్పపండితుని జయించి అక్కడనే సుఖముగానుండిరి.

3౫. షణ్మతస్థాపనాచార్యః శంకరార్యఇతిప్రథాం।
సర్వదేశేషుసంలభ్యకాస్యాంసుఖమువాససః॥

తా ॥ షణ్మతస్థాపనాచార్యులని దేశములయందు బిరుదును వహించి కాశియందు సుఖముగాఉండిరి.

3౬. బదర్యాగమనం పశ్చాత్తత్రైకంనిర్మితంమఠ।
తోటకాచార్యనామానం శిష్యంసంస్థాప్యయత్నతః॥

తా ॥ పిదప బదరికాశ్రమమునకువెళ్లి అచ్చట ఒకమఠము నిర్మించి తోట కాచార్యులను శిష్యుని నచ్చటనిల్పి విశేషప్రయత్నమువల్ల.

౩౭. తత్రైవసుచిరంస్థిత్వా దత్తాత్రేయస్యదర్శనం ।
భాష్యార్థబోధతుష్టస్య విష్ణోస్సాయుజ్యకృతి స్తతః ॥

తా ॥ చాలాకాల మచ్చటనేయుండి దత్తాత్రేయదర్శనము చేసుకొనితన భాష్యార్థమును వారికి వినుపించి ఆయనను సంతోషింపచేసి.

౩౮. దత్తాత్రేయగుహాద్వారా త్కైలాసమగమద్గురుః ॥

తా ॥ దత్తాత్రేయ గుహద్వారముగానే కైలాసమునకువెళ్లిరి.

౩౯. ఏతత్సర్వంసమాప్తేన కృతంకర్మజగద్గురోః ।
భారద్వాజాబ్ధిచంద్రేణ భాస్కరార్యేణధీమతా॥

ఇతి శ్రీమద్ఘాతనగరనిలయభాస్కరకవినామధేయ విరచి
తాయాం వైశ్యధర్మప్రకాశికాయాం
శంకరచరిత్రం నామ
పంచమోఽధ్యాయః
సంపూర్ణం.



## అథ షష్ఠమోఽధ్యాయః.

—*(రామానుజచరిత్రం)*—

౧. తతఃకదాచిచ్ఛేషోపిస్వావతారంమహామతిః ।
కర్తుంవిష్ణోరాజ్ఞయైవ ధరణీతలమభ్యగాత్ ॥

తా ॥ అనంతర మొకానొక కాలమందు ఆదిశేషుడున్ను తనఅవతారమును భూలోకమందు చేయవలెనని విష్ణువుఆజ్ఞచే భూమికివచ్చెను.

౨. భూతపుర్యాంమహాశాంతః కేశవార్యశుభాహ్వయః ।
విష్ణుభక్తోజితక్రోధస్తా మధ్యాస్తేనిరంతరం ॥

తా ॥ భూతపురియను గ్రామమునందు. అతిశాంతుండు క్రోధరహితుడు, విష్ణుభక్తుడున్నగు కేశవాచార్యులనుపేరుచే ఒకబ్రాహ్మణుడున్నాడు.

౯. భాగినేయోద్భవంశ్రుత్వా కృతీశ్రీశైలపూర్ణకః ।
స్వసారంభాగినేయంచ ద్రష్టుంభూతపురీంయయౌ ॥

తా ॥ శ్రీశైలపూర్ణుడు తనకు మేనల్లుడు పుట్టినాడని చెల్లెలను అల్లుని చూచుటకై భూతపురికి వెళ్లెను.

౧౦. గత్వాదృష్ట్వాభూతపుర్యాం విరాజంతంశిశుంతదా ।
నామకర్తాకారయత్తల్లక్షణైర్లక్ష్మణేతిసః ॥

తా ॥ ఆయనభూతపురికి ప్రకాశమైన ఆశిశువులక్షణముచే గట్టివాడని తెలిసి లక్ష్మణుడను పేరుబెట్టించెను.

౧౧. అనంతరంలక్ష్మణార్యః పిత్రాచైవోపనీతకః ।
శ్రవణాదేవసర్వాసాం శ్రుతీనాంగ్రాహకోభవత్ ॥

తా ॥ పిదపలక్ష్మణాచార్యులు తండ్రిచే ఉపనీతులై విన్నమాత్రముతోనే సర్వవేదములను గ్రహించిరి.

౧౨. తతషోడశవర్షేతు కృత్వాదారపరిగ్రహం ।
గార్హస్థ్యాశ్రమమాపేదే పంచయజ్ఞపరాయణః ॥

తా ॥ అనంతరమున పదియారుసంవత్సరములయినపిదప వివాహముచేసుకొని గ్రహస్థాశ్రమయోగ్యమగు పంచయజ్ఞములను జరుపుచుండిరి.

౧౩. తతఃకాంచీపురీంయాత్రో మాత్రాజాయాసమన్వితః ।
వరదారాధనంకుర్వన్నావసంచక్రేసలక్ష్మణః ॥

తా ॥ పిదపరామానుజాచార్యులు తాను భార్య తల్లివచ్చి వరదరాజస్వామినారాధించుచు అచటనేయుండిరి.

౧౪. అద్వైతీయాదవోనామ యతిస్తత్రవిశేషతః ।
స్వశిష్యానోధయామాస జీవైక్యంపరమాత్మనః ॥

తా ॥ అక్కడ ఏకదండియాదవుడను అద్వైతయితి తనశిష్యులకు జీవపరమాత్మైక్యతను చెప్పుచుండెను.

౧౫. తస్యాంతేవాసిభిస్సాకం గత్వానత్వాచతంయతిం ।
శృణ్వన్బోధాంసతేనోక్తాం పూర్వపక్షంకరోత్తదా ॥

తా ॥ ఆయనశిష్యులతోగూడా రామానుజాచార్యులచటికేగి ఆయతిచెప్పిన బోధనుపూర్వపక్షము చేయుచు అచటనేఉండెను.

౧౬. ఏవంయాదవసామీప్యే నిత్యంవేదార్థచింతకః ।
కాంచీపూర్ణేనసఖ్యంచ చకారసమహామతిః ॥

తా॥ ఈప్రకారముయాదవప్రకాశునివద్ద వేదార్థము లాలోచించుచుకాంచీపూర్ణుడను ఒకభక్తునితో స్నేహముచేసెను.

౧౭. రామానుజస్యమాతృష్వ శ్రీయోగోవిందనామకః ।
అనుజంద్రష్టుమాగచ్ఛ త్కాంచీపురనివాసినం ॥

తా ॥ ఈరామానుజాచార్యుల పినతల్లికొమారుడు గోవిందాచార్యులనువారు ఈననుచూడవలెనని కంచికివొచ్చెను.

౧౮. తంద్రృష్ట్వాలక్ష్మణోపూర్ణ మానందసముపాగతః ।
ఉభౌయాదవసామీప్యే శృత్యర్థాన్ఛ్రృణ్వతఃస్థితౌ ॥

తా ॥ ఈరీతిగావొచ్చిన గోవిందాచార్యులనుచూచి లక్ష్మణార్యులు సంతోషించి ఇద్దరుయాదవ ప్రకాశుల సమీపమందు శృత్యర్థములనువినుచుండిరి.

౧౯. కదాచిద్యాదివేనోక్త మపార్థంఖండయచ్ఛ్రుతేః ।
కస్యాసంపుండరీకాక్ష మిత్యస్యాంవిరళీకృతం ॥

తా ॥ ఒకానొక సమయమందు యాదవప్రకాశుడు కస్యాసంపుండరీకాక్షమనుశృతికి తప్పుతాత్పర్యముచెప్పగా రామానుజుడా యర్థముఖండించి సరియైన అర్థముచెప్పెను.

౨౦. అనంతరంయాదివేతు శిష్యాణాంభక్తిరన్యథా ।
బభూవతస్యబుద్ధిస్తులక్ష్మణేవైష్ణవోత్తమే ॥

తా ॥ పిదపయాదవ ప్రకాశునియందు శిష్యులకుభక్తిలేకపోయెను. రామానుజునియందు యాదవునికిన్ని బుద్ధివేరుగాగలిగెను.

౨౧. ఆత్మనశ్చాపకీర్తిస్తు లక్ష్మణాత్సముపాగతా ।
ఇతిచింతాసమావిష్ట స్తంహంతుంనిశ్చినోత్తదా ॥

తా ॥ తనకులక్ష్మణునివల్ల అపకీర్తి కలిగెనని ఆలోచించి అతని జంపనిశ్చయించెను.

౨౨. ఏవంశిష్యైర్మంత్రయిత్వా రాత్ర్యాదుర్మార్గగామిభిః ।
గంగాస్నానచ్ఛలేనాపి హంతవ్యంలక్షణంవయం ।

తా ॥ ఈప్రకారముగా దుర్మార్గులై శిష్యులతో రాత్రియందాలోచించి గంగాస్నానమను మిషచేతనైనను చంపవలెను.

౨౩. ఇత్యాలోచ్యప్రభాతేసౌ లక్ష్మణంసముపాహ్వయత్ ।
గోవిందాచార్యముఖ్యాన్సర్వాన్ శిష్యాన్ప్రత్యేవమబ్రవీత్ ॥

తా ॥ అనిఆలోచించి తెల్లవారి లక్ష్మణునిపిలిపించి గోవిందాచార్యుడే మొదలైన అందరిశిష్యులతోను ఒకమాటపలికెను.

౨౪. కాశీంగంతుంమనీషాస్తి మమేదానీంవిశేషతః ।
భవద్భిస్సహితస్నానం గంగాయాంకర్తుముత్సహే ॥

తా ॥ (ఓశిష్యులారా) మీయందరితో కలుసుకొనికాశివద్ద గంగాస్నానముచేయ నపేక్షించియున్నాను.

౨౫. ఇత్యాజ్ఞప్తంవచశ్శ్రుత్వా శిష్యాస్సర్వేసమాహితాః ।
ఆచార్యభవతాసాకమాగచ్ఛామఇతీరయన్ ॥

తా ॥ ఈప్రకారము శిష్యులందరు ఆయనమాటవిని మిక్కిలి భక్తిగలిగి ఆచార్యునితోకూడ మేమందరు వొచ్చెదమని ప్రత్యుత్తరమిచ్చిరి.

౨౬. తతస్సయాదవప్రాశిష్యై స్సాకంకాశీంముదాన్వితః ।
చక్రేప్రయాణంత్వరిత మేకదండీయతి స్తదా ॥

తా ॥ పిదపసంతోషయుక్తుడైయొక దండియతి శిష్యులతోకూడా శీఘ్రముగాకాశికిప్రయాణమైవెళ్లెను.

౨౭. మార్గేగోవిందకథితం లక్ష్మణోయాదవాశయం ।
జ్ఞాత్వాపశ్చాద్దేవదేవం వరదంసంస్మరన్హృది ॥

తా ॥ పిదపయాదవుని అభిప్రాయము గోవిందార్యుడు తెలుసుకొని రామానుజులతో సంగతిచెప్పి దారిలోవెనుక భాగమందాయ ననునిల్చితాను వెళ్లెను.

౨౮. గచ్ఛన్మందంసరణ్యాంతు సర్వేషాంపృష్ఠతోభవత్ ।
తేసర్వేశీఘ్రగమనావింధ్యారణ్యముపాగతాః ॥

తా ॥ వింధ్యారణ్యమం దందరుబోవుచుండగా యాదవప్రముఖులు ముందరగావెళ్లిరి రామానుజులు వెనుక ఒంటరిగాచిక్కెను.

౨౯. అనంతరంయాదవార్యో శిష్యాన్సర్వానుదీక్ష్యసః ।
రామానుజఃక్వేత్యపృచ్ఛ త్తేనవేద్మ ఇతిశ్రుతః ॥

తా ॥ ఇట్లు కొంతదూరమరిగినపిదప యాదవుడు తిరిగిచూచి అందరిలో రామానుజుడెక్కడయని అందరిని అడుగగా వారు మాకుతెలియదనిరి.

3౦, క్వవాదుష్టమృగైర్భుక్త మితిసంతోషమానసః ।
అభూదభీష్టమస్మాక మితిమత్వాగతోయతిః ॥

తా ॥ ఎచ్చటనో దుష్టమృగములు దినిపోయెననిన్ని తనమనోరథము సిద్ధించెననుబుద్ధితో ఆయతివెళ్లిపోయెను.

3౧. రామానుజస్త్వేకతమోతస్మిన్నారణ్యేకేభృశం ।
మార్గభ్రమేణసంగచ్ఛ దేవమస్మారయద్ధృది ॥

తా ॥ రామానుజాచార్యులు ఆయరణ్యమందు దారితప్పి తనహృదయమందు తలచుకొనెను.

3౨. భక్తసంరక్షణేదీక్షో వరదోజాయయాసహ ।
వ్యాధవేషణసందృష్టః ల్లక్ష్మణస్యదృశోఃపథి ॥

తా ॥ భక్తసంరక్షణదీక్షితుడైన వరదరాజులు తనభార్యతోకూడా కిరాత దంపతులై మార్గమందు లక్ష్మణుని కన్నులకు కనుపించిరి.

33. తాందృష్ట్వాలక్ష్మణార్యేణ పన్థానఃక్వేతియాచితం ।
శృత్వాచక్షుర్నిమీలయస్వ ద్రక్ష్యస్యద్యైవపద్ధతిం ॥

తా ॥ వార్లనుచూచి లక్ష్మణార్యులు కిరాతులను దారిచూపమని అడుగగా వారు కన్నులుమూసుకొమ్ము ఇప్పుడేమార్గమునుచూపెదము.

3౪. తయోరిత్థంవచశ్శ్రుత్వా లక్ష్మణోమీలయద్దృశౌ ।
తయోరనుగ్రహేణైవ కాంచీదేశముపాగతః ॥

తా ॥ అనివార్లయొక్కమాటనువిని లక్ష్మణుడు కన్నులుమూసుకొనెను వారి యనుగ్రహముతో కాంచీదేశమునకా లక్ష్మణుడు తక్షణమేవొచ్చెను.

3౫. తత్రచోన్మీల్యనేత్రేస్వే దృష్ట్వాకాంచీంసవిస్మయః ।
సర్వందైవకృతంమేనే వింధ్యారణ్యాదుపాగమం ॥

తా ॥ అచ్చటకన్నులుదెరిచికాంచీపట్టణమునుచూచి వింధ్యారణ్యమునుంచి కంచికివొచ్చినందుకు చాలావిస్మయమంది దేవునివలననే ఇదంతయు చేయబడ్డదని తలచెను.

౩౬. పూర్వవద్వరదం శేష న్వైష్ణవంమతముత్తమం ।
సిద్ధాంతంకర్తుమారేభే శ్రుతిస్మృతిముఖాన్నః ॥

తా ॥ పూర్వమువలె వరదరాజును శేవించుచు విశిష్టాద్వైత సిద్ధాంతమునకనుకూలము శ్రుతిస్మృతులను చేయనారంభించెను.

౩౭. కాశీదేశాదుపాగమ్య యాదవ్రోలక్ష్మణాంశుచిం ।
దృష్ట్వాజీవంతమేనంసః పునశ్చింతాకులోభవత్ ॥

తా ॥ కాశినుండియాదవార్యులు కంచికేతెంచి సుఖజీవితుడై యుండిన రామానుజులచూచి మరల సంకటపడెను.

౩౮. రామానుజార్యోవేదానా మర్థంయాదవసన్నిధౌ ॥
పునర్వేత్తుముపాగంత్త తత్సామీప్యమకల్మషః ॥

తా ॥ రామానుజార్యులు మరలనిష్కల్మషుడై యాదవసమీపమునకే వేదార్థములం జూచుటకై వొచ్చెను.

౩౯. ఏవంరామానుజోనిత్యం పరమార్థవిచింతకః ।
యాదవ్రోక్తార్థమంత్రాణాం స్థితోన్యార్థంవదన్ముదా ॥

తా ॥ ఈరీతిగారామానుజులును మంత్రార్థములయొక్క అర్థమును వినుచూ యాదవుడు చెప్పినఅర్థమును ఆక్షేపించుచూ సంతోషముగాఉండెను.

౪౦. శ్రుత్యర్థేషుచసర్వేషు వివాదోభూత్క్రమేణచ ।
తయోర్వాదంజనంశ్రుత్వా లక్ష్మణేప్రీతిమానభూత్ ॥

తా ॥ ఈరీతిగా శ్రుత్యర్థములయందుభయులకువివాదము జరుగుచుండగా ఈవాదముజనులువిని లక్ష్మణార్యులయందు విశ్వసించుచు వొచ్చిరి.

౪౧. జగత్యేవంస్థితే శేషే కదాచిద్యామునార్యకః ।
శ్రీరంగాత్సముపాగత్య వరదంప్రీతిపూర్వకం ॥

౪౨. నత్వారామానుజందృష్ట్వా మనస్యేవమచింతయత్ ।
అయంభవేద్వైష్ణవానాం మతోద్ధారకకారణః ॥

తా ॥ ఈప్రకారము రామానుజులయందు జగజ్జనుల కందరికి ప్రీతిఉండగా ఒకానొకసమయమందు యామునాచార్యులు వరదరాజసేవార్థము కంచికివచ్చియాదవార్యుల శిష్యబృందమధ్యకుడైన రామానుజులనుచూచి ఈయనవైష్ణవమతోద్ధారకుడగునని చెప్పెను.

౪౩. అనంతరంయామునార్యో శ్రీరంగంపునరభ్యగాత్ ।
రామానుజోయామునార్యం ద్రష్టవ్యమితిచింతయత్ ॥

తా ॥ పిదపయామునాచార్యుడు రామానుజాచార్యులనుచూడకనే వెళ్లిపోయెను. రామానుజాచార్యులకును యామునాచార్యులనుచూడవలెనని ఇచ్ఛగలిగెను.

౪౪. లక్ష్మణోయామునార్యస్య శిష్యేణైవవినీతకః ।
పంచసంస్కారమాపేదే వైష్ణవాగమలాంఛనం॥

తా ॥ లక్ష్మణాచార్యులు యామునాచార్యుల శిష్యునిచే పంచసంస్కారమునుపొందిరి.

౪౫. యామునార్యప్రేషితైస్సన్ద్రష్టుంశ్రీరంగమందిరం ।
గత్వాతత్రాంతరేదృశ్య త్పరలోకగతంగురుం ॥

తా ॥ పిదపయామునాచార్యులను చూడవలెనని ఆయనపంపిన స్వామితోకూడను రామానుజులు శ్రీరంగమునకుబోయి అక్కడపరంపదించిన యామునార్యులనుచూచెను.

౪౬. అకుంచితాంగులీర్దృష్ట్వా తస్యజ్ఞాత్వామనోగతం ।
సర్వంకరిష్యేత్యుక్త్వాతా మోచయామాసలక్ష్మణః ॥

తా ॥ ఇట్లువిగతజీవుడగు యామునార్య శరీరమునుచూచి ముడుచుకొన్న మూడువ్రేళ్లను వారిమనోగతములీడేర్చెదనని ఆవ్రేళ్లను విడిపించెను.

• ౪౭. తద్దృష్ట్వాపరమాశ్చర్యం జనాశ్రీరంగవాసినః ।
మానుషాకారదేవంతం మేనిరేలక్షణంముదా ॥

తా ॥ శ్రీరంగమందుండు జనులందరు ఆయాచార్యునిచూచి మనుష్యాకారదేవుడని రామానుజులను ఎంచుకొనిరి.

౪౮. యామునార్యస్యసంస్కారం కారయామాసలక్ష్మణః ।
పునఃకాంచీముపాగచ్ఛ చ్చింతయన్వరదంహృది ॥

తా ॥ యామునాచార్యులకు సర్వసంస్కారములు చక్కగచేయించి మరలకంచివరదరాజులను హృదయమందు చింతించుచు కాంచీపురికేతెంచిరి.

౪౯. ఏకదాలక్ష్మణస్స్వాంతే చింతయత్కరుణాకరః ।
విశిష్టాద్వైతసిద్ధాంతః కథంస్యాద్ధరణీతలే ॥

తా ॥ ఒకసమయమందు కరుణాకరుడగు లక్ష్మణుడు భూమియందు విశిష్టాద్వైత సిద్ధాంతమెట్లగునో యని చింతించెను.

౫౦. ఏవంసంచింత్యమనసి తుర్యాశ్రమపరిగ్రహే ।
బుద్ధింకృత్వావైష్ణవైశ్చ ప్రార్థితఃతంపరిగ్రహీత్ ॥

తా॥ ఈప్రకారము ఆలోచించుచుండగ వైష్ణవులగు కొందరిచేప్రార్థింపబడి సన్యాసాశ్రమముతీసుకొనిరి.

౫౧. అనంతరంబ్రహ్మవాదే యాదవంచాభిభూయతం ।
శిష్యంకృత్వాతస్యబాహ్వో రంకయచ్ఛంఖనేమినా ॥

తా॥ అనంతరము వేదవాదమందు యాదవునిజయించి ఆయనకే చక్రాంకనముచేశి శిష్యునిగచేసుకొనిరి.

౫౨. అనంతరంసయతిరాట్ సర్వదేశేషుసంచరన్ ।
విష్ణుస్స్వయంవ్యక్తదేశే వాచయిత్వాప్రబంధకాన్ ॥

తా ॥ పిదపసర్వదేశముయందు సంచరించుచు విష్ణువుయొక్క స్వయంవ్యక్త స్థలములయందు ప్రబంధముపాడి చెప్పిరి.

౫౩. పీఠైశ్చతుస్సప్తభిర్గత్వాదేశాన్సమంతతః।
సమర్పయన్శంఖచక్రౌ విష్ణోర్వ్యక్తస్థలేషుచ ।
పరిగ్రహంచాన్నతీర్థ గ్రహణంచాకరోద్యతిః॥

తా ॥ డెబ్బదినాల్గుపీఠముల కధిపతులగు ఆచార్యపురుషులతో సహా దేశములుతిరుగుచు నచ్చటచ్చట శంఖచక్రచిహ్నలనుధరింపచేయుచు నాయాస్థలములయందు తీర్థప్రసాద పరిగ్రహమును చేయుచువెళ్లినవారైరి.

౫౪. ఆచార్యపురుషాంస్తత్ర దేశేదేశేగురుస్స్వయం।
సంస్థాపయత్సర్వవర్ణాన్ వైష్ణవాన్కారయంత్వితి ॥

తా ॥ మరియునింకసమస్తమైన వర్ణములను వైష్ణవులనుజేయుమని ఆచార్యపురుషులనక్కడక్కడ స్థాపించిరి.

౫౫. ఆజ్ఞాంకృత్వాస్వసిద్ధాంతం సర్వదేశేషుసంస్థితిం ।
అకరోద్యతిరాజోసౌ సాక్షాచ్ఛేషస్సలక్ష్మణః ॥

తా ॥ సాక్షాత్ శేషుడగు ఆలక్ష్మణముని అన్నిదేశములయందు విశిష్టాద్వైత సిద్ధాంతముచేసిరి.

౫౬. విసిష్టాద్వైతసిద్ధాంత నిర్ధారణసమర్థకాః।
దర్శనస్థాపనాచార్యో మాయావాదిభుజంగకః ॥

తా ॥ ఈశ్లోకమందు చెప్పినప్రకారము పొగడించుకొనుచుందురు.

౫౭. ఇతిసర్వేషుదేశేషు తంవదంతిమహాగురుం ।
చతుస్సప్తతిపీఠాది జనాశ్శ్రీవైష్ణవాస్సదా॥

తా ॥ డెబ్బదినాల్గు పీఠాధిపతులు పైచెప్పినప్రకారమాగురువులను పొగడుచుందురు.

౫౮. ఏవంభూమావ్స్వసిద్ధాంతం స్థాప్యాపిసగురుఃపరః।
శ్రీభాష్యంబ్రహ్మసూత్రాణాం విసిష్టాద్వైతసాధకం॥

తా ॥ ఈప్రకారము భూమియందు స్వసిద్ధాంతమునునిల్పి శ్రీభాష్యమునుబ్రహ్మసూత్రములకొనర్చిరి.

౫౯. గీతాభాష్యంస్తోత్రభాష్యం కృత్వాలోకోపకారకం।
సర్వాన్ శ్రీవైష్ణవాన్కృత్వ సుఖేనన్యవసద్యతిః ॥

తా ॥ భగవద్గీతలకు భాష్యం ఆళువందారుస్తోత్రమునకు భాష్యముచేసి అందరిని శ్రీవైష్ణవులను చేసిరి.

౬౦. యఃపఠేత్సతతంభక్త్యా రామానుజచరిత్రకం।
తస్యసర్వాణిపాపాని నస్యంతిస్మరణాదిహ॥

తా ॥ ఈరామానుజచరిత్రము నిరంతరము ఎవడుభక్తితోపఠించునో వాడు సకలపాపములనుంచి విడువబడును.

ఇతి శ్రీగౌతమపురనిలయభాస్కరార్య ప్రణీ
తాయాం వైశ్యధర్మప్రకాశికాయాం
రామానుజచరిత్రో నామ
షష్ఠోఽధ్యాయః
సంపూర్ణం.



## అథ సప్తమోఽధ్యాయః.

—*(మధ్వావతారం)*—

౧. ఇత్యాదికంసమాలోక్య శ్రీవాయుర్విష్ణుసన్నిధౌ ।
అహంప్రతిజ్ఞాం నిస్తీర్యకలౌద్వైతమతాగ్రణీ ॥

తా ॥ రామానుజుల వృత్తాంతమునువిని మధ్వాచార్యులవారు విష్ణుసన్నిధి యందు ప్రతిజ్ఞనుచేసినవారైరి.

౨. భూత్వాస్వశిష్యాక్షాన్స్వమతైః బోధయిత్వామతాంతరం ।
వేదానాంసారముధృత్య మంత్రసారంకరోమ్యహం ॥

తా ॥ ఆమధ్వాచార్యులవారు తమశిష్యులకు మతాంతరములను గ్రంథమును విస్తరింపజేసెదనని చెప్పిరి.

౩. సర్వోపనిషధాంసార ముధృత్యైవచభాష్యకం ।
అష్టాదశపురాణానాం సారముధృత్యటిప్పణీక ॥

తా ॥ అష్టాదశ పురాణములయొక్క సారమునెత్తి (టిప్పణి) యనెడిగ్రంథమునుం సర్వోపనిషత్తులయొక్క సారమునుదీసి. మరియొకభాష్యమును మధ్వాచార్యులవారు జేసిరి.

౪. శాస్త్రాణాంసారముధృత్య టీకాంకృత్వాప్యహంహరే।
ఆగమిష్యామిదేవేశ అనుజ్ఞాంధాతుమర్హసి ॥

తా ॥ శాస్త్రసారమును గ్రహించెడి (టీక) యను గ్రంథమును చేసుకొని భూలోకమునకు వెళ్లుటకు ఆజ్ఞను యివ్వమనియడిగిరి.

౫. తథాస్త్వితిమహావిష్ణు రువాచచసమీరణం ।
విష్ణ్వాజ్ఞాంశిరసాధృత్వా భూమండలమగాత్స్వయం ॥

తా ॥ అంతట అటులనేకానిమ్మనుఅని విష్ణువుచెప్పగ నంతట వారుభూమండల సంచారార్థము వెడలిరి.

౬. హరివాయురితిప్రోక్తం వైకుంఠేపరమర్షయః ।
ఆద్యావతారఃకధితః ద్వితీయోభీమసేనకః ॥

తా ॥ వైకుంటమందు గొప్పఋషుల ప్రథమావతారమందు హరివాయువు అనియు,ద్వితీయావతారమందు భీమసేనుడనియు నామము మధ్వాచార్యులకిచ్చిరి.

౭. తృతీయోదేశికేంద్రోభూత్ మధ్వాచార్యేతికథ్యతే ।
ద్వైతానాంమతసిద్ధాంతం కృత్వాశిష్యానబోధయత్ ॥

తా ॥ తృతీయావతారమందు యామధ్వాచార్యులవారు దేశకేంద్రులనెడి పేరును వహించిద్వైత సిద్ధాంతముజేసి శిష్యులకుబోధించిరి.

౮. నారాయణంనమస్కృత్య నరాణాంముక్తిదాయకం ।
ఉవాచభక్తివైరాగ్య సంయుక్తంవచనంప్రియం ॥

తా ॥ నారాయణుని నమస్కరించి మోక్షులక్తినిచ్చెడి వైరాగ్యవచనమును పలికెను.

౯. మధ్వాచార్యఇతిఖ్యాతో దేశికేంద్రోవదత్స్వయం ।
పుంస్త్వస్త్రీత్వవిశేషోవా జాతినామాశ్రయాదయః ॥

తా॥మధ్వాచార్యులనెడి పేరుగల దేశకేంద్రులు జాతినామవిచయక్షణలేక.

౧౦. నకారణంతద్భజనే భక్తిరేవహికారణం ।
యజ్ఞదానతపోభిర్వా వేదాధ్యయనకర్మభిః ॥

తా ॥ యజ్ఞదాన తపస్సులుచేతను వేదాధ్యయనము చేతను భక్తిశ్రద్ధలనుం చవలసినదనిచెప్పిరి.

౧౧. నైవద్రష్టుమహాంశక్యో మద్భక్తివిముఖైస్సదా ।
తస్మాద్బ్రూమిసుసంక్షేపా ద్వక్ష్యేహంభక్తిసాధనం॥

తా ॥ వారుభక్తిసాధనమును గురించిసంక్షేపముగ చెప్పెదమనిపలికిరి.

౧౨. సతాంసంగతిరేవాత్ర కారణంప్రథమంస్మృతం ।
ద్వితీయ్యంతత్కథాలాపో తృతీయ్యంతద్గుణేరతిః॥

తా ॥ ప్రథమమందు (సద్గతి) సత్సాంగత్యమే కారణమనియు, ద్వితీయ మందు సత్కథాలాపమే కారణమనియు, తృతీయమందు తద్గుణమందాసక్తియేకా రణమనియుచెప్పిరి.

౧౩. వ్యాఖ్యాతృత్వంతద్వచసాం చతుర్థంసాధనంస్మృతం ।
ఆచార్యోపాసనంశిష్యాః తద్బుధ్యామాయయాసదా ॥

తా ॥ చతుర్థవసాధనము వేదవాక్యములకు వ్యాఖ్యానము చేసుటేకారణ మనిపలికెను

౧౪. పంచమంపుణ్యశీలత్వం యమాదినియమానిచ ।
నిష్ఠాతత్పూజనేనిత్యం షష్ఠంసాధనమీరితం ॥

తా ॥ ఐదవది పుణ్యస్వభావము గలుగుట. ఆరవది భగవత్పూజచేసుటయే కారణమనిచెప్పిరి.

౧౫. తన్మంత్రోపాసనత్వం సాంగంసప్తమఉచ్యతే ।
మద్భక్తేష్వధికాపూజా సర్వభూతేషుతన్మతిః ॥

తా॥ ఏడవకారణము మంత్రముయొక్క ఉపాసనచేసుటయేయనిచెప్పెను.

౧౬. బాహ్యార్థేషువిరాగత్వం శమాదిసహితంతథా ।
అష్టమంనవమంతత్ర విచారంభగవత్కథా ॥

తా ॥ ఎనిమిదవసాధనము బాహ్యవస్తువులయందు ఆసక్తిలేకపోవుటయు, తొమ్మిదవదిభగవత్కథా విచారణయనిపలికిరి.

౧౭. ఏవంనవవిధంభక్తి సాధనంయస్యకస్యవా ।
వాసుదేవేపరంధామ్ని యస్యకస్యాపిజాయతె ॥

తా ॥ ఎవరికైనను తొమ్మిదివిధములైన భక్తిసాధనములనిచెప్పిరి.

౧౮. సమీరణోపిభూలోకే స్వాంతనుంగోచరీకరోత్ ।
మధ్వాచార్యఇతిఖ్యాతో ద్విజానాముత్తమేకులే ॥

తా ॥ ఎవరికైతేభగవంతునియందు నిశ్చలభక్తియుండుచున్నదో వారుమోక్షసాధకులయ్యెదరని తాత్పర్యము.

౧౯. సోపివృద్ధిముపాగమ్య క్రమసన్యాసయాశ్రితః ।
తత్రతత్రచరన్దేశేశిష్యాన్కృత్వాద్విజాన్భృశం॥

తా ॥ ఆయనవృద్ధిజెంది క్రమముగ సన్యాసము తీసుకొని యచ్చటచ్చట తిరుగుచు బ్రాహ్మణులనేకులను శిష్యులనుజేసుకొనియెను.

౨౦. ద్వైతసిద్ధాంతరీతించ తేషాంసమ్యగ్వదన్యతిః ।
విష్ణోఃపంచాయుధైరేవ పంచముద్రాఙ్కరోద్యతిః॥

తా ॥ శిష్యులకుద్వైతసిద్ధాంతము చక్కగబోధించుచు విష్ణుపంచాయుధములతో ౫-ముద్రలు వార్లకువేయుచుండెను.

౨౧. ఏవంరీత్యాస్వశిష్యాన్వై బోధయన్మాధ్వదేశికః ।
దేశేషుసంపరిక్రమ్య రాద్ధాంతంస్థాపయన్ముదా ॥

తా ॥ ఈరీతిగ మాధ్వసిద్ధాంతములను స్థాపించుటకై దేశములయందు సంచరించుచు సిద్ధాంతములను నిల్పిరి.

౨౨. బ్రహ్మణాసహముక్తిశ్చ అస్మాకంమతముత్తమం ।
ఇతితాన్బోధ్యభూమ్యాంచహనుమత్సముపాశ్రయః॥

తా ॥ అనంతరము శిష్యులనందరినిబిలచి మనము బ్రహ్మదేవునితోగూడ మనకుముక్తిగలదని బోధించిముందు బ్రహ్మగాబోవు నాంజనేయునియాశ్రయించిరి.

౨౩. సుఖేనాగమయత్కాలం మధ్వాచార్యస్వశిష్యకాన్ ।
మధ్వభాష్యంతతఃకృత్వా బ్రహ్మలోకంజగామసః ॥

తా ॥ తమ శిష్యులకందరికిమధ్వభాష్యముబోధించి బ్రహ్మలోకగతుడయ్యెను.

ఇతి శ్రీగౌతమపురనిలయ భాస్కరకవినామధేయప్రణీతాయాం
వైశ్యధర్మప్రకాశికాయాం
మధ్వావతారంనామ
సప్తమోఽధ్యాయః
సంపూర్ణం.



## అథ అష్టమోఽధ్యాయః.

—*(కన్యకాజననం)*—

౧. అథదేవీస్వయంభూమ్యామవతర్తుమియేషసా ।
ధనధాన్యైస్సుసంపూర్ణే ఆర్యాణాముత్తమేకులే ॥

తా ॥ అనంతరమందు పార్వతి తాను భూమియం దవతారమెత్తుట కిచ్ఛయించి. (వెంటనే) ధనధాన్యములచే నిండియున్న వైశ్యులవంశమందు. జనించెదనని చెప్పెను.

౨. బృహద్గిర్యభిధానే సత్పట్టణేవోరుజోత్తమః ।
కుసుమశ్శ్రేష్ఠినామ్నాచ విఖ్యాతఃకశ్చిదస్తిహి ॥

తా॥ అంతట పెనుగొండయను మంచిపట్టణమందు వైశ్యులలోనుత్తముడగు కుసుమశ్రేష్ఠియొకడుండెను.

౩. తస్యాభూత్కుసుమాభార్యా సాధ్వీసుగుణసంయుతా ।
భర్తృభక్తియుతానిత్యం పుణ్యశీలపరాయణా ॥

తా॥ అతనికివిశేషపతివ్రతయై మంచిగుణములుగలిగి మంచిస్వభావముగల కుసుమాంబ యను భార్యయుండె.

౪, అసత్యాచ్చుతౌనిత్యం పార్వతీపరమేశ్వరౌ ।
ఉద్దిస్యచక్రతుశ్శైవం వ్రతమత్యంతదుష్కరం ॥

తా॥ ఆదంపతులిరువురు సంతానములేక పార్వతీ పరమేశ్వరులనుగూర్చి అధిక శైవవ్రతము చేయుచునుండిరి.

౫. తయోర్వరందాతుమిచ్ఛన్నీశ్వరోవాచపార్వతీం ।
కుసుమశ్రేష్టిభార్యాయాందుహితాభవసుందరీ ॥

తా॥ ఇట్లుండనాయీశ్వరుడాయిర్వురకు వరమివ్వదలచి పార్వతినిబిల్చి ఓసుందరీ నీవు కుసుమశ్రేష్టిభార్యయందు పుత్రికగనవతరించుము.

౬. ఇత్యుక్త్వాతాంమహాదేవీం భక్తకామప్రదోహరః ।
పుణ్యేబృహన్నగర్యాం శ్రీనగరేశోభవామిచ।
ఇతితాంప్రేషయామాస భక్తానుగ్రహదీక్షితః ॥

తా॥ ఈప్రకారము పార్వతిని పొమ్మనిచెప్పుచు భక్తాభీష్టము లిచ్చునట్టి యీశ్వరుడు పవిత్రమైన ఆపట్టణమందే నేను నగరేశ్వరుడయ్యెదనని పార్వతినిపంపించెను.

౭. సంతానాయార్యభార్యాసా దేవీంమల్లీసుమైశ్శుభైః ।
పూజాంచకారతామేవ సదాభక్తిపరాయణా ॥

తా॥ ఆకుసుమశ్రేష్టిభార్య సంతతికొరకై ఎల్లప్పుడు భక్తిగలదై ఆదేవినే మంచిమల్లికాకుసుమములచేత పూజించుచుండెను.

౮. ఏవంవ్రతంచరంతీసా కదాచిత్కంజలోచనా ।
పత్యాసహప్రసుప్తాతాం దేవీమేవవిచింతతా॥

తా॥ ఈప్రకారము వ్రతముచేయుచు ఆదేవిని మనసులో తలచుకొనుచు నొకదినమురాత్రి తనపెనిమిటితోకూడ శయనించియుండెను.

౯. సింహాసంహననాగారీ ఉత్తమావరవర్ణినీ।
స్వాంతనూంగోచరీచక్రే తస్యాస్స్వప్నే కదాచన॥

తా॥ ఇట్లు నిద్రపోవుచున్న ఆకుసుమాంబ స్వప్నమందు పార్వతీ దేవి కనుపించెను.

౧౦. తాందేవీంస్వర్ణవర్ణాంగీం శరచ్చంద్రనిభాననాం।
తుష్టావవివిధైర్వాక్యైస్స్వాశయార్థాభిసూచకైః॥

తా॥ అంతటనాకుసుమాంబ శరత్కాలచంద్రునితో సరియగు నాప్రత్యక్షంబైన యీపార్వతీదేవినిచూచిన దైతనయిష్టమును తెల్పుచు అనేకవాక్యములచేస్తుతి చేసెను.

౧౧. స్తుత్వాతయాప్రసన్నాసా దేవీకారుణ్యసంయుతా।
దాస్యేవరంతమితితాం చాపృచ్ఛద్ధరాబలా॥

తా॥ కరుణతోకూడిన ఆదేవి కుసుమాంబచేశిన స్తుతికిసంతసించినీకు ఏమి వరము కావలెనో కోరుమని యామెను అడిగెను.

౧౨. అర్యభార్యాప్రార్థయత్తాం దీయతాంకన్యకామమ।
తయేత్థంప్రార్థితాదేవీ తథాస్త్వితితిరోభవత్॥

తా॥ కుసుమాంబయును నాకొకపుత్రికనివ్వమని ప్రార్థించగ నామె అదేరీతిగవరమిచ్చి యంతర్ధానంబయ్యె.

౧౩. విబుధ్యకుసుమాంబాచ కిమేతదితివిస్మితా।
ప్రబోధ్యపతయేస్వప్న. దృష్టంసర్వంన్యవేదయత్॥

తా॥ పిదప కుసుమాంబ మేలుకొని యిదియేమనియచ్చెరువొంది తనపెనిమిటిని నిద్రలేపి స్వప్నమందు జరిగినవృత్తాంతమంతయుంజెప్పగ.

౧౪. శ్రుత్వాసర్వంపుష్పగుప్తో తపఃఫలితమావయోః।
తుతోషనిభృతందేవ్యాః ప్రసాదఇతిసాదరం॥

తా॥ కుసుమగుప్తుడీవార్తవిని యిదంతయు దేవియొక్కయనుగ్రహమేయనియు మనతపంబీడేరెననియు మిగులసంతసించె.

౧౫. తతస్సకుసుమాంబాచ గర్భమాధత్తసత్వరం।
దినేదినేగర్భచిహ్నమదృశ్య తజనైర్ముదా॥

తా ॥ అనంతర మాకుసుమాంబ గర్భముధరించి దినదినము గర్భాభివృద్ధియై యెల్లరులకుసల్లలితంబుగ తెలియబడుచుండె.

౧౬. సంపూర్ణనవమాసాత్తు ప్రాసూతవరపుత్రికాం।
దృష్ట్వా తాంసుకుమారాంగీం సర్వలక్షణసంయుతాం।
స్వరోచిభిః ప్రదీప్తాంచ మోదతుఃపితరౌభృశం॥

తా ॥ సంపూర్ణమాసములైనపిదప వరప్రాప్తమైనపుత్రికను ప్రసవించె. ఆ పెబహుతనకాంతిచే ప్రకాశించునట్టియు సుకుమారశరీరము గలిగినట్టియుసమస్త శుభలక్షణములతో కూడిన యాకన్యంజూచి తల్లిదండ్రులు సంతోషించిరి.

౧౭. తతస్సకుసుమార్యోసౌ దేశేమార్గానుసారతః।
బ్రాహ్మణైరభ్యనుజ్ఞాతో జాతకర్మ కరోత్తదా ॥

తా॥ తదనంతరము ఈకుసుమగుప్తుడు వేదమార్గానుసారముగ బ్రాహ్మణుల చేయనుజ్ఞబొంది (ఆకన్యకు) జాతకర్మచేసిరి.

౧౮. వేదోక్తకర్మణాచార్యో తస్యాఃపుత్ర్యామనోహరం।
కన్యకావాసవీచేతి నామద్వయమకారయత్ ॥

తా॥ (పిదప)వేదోక్తకర్మచేతనే యాకూతురికిమనోహరముగుకన్యకయనియు వాసవీయనియు రెండుపేర్లబెట్టిరి.

౧౯. దినేదినేవృద్ధిముపాగతాసాశశాంకరేఖేవవళక్షపక్షే ।
విరోచయంతీసకలాదిశశ్శ్రియాక్రమేణకన్యాత్వమనన్యపూర్వాం ॥

తా ॥ దినదినము ఆకన్యక తనకాంతిచే సకలదిక్కులం బ్రకాశించుచు శుక్లపక్షచంద్రరేఖవలె తేజరిల్లుచు క్రమముగ అపూర్వ కన్యత్వమును పొందెను.

౨౦. ఏవంవిరాజద్దీప్త్యాసా వాసవీకన్యకాస్వయా ।
వైవాహికార్హవయసా నవవర్షయుతాసతీ॥

తా॥ ఈప్రకారము కన్యక తనయొక్క కాంతిచేతప్రకాశించుచు తొమ్మిది సంవత్సరముల చిన్నదాయెను.

ఇతి శ్రీగౌతమపురనిలయభాస్కరకవి ప్రణీతాయాం వైశ్యధర్మప్రకాశికాయాం.
కన్యకాజననంనామ
అష్టమోఽధ్యాయః
సంపూర్ణం.



## అథ నవమోఽధ్యాయః.

—*(విష్ణువర్ధనరాజాఘనాద్రిపురప్రవేశనం)*—

౧. అస్తిరాజమహేంద్రాఖ్య నగరీస్వర్ణగోపురా ।
చంద్రవంశప్రజాతానాం రాజ్ఞాబాహుబలార్జితా ॥

తా॥ (భూమియందు) బంగారు గోపురములు గలిగినట్టియు చంద్రవంశపు రాజులయొక్క భుజబలముచే సంపాదింపబడినట్టియు రాజమహేంద్రమనుపట్టణము గలదు.

౨. విధాతృప్రతిమైర్విప్రై ర్వేదవేదాంగపారగైః।
సోమసూర్యాన్వయైర్భూపైః షడాననపరాక్రమైః॥

తా ॥ (అది) బ్రహ్మసములైనట్టియు, వేదములను వాటి యంగోపాంగములను తెలిసిన బ్రాహ్మణులచేతను, కుమారస్వామివంటిపరాక్రమముగలరాజులచేతను.

3. నానారత్నగణై రర్యై రధఃకృతధనాధిపైః ।
కృషివాణిజ్యగోరక్షాం కుర్వద్భి ర్వేదలోలుపైః॥

తా॥ అనేకరత్నములు గలిగినట్టియు కుబేరుని ధిక్కరించునట్టి సంపదగలిగినట్టియు కృషివాణిజ్య గోరక్షణచేయుచున్నట్టియు వేదవిహితకర్మలయందాసక్తులైన వైశ్యులచేతనున్నూ.

౪. ద్విజసేవారతైశ్శూద్రై ర్విష్ణుపాదసముద్భవైః।
విరాజితాపురీరమ్యా గోదాజలపవిత్రితా ॥

తా ॥ బ్రహ్మ క్షత్రియ వైశ్య శుశ్రూషాసక్తులును విష్ణుపాదోద్భవులైన శూద్రులచేతను నివాసయోగ్యమైగోదావర్యుదకములచే పవిత్రమై యాపట్టణము రమ్యమై ప్రకాశించుచుండె.

౫. తాంమధ్యాస్తేపురీంరమ్యాం విష్ణువర్ధననామకః।
రాజాసోమకులోద్భూతో చంద్రశేఖరభక్తిమాన్॥

తా ॥ ఆరమ్యమగు పట్టణమందు చంద్రవంశమందు బుట్టినట్టియు ఈశ్వరభక్తుడగు విష్ణువర్ధనరాజు పాలించుచునుండెను.

౬. సదిశోజేతుకామస్సన్న వ్యాహతపరాక్రమః ।
స్వబాహుబలవిక్రాంతశ్చచారధరణీతలం ॥

తా॥ ఆరాజు అడ్డములేనిపరాక్రమముగలవాడై దిక్కులు గెల్వనిచ్ఛగలిగి తన భుజపరాక్రమముచే భూమి (నలుదిక్కులు) సంచరించుచు.

౭. తత్రతత్రస్థితాన్సర్వాన్ జిత్వాశత్రూననేకశః ।
ఘనాద్రిపురమభ్యేత్య తత్సమీపవనేవసత్ ॥

తా॥ అచ్చటచ్చటనుండు రాజులననేక విధములుగ జయించి పెనుగొండ యనుపట్టణమునకేతెంచి పట్టణసమీపమందుండు ఉపవనమందుదిగినవాడై.

౮. వనేసమంతతస్సైన్యాన్ నానాధ్వజపతాకికాన్ ।
అమాత్యైస్సహితోరాజా తాంపురీంద్రష్టుమాయయా ॥

తా॥ వనమందంతట సైన్యములునిల్పి మంత్రులతోగూడ యాపట్టణము జూడ వెడలె.

౯. తాంపురీంవిమలాంరమ్యాం బహుప్రాకారసంకులాం।
చంద్రకాంతశిలాసౌధ క్రీడితామరమండలాం ॥

తా॥ అదియనేకకోటప్రాకారములచేనొప్పునట్టియు చంద్రకాంతమణులచే కట్టబడ్డ మేడలయందు క్రీడించుచున్న దేవకాంతలుగల్గినట్టియు రమ్యమైనపట్టణమై యుండె.

౧౦. వేదానుష్ఠాననిరత తదర్థార్యైర్విరాజితాం ।
కన్యకాంబాప్రీతియుక్త నగరేశవిరాజితాం ॥

తా॥ వేదకర్మలయందాసక్తులై కర్మలు జరుపుచు వేదార్థమును తెలుసుకొను వైశ్యులచేతను కన్యకాంబయందాసక్తిగల నగరేశ్వరునిచే ప్రకాశమానమై యొప్పుచు.

౧౧. చిరంతనార్యయోగీనాం నివాసాసర్వసంపదాం।
దృష్ట్వాతాంనగరీంరమ్యాం రత్నజాలవిరాజితాం ॥

తా॥ బహుకాలముగ వైశ్యఋషులచే నివసింపబడిసమస్తసంపదలకున్ను నివాసమైనట్టిహర్మ్యములు రత్నములగుంపులచే ప్రకాశించుచుండె.

౧౨. ముక్తాదామవితానైశ్చ శోభితాంకుసుమైశ్శుభైః ।
రాజాసోమకులోద్భూతో దధావానందమాత్మని ॥

తా॥ ఇంకముత్యములహారములు మేలుకట్లచేతనున్ను దివ్యమైన కుసుమములచేప్రకాశించుచున్నయాపురినిసోమవంశోద్భవుడగు రాజు చూచి మిక్కిలి మనస్సునందానందము జెందెను.

౧౩. తస్యామేకత్రచాద్రాక్షీత్ జనార్దనవిరాజితం ।
మందిరంసర్వజంతూనాం పరంసౌఖ్యప్రదాయకం ॥

తా ॥ ఆపట్టణమందు సర్వులకు సౌఖ్యమిచ్చునట్టి జనార్దనస్వామి దేవాలయము నొకప్రదేశమందు (రాజు) చూచెను.

౧౪. తందృష్ట్వాదేవసదనం పాపీయ్యాన్రాజపాశకః ।
అంధేతమసివర్తేయ మితినేత్రేన్యమీలయత్ ॥

తా ॥ ఆదేవాలయమును పాపిష్ఠుడగు నీచరాజు చూచి కన్నులు మూసుకొని (ఎందుకనగ) నే నజ్ఞానమను-చీకటిలోనే యుంటున్నానని చెప్పుకొనుచు.

౧౫. తతస్తునగరేశస్య గత్వామందిరముత్తమం ।
నత్వాతంవివిధస్తోత్రైస్తుష్టావపరిమోదితః ॥

తా ॥ అనంతరమారాజు అత్యుత్తమమగు నగరేశ్వరాలయమునకు వెళ్లిఆయనననేక వాక్యములచే స్తుతించి సంతోషమొందెను.

౧౬. తతస్తన్నగరస్థాయె ఆర్యవంశసముద్భవాః ।
ద్రష్టుకామాన్నృపాలంతం నానోపాయనపాణయః ।
పరిగృహ్యాత్యనత్వాతం వినయేనబభాషిరే ॥

తా॥ మరియునంతనా పురియందుండు వైశ్యులురాజును చూడవలెననియనేకమైనకానుకలు తీసుకొనివచ్చి వినయముతోయాయనను నమస్కరించిమాట్లాడిరి.

౧౭. మనోహరంమంద్రిరమత్రతతిష్ఠత్వ త్రైవవాసోభవతాంమనోరమః । ఇతీరయంతోవణిజస్సభూపతే స్తన్మందిరందర్శయతాబభూవుః ॥

తా ॥.వారందరు (పిదప) ఆరాజుకుమంచిదగు గృహమచటనే యున్నదనియు నచ్చటమీరు నివశించుడని యాయింటినిచూపి యచ్చటరాజును ప్రవేశింపచేసిరి.

౧౮. దృష్ట్వాతన్మందిరందివ్యం దివ్యరత్నోజ్వలంపరం ।
రాజాపిపరమామోద స్తస్యాంవాసంచకారహి ॥

తా ॥ రాజుఅంతటదివ్యవర్ణములచే ప్రకాశించునాగృహమునుచూచి మిక్కిలిసంతోషించియచ్చటనేవాసముచేసెను.

౧౯. భక్ష్యభోజ్యైరర్యకృత్రైస్తృప్తిమేధనరాధిపః ।
అతీవహర్షమాపేదే మంత్రిభిఃపరివేష్టితః ॥

తా ॥ (ఇట్లునివసించి) వైశ్యులచేచేయబడిన భక్ష్యభోజ్య పదార్థములచే తృప్తిజెంది తనమంత్రులతో సహాసంతోషించుచుండిరి.

౨౦. అశేషశివనిర్మాల్య భోజనాత్పరితోషితః ।
వీటింగృహీత్వాసాయాహ్నే త్వారురోహచ్ఛిరోగృహం ॥

తా ॥ ఇట్లుండనొకానొక దివసమందు భోజనాది కృత్యంబులు దీర్చిసంతోషముగనున్న యొకసాయంకాలంబున తనమంత్రులతోకూడరాజు మేడమీదనెక్కెను.

ఇతి శ్రీగౌతమపురినిలయ భాస్కరకవినామధేయ విరచితాయాం
వైశ్యధర్మప్రకాశికాయాం విష్ణువర్ధన రాజాఘనా
త్రిపురప్రవేశనం నామ
నవమోఽధ్యాయః
సంపూర్ణం.



అథ దశమోధ్యాయః.

—*( రాజార్య సంవాదం )*—

౧. అనంతరంసుభూపాలో నగరంపరితశ్చరన్।
దదర్శరాజవీథింసో మంత్రిభిఃపరివేష్టితః॥

తా ॥ అనంతరమారాజు (మేడమీద నిలువబడి) మంత్రులతోగూడనా పట్టణమంతయుం జూచుచు రాజవీథినిచూచెను.

౨. కుసుమస్యసుతాకన్యా విపణ్యామాగతాశుభా।
జనార్దనస్య శేవార్థం సుమాన్యాదాయసత్వరం॥

తా॥ అప్పుడు(ఆవీథిలో) కుసుమశ్రేష్ఠికూతురగు వాసవకన్య జనార్దనస్వామిసేవార్థముగ (ఆదేవునికి) కుసుమములు తీసుకొనిపోవుచుండెను.

౩. తాందృష్ట్వాకన్యకాం రాజామమోహాపరమాద్భుతాం।
ఆర్యవంశమహాంభోధి సంజాతశశిరేఖికాం॥

తా॥ అప్పుడాపెయాశ్చర్యవంశమను సముద్రమందు బుట్టినచంద్రరేఖవలెన త్యాశ్చర్యముగజూపట్టెడి యాకన్యనుచూచి రాజుమోహితుడయ్యె.

౪. తాంమత్తకుంభగమనాంతరళాలకాంతాం కాంతాంస్వమ
ధ్యజితకేసరిరాజకాంతాం । కాంతాగణేషు వికసజ్జలజాత
నేత్రీం నేత్రాంతవీక్షితవశీకృతసర్వలోకాం॥

తా॥ ఆ పెమదపుటేనుగవంటి నడకగలిగినట్టియు తననడుముచే జయింపబడ్డ సింహముగలిగినట్టియు కమలములవంటి నేత్రము గలిగినట్టియు కడకంటిచూపులచే సర్వలోకవశ్యము గలిగినట్టియు స్త్రీలసముదాయములో రమణీయ్యమగు ఆకన్యను చూచె.

౫. అపతద్భువిరాజాయం మూర్ఛితశ్చతతోభటైః।
ఉత్థాపితోవదద్రాజా గచ్ఛంతీంతాంసమీక్షయన్.॥

తా॥అంతట నీరాజుమూర్ఛచే క్రిందబడి (పిదప) సమీపమందుండుభటులచే లేవనెత్తబడి తనలోనీవిధముగవితర్కించె.

౬. మాయామయీంసతీందృష్ట్వా చిత్తజాతప్రవేసితః।
సమీపస్థాన్మహారాజః పప్రచ్ఛేయంతుకేతితాన్ ॥

తా ॥ దేవీమాయామయమగు ఈచిన్నదానినిచూచి మన్మథకంపము గలవాడై సమీపమందుండు జనులను ఈచిన్న దెవరని విష్ణువర్ధనుడడిగెను.

౭. విప్రాఃప్రోచుర్మహీపాల మర్యకన్యాతిసుందరీ।
సుమగుప్తస్యసాపుత్రీ సుమాంబాపోషితాసుతా॥

తా ॥ (అప్పుడచటనున్న) బ్రాహ్మణులు ఈచిన్నది మంచిసౌందర్యవతి వైశ్యులకన్యక కుసుమగుప్తుని పుత్రిక కుసుమాంబచే పోషింపబడుచున్నదని చెప్పిరి.

౮. ఏతద్రూపవతీకన్యా క్వచిత్కాప్వినవీక్షితా।
విద్యుద్వారూపమాస్థాయ సంచరంతీధరాతలే ॥

తా ॥ (అప్పుడు రాజు) ఇట్టిరూపముగలకన్య నెచ్చట చూడలేదు మెరుపుయీరూపమును ధరించి భూమియందు తిరుగుచున్నదా యేమి.

౯. ఇతిప్రలపితంరాజ్ఞా శ్రుత్వారాజానుశాసనాత్ ।
నగరస్థాన్విశస్సర్వా నానయామాసురుత్సుకాః ॥

తా ॥ అను రాజుయొక్క వ్యర్థోక్తులు విని రాజాజ్ఞవల్ల (భటులు) ఆపట్టణమందుండు వైశ్యులను సంతోషముగ పిలుచుకొని వచ్చిరి.

౧౦. రాజాదిశన్నమాలోక్య స్వయముత్థాయగౌరవాత్ ।
దివ్యాసనేషుసంస్థాప్య ప్రోచేసాంజలిరగ్రతః ॥

తా ॥ రాజు (తన ఆజ్ఞచేవచ్చిన) వైశ్యులను చూచి లేచి గౌరవముతో మంచి సింహాసనములందు గూర్చుండబెట్టి చేతులు జోడించుకొని పలికెను.

౧౧. భవంతోహివిధేఃపుత్రా స్సదాచారపరాయణాః ।
సధర్మనిరతాస్సర్వే లోకసంస్థితిహేతవః ॥

తా ॥ మీరు బ్రహ్మ కొడుకులును సదాచారములందాసక్తిగల వారును మంచి ధర్మమందాసక్తులును సర్వజనుల నివాసమునకు కారణులైన వారును (అగుచున్నారు).

౧౨. ధర్మాధర్మవివేకజ్ఞా వైదికాచారతత్పరాః ।
భవద్భిరేవమేరాజ్యం విత్తంజీవితమేవవా ॥

తా ॥ (మీరు) ధర్మాధర్మములయొక్క వివేకములు తెలిసినవారును వేదాచారములను జరుపువారును (ఇట్టి) మీచేతనే నాయొక్క రాజ్యమున్ను ప్రాణమున్ను (నిల్చియున్నది).

౧౩. వృణోమ్యేకంవరంచార్యాః ప్రసన్నంక్రియతాంమనః ।
సుమగుప్తసుతాబాలాదీయతాం మమసాదరం ॥

తా ॥ గనుక(ఓవైశ్యులారా) మిమ్ములనొక వరమడిగెదను (మీరు) ప్రసన్నమైనమనస్సునుచేసి కుసుమశ్రేష్ఠి కూతురను విశ్వాసముగ నాకివ్వవలసినది.

౧౪. ఇతిరాజ్ఞోవచస్శ్రుత్వా చార్యవర్యవిగర్హితం ।
నశక్యమిదమస్మాకం కస్సంబంధఃప్రదృశ్యతే ॥

తా ॥ ఇట్లు వైశ్య వంశమునందు దూషణమగు జనాధిపతి వాక్యమును విని ఆవైశ్యులు) మాకు శక్యముకాదు (ఇది) ఎట్టిసంబంధమనిరి.

౧౫. ఇత్యూచుఃకేచిదార్యాస్తే మంత్రయంతిహికేచన ।
విచారయామఇతివా వయంగచ్ఛామహేగృహాన్ ॥

తా ॥ కొందరువైశ్యులు ఆలోచించిచెప్పెదమనియిండ్లకువెళ్లిరి.

౧౬. సుమగుప్తంతుప్రష్టవ్యమితిరాజ్ఞేన్యవేదయన్।
ఆహూయతాంపుష్పగుప్త ఇతిరాజ్ఞానియంత్రితాః।
తథాసుమోప్యాగతస్స రాజాజ్ఞాంశిరసావహన్ ॥

తా ॥ (మరికొందరు) కుసుమగుప్తుని యడుగవలెననగ రాజు కుసుమశ్రేష్ఠి నిబిలువమని భటులనంపగ వారుపోయి యతని రాజుకడకు దెచ్చిరి.

౧౭. ఆగతంసుమగుప్తంత దృష్ట్వారాజాసగౌరవం ।
బభాషేమపురంవాక్యం స్వీయాభిప్రాయసూచకం ॥

తా ॥ ఇట్లే తెంచిన కుసుమశ్రేష్ఠిని జూచి గౌరవముగ తనభావమునూచించునట్టి తియ్యనిపలుకులతో యొకవాక్యముపలికెను.

౧౮. తచ్ఛృత్వాపుష్పగుప్తోసా ప్రత్యూచేనిర్భయాంతరః ।
కిమిదంలోకవిద్విష్టం ధర్మశాస్త్రైశ్చగర్హితం ॥

తా ॥ ఆమాటవిని కుసుమగుప్తుడు ధర్మశాస్త్రనిందితమైనట్టియు లోకవిరుద్ధమైన ఈయభిప్రాయమేమని నిర్భయుడై ప్రత్యుత్తరమిచ్చెను.

౧౯. నారకప్రాపకంవాక్యం కుతస్త్వంభాషసేనృప ।
నాదాస్యామిసుతాంకన్యాం దేవీవరబలార్జితాం ।
నగరేశాయదాతవ్యమితిమేనిశ్చితంమనః ॥

తా ॥ ఇంకనో రాజా నరకహేతువగు నీలాటివచనమేలబల్కెదవు. ఆకన్యక దేవి వర బలముచే గలిగినది. దానిని నగరేశ్వరునికివ్వవలెనని నామనో నిశ్చయము గనుక నీకివ్వను.

౨౦. ఇత్యుక్త్వాస్సుమగుప్తోసోకోపసంవర్తితేక్షణః ।
తూష్ణీంస్థితస్తతోరాజాశస్త్రముద్యమ్యరోషధీః ॥

తా ॥ ఈప్రకారము బల్కి కుసుమగుప్తుడు కోపముచేగుడ్లుద్రిప్పుచు వూరకుండెను. పిదపరాజురోషముగలవాడైకత్తియెత్తుకొని యిట్లుచెప్పె.

౨౧. హనిష్యామివిశస్సర్వాంస్స్వయంగృహ్ణామికన్యకాం ।
రాక్షసోసౌవివాహస్స్యాద్యుద్ధేక్షత్రియశోభితః ॥

తా॥ వైశ్యులనందరిని చంపియాకన్యకను నేనేగ్రహించుచున్నాను. ఈవివాహము క్షత్రియార్హమైనయుద్ధమందు రాక్షస వివాహముచేసికొనియెద.

౨౨. ఇత్యుక్త్వాతుమహీపాలేచమూసంగ్రహణోత్సుకే ।
విశోదృష్ట్వాభీతిమంతః ప్రోచురిద్ధంపరస్పరం ॥

తా ॥ ఇటులని రాజు సైన్యములను గుంపుచేయను యత్నపడగాచూచి కొందరు వైశ్యులుభయపడి తమలోతాము ఈకిందచెప్పినవిధముగ మాట్లాడుకొనిరి.

౨౩. ఆపన్నివారితవ్యాద్య బుధ్యోపాయవిశారదైః ।
బోధయామోవయతిమితి కధయామస్సుమాహ్వాయం ॥

తా ॥ వచ్చినయాపద నివారించుకొనవలయు గాన బుద్ధిమంతులచేత కుసుమశ్రేష్ఠిని బోధింపజేసెదమని చెప్పుటకు నాలోచించిరి.

౨౪. ఇత్యాలోచ్యతదాసర్వే దాస్యాముఃకన్యకాంశుభాం ।
సుమగుప్తస్యవిహితం పథ్యామఇతినిర్గతాః ॥

తా ॥ ఈరీతిగనాలోచించి (ఓరాజా) కన్యకనిచ్చెదము, కుసుమగుప్తునికిహితముచెప్పెదమని సెలవుపుచ్చుకొని వెళ్లిపోయిరి.

౨౫. రాజాపిభాస్కరాచార్య మాహ్వాయధ్వమితీరితాః ।
తదాభటాభాస్కరార్య మానేతుంజగ్మురంజసా ॥

తా ॥ తదనంతరంబరాజు భాస్కరాచార్యులను పిలువమని భటుల కాజ్ఞచేయగ వారుశీఘ్రముగ పిలుచుకొనిరావలెనని వెళ్లిరి.

౨౬. సభాస్కరార్యస్తచ్ఛ్రుత్వాశాసనం భూపతేఃపునః ।
నమేరాజాంతికేకార్యం నాగచ్ఛామీత్యువాచతాన్ ॥

తా ॥ భాస్కరాచార్యులిదియావత్తువిని కోపితుడై నాకురాజుయొద్దరాపనిలేదనియాభటులతోచెప్పిపంపెను.

౨౭. నిరస్తాస్తేనతేసర్వే దుఃఖితాఃపునరాగతః ।
రాజానమబ్రువన్నత్వా మూర్ఖోనాయాతిబాడబః ॥

తా ॥ (భాస్కరాచార్యులచే) ధిక్కరింపబడ్డ యాభటులు వ్యసనముతోబోయి (అయ్యా) ఆమూర్ఖబ్రాహ్మణుడు రానని యెననిచెప్పిరి.

౨౮. తచ్ఛ్రుత్వాస్వభటైర్భూపో హసన్నాజ్ఞామథాకరోత్ ।
కిమనేనచ్ఛాందసేన నగంతవ్యమితఃపరం ॥

తా॥అంతనామాట రాజువిని నవ్వుచు ఈచ్ఛాందసబ్రాహ్మణునితో కావలసినదేమి యింకమీరచ్చుటకు పోకుడనిచెప్పెను.

౨౯. ఏతస్మిన్నంతరేరాజా కన్యామోహనపీడితః ।
సందిదేశభటాన్సర్వా నర్యాహ్వానాయసాదరం ॥

తా ॥ ఇంతలోనే రాజుకన్యకా మోహపీడితుడై వైశ్యులను బిలుచుటకొరకు భటులనంపెను.

30. ఆహూతా స్తే స్తథాకె చింతాభూపాలసన్నిధిం।
చోద్యద్ధినాగరాబాలాస్స వేషాఃపురతోగతాః ।

తా॥ అంతటనాభటులచే పిలువబడి కొంతమంది వైశ్యబాలకులు రాజు యెదుటకు మంచివేషముగలవారై వెళ్లిరి.

3౧. వివాహోత్సవకర్తార ఇవాభినయకారిణః ।
ప్రోచుర్ముహూర్తో ద్రష్టవ్య ఇతిరాజానమాదరాత్ ॥

తా ॥ (ఆబాలకులు) వివాహోత్సవముచేయువారివలెనే యభినయించిలగ్నము చూడుడని విశ్వాసముతో రాజుకు చెప్పిరి.

3౨. ఏతచ్ఛ్రుత్వాసరాజాపినహాసోద్ధాయసంభ్రమః ।
తాడయత్స్వభుజంతుష్టశ్చకారసుఖనర్తనం ॥

తా ॥ ఆ (ఇట్లుబాలకుల) మాటలనువిని శీఘ్రముగలేచి భుజములు తట్టుకొని సుఖమైననాట్యము జేసెను.

33. కన్యామంకగతాంమత్వా ప్రేషయామాసమంత్రిణః ॥
మాహూర్తికానాంభవనం తే సమాగత్యతక్షణాత్ ॥

తా ॥ (అప్పుడు) రాజు కన్యక తనతొడమీద నున్నట్టుగ నెంచి జ్యోతిష్కుల ఇండ్లకు లగ్నముచూడను మంత్రుల బంపెను. ఆజ్యోతిష్కులప్పుడెవచ్చి యిట్లుచెప్పిరి.

3౪. అర్థ్యవర్యో క్తబుద్ధ్యాచకాలాతిక్రమణేచ్ఛయా ।
నాయంవైవాహికఃకాలో మాఘమాసేస్తుభోనృప ॥

3౫. గురుమౌఢ్యంశుక్రమౌఢ్యమిదానీంపరిదృశ్యతే ।
తస్మాన్మాఘే ప్రశస్తస్స్యాతదాపస్యేన్ముహూర్తకం ॥

తా ॥ వైశ్యులుచేసిన కుత్రిమమునకువారు (పక్షపాతముతో) కాలాతిక్రమణముచేయవలెననిదలచి యిప్పుడు గురుశుక్రమౌఢ్యములు వివాహమునకర్హమగు కాలమిదిగాదు, మాఘమాసమందు వివాహార్హకాలముగ కనుబడుచున్నది అప్పుడేమి ముహూర్తము చూడవచ్చుననిరి.

3౬. ఇతిశ్రుత్వాద్విజేభ్యోససాక్షోపాత్ప్రోవాచసత్వరం ।
మూర్ఖాయూయంతుగచ్ఛధ్వం నేంగితజ్ఞాద్విజాధమాః ॥

తా॥ ఇట్లు బ్రాహ్మణులు చెప్పినది రాజువిని తీవ్రకోపుడై మీరు వెళ్లిపొండి అభిప్రాయము తెలియనిమాఖుర్వరలనియిట్లుజెప్పె.

౩౭. తచ్ఛ్రుత్వాప్రోచిరేవిప్రావివాహోయదిసాంప్రతం ।
మమాకేవరనాశస్యాత్కన్యానాశోపివాభవేత్ ॥

తా ॥ ఆమాటనువిని బ్రాహ్మణులు (కోపముతో) ఇప్పుడు వివాహమయ్యేనేని వరనాశమో లేక కన్యానాశమో సంభవించుచున్నదనిరి.

౩౮. తచ్ఛ్రుత్వాసద్ధియోగుప్తావినయాన్నృపమూచిరే ।
వాక్యదానమభూద్రాజన్జాతాసాత్వత్కృతేభువి ॥

తా ॥ అందుపైన మంచిబుద్ధిగల వైశ్యులు రాజునుజూచి అయ్యాకన్యమీకు గానే భూమియందు పుట్టినది గనుక వాగ్దానమైనది.

౩౯. నప్రౌఢాచాద్యసంజాతా నైవర్తుసమయాహ్యుతం ।
మాఖాదిపంచకేరాజన్ తస్యాయావ్వనముహ్యతె ॥

తా ॥ రాజా ఇప్పుడుకన్యప్రౌఢయుకాదు రుతుసమయమునుకాదు. మాఖాదిపంచకమునకా పెకు యవ్వనముకలుగును.

౪౦. సాద్యత్వయోద్వాపితాపి నభోగాయోపభువతె ।
సయేవకాలోభోగాయ త్వరాన్మాశుభమాచర ॥

తా ॥ ఇప్పుడాకన్య నీచే పెండ్లిచేయబడినను నీవేమియనుభవించెదవు గనుక బ్రాహ్మణులు చెప్పినకాలమే మీ కనుకూలముగనుండునుగాన త్వరపడి అమంగలము చేసుకొనవద్దనిచెప్పిరి.

౪౧. తచ్ఛ్రుత్వాబోధితోరాజా ప్రత్యూచెంతాం స్తథాస్త్వితి ।
మాఖేవస్యంప్రదాతవ్యా మహ్యంకన్యాసునిశ్చితా ॥

తా ॥ ఆమాటలువిని రాజుఅటులనేకానిండు. అయితేమాఖమాసమందు కన్యకను నిశ్చయముగనాకే యివ్వవలయుననియె.

౪౨. సత్యంవదతభోవైశ్యా ఇత్యుక్తా స్తేతథోచిరె ।
నిశ్చితై వాపిసాకన్యా భూమీశాయైవదీయతె ॥

తా ॥ ఓవైశ్యులారా మీరునిజము చెప్పుడనగ (వారు) అయ్యా ఈకన్యక భూపతికొరకే నిశ్చయింపబడ్డది. మీకే ఇవ్వబడుననిచెప్పిరి.

౪౩. సత్యంసత్యంపునస్సత్యం సాక్షిణౌభానుభేశ్వరౌ ।
మృషోక్త్వాళ్వాగమిష్యామ స్తవరాజ్యేహిసంస్థితాః ॥

తా॥ ముమ్మారుగనిట్లు వైశ్యులుప్రమాణముచేసి యందుకు సూర్యచంద్రులను సాక్షులనిచెప్పచునయ్యాలబద్ధమాడి నీరాజ్యమందుండక నెచ్చటికరుగుదము.

౪౪. ఇతినరపతిరత్రైర్వైశ్యైర్భోధితో బుద్ధిమద్భిర్నిజహృదిపరిజాతం సంశయంతంముమోచక్ । స్వనగరగతబుధ్యామంత్రిణస్తా న పశ్యన్గజతురగరథాద్యైః ప్రాపతత్పట్టణస్వం ॥

తా॥ గనుకపైచెప్పినమేరకు మంచిబుద్ధిగల వైశ్యబాలకులచే బోధించబడి తనమనస్సునందలి సంశయమును విడిచినవాడై తనపట్టణమునకు వెళ్లవలెనని రథగజతురగ పదాతులతో పట్టణమునకు వెళ్లెను.

ఇతి శ్రీగౌతమపురనిలయభాస్కరకవినామధేయ ప్రణీతాయాం వైశ్యధర్మప్రకాశికాయాం
రా జా ర్య సం వా దో నా మ
దశమోఽధ్యాయః.
సం పూ ర్ణం.



## అథ ఏకాదశోధ్యాయః.

—*(క న్య కా న గ రే శ్వ ర ప్ర ధా నం)*—

౧. నగరేతత్రతేవైశ్యాసమాలోచ్యస్వవంశజాన్ ।
అనేతుంసువిచార్యేవ దుష్టభూపవిచింతితం ॥

తా॥ ఆపెనుగొండపట్టణమందు వైశ్యులందరు ఆలోచించి తమవర్ణస్థులనందరిని పిలిపించి రాజభిప్రాయమిట్టిదని చెప్ప నిశ్చయించిరి.

౨. మహాత్కార్యంజాతమితిలిఖిత్వాప్రతికారహాః ।
సమాయాంతుకులాచార నిశ్చయార్థమితిస్ఫుటం ॥

తా॥ ఇంకమరియొక గొప్పకార్యమున్నది కులాచారనిశ్చయమునకై (మీరందరు) రావలెనని రహస్యముగ పత్రికలువ్రాయుటకొప్పకొని.

౩. ప్రేషయిత్వాభటాన్సప్త దశపట్టణసంస్థితాన్ ।
ఆనయామాసురథతేజ్ఞాత్వావంశ్యప్రయోజనం ॥

తా ॥ వెంటనే పరిచారకులను పంపి పదునేడు పట్టణముల యందుండు వైశ్యులంపిలిపించగా వారును వంశకార్యముగా నాలోచించసాగిరి.

౪. సపుత్రకాస్సపత్నీకాస్సమాయాతాస్సబాంధవాః ।
తేషామాతిథ్యసత్కార్యం కృత్వాదేవస్యమంటపే ॥

తా॥ అంతటవారు పుత్రమిత్రబంధువులతోకూడ పెనుగొండకేతెంచగా వారలను పట్టణవాసులగు వైశ్యులుచక్కగనాతిథ్యమొనర్చిదేవతామంటపమునయుంచిరి.

౫. స్థిత్వాతైస్సహతత్కార్యం సమస్తంప్రోచురాదితః ।
విష్ణువర్ధనభూపాలః కృత్వాదిగ్విజయంజయీ ॥

తా॥ అక్కడ (ఆదేవస్థానమందందరుకలసి) యావత్సంగతి మొదటినుంచి చెప్పనారంభించి విష్ణువర్ధనమహారాజుదిగ్విజయార్థముదిక్కులజయించబయలు వెడలి.

౬. అస్మత్పట్టణసాన్నిధ్య శ్రుంగారవనమాగతః ।
సరాజాప్రార్థితోస్మాభిస్సమాగత్యపురేస్థితః ॥

తా॥ మనయూరి సమీపమందుండు శృంగారవనమందుండగా మేముపోయి వారలనీపట్టణమునకు దోడ్తెచ్చితిమి.

౭. సాయంకాలేతథారాజా కుసుమాఖ్యస్యకన్యకాం ।
తాంవిలోక్యవివాహాయ యయాచేరాజశేఖరః ॥

తా ॥ (ఒకనాటిదినం) సాయంకాలమందు రాజు కుసుమశ్రేష్ఠి కూతురగు కన్యకనుచూచి తాను వివాహముచేసుకొనుటకై యాచించెను.

౮. దాస్యామఃకన్యకాతుభ్య మితితూష్ణీంస్థితావయం ।
యుష్మన్మనోగతంజ్ఞాతు ముక్తంమాఘేభవత్వితీ ॥

తా ॥ అప్పుడా రాజుకొరకు కన్యనిచ్చెదమని చెప్పితిమి. (ఐనను) మీయొక్కమనోభిప్రాయము తెలుసుకొనవలయునని(రాజుతో) మాఘమాసమువరకులగ్నమునిలుపు కానిమ్మని చెప్పితిమి.

౯. వయంహికింకరిష్యామ స్సర్వమేతద్విచార్యతాం ।
ఇత్యుక్త్వాస్వకులైర్వైశ్యా ప్రోచుఃకేచనతోషితాః ॥

తా॥ (ఇప్పుడు) మనమేమిచేయవలయునోయాలోచించుడనగ కొందరువైశ్యులు సంతోషించినవారలై యిట్లనిరి.

౧౦. సోమవంశోద్భవోరాజా త్వస్మాకమధికఃకులె ।
దత్వాసుఖేనతిష్ఠామో నదోషఃప్రతిభాతినః ॥

తా॥ చంద్రవంశమందు బుట్టినవాడును మనకంటే కులమందధికుడున్నగుసుగనుక ఆయనకుకన్యనిచ్చి సుఖముగ నుందమనియు మనకేమియు దోషములేదనియుచెప్పిరి.

౧౧. తచ్ఛ్రుత్వాకేచనప్రోచు ర్వర్ణేతరసుతాకతా ।
నిషిద్ధాభూవిభోదుష్టో గృహ్ణాత్యేవబలాత్స్వయం ॥

తా॥ ఆమాటలువిని భిన్నవర్ణస్థులకు పరస్పరబంధుత్వము కలియుగమందు నిషేధము గనుక కూడదనిరి. (మరికొందరు) రాజుదుష్టుడు గనుక కన్యను బలత్కారముగనైనతీసుకొనుననిరి.

౧౨. కేచిద్రాజార్యసంబంధ కదాచిదపినశ్రృతం ।
ఇదానీంకింకరిష్యామ ఇత్యన్యోన్యంవిలోకితాః ॥

తా॥ మరికొందరు రాజులకు వైశ్యులకు సంబంధమెప్పుడునులేదు. ఇప్పుడేమిచేయుదమని యొకరినొకరు యడుగసాగిరి.

౧౩. బంధుంకుసుమనామాన మబ్రువన్గద్గదస్వరాః ।
కిమిదంకర్తకింకుర్మో బ్రూహితాత్కాలికీంక్రియాం ॥

తా॥ కొందరు(అప్పుడారాజుయొక్కదుష్టస్వభావమునెరిగి) తమబంధువైనకుసుమశ్రేష్టినిగద్గదస్వరముతో (బిలచి) అయ్యా ఏమిచేయవలెను. ఈకాలమునకుతగినక్రియజెప్పుమనిరి.

౧౪. యదావంశేసుతాజాతా తదైవనిహతావయం ।
స్వాంతేకింవర్తతేబ్రూహి యథార్థంస్వామిసన్నిధౌ ॥

తా॥ మరికొందరు (అయ్యా) వంశమందుకన్యక ఎప్పుడుబుట్టెనోయప్పుడేమనము చచ్చినవారము (గాన) నీమనస్సునందేమియున్నదో దానిని నిశ్చయముగస్వామిసన్నిధియందు జెప్పుమనిరి.

౧౫. తచ్ఛ్రుత్వాకుసుమఃప్రాహ ప్రణిపత్యాకృతాంజలిః।
కులార్థమేకముత్సృజ్య కులంరక్షంతిసాధవః ॥

తా ॥ ఆమాటవిని కుసుమగుప్తుడందరికి నమస్కరించి చేతులుజోడించుకొని(అయ్యా) కులసంరక్షణకై పెద్దమనుష్యులనైనంవిడచి కులసంరక్షణచేయవలె.

౧౬. కులీనామాంపరిత్యజ్య రక్షంతుకులసంతతిం ।
జలాగ్నివిషపానాద్యైః ప్రాణాంస్త్యక్ష్యామ్యహంధృవం ॥

తా ॥ (గాన) శ్రేష్ఠులైన (మీరు) నన్నువిడిచి వంశమును రక్షించుడి. నేనునిశ్చయముగ జలాగ్నివిషాదులచే ప్రాణపరిత్యాగము చేసుకొనియెదను.

౧౭. సుతామమాసాహిహర ప్రియాస్యాచ్చేష్టా విలాసాదిభిరేవ దేవీ । దాస్యామ్యహంశ్రీనగరేశ్వరాయ మనుష్యజన్మాకథ మర్హాతీమాం ॥

తా ॥ నాయొక్కకూతురు చేష్టలచేతను పార్వతివలెనున్నది గాన ఈశ్వర ప్రియురాలుగనుక నగరేశ్వరున కాచిన్నదానినిచ్చెదను. (ఇట్టిదానిని) మనుష్యుడైనరాజు (పెండ్లిచేసుకొనుట) కెట్లర్హుడగు.

౧౮. ఇత్యుదర్యసపత్నీకో మరణేకృతనిశ్చయః ।
యయాచేనిధసంబకధూ ప్ర్వణిపత్యపునఃపునః॥

తా ॥ అనిచెప్పికుసుమగుప్తుడు భార్యాసహితుడయి మరణమందు నిశ్చయముచేసి బంధువుల నందరిని ముమ్మారు నమస్కరించి చావునకు సెలవడిగెను.

౧౯. తచ్ఛ్రుత్వాతేవిశస్సర్వే·తంప్రోచురతిగౌరవాత్ ।
కిముచ్యతేత్వయావృద్ధ నోచితంతవభాషితం॥

తా ॥ ఆమాటలను వైశ్యులందరువిని అతిగౌరవముతో (ఓయివృద్ధుడా) ఏమిచెప్పితివి. యీలాటిమాటనీకు వచించుట కర్హముగాదనిరి.

౨౦. నదాతవ్యాసుతారాజ్ఞే నత్యక్తాఃకులసాగరః ।
మానంకులేప్రతిష్ఠాప్య కీర్తింకుర్వోజగత్రయే ॥

తా ॥ మరియునాకుసుమగుప్త(అయ్యా)రాజునకునాకూతురనివ్వనక్కరలేదు. మనకులమనుసముద్రమునుమీరిపోగూడదు వంశమందుకీర్తినిలుపవలయుననిచెప్పగ.

౨౧. ప్రాణానద్యతృణప్రాయా స్త్యక్ష్యామోనిశ్చితాస్త్వయా।
జనార్దనహరింకోన కమలాంవింధ్యవాసినీం ॥

తా ॥ అప్పుడువారందరు మనయొక్క ప్రాణములను తృణప్రాయముగా నీతోసహావిడుచుచు న్నాము (మరియు) జనార్దనస్వామిని కోనకమలాదేవిని నిన్నీ.

౨౨. నగరేశ్వరగౌరీశం నగరాఖ్యమహాస్థలం ।
ధర్మంకీర్తింసదాచారం వైదికాచారపద్ధతిం ॥

తా॥నగరేశ్వరుని,ఈపట్టణమును, కీర్తిని, ధర్మమును వేదాచారమార్గమునున్ను.

౨౩. యేవాంచ్ఛంతీహతిష్ఠంతి గచ్ఛంత్వన్యేనిజేచ్ఛయా।
ఇతిసర్వేగతాశ్శీఘ్రం భాస్కరాచార్యసన్నిధిం ॥

తా॥ ఎవరపేక్షించెదరో వారిచ్చట నసగా ఈప్రతిజ్ఞయందు నిలువవలయును. దీనికిసుడబడనివారు ఇతరత్ర వెళ్లవచ్చునని భాస్కరార్యులవారుచెప్పి.

౨౪. దృష్ట్వాసర్వాన్విశః తత్ర భాస్కరో ప్యాహగౌరవం ।
కిమర్థమాగతాయూయం నభేత్తవ్యంనరాధిపాత్ ॥

తా ॥ భాస్కరాచార్యులు విశేషగౌరవముతో నావైశ్యులనుచూచి మీరెందుకిచ్చటికి వచ్చితిరి రాజువల్లభయపడనక్కరలేదు.

౨౫. కథమర్హతిరాజాతాం సుసిద్ధమివపాపకృత్ ।
నాశహేతోస్సముత్పన్నా రాజ్ఞోదుష్టమతేస్త్వియం ।
నగరేశాయదాతవ్య మిమాంమాఖేసునిశ్చయం ।

తా ॥ మంచికార్యముయొక్క సిద్ధినిపాపిష్ఠుడు చెందుటకెట్లర్హుడుకాడో అటులనేరాజున్ను కన్యను పెండ్లిచేసుకొనుటకర్హుడుగాడు మరియురాజు నాశముకొరకే యాచిన్నది జన్మించినది మాఖమాసమందీకన్యను నిశ్చయముగ నగరేశ్వరున కివ్వవలయును.

౨౬. నవిచారోత్రకర్తవ్యో వాసవీపరిరక్ష్యతాం ।
దైవంవోవాసవీకన్యా తస్మాత్తాంరక్ష్యతాంసదా ॥

తా ॥ మీరాలోచించనక్కరలేదు మీదైవమైనవాసవ కన్యనునిరంతరముకాపాడవలయును.

౨౭. కాప్రతిష్ఠాచకాకీర్తి స్సారాజ్ఞాపహృతాయది ।
ఇతిశృత్వాగురోర్వైశ్యా స్తథాస్త్వితిముదాస్థితాః ॥

తా ॥ (గ్రాస) ఆకన్యకరాజుచే నపహరించబడ్డదైనయెడల కీర్తిప్రతిష్ఠ లెక్కడివి అనిచెప్పగ వారుమంచిదని ఆచార్యుని యెదుటనేయుండిరి.

౨౮. యేకన్యారక్షణార్థాహిప్రాణాం స్త్యక్ష్యంతిచోరుజాః ।
యుద్ధంకుర్వంతిభూపేన సాకంలక్ష్మీర్భవంతువః ।

తా ॥ (అప్పుడాచార్యుడు చెప్పినదేమనగ) ఎవరైతే కన్యకా సంరక్షణ మైరాజుతో యుద్ధముచేశి ప్రాణములువిడిచెదరో అట్టివారైశ్వర్యవంతులుగ నుం దురు.

౨౯. యేభీతాఃపాపకర్మాణో హిత్వాస్వకులమానసం ।
గచ్ఛంతి తేదురాచారా శూద్రప్రాయాభవిష్యథ ॥

తా ॥ ఏవరుపాపిష్టులై రాజభీతులై పారిపోయెదరో వారుతమకులమును విడిచిదురాచారముగల శూద్రులవలెనగుదురు.

౩౦. వేదవైదికసంత్యక్తా స్త్యక్తసంధ్యాద్యుపాసనాః ।
దైవభక్తివిహీనాశ్చ దరిద్రాశ్చభవిష్యథ ।

తా॥ మరిన్ని వేదసంబంధమైన స్నానసంధ్యాది కర్మలవిడిచి దైవభక్తివర్జి తులై దరిద్రులగుదురుగాక.

౩౧. ఇతిశ్రుత్వాగురోర్వాక్యం కర్తవ్యమితిచాబ్రువన్ ।
సందిగ్ధమనసః కేచి త్కావార్తాకుత్రవైశివః ॥

౩౨. అర్యకన్యాక్వసంబంధః దృశ్యతేదైవమర్త్యయోః ।
రాజార్యయోఃకథంనస్యా త్కథంస్యాద్దైవమర్త్యయోః ॥

తా ॥ ఈప్రకారము భాస్కరాచార్యులవారు చెప్పినదానిని విని ఆచా ర్యాజ్ఞప్రకారము చెయ్యవలెనని కొందరనిరి మరికొందరుసందేహ మనస్కులై (ఈ భాస్కరాచార్యులు చెప్పినట్లు) నగరేశ్వరునకు కన్యనిచ్చుటమాత్రమెట్లగును దేవ మనుష్యులకుమాత్ర మెట్లుబంధుత్వము కలుగును క్షత్రియవైశ్యులకు బంధుత్వమెం దుకు కాగూడదు.

౩౩. కింకరోతిచసాకన్యా పతింపాషాణరూపిణం ।
వృథాప్రాణపరిత్యాగః కార్యకింగురుబోధనాత్ ।
ఛాందసోవృద్ధవిప్రోసౌ బ్రూతేపైత్యాఃశపిష్యతి ॥

తా ॥ ఆనగరేశ్వరుని కన్యకపెండ్లిచేసుకొని శిలారూపమగు. దేవునినేమిచే యగలదు (గనుక) గురుబోధనవిని ప్రాణత్యాగము వ్యర్థముగాచేయవలెను. ఐతేఈ బ్రాహ్మణుడు వృద్ధుడు పిత్తముచేదిట్లుచున్నాడు.

౩౪. రాజ్ఞేదాస్యతువాపుష్పో సదాస్యత్వధవాసుతాం ।
వయమన్యత్రగచ్ఛామః కింనఃప్రాణవిపర్యయాత్ ॥

తా ॥ పుష్పగుప్తుడు తనకూతురను రాజుకివ్వని, ఇవ్వకపోని, మనమెచ్చుటకై నమరియొకతట్టువెళ్లెదము. ప్రాణములుపోగొట్టుకొనుటకంటే మనకదియేమేలనిరి.

౩౫. శ్రుత్వాతేషాంవచఃకన్యా కోపారుణితలోచనా ।
మమసంరక్షణేహీనా వైశ్యావిందంతునాశనం ।

తా ॥ (ఇట్లుబల్కిన) వారివాక్యములను కన్యకవిని కోపముచే కన్నులెఱ్ఱజేసినా సంరక్షణముకువెరచి తప్పిన వైశ్యులు నాశనమొందుదురనిశాపమిచ్చెను.

౩౬. యాదాహంభాస్కరాచార్య స్తథాతేపాపచారిణః ।
వేదధర్మ విహీనాశ్చ భవిష్యథకలౌయుగే ॥

తా ॥ కలియుగమందు (నారక్షణకుతప్పినవారి) విషయమైన భాస్కరాచార్యులవారు చెప్పినదంతయు నిజమై వేదకర్మ విహీనులగుదురుగాక.

౩౭. ఇత్యేవంకన్యయాశప్తా అపిద్విశతగోత్రిణః ।
ప్రాణసంరక్షణపరాః గంతుమన్యత్రచోద్యతాః ॥

తా ॥ ఈప్రకారం కన్యకచే శపింపబడినను, ఇన్నూరుగోత్రికులవారు ప్రాణసంరక్షణ పరులై ఇతరత్ర వెళ్లుటకుప్రయత్నపడిరి.

౩౮. తదాకన్యాద్విషోవైశ్యాః కళాహీనావిగర్హితాః ।
చండాలాఇవనీలాంగా బభూవుఃపాపచారిణః ॥

తా ॥ అప్పుడు కన్యద్వేషులైన వైశ్యులునల్లని శరీరములతో నిందింపబడ్డ చండాలులవలె కాంతిహీనులై పాపిష్ఠులైరి.

౩౯. పరస్పరంచ తేప్రోచు ర్దురుక్తీర్దుర్మదావిశః ।
నదర్శనీయాకన్యేయం నసంభాష్యాదురాత్మజా ॥

తా ॥ (అప్పుడు) వారు (తమరూపములు) చూచుకొని విశేషగర్వముగలవారై యీకన్యచూడతగినదికాదనియు మాట్లాడుట కర్హురాలు గాదనియు, దుర్భాషలాడుకొనిరి.

౪౦. ఏషాదార్యకులాంభోధా బడబాగ్నిశిఖాభవత్ ।
ఏకానష్టాభవేత్కన్యా కాబాధాకులగోత్రయోః ॥

తా ॥ ఈకన్యవైశ్యవంశమను సముద్రమును (పీల్చుటకు) బడబాగ్నివలె పుట్టియున్నది. ఒకతెనష్టమైతే మనకులగోత్రముల కేమిహానియగుననిరి).

౪౧. ఆయాంతినృపసైన్యాని హనిష్యంతిశోబహూన్ ।
వయంరహస్యమార్గేణ యత్రకుత్రాపిమేదినీం ॥

తా॥ఇంతలోకొందరురాజసైన్యములొచ్చుచున్నవి. వైశ్యులనేకులుసంహరించబడుదురు(గనుక) మనమురహస్యమైన మార్గముచేనెద్ది భూమినైన గూర్చివెళ్లుదము.

౪౨. గచ్ఛామఃపుత్రమిత్రాద్యైః కుర్వంతప్రాణరక్షణం ।
ఇత్యుక్తవంతస్తేకేచిత్ న్నిర్గతానిజపట్టణాత్ ॥

తా ॥ అనిచెప్పుచుపుత్రమిత్రాదులతో సహాప్రాణసంరక్షణ చేసుకొనవలెను అనిపలుకుచు కొందరిపట్టణము విడచివెళ్లిరి.

౪౩. తదాద్విశతగోత్రాంకాః ప్రాణభీతాఃపలాయితాః ।
అశీతిగోత్రసంభూతా స్తురాపాట్కుకుభంగతాః ॥

తా ॥ అప్పుడు ఇన్నూరు గోత్రములవారు ప్రాణభీతిచేపరుగెత్తిరి. యెనుబది గోత్రములవారు తూర్పుదిక్కునకు వెళ్లిరి.

౪౪. పునర్ద్విశతగోత్రాంకా దక్షిణాందిశమాస్థితాః ।
చతుస్త్రింశోత్తరశత గోత్రజాశ్చోత్తరంగతాః ॥

తా ॥ మరలనిన్నూరుగోత్రములవారు దక్షిణదిక్కునకువెళ్లిరి. నూటముప్పది నాల్గుగోత్రములవారుత్తరపు దిక్కునకు వెళ్లిరి.

౪౫. గురుశప్తేష్వసభ్యేషు గోత్రజేషుసమంతతః ।
ఏవంయాతేషుభీతేషు పరేవైశ్యకులోద్భవాః ॥

తా ॥ ఈప్రకారము దుర్మార్గులైన గురుశాపగ్రస్తులందరు నానావిధములుగ వెళ్లగాకొందరు వైశ్యులు

౪౬. ధీరాస్స్వధర్మనిరతా శ్శతగోత్రవివర్ధకాః ।
కన్యాసంరక్షణార్థంహి స్థితాస్తత్రైవసంగతాః ॥

తా ॥ ధైర్యముగలవారై తమధర్మమందాసక్తులై కన్యారక్షణపరులై అచ్చటనేనిలచియుండిరి.

౪౭. తాంబూలైర్మధుపర్కైశ్చ కంకణైశ్శోభితావిశః।
ఉద్ధాయకుసుమాఖ్యస్తు మదర్థమఖిలాజనాః ॥

తా॥ పిదపవైశ్యులందరు తాంబూలచందనములు బూచుకొని (కన్యకారక్షణకొరకై ప్రాణములువిడిచెదమని)కంకణబద్ధులైరి. (అప్పుడు) కుసుమశ్రేష్ఠిలేచి నిల్వబడి యిట్లుచెప్పె.

౪౮. శ్రమంప్రాణస్యవిన్యాసం నకుర్వంత్వహామేవహి ।
అగ్నౌనష్టోభవిష్యామి ననహేకులసంక్షయం ॥

తా ॥ (ఓవైశ్యులారా) శ్రమగాప్రాణ పరిత్యాగమేలచేసెదరు. నేనేఅగ్ని యందుపడి ప్రాణత్యాగము చేసుకొనెదగాని కులక్షయమునకోర్వను.

౪౯. కులనాశనపాపంత న్నశ్రోఢుంమహాముత్సహే ।
ఇత్యూచతంగురుఃప్రాహ త్వదర్థేనైవసంభ్రమః ॥

తా ॥ వర్ణనాశనమువలననగు పాపమును భరించుటకు సహించనని చెప్ప గనాచార్యులు (కుసుమశ్రేష్టిని) చూచి (అయ్యావీరలు) నీకొరకైయత్నపడలేదు.

౫౦. కులసంరక్షణార్థంయె దేవతాధర్మహేతవె ।
విష్ణుధర్మవివేకాయ కుర్వంత్యుత్సవమీదృశం ॥

తా ॥ కులమునుసంరక్షించవలెననియు కులదేవతయనుహేతువ కొరకును వైష్ణవధర్మముకొరకును ఈపాటియుత్సవముచేయుచున్నారుగాని వ్యసనమక్కరలే దు నీకొరకేకాదు.

౫౧. పూజైషాదేవదేవస్య కన్యాతస్మైచదీయతె ।
విఘ్నంమాకురుతద్విఘ్నా దపరాధోభవిష్యతే ॥

తా॥ (ఈయుత్సవరూపమగు) దేవదేవునియొక్క పూజగాని (మరేమియు కాదు) కన్యయునాయనకొరకే.యివ్వబడునుగాననీవు విఘ్నము చేయకు అట్లుచేసిన యపరాధము కలుగును అనిభాస్కరాచార్యులు చెప్పిరి.

౫౨. తచ్ఛ్రుత్వాకుసుమశ్రేష్ఠో నత్వాగురుపదాంబుజం ।
తూష్ణీంబభూవసాకన్యా తదానత్వాగురోఃపదే ॥

తా॥ ఆమాటనుకుసుమశ్రేష్ఠివిని గురువునునమస్కరించియూరకుండెను. అప్పుడు కన్యగురువును నమస్కరించి.

౫౩. ప్రోవాచసాతదాకన్యా శరీరందూషితంమమ ।
రాజదృష్టిశునానూనం శుద్ధంభవతిపావకాత్ ॥

తా ॥ (స్వామీ) నాశరీరము రాజదృష్టియను శునకముచే స్పృశింపబడి అపరిశుద్ధమైనదిగనుక అగ్నివల్ల శుద్ధియగుచున్నదని కన్యచెప్పెను.

౫౪. అతశ్శరీరశుద్ధ్యర్థం త్వరతేమానసంమమ ।
శ్రోత్రియాగార్హతోవహ్ని ర్నేయోభవతివైజనాః ।
తచ్ఛ్రుత్వానిఖిలావైశ్యా హాహాకారంప్రచక్రిరే ॥

తా ॥ అందువల్ల శరీర శుద్ధికొరకై నామనస్సు త్వరపడుచున్నది (గాన) శ్రోత్రియులింటినుంచి అగ్నిదీసుక రావలయుననగా ఆమాటవినిజనులందరు హాహా యని వాక్థ్వనులంజేసిరి.

౫౫. శ్రుత్వాసుమోపితద్వాక్యం పపాతధరణీతలే ।
దుఃఖార్తశ్చకుఠారేణ ఛ్ఛిన్నభూమిరుహాకృతిః ॥

తా ॥ ఆమాటవిని కుసుమశ్రేష్టి (కూతురయందలి ప్రేమాతిశయముతో) ఖిన్నుడై నరికివేశిన వృక్షమువలెదుఃఖముచే పీడితుడై క్రిందబడెను.

౫౬. కన్యాకాపితరంచార్త మబ్రవీల్లోకసుందరీ ।
మాధవతిఛుందుఃఖమనా నార్హస్యాప్తుంశుచంవృథా ॥

తా ॥ (అప్పు) డాకన్యక (తన) తండ్రినిదుఃఖాతురునిగా జూచిపలికెను (అయ్యా) మాధునివలె వ్యర్థముగ శోకమునుపొందుట కరహుడవుకావు.

౫౭. సోయశంభురభూద్వహ్ని స్సర్వతేజోమయస్స్వయః ।
వహ్నిరీశముఖాజ్జాతో తస్మాద్వహ్నిభయంనమె ।
తస్మైపూర్వంకథంప్రాదాః కింశంభోరధికానలః ॥

తా ॥ ఆయగ్ని సాక్షాదీశ్వరుడు. సమస్తమగు తేజస్సులవికార మీశ్వరుడు ఈశ్వరుని ముఖమువల్లనే అగ్నిపుట్టినదిగాన నాకగ్నిభయములేదు. (అట్లుండినయెడల) ఆయనకేలనన్నొసగితివి. ఈశ్వరునికంటే అగ్ని అధికుడాకాదు.

౫౮. సముద్రవాసినఃకూప స్నానంకింకఠినంభవేత్ ।
మానుషేణశరీరేణ కథంప్రాప్స్యామ్యుమాధవం ॥

తా ॥ (ఈశ్వరునియందుండు నాకగ్నిభయములేదు ఏలననగా) సముద్రమందుండువానికి చాదభావిదిగుటెట్లు లేదోయటులనేగాన మనుష్యశరీరముతో దేవుడైన ఈశ్వరునెట్లు బొందుదును.

౫౯. త్యాజ్యోసామానుషందేహం రాజాలోకనదూషితం ।
మాభజక్లేశమత్యంతం మామాధ్యముపపాదయ ॥

తా ॥ (అందువల్ల) ఈమనుష్యశరీరము విడువతగినది. గనుక నీవువ్యసనప డకుము బుద్ధిమాంద్యము చేసుకొనకుము.

౬౦. ఏవంకన్యాబోధితోపి నజహాత్కుసుమశ్ళ్వచం ।
భాస్కరార్యోవిశాంతత్ర భరన్యాసయథాకరోత్ ॥

౬౧. మహర్షిర్మహర్భాస్కరార్య స్తద్విష్ణోరితిమంత్రతః ।
అర్పయామాసతాన్విష్ణౌ న్యాసకర్మవిధానతః ।
కృత్వాగచ్ఛద్భాస్కరార్య స్వగేహమతిపావనం ॥

తా ॥ ఈప్రకారము కన్యకచేబోధింప బడినను కుసుమశ్రేష్టి వ్యసనము వి డువకుండెను. పిదప భాస్కరాచార్యులును (వైష్ణవులు చక్రాంకన పరులును ప్ర కృతం ప్రాణపరిత్యాగము చేయనిశ్చయించిన యావైశ్యులనందరికిని భరన్యాస ము తద్విష్ణో అనుమంత్రముతో విష్ణువందు భరార్పణముచేయించి తన గృహమునకు వెళ్లిపోయెను.

౬౨. తతోవైశ్యాస్సుసంహృష్టాః కన్యోద్వాహప్రయత్నతః ।
అలంకృత్యపురీంసర్వాం వీథీంశ్చబహుతోరణైః ॥

తా॥ పిదప వైశ్యులు మిక్కిలి సంతోషముతో కన్యకావివాహమునకై ప ట్టణమంతయు ననేక తోరణములచే వీథులనలంకరించిరి.

౬౩. ఆర్యానిస్సంశయాస్సర్వే నిధీనాద్యతమానసాః ।
గురూన్దేవాన్సమభ్యర్చ్య దేహాలంకరణోత్సుకాః ॥

తా॥ వైశ్యులు చావునిశ్చయించుకొని గురువును దేవుండ్లను చక్కగా పూజించి దేహములలంకరించుకొని సంతోషముగనుండి.

౬౪. పుత్రైశ్చమిత్రవర్గైశ్చ దారైశ్చసహాజన్మభిః ।
తస్థిరేవైశ్యమనుజా గ్రుహప్రాంగణభూమిషు ॥

తా॥ పుత్రమిత్ర బంధుభార్యలతోసహా తమ యిండ్లముందర నిలువబడి యుండిరి.

౬౫. తత్రరాజామహామూర్ఖో కన్యాకామాతురోభృశం ।
ఆజ్ఞాపయామాసభటాన్ ప్రయాణంనగరాయచ ॥

తా॥ ఇట్లుండ (రాజమహేంద్రమందు) అతిమూర్ఖుడగు రాజు వైశ్యకన్య కయందాసక్తుడై భటులకు ప్రయాణమాజ్ఞాపించెను.

౬౬. తతస్సేనాసమాయాతా సవాజిరథకుంజరా ।
సోష్ట్రాశ్వసమార్త్యాసఖరా నానాయుద్ధవిశారదాః ॥

తా॥ అనంతరమందు రథగజతురగ పదాదులు ఒంటెయలు మొదలగుఅనేక యుద్ధసమర్థమైన సైన్యముతో రాజుసిద్ధమయ్యె.

౬౭. ఆనీతౌ రాజయానార్థే మత్తశుభ్రాబ్జాకులేక్షణౌ ।
పట్టమాతంగపట్టాశ్వౌ నానాభూషణశోభితౌ ॥

తా॥ (పిదప) రాజు ప్రయాణముకొరకై పట్టపేనుగ గుఱ్ఱములును కన్నుల యందు నీరుగారుచున్నవైనను నానాభూషణాభూషితములతోనలంకృతమైవచ్చెను.

౬౮. నిర్గతానగరాత్తస్మాత్కరవీరకృతస్రజః ।
రక్తమాల్యాంబరధరా భటాయుద్ధవిశారదాః ॥

తా॥ పిదప యాపట్టణమునం గన్నెరుపువ్వులదండలు ధరించినట్టి యరక్త గంధమాల్యాంబరములు ధరించిన భటులు యుద్ధసమర్థులై వెడలివచ్చిరి.

౬౯. రాజాశృణోత్తంచైకం పురోహితవినిర్గతాం ।
కాణస్త్వేకస్తథావిప్రో ప్యాయయౌ రాజసన్నిధిం ॥

తా॥ (అప్పుడు) రాజు తన పౌరోహితునివలన వచ్చిన యొంటితుమ్మును వినెను. మరియు నొకగుడ్డివాడు రాజసమీపమునకేతెంచెను.

౭౦. ఇత్యాదిదుర్నిమిత్తాని దృష్ట్వాగచ్ఛద్బహూన్యపి ।
పపాతమకుటంభూమౌ జటీకశ్చిత్సమాగతః ॥

తా॥ ఈపైన చెప్పబడిన యనేకదుశ్శకునములైనను రాజు నిలువకుండ వెళ్లుచుండగా ఇతనికిరీటము క్రిందబడగ (నదిచూచుచున్నపుడు)జటాధారియొకడు వచ్చెను.

౭౧. తదాలోక్యద్విజశ్రేష్ఠో మంత్రీత్యాహనృపాలకం ।
ప్రయాణంజహిరాజేంద్ర దుష్కాలస్సముపస్థితః ॥

తా॥ అప్పుడు బ్రాహ్మణశ్రేష్ఠుడగు మంత్రి రాజునుచూచి అయ్యా దుష్కాలముగాయున్నది ప్రయాణమునిల్పుడు.

౭౨. వైశ్యకన్యావివాహేన సంకీర్ణస్యాత్త్వదన్వయః ।
మాహిష్యోజాయతేపుత్రో వైశ్యాయాంతవభూపతే ॥

No. XIII, Silver coin Weight, 31 grains. Mr. Freeling. *Unique*. See the above Book.

* * * * *

*Kumara Gupta.*

Peacock Types.

36. Nos. 22, 23, Silver. My Cabinet.

Obverse—A localized and greatly debased imitation of the Sah head, especially disfigured by the Oriental rendering of the almond eye.

* * * * *

Reverse—An admirably executed figure of a Peacock with full front expanse of plumage. To the right, at the foot, a reduced cluster of three stars.

Legend—దేవంజయతి విజితావనిరవనిపతి కుమారగుప్తో.

" His Majesty, Kumara Gupta, who has subdued the earth, rules."

కుమారగుప్త.

మయూరధ్వజము.

౨౨. ౨౩. రజిత నాణ్యములు.

మొదటివైపు—శిరస్సు-

రెండవవైపున—విచిత్రముగ చెక్కిన మయూరవిగ్రహమును, దాని చుట్టును "దేవోజయతివిజితావనిరవనిపతి కుమారగుప్తో" అను నాగరాక్షరములుగలవు.

*Skunda Gupta.*

37. Nos. 24 and 25. My Cabinet.

Observe—Head as above. Traces of a date in front of the profile. The figure for 100 is quite plain and distinct on the original of No. 24.

Reverse—Peacock as above. The stars are omitted.

Legend—విజితావనిరవనిపతి జయతిదేవస్కన్దగుప్తయ.

౨౪. ౨౫. స్కన్దగుప్త.

మొదటివైపు—శిరస్సుమాత్రమేయున్నది.

రెండవవైపు—మయూరముంగలిగి దానిచుట్టును "విజితావనిరవనిపతిజయతిదేవస్కందగుప్తయ" అని నాగరలిపినిగలిగియున్నది.

*Budha Gupta.*

38. No. 26, Silver.

Obverse—Head as above. Date in front of the profile, 155.

Reverse—Peacock as in No. 25.

Legend—దేవజయతి విజితావనిరవనిపతి శ్రీబుద్ధగుప్తో.

Dev (o) jayati vigitaivnis avanipati (h) Sri Budha Gupta.

## బుద్ధగుప్త.

౨౬. రజితనాణ్యము.

మొదటివైపు—శిరస్సు.

రెండవవైపు—మయూరముగలిగి, దాన్నిజుట్టును “దేవజయతివిజితావనిరవనిపతిశ్రీబుద్ధగుప్తో”అని నాగరలిపినిగలిగియున్నది.

39. *Resume.*

* * * * * *

I have had to reduce my recapitulation of the Gupta and other international dates to the abstract form embodied in the subjoined table, which however, effectively combines most of the existing data available for the scrutiny and ultimate adjustment of independent commentators.

*Abstract of the Recorded Gupta Dates.*

| Names of Kings. | Inscriptions. | Coins. | Tradition. | Result A. D. derived from the Saka Era. | Remarks. |
|---|---|---|---|---|---|
| 1. Gupta. | | | | | |
| 2. Ghatot Kacha. | | | | | |
| 3. Chandra Gupta I. | | | | | The first Maharajadhi Raja. |
| 4. Samudra Gupta. | | | | | |
| 5. Chundra Gupta II. | 82 | ... | Reigned 23 | 161 | |
| | 93 | | years after the conquest of Surashtra. | 172 | |
| 6. Kumara Gupta. | ... | 90 odd | ... | ? | |
| | | 121 | ... | 200 | Coin of Kumara No. X. |
| | | 129 | ... | 208 | |
| | 130 | ... | Reigned 20 years. | 209 | |
| 7. Skanda Gupta. | 138 | ... | ... | 217 | |
| | 141 | ... | ... | 220 | |
| | 146 | ... | Senapati Bhattaraka, two years before Skanda's death. | 225 | |
| 8. Budha Gupta. | | 155 | ... | 234 | |
| Toramana. | 165 | ... | ... | 244 | |
| other local unrecorded Gupta Kings. | | 182 | ... | 261 | |
| Vallabhis. | ... | ... | ... | 319 | |

ఇంతవరకు చెప్పినవాటినింబట్టి వైశ్యరాజులయొక్క సంవత్సరావళీ బింబమిచ్చుట వివరించుచున్నారము.

| రాజులపేళ్లు. | శాసనములు. | నాణ్యములు | వాగ్రూపచరిత్రము. | క్రీస్తుశక సంవత్సరము. | విషయములు. |
|---|---|---|---|---|---|
| ౧. గుప్త ... ... | | | | | మొదట మహా రాజాధిరాజ. |
| ౨. ఘటోత్కచ. . | | | | | |
| ౩. చంద్రగుప్త I.. | | | | | |
| ౪. సముద్రగుప్త... | ... | ... | ... ... ... | ౧౬౧ | |
| ౫. చంద్రగుప్త II. | ౮౨<br>౯౩ | ... | సౌరాష్ట్రమును జయించిన ౨౩-సంవత్సరములవరకు పరిపాలించెను. ... ... | ౧౭౨ | |
| ౬. కుమారగుప్త. . | ... | ౯౦పైచిలుకు | ... | ? | |
| | | ౧౨౧ | ... | ౨౦౦ | |
| | | ౧౨౯ | ... | ౨౦౮ | |
| ౭. స్కందగుప్త... | ౧౩౦ | ... | ౨౦-సంవత్సరము పరిపాలించెను. | ౨౦౯ | |
| | ౧౩౮ | ... | ... | ౨౧౭ | |
| | ౧౪౧ | ... | ... | ౨౨౦ | |
| | ౧౪౬ | ... | స్కందగుప్త మరణమునకుముందు సేనాపతిభట్టారకి పరిపాలించెను. | ౨౨౫ | |
| ౮. బుద్ధగుప్త ... | | ౧౫౫ | ... ... ... | ౨౩౪ | |
| | ౧౬౫ | ... | ... ... ... | ౨౪౪ | |
| | | ౧౮౨ | ... ... ... | ౨౬౧ | |
| వాల్లభి... ... | ... | ... | ... ... ... | ౩౧౯ | |

వైశ్యరాజవిషయం విలియం నిఘంటావర్ణితం యథా (పుట. ౯౯౩)

"A Vaisya with this appellation was the founder of the renowned Gupta dynasty, in which the names of the Sovereigns generally end in Gupta.

తా ॥ ఒకవైశ్యుడు గుప్తయను బిరుదునువహించి గుప్తవంశమును స్థాపించి నందుచే నావలవచ్చిన వైశ్యప్రభువులున్ను గుప్తయనుబిరుదుతో వర్ధిల్లిరి. (ఇప్పటికి వైశ్యులు సంధ్యావందనాది కర్మలయందుపనామముగ నీగుప్తశబ్దమునే ప్రయోగించు చున్నారు.)

౪౧ "వైశ్యోపనామభేదేగుప్తయితి" శ్రీతారానాథతర్కవాచ
స్పతిభట్టాచార్యేణవిరచితవాచస్పత్యేఉక్తం ॥

తా ॥ గుప్తయనగ వైశ్యునకుపనామమని తారానాథవాచస్పత్య మనుగ్రంథ మందుచెప్పంబడినది.

ఇ తి వై శ్య ధ ర్మ ప్ర కా శి కా యాం
వైశ్యచక్రవర్తినామాఖ్యాయాం
తృతీయోఽధ్యాయ
స్సంపూర్ణః.



అథ చతుర్థోఽధ్యాయః.
—*(విదుషకథనం)*—

౧. మాఘాదిగ్రంథాన్రచ యద్వణిజ్మాఘోమహామతిః ।
సంప్రత్యపిచభూలోకే మాఘంబాలాఃపఠంతిహి ॥

తా ॥ మాఘాదిగ్రంథములను చేసినవాడు మాఘుడు ఆగ్రంథములను భూలోకమునందు ఇప్పటికిని బాలురు పఠించుచున్నారు.

౨. విక్రమాదిత్యభూపాల సచివోగురుబుద్ధిమాన్ ।
భట్టిర్నామమహాప్రాజ్ఞో జగద్విదితబుద్ధిమాన్ ॥

తా ॥ బుద్ధిమంతుడైన విక్రమాదిత్యభూపాలుడు భట్టియనుగ్రంథముచేసెను

3. శృంగారనైషధాఖ్యాన నాయకోబుద్ధిమాన్సదా ।
మామిడీవంశసంజాతో శింగనాఖ్యోవిచక్షణః ॥

తా॥ శింగనాఖ్యుడు శృంగార నైషధమును చేసినవాడాయెను.

౪. గ॥ శ్రీమద్వేదోక్తార్యాద్వైత పునరుద్ధారక సంస్కృతాం
ధ్రసాహితీ విరాజితః బృందావననగరప్రసిద్ధ నానారాజసం
స్థాన సంప్రాప్తమండలీసన్మానః శబ్దార్థకల్పతర్వాది నానా
గ్రంథరచనాచాతురీధురీణః శతాష్టావధాన రచనా ధురం
ధరః శ్రీమద్ధూణచక్రవర్తిసీదత్తసహస్రదీనారపండితరాయ
బిరుదప్రసిద్ధః శ్రీమచ్చెన్నపురీవరన్యాయపండితసభాభవన
ప్రథమపండితః శ్రీమచ్ఛంకరాచార్యశిష్యోఽద్వైతమతనిష్ఠః
శ్రీమన్మామిడి సూరనాహ్వయపౌత్ర వేంకనార్యసుపుత్రాప
స్తంబశాఖాధ్యాయీఆపస్తంబసూత్రజైమినిస (వ్యాళకూ
లస) గోత్రపవిత్ర వేంకటపండితార్యో భువివ్యరాజత్॥

తా॥ శ్రీమద్వేదోక్తార్యాద్వైతమునుమరలనుద్ధరించినవారును సంస్కృతాంధ్రసాహిత్యములచే ప్రకాశించినవారును సంస్కృతాంధ్రాలంకారాదిగ్రంథరచనలయందునేర్పరులును బృందావననగరసంస్థానములయందు పండితకట్నములచే సన్మానింపబడినవారునుశబ్దార్థకల్పతర్వాదినానాగ్రంథములనురచియించినసమర్థులును అష్టావధానశతావధానములయందు నిపుణులును ఇంగ్లీషువారివలన వేయివరహాలచే సన్మానింపబడినవారును, పండితరాయలను బిరుదును వహించినవారును, అద్వైతమతనిష్ఠులైనవారును, చెన్నపురీపండితన్యాయసభయందుప్రథమపండితులును, శ్రీశంకరాచార్యశిష్యులును, నానామతములు తెలిసినవారును మామిడిసూరనాహ్వయునకు పౌత్రులును, వేంకనార్య సుపుత్రులును ఆపస్తంబశాఖాధ్యాయీఆపస్తంబసూత్రజైమినిస(వ్యాళకూలస)గోత్రపవిత్రులగు వేంకటార్యపండితులు భూమియందుప్రకాశించిరి.

౫. ఏతాదృశోమహాప్రాజ్ఞాః పండితాస్సంతిసత్కులే ।
నిత్యంవిరచయన్త్యేతే గ్రంథాన్వివిధరూపకాన్ ॥

తా ॥ ఇట్టికీర్తిచెందినవారు సమీచీనకులమందు జన్మించి నిరతంరమందును విచిత్రముగగ్రంథములుచేసినవారైరి.

ఇతి శ్రీగౌతమనగరనిలయ భాస్కరకవినామధేయవిరచితాయాం
వైశ్యధర్మప్రకాశికాయాం విదుషకథనంనామ
చతుర్థోఽధ్యాయ
స్సంపూర్ణః.

# అథ పంచమోఽధ్యాయః.

—*(శ్రు త్యు క్త ధ ర్మ వి వే చ న మ్)*—

౧. తతస్సకన్యావిశస్సర్వా స్స్వీక్ష్యధర్మపరాయణా౯ ।
వదామివేదజంధర్మ మిత్యువాచకులాంగనా ॥

తా॥ అనంతరమందు వైశ్యకన్య సర్వవైశ్యులనుజూచి ధర్మమందు ఆసక్తి గలవారని దెలుసుకొని వారలకు వేదోక్తధర్మములనుచెప్పదొడంగె.

౨. నాస్తివేదాత్పరంశాస్త్రం నాస్తిమాతుఃపరోగురుః ।
నాస్తిదానాత్ పరంమిత్ర మిహలోకే పరత్రచ॥

అత్రి సంహిత.

తా ॥ ఇహపరలోకములయందు వేదముకంటె నధికమైన శాస్త్రమును, తల్లికంటె శ్రేష్ఠమైన గురువును, దానముకంటె శ్రేష్ఠమైనమిత్రుడును లేదు.

౩. తత్రమూలాఃస్మృతయఇతి.

(శంఖసూత్రే)

తా ॥ వేదములు స్మృతులకు ప్రమాణములు.

యజ్ఞార్హవిషయః.

౪. తన్నసర్వఇవాభిప్రపద్యేత । బ్రాహ్మణోవైవ
రాజన్యోవావైశ్యోవా తేహియజ్ఞియాః ॥ ౯ ॥

(శతపథశ్రుతి ౩-కా, ౧-అ, ౧-బ్రా, ౯-ఖం)

తా॥ ప్రతివారును యజ్ఞముచేయగూడదు. అయితే ద్విజులైనబ్రహ్మక్షత్రియ వైశ్యులుమాత్రమేచేయనర్హులు.

౫. సవైనసర్వేణే వసంవదేత । దేవాన్వాఽఏష ఉపావర్తతే
యోదీక్షతేస దేవతానామేకోభవతినవై దేవాఃసర్వేణేవసం
వదంతేబ్రాహ్మణేనవైవరాజన్యేనవావై శ్యేనవాతేహియజ్ఞి
యాః. (శతపథశ్రుతి. ౩-కా, ౧-అ, ౧-బ్రా, ౧౦-ఖం)

తా ॥ క్రతువుచేయువా డక్కాలంబున దేవతాపరినేష్టితుడై యుండును. గావుననప్పుడు ద్విజులైనబ్రహ్మక్షత్రియ వైశ్యులను దప్పితదితరులతో సంభాషింపంజనదు.

ద్విజానాంయజ్ఞభోజ్యవస్తునిర్ణయః.

౯. నమాగ్ంసమశ్నీయాన్న స్త్రియముపేయాన్నో పర్యాసీత జుగుప్సేతానృతాత్ (౭)పయోబ్రాహ్మణస్య వ్రతం యవాగూరాజన్యస్యామిక్షా వైశ్యస్య(౮)అథోస్సౌమ్యేప్య ధ్వరపత ద్వ్రతంబ్రూయాత్ (౯)।యదిమన్యేతోపద స్యామీత్యోదనంధానాఃసక్తూన్ ఘృతమిత్యనువ్రతయేదాత్మనోనుపదాసాయ (౧౦)

(తైత్తిరీయారణ్యకము. -౨-ప్ర, ౮-అ)

తా ॥ యజ్ఞకాలమునందు బ్రాహ్మణునకు పయస్సున్ను, క్షత్రియునకు యవాగులున్ను, వైశ్యునకుఆమిక్షము(మీగడపెరుగున్ను) వారలకువిధ్యుక్తభోజ్యద్రవ్యములైయున్నవి.

౭. "సర్వంతేజః సామరూప్యగ్ంహశశ్వత్।సర్వగ్ం హేదంబ్రహ్మణాహైవసృష్టమ్।ఋగ్భ్యోజాతంవైశ్యంవర్ణమాహుః।యజుర్వేదంక్షత్రియస్యాహుర్యోనిమ్।సామవేదో బ్రాహ్మణానాంప్రసూతిః।పూర్వేపూర్వేభ్యోవచఏతదూచుః"

(తైత్తిరీయబ్రాహ్మణము 3-కా,౧౨-ప్ర,౯-అ,౨-ప)

తా ॥ ఋగ్వేదమువలన వైశ్యులున్ను, యజుర్వేదమువలన క్షత్రియులున్ను, సామవేదమువలన బ్రాహ్మణులున్నుజన్మించిరి.

ఇతి వైశ్యధర్మప్రకాశికాయాం
శ్రుత్యుక్తధర్మవివేచనంనామ
పంచమోధ్యాయః.
సంపూర్ణః.





## అథషష్ఠోఽధ్యాయః.

### —*(సూత్రోక్త ధర్మవివేచనమ్.)*—

### ఉ ప న య న కా ల ని ర్ణ యః.

౧. వసన్తే బ్రాహ్మణముపనయీత గ్రీష్మే రాజన్యం శరది వైశ్యం గర్భాష్టమేషు బ్రాహ్మణం గర్భైకాదశేషు రాజన్యం గర్భద్వాదశేషు వైశ్యమ్ ॥ ౧౮ ॥ అథకామ్యాని ॥౧౯॥ సప్తమే బ్రహ్మవర్చసకామ మష్టమ ఆయుష్కామం నవమే తేజస్కామం దశమే న్నాద్యకామమేకాదశ ఇన్ద్రియకామం ద్వాదశేపశుకామమ్ ॥౨౦॥ ఆషోడశాద్బ్రాహ్మణస్యానాత్యయ ఆద్వావింశాత్క్షత్రియస్యాచతుర్వింశాద్వైశ్యస్య॥౨౧॥

(ఆపస్తంబధర్మసూత్రమ్ ౧-౧-౧)

తా ॥ వసంతఋతువునందు బ్రాహ్మణుడును, గ్రీష్మఋతువునందు క్షత్రియుడును, శరదృతువునందు వైశ్యుడును ఉపనయనము జరిగించుకొనవలయును. మరియు నాయుపనయనమునకువిధ్యుక్తమైన కాలములు; గర్భధారణమొదలెనిమిదవయేట బ్రాహ్మణుడును, పదనొకండవయేట క్షత్రియుడును, పండ్రెండవయేట వైశ్యుడును, ఉపనయనము జరిగించుకొనవలసినది ॥౧౮॥ అట్లుజేసినలభించుకామ్యంబులు. ॥౧౯॥ ఏడవయేట బ్రహ్మవర్చస్సును, ఎనిమిదవయేటను ఆయుష్కామమును, తొమ్మిదవయేట తేజస్కామమును, పదియవయేట అన్నాద్యకామమును, పదునొకండవయేట నింద్రియకామమును, పండ్రెండవయేట పశుకామమును లభించును ॥౨౦॥ (పైచెప్పిన కాలములయందు సందర్భపడనియెడల) బ్రాహ్మణుడు పదునారవయేటను, క్షత్రియుడు ఇరువదిరెండవయేటను, వైశ్యుడు ఇరువదినాలుగవయేటను, జరిగించుకొనుటకు గౌణకాలమేర్పడినది ॥౨౧॥

౨. మౌఞ్జీమేఖలా త్రివృద్బ్రాహ్మణస్య శక్తివిషయే దక్షిణావృత్తానామ్ ॥ 33 ॥ జ్యా రాజన్యస్య ॥ 34 ॥ మౌఞ్జీవాయోమిశ్రా ॥ 35 ॥ ఆవీసూత్రంవైశ్యస్య ॥ 36 ॥ సైరీతామలీ వేత్యేకే ॥ 37 ॥ పాలాశోదణ్డో బ్రాహ్మణస్య నైయ్యగ్రో

ధస్య న్యగ్రోధజో వాఽగ్రో రాజన్యస్య బాదర ఔదుంబరో వా వైశ్య
స్య వార్క్షో దణ్డఇత్యవర్ణసంయోగేనైకఉపదిశన్తి ॥3౮ ॥
వాసః ॥ 3౯ ॥ శాణీక్షౌమాజినాని ॥ ౪౦ ॥ కాషాయంచై
కేవస్త్రముపదిశన్తి ॥ ౪౧ ॥

(ఆపస్తంబ ధర్మసూత్రము ౧-౧-౨)

తా॥ బ్రాహ్మణుడు మౌఞ్జితో జేయంబడిన మేఖలమును ॥33॥ క్షత్రియుడు నారియును ॥ 3౪ ॥ లేదా మౌఞ్జితో చేయుంబడినది ॥ 3౫ ॥ వైశ్యుడు ఆవితో చేయుంబడినది ॥ 3౬ ॥ లేదా పశువులరజ్జువును గాని లేక తామలీతో చేయంబడినది గాని (ధరించవలయును) ॥ 3౭ ॥ మరియు బ్రాహ్మణుడు పలాశదండమును, క్షత్రియుడు న్యగ్రోధదండమును, వైశ్యుడు బాదరమును గాని లేక ఔదుంబరమును గాని లేదా అందరు వర్ణభేదములేక వాక్షదండము నుంచుకొనవలయును॥3౮॥ వస్త్రధారణము॥3౯॥ బ్రాహ్మణుడు శాణివస్త్రమును, క్షత్రియుడు క్షౌమవస్త్రమును, వైశ్యుడు అజినవస్త్రమును ॥ ౪౦ ॥ లేదా కొందరి తాత్పర్య ప్రకారము కాషాయవస్త్రమును ధరించవలసినది.

3. (కాషాయంబ్రాహ్మణస్య) మాఞ్జిష్ఠంరాజన్యస్య ॥ ౧ ॥ హారి
ద్రంవైశ్యస్య ॥౨॥ హారిణమైణేయంవాకృష్ణంబ్రాహ్మణస్య॥
3॥ కృష్ణంచేదపనూస్తీర్ణాసనశాయీస్యాత్ ॥౪॥రౌరవంరా
జన్యస్య॥౫॥బస్తాజినంవైశ్యస్య॥౬॥ఆవికంసార్వవర్ణికమ్ ॥౭॥

(ఆపస్తంబ ధర్మసూత్రమ్ ౧-౧-3)

తా॥ (బ్రాహ్మణుడు కాషాయవస్త్రము) క్షత్రియుడు చిరువేరురంగు వర్ణముగల వస్త్రమును ॥ ౧ ॥ వైశ్యుడు పసుపువర్ణముగలవస్త్రమును ॥౨॥ బ్రాహ్మణుడు హారిణకృష్ణమృగములలో నేచర్మమైనను ధరించవలసినది ॥ 3 ॥ కృష్ణాజినమునుధరించినపుడతను అజినమును పడుకొనుటకు గాని, కూర్చుండుటకు గాని క్రిందపరచగూడదు ॥ ౪ ॥ క్షత్రియుడుదుప్పిచర్మమును ॥ ౫ ॥ వైశ్యుడు మేకపోతు యొక్క చర్మమును (ధరించవచ్చును) ॥ ౬ ॥ (అట్లు దొరకని యెడల) అందరు గొఱ్ఱెచర్మమునే ధరించవచ్చును.

ఉపనయనాధికారిణః.

౪. అశూద్రాణామదుష్ట కర్మణాముపాయనం।
వేదాధ్యయనమగ్న్యాధేయం ఫలవన్తిచకర్మాణి ॥ ౫ ॥

(ఆపస్తంబ ధర్మసూత్రమ్. ౧, ౧, ౧.)

తా ॥ శూద్రులకును, దుష్టకర్మచేసిన వారికిని దప్ప మిగిలిన వారికి ఉపనయనము, వేదాధ్యయనము, అగ్నిహోత్రము, విధింపబడినవి॥ ౫॥

ఆపత్కాలవిషయః.

౫. ఆపది బ్రాహ్మణేన రాజన్యేవైశ్యేవాధ్యయనమ్ ॥ ౨౫ ॥
(ఆపస్తంబ ధర్మసూత్రమ్. ౨. ౨. ౪.)

తా ॥ ఆపత్కాలమందు బ్రాహ్మణుడు క్షత్రియుని యొద్దగాని, వైశ్యునియొద్దగాని యధ్యయనము చేయవచ్చును.

౬. భవత్పూర్వయా బ్రాహ్మణోభిక్షేత॥ ౨౮ ॥ భవన్మధ్యయా రాజన్యః ॥ ౨౯ ॥ భవదన్త్యయా వైశ్యః ॥ ౩౦॥
(ఆపస్తంబధర్మసూత్రమ్. ౧. ౧. ౩.)

తా ॥ బ్రాహ్మణుడు భవతిభిక్షాన్దేహియనియు, క్షత్రియుడు భిక్షాంభవతిదేహి యనియు, వైశ్యుడు భిక్షాన్దేహిభవతియనియు భిక్షనడుగవలయును.

ఉపనయనకాలనిర్ణయః.

౭. అష్టమేవర్షే బ్రాహ్మణముపనయేత్ ॥౧॥ గర్భాష్టమేవా ॥ ౨ ॥ ఏకాదశే క్షత్రియమ్ ॥ ౩ ॥ ద్వాదశే వైశ్యమ్ ॥౪॥ ఆషోడశాద్బ్రాహ్మణస్యానతీతఃకాలః ॥ ౫ ॥ ఆద్వావింశాత్క్షత్రియస్య. ఆచతుర్వింశాద్వైశ్యస్య. అత ఊర్ధ్వంపతితసావిత్రికాభవన్తి ॥ ౬ ॥ నైనానుపనయేన్నాధ్యాపయేన్నయాజయేన్నైభిర్వ్యవహరేయుః ॥ ౭ ॥ అలఙ్కృతం కుమారం కుశలీకృత శిరసమహతేన వాససా సంవీతమైణేయేన వాఽజినేన బ్రాహ్మణంరౌరవేణ క్షత్రియమాజేన వైశ్యమ్ ॥ ౮ ॥ యదివాసాంసివసీరన్రక్తానివసీరన్. కాషాయంబ్రాహ్మణోమాఞ్జిష్ఠం క్షత్రియోహారిద్రంవైశ్యః ॥ ౯ ॥ తేషాంమేఖలాః ॥ ౧౦ ॥ మౌఞ్జీబ్రాహ్మణస్యధనుర్జ్యాక్షత్రియస్య. ఆవీవైశ్యస్య ॥ ౧౧ ॥ తేషాందండాః ॥౧౨॥ పాలాశోబ్రాహ్మణస్య. ఔదుమ్బరః క్షత్రియస్య. బైల్వో

వైశ్యస్య । కేశసంమితో బ్రాహ్మణస్య లలాటసమితః క్షత్రియస్య ప్రాణసమ్మితో వైశ్యస్య ॥ ౧౩ ॥

(ఆశ్వలాయన గృహ్యసూత్రమ్. ౧-౧౯, ౧ - ౧౩)

తా ॥ (గర్భధారణము మొదలుకొనిగాని జన్మించినదిమొదలుకొనిగాని యెనిమిదిసంవత్సరములకు) బ్రాహ్మణుడును ॥౧,౨॥ పదకొండు సంవత్సరములకు క్షత్రియుడును ॥౩॥పంౘ్రెండుసంవత్సరములకు వైశ్యుడును ఉపనయనముచేసుకొన వలసినది ॥౪॥ (అట్లుకాకపోయెనేని రెండవ పక్షమున) పదునారుసంవత్సరములవఱకు బ్రాహ్మణునకును, ఇరువది రెండుసంవత్సరములవరకు క్షత్రియునకును, ఇరువది నాలుగుసంవత్సరములవరకు వైశ్యునకును కాలపరిమితిగలదు. అంతకు మించెనేనివారు సావిత్రికి నర్హులుగాక వ్రాత్యులగుదురు. ॥౫,౬॥గనుక వారల కెవరుఉపనయనాధ్యాపన, యజన, యాజనాది వైదికక్రియలను, సంబంధబాంధవ్యములను జేయంజనదు ॥౭॥అలంకృతుడై నూతన వస్త్రధారుడైన చిన్నవానికి ఉపనయనముచేయించవలయును. వస్త్రములేనియెడల బ్రాహ్మణునకు లేడిచర్మమును, క్షత్రియునకు దుప్పిచర్మమును, వైశ్యునకు మేకచర్మమును గట్టవలసినది ॥ ౮ ॥ వస్త్రములు ధరించుకునేయెడల బ్రాహ్మణులు పసుపు, ఎరుపు రంగుగల వస్త్రమును, క్షత్రియుడుకొద్దియెరుపు రంగుగలవస్త్రమును, వైశ్యుడు పసుపురంగుగలవస్త్రమును గట్టవలసినది ॥ ౯ ॥ బ్రాహ్మణుడు ముంజమును, క్షత్రియుడు వింటినారిని, వైశ్యుడు కంబళిదారమును, మేఖలముగా ధరించవలయును ॥ ౧౧ ॥ బ్రాహ్మణుడు మోదుగకఱ్ఱను,క్షత్రియుడు మేడికఱ్ఱను,వైశ్యుడుమారేడుకఱ్ఱనుదండముగాధరించి యుండవలయును. ఆదండము బ్రాహ్మణునికి శిఖవరకును, క్షత్రియునికి లలాటమువరకును, వైశ్యునికి హృదయమువరకును పరిమితిగలిగియుండవలయును.॥౧౨. ౧౩॥.

దండవిషయః.

౮. సర్వేవాసర్వేషాం ॥ ౧ ॥ గార్గ్యనారాయణవృత్తౌ, సర్వేదణ్డాః సర్వేషాంభవతిపాలాశాదయః ॥ ౧ ॥

(ఆశ్వలాయన గృహ్యసూత్రమ్. ౧. ౨౦. ౧)

తా॥ పైచెప్పినట్లుకానియెడలనందరుపాలాశదండమును గైకొనవచ్చును.

భిక్షావిషయః.

౯. భవతిభిక్షాందదాత్వితి. అను ప్రవచనీయమితివా ॥౮॥

(ఆశ్వలాయన గృహ్యసూత్రమ్. ౧. ౨౨. ౮.)

తా ॥ అమ్మా బిక్ష(లేక అనుప్రవచనీయము) ఇమ్మని వటుడు చెప్పవలయును.

గార్హపత్యాగ్నివిషయః.

౧౦. ఉత్సర్గే ఽపరాహ్ణే గార్హపత్యం ప్రజ్వాల్య దక్షిణాగ్నిమానీయ వైశ్య కులాద్విత్తవతో వైకయోనయ ఇత్యేకే భ్రియమాణం వా ప్రజ్వాల్యారణిమన్తం వా మథిత్వా గార్హపత్యాదాహవనీయం జ్వలన్తముద్ధరేత్ ॥ ౧ ॥

(ఆశ్వలాయన. శ్రౌత. సూత్రమ్. ౨. ౨. ౧.)

తా ॥ ఉత్సర్గమందు, అపరాహ్ణమందు గార్హపత్యాగ్నిని వెలిగించి, యావల ధనికుడగు వైశ్యునింటనుంచి దక్షిణాగ్నిని దెచ్చి బాగుగ ప్రజ్వలింపంజేసి అరణిని మథించి గార్హపత్యము వలన ఆహవనీయమును వెలిగించవలయును.

౧౧. అష్టమే వర్షే బ్రాహ్మణముపనయేత్ ॥ ౧ ॥ తస్యాషోడశాదనతీతః కాలః ॥ ౨ ॥ ఏకాదశే క్షత్రియమ్ ॥ ౩ ॥ తస్యాద్వావింశాత్ ॥ ౪ ॥ ద్వాదశే వైశ్యమ్ ॥ ౫ ॥ తస్యా చతుర్వింశత్ ॥ ౬ ॥

(ఖాదిరగృహ్యసూత్రం-పటలమ్-౨, కాం -౪)

తా ॥ బ్రాహ్మణునకు ఎనిమిదవ యేట నుపనయనము చేయుట నుత్తమము. అట్లుకాకపోయెనేని పదునారువత్సరములలో నెప్పుడైనను చేయవచ్చును. క్షత్రియునకు పదునొకండవయేటను. అది తప్పెనేని యిరువదిరెండువత్సరములలో నెప్పుడైన నుపనయనము జేసుకొనవచ్చును. వైశ్యునకు పండ్రెండవయేటను ఉపనయనము చేయవలసినది. అది తప్పెనేని యిరువదినాలుగు సంవత్సరములలో నెప్పుడైనను చేసుకొనవచ్చును. (ఆపై కాలములు దప్పినేని వ్రాత్యులగుదురు)

౧౨. తిథినక్షత్రపర్వసమవాయే ॥ ౧౩ ॥ దర్శే వా పౌర్ణమాసే వాఽగ్నిసమాధానం కుర్వీత ॥ ౧౪ ॥ వైశ్యకులాద్వాఽమ్బరీషాద్వాఽగ్నిమాహృత్యాభ్యాదధ్యాత్ ॥ ౧౫ ॥ అపి వా బహుయాజిన ఏవాగారాత్ బ్రాహ్మణస్య వా, రాజన్యస్య వా, వైశ్యస్య వా ॥ ౧౬ ॥

(గోభిలీయగృహ్యసూత్రమ్. ౧-ప్ర, ౧-కాం)

తా ॥ మంచితిథినక్షత్ర పర్వకాలమునందు అగ్న్యాధానమును జేయునది అందులో అమావాస్యయందైనను పూర్ణిమయందైనను ముఖ్యముగా జేయునది. వైశ్య కులమునుంచిగాని అంబరీషకులమునుంచి గాని అగ్నినిదీసుకొనివచ్చి అగ్న్యాధానమును జేయవచ్చును. లేక పెక్కు యాగంబులను జేసిన బ్రాహ్మణునియొక్క గాని క్షత్రియునియొక్క గాని వైశ్యునియొక్క గాని యింటినుండి అగ్నినిదీసికొనివచ్చి అగ్న్యాధానమును జేయునది.

ఉపనయనకాలః.

౧౩. గర్భాష్టమేషు బ్రాహ్మణముపనయేత్ ॥ ౧ ॥ గర్భైకాదశేషు క్షత్రియస్య ॥ ౨ ॥ గర్భద్వాదశేషు వైశ్యస్య ॥ ౩ ॥ ఆషోడశాద్వర్షాద్బ్రాహ్మణస్యానతీతః కాలో భవత్యా ద్వావింశాత్ క్షత్రియస్యా చతుర్విగంశాద్వైశ్యస్య ॥ ౪ ॥ క్షౌమగ్ంశాణంవా వసనం బ్రాహ్మణస్యకార్పాసం క్షత్రియస్యావికంవైశ్యస్య ॥ ౧౨ ॥

(గోభిలీయగృహ్యసూత్రమ్. ౨-ప్ర. ౧౦-కా)

తా ॥ ౧-౪. వరకు ౧౧-వ సూత్రముచూడుము. బ్రాహ్మణుడు శాణి, క్షౌమ, వస్త్రములను, క్షత్రియుడు కార్పాసమును, వైశ్యుడు గొఱ్ఱెచర్మమును ధరించవలసినది.

౧౪. గోమిథునందక్షిణా బ్రాహ్మణస్య ॥ ౫ ॥ అశ్వమిథునం క్షత్రియస్య ॥ ౬ ॥ అవిమిథునంవైశ్యస్య ॥ ౭ ॥

(గోభిలీయగృహ్యసూత్రమ్. ౩-ప్ర, ౧-కం)

తా॥ బ్రాహ్మణునకు గోమిథునమును, క్షత్రియునకు అశ్వమిథునమును, వైశ్యునకు గొఱ్ఱెమిథునమును దక్షిణవిధింపఁబడినది.

౧౫. గౌరపాగ్ శు బ్రాహ్మణస్య॥ ౫॥ లోహితపాగ్ంశు క్షత్రియస్య ॥ ౬ ॥ కృష్ణపాగ్ శు వైశ్యస్య ॥ ౭ ॥

(గోభిలీయగృహ్యసూత్రమ్. ౪-ప్ర. ౭-కాం)

తా ॥ తెల్లనివర్ణముగలది బ్రాహ్మణుడును, ఎఱ్ఱనివర్ణముగలది క్షత్రియుడును, నల్లనివర్ణముగలది వైశ్యుడును, ధరించవలసినది.

దాంపత్యలక్షణమ్.

౧౬. పాణిగ్రహణమన్త్రైస్తునియతందారలక్షణమ్ ॥ ౨౩ ॥ వివాహేహోమోవిధిః ప్రోక్తోమన్త్రాదామ్పత్యవాచకాః। వరస్తుతాన్జపేత్సర్వాన్ ఋత్విగ్రాజన్యవైశ్యయోః॥ ౨౪ ॥

(గోభిలీయగృహ్యసంగ్రహః. ప్ర. ౨)

తా ॥ పాణిగ్రహణయోగ్యమంత్రంబులచే దారలక్షణము నియతముగ నేర్పడుచున్నది. వివాహమందు ఏవిధిచెప్పబడెనో అట్టివిధిని చెప్పునట్టి మంత్రమువలన దాంపత్యలక్షణముఏర్పడుచున్నది. అట్టియెల్లమంత్రంబులను వరుడుజపించవలసినది. రాజన్యవైశ్యులకు మాత్రము యాజ్ఞికుడు ఆమంత్రంబులను జపింపవలయును.

గురుదక్షిణా.

౧౭. వైశ్యస్య బహుపశోర్గృహా దగ్నిమాహృత్య ॥౩॥ (౧.౨). తిస్రోబ్రాహ్మణస్యవర్ణానుపూర్వేణ ॥౮॥ ద్వేరాజన్యస్య॥౯॥ ఏకావైశ్యస్య ॥౧౦॥ సర్వేషాంశూద్రామప్యేకేమన్త్రవర్జమ్॥౧౧॥(౧.౪). ఆచార్యాయవరందదాతి॥౧౪॥గౌర్బ్రాహ్మణస్యవరః ॥ ౧౫ ॥ గ్రామోరాజన్యస్య ॥ ౧౬ ॥ అశ్వోవైశ్యస్య ॥ ౧౭ ॥(౧.౮). శర్మబ్రాహ్మణస్యవర్మక్షత్రియస్య గుప్తేతివైశ్యస్య ॥ ౧౮ ॥ (౧.౧౭),

(ఇతి పారస్కరగృహ్యసూత్రే ప్రథమకాణ్డే.)

తా ॥ బహుపశుభాగ్యముగలిగిన వైశ్యునియింటనుంచి యగ్నినిదేవలయును 3. (౧. ౨) బ్రాహ్మణుడు వర్ణక్రమప్రకారము మువ్వురుస్త్రీలను॥ ౮ ॥ రాజన్యులు ఇద్దరిని, వైశ్యుడొకరిని పెండ్లిచేసుకొనవచ్చును॥౧౦॥ ఇదియునుంగాక అందరువివాహమునందు వేదమంత్రముపయోగించకుండా శూద్రస్త్రీని వివాహము చేసుకొనవచ్చును ॥ ౧౧ ॥ (౧. ౪). బ్రహ్మచారి గృహస్థాశ్రమములో ప్రవేశించునెడ గురువునకుకానుకనిచ్చియనుజ్ఞనుబొందవలసినది. బ్రాహ్మణుడుగోవును ॥౧౫॥ క్షత్రియుడుగ్రామమును ॥ ౧౬ ॥ వైశ్యుడు అశ్వమును ఇయ్యవలసినది ॥౧౭ ॥ (౧. ౮) బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు క్రమముగ శర్మ, వర్మ, గుప్తయను నామాంతరంబులను బొందుదురు ॥౧౮॥ (౧. ౧౭)

ఉపనయనకాలనిర్ణయః.

౧౮, అష్టవర్షం బ్రాహ్మణముపనయేద్గర్భాష్టమేవా ॥ ౧ ॥ ఏకాదశవర్షం రాజన్యమ్ ॥౨॥ ద్వాదశవర్షం వైశ్యమ్॥౩॥ (౨. ౨). సద్యస్త్వేవగాయత్రీం బ్రాహ్మణాయానుబ్రూయాదాగ్నేయో వై బ్రాహ్మణ ఇతి శ్రుతేః ॥౭॥ త్రిష్టుభం రాజన్యస్య ॥౮॥ జగతీం వైశ్యస్య ॥౯॥ సర్వేషాం వా గాయత్రీమ్॥ ౧౦॥ (౨.౩). అత్ర భిక్షాచర్యచరణమ్॥౧॥ భవత్పూర్వాం బ్రాహ్మణోభిక్షేత ॥ ౨ ॥ భవన్మధ్యాం రాజన్యః ॥ ౩ ॥ భవదన్త్యాం వైశ్యః ॥ ౪ ॥ తిస్రోఽప్రత్యాఖ్యాయిన్యః ॥ ౫॥ షట్ ద్వాదశాపరిమితా వా॥౬॥ మాతరం ప్రథమామేకే ॥ ౭ ॥ ఆచార్యాయ భైక్షం నివేదయిత్వా । వాగ్యతోఽహః శేషం తిష్ఠేదిత్యేకే ॥ ౮ ॥ దణ్డధారణమగ్నిపరిచరణం గురుశుశ్రూషాభిక్షాచర్యా ॥౧౧॥ మధుమాంసమజ్జనోపర్యాసన స్త్రీగమనానృతాదత్తాదానాని వర్జయేత్ ॥౧౨॥ అష్టాచత్వారింశద్వర్షాణి వేదబ్రహ్మచర్యం చరేత్ ॥ ౧౩ ॥ ద్వాదశ వా ప్రతివేదమ్ ॥౧౪॥ యావద్గ్రహణం వా ॥ ౧౫॥ వాసాంసి శాణక్షౌమావికాని ॥౧౬॥ ఐణేయమజినముత్తరీయం బ్రాహ్మణస్య ॥ ౧౭ ॥ రౌరవం రాజన్యస్య ॥ ౧౮ ॥ ఆజం గవ్యం వా వైశ్యస్య ॥౧౯॥ సర్వేషాం వా గవ్యమసతి ప్రధానత్వాత్ ॥ ౨౦ ॥ మౌఞ్జీ రశనా బ్రాహ్మణస్య ॥ ౨౧ ॥ ధనుర్జ్యా రాజన్యస్య ॥౨౨॥ మౌర్వీ వైశ్యస్య ॥ ౨౩ ॥ ముఞ్జాభావే కుశాశ్మన్తకబల్బజానామ్ ॥౨౪॥ పాలాశో బ్రాహ్మణస్య దణ్డః ॥ ౨౫ ॥ బైల్వో రాజన్యస్య ॥ ౨౬॥ ఔదుంబరో వైశ్యస్య॥ ౨౭ ॥ సర్వే వా సర్వేషామ్॥౨౮॥ ... ఆషోడశాద్వర్షాద్బ్రాహ్మణస్యానతీతః కాలో భవతి ॥ ౩౬ ॥ ఆద్వావింశాద్రాజన్యస్య ॥ ౩౭ ॥ ఆచాతుర్వింశాద్వైశ్యస్య ॥ ౩౮ ॥ అతఊ

ర్ధ్వంపతితసావిత్రీకాభవన్తి ॥౩౯॥ (౨.౫).

(ఇతిపారస్కరగృహ్యసూత్రే ద్వితీయకాణ్డమ్)

తా॥ గర్భధారణము మొదలుకొనిగాని జననానంతరము మొదలుకొనిగాని యెనిమిదవయేటను బ్రాహ్మణుడు ॥ ౧ ॥ అటువలెనే పదునొకండవయేటను క్షత్రియుడును, అటువలెనే పండ్రెండవయేటను వైశ్యుడును, ఉపనయనము చేసుకొనవలసినది ॥ ౨,౩॥ బ్రాహ్మణునకు తక్షణమునందే గాయత్రీఛందస్సుగల సావిత్రిని యుపదేశముచేయవలసినది. ఎందువలననగ శ్రుతియందు బ్రాహ్మణుడు అగ్నిదేవతగాగలవాడుగాన తక్షణముపదేశించవలసినది ॥ ౧,౨,౩ ॥ (౨. ౨). క్షత్రియునకు త్రిష్టుప్ఛందస్సుగల గాయత్రినిన్ని వైశ్యునకు జగతీఛన్దస్సుగల సావిత్రినిన్ని (ఉపదేశించవలసినది) ॥౪, ౫॥ పక్షాంతరమునందు గాయత్రీఛన్దస్సుగల సావిత్రినే మువ్వురకు నుపదేశించవచ్చును ॥ ౯ ॥ భిక్షాచరణప్రకరణం—బ్రాహ్మణుడు భవచ్ఛబ్దము పూర్వమందును, క్షత్రియుడుమధ్యమందును వైశ్యుడంతమందును గలుగునట్లు భిక్షాచరణముచేయవలసినది ॥౧,౨,౩॥(౨.౩). తిరస్కరించనటువంటి ముగ్గురినైనను, ఆరుగురినైనను, పండ్రెండుగురినైనను, అనేకమందినైనం స్త్రీలను భిక్షనడుగవలయును ॥ ౫.౬. ॥ కొందరిమతమందు తల్లినేమొదట భిక్షాచరణమును చేయవలసినదని యున్నది ॥ ౭ ॥ మరికొందరి మతమునందు వటుడు భిక్షాచరణవలన వచ్చినద్రవ్యమును ఆచార్యునకు దెలియపరచి వాఙ్నియమముగలవాడై ఆపవలంతయు నిరాహారుడుగనుండవలయునని యున్నది ॥ ౫ ॥ దండధారణము, అగ్నిపరిచర్య గురుశుశ్రూష భిక్షాచరణములు ఇవి బ్రహ్మచారిలక్షణములు ॥౧౧॥ సారాయి, మాంసమును, అభ్యంగనస్నానమును, ఖట్వాద్యాసనములను స్త్రీగమనమును, అనృతమును, ఇయ్యాగూడనిదానములను గ్రహించుటకూడదు ॥౧౨॥ వేదగ్రహణార్థమై బ్రహ్మచర్యమును నలుబదియెనిమిది సంవత్సరముల పర్యంతము చేయవలసినది ॥ ౧౩ ॥ లేదా ఒక్కొక్కవేదమునిమిత్తమైపండ్రెండేండ్లు చేయవలసినది ॥౧౪॥ లేదా తానెంతవరకు అధ్యయనము చేయగలడో అంతవరకుబ్రహ్మచర్యమును చేయవలసినది ॥౧౫॥ బ్రహ్మచారులు ధరించవలసిన వస్త్రప్రకరణము బ్రాహ్మణుడు నారబట్టను క్షత్రియుడు తెల్లపట్టువస్త్రమును, వైశ్యుడు మేషరోమములచేచేయంబడినధావళినిగాని కట్టువస్త్రములుగాధరించవలసినది ॥ ౧౬ ॥ బ్రాహ్మణుడుజింకచర్మమును, క్షత్రియుడు దుప్పిచర్మమును, వైశ్యుడు మేకచర్మమునుగాని, గోచర్మమునుగాని పైవస్త్రములుగా ధరించవలసినది ॥౨౦॥ బ్రాహ్మణుడు ముంజవికారమైన త్రాడును, క్షత్రియుడు వింటినారిని, వైశ్యుడు అల్లెత్రాడును మొలత్రాడుగ ధరించవలసినది ॥ ౨౧, ౨౨, ౨౩॥ ముఞ్జనార లేనియెడల కాశగడ్డి రెల్లు వీట్లసంబంధమైన యేత్రాళ్లనైనను ధ

రించవచ్చును ॥౨౪॥ బ్రాహ్మణుడు మోదుగదండమును ॥౨౫॥ క్షత్రియుడు మారేడుదండమును ॥౨౬॥ వైశ్యుడు మేడి (అత్తి) దండమునుధరించవలసినది ॥౨౭॥ అసంభవమునందు అందరుఆపైచెప్పినదండములలో నెద్దియైనం ధరించవచ్చును ॥౨౮॥ పదునారవసంవత్సరమువరకు బ్రాహ్మణునకును, ఇరువదిరెండుసంవత్సరములవరకు క్షత్రియునకును, ఇరువదినాలుగు సంవత్సరమువరకు వైశ్యునకును ఉపనయనము గౌణకాలముగనున్నది ॥౩౬,౩౭,౩౮॥ అంతకుమించెనేని గాయత్రివలనభ్రష్టులగుచున్నారు.

వర్ణవిహితకర్మనిర్ణయః.

౧౯. బ్రహ్మవై స్వంమహిమానంబ్రాహ్మణేష్వదధాదధ్యయనాధ్యాపనయజనయాజనదానప్రతిగ్రహసంయుక్తంవేదానాంగుప్త్యై ॥౨॥క్షత్రేబలమధ్యయనయజన దానశస్త్రకోశభూతరక్షణ సంయుక్తం క్షత్రస్యవృద్ధ్యై ॥ ౩ ॥ విట్స్వధ్యయన యజన దానకృషివాణిజ్యపశుపాలనసంయుక్తం కర్మణాంవృద్ధ్యై శూద్రేషుపూర్వేషాంపరిచర్యా ॥ ౫ ॥

(బోధాయన ధర్మసూత్రమ్. ౧. ౧౮)

తా ॥ బ్రాహ్మణుడు అధ్యయనము, అధ్యాపనము యజన యాజన దాన ప్రతిగ్రహాది కర్మలనుచేయుచు వేదమురక్షించుచుండవలయును. క్షత్రియునియందు బలము, అధ్యయనము, దానము శస్త్రరక్షణము కోశభూత రక్షణమునుగలిగి వృద్ధిచేనొప్పుచుండవలయును. వైశ్యులయందధ్యయనము యజనము దానముకృషి వాణిజ్యము పశుపాలనముగలిగి కర్మలయొక్క వృద్ధియొప్పుచు నుండవలయును. శూద్రుడు బ్రహ్మ క్షత్రియ వైశ్యులకు పరిచర్యనుజేయుచు వృద్ధినొందవలయును.

౨౦. నాస్యకర్మనియచ్ఛన్తి కించిదామౌఞ్జీబంధనాత్ । వృత్త్యా శూద్రసమోహ్యేష యావద్వేదేనజాయతఇతి ॥ ౬ ॥ గర్భాదిసంఖ్యావర్షాణాం తదష్టమేషుబ్రాహ్మణముపనయీత ॥ ౭ ॥ త్ర్యధికేషురాజన్యమ్ ॥ ౮ ॥ తస్మాదేకాధికేషువైశ్యమ్ ॥ ౯ ॥ వసంతోగ్రీష్మః శరదిత్యృతవోవర్ణానుపూర్వేణ ॥ ౧౦ ॥ గాయత్రీత్రిష్టుబ్జగతీభిర్యథాక్రమమ్॥౧౧॥ ఆషోడశాదా ద్వావింశాదాచతుర్వింశాదిత్యనాత్యయ ఏషాం

క్రమేణ ॥ ౧౨ ॥ మౌంజీధనుర్జ్యాశాణీతి మేఖలాః ॥ ౧౩ ॥ కృష్ణరురుభస్తాజినాన్యజినాని ॥ ౧౪ ॥ మూర్ధలలాటనాసాగ్రప్రమాణాయజ్ఞికస్య వృక్షస్యదణ్డావిశేషాః పూర్వోక్తాః॥ ౧౫ ॥ భవత్పూర్వాంభిక్షాంమధ్యాం యాజ్ఞాన్తాంభిక్షాంచ రేత్సప్తాక్షరాం క్షాంచహీంచ నవర్ధయేత్ ॥ ౧౬ ॥ భవత్పూర్వాంబ్రాహ్మణోభిక్షేత భవన్మధ్యాంరాజన్యోభవదన్త్యాంవైశ్యః సర్వేషువర్ణేషు ॥ ౧౭ ॥ తేబ్రాహ్మణాద్యాః స్వకర్మస్థాః ॥ ౧౮ ॥

(బోధాయనధర్మసూత్రమ్. ౧. ౩)

తా ॥ బ్రహ్మ క్షత్రియ వైశ్యులు ఉపనయనసంస్కారముగువరకు వేదాధికారములేక శూద్రప్రాయులుగనెంచబడుదురు. మిగిలినవాటియొక్క అర్థమును సూత్రోక్తధర్మవివేచనమందు. నెం.౧. ౨. సూత్రము చూడదగును.

౨౧. అథాప్యుదాహరన్తి । అమత్యావారుణీంపీత్వా ప్రాశ్య మూత్రపురీషయోః । బ్రాహ్మణఃక్షత్రియో వైశ్యఃపునః సంస్కారమర్హతి ॥ ౨౮ ॥

(బోధాయనధర్మసూత్రమ్. ౨. ౧)

తా॥పొరబాటున వారుణియనెడి సారాయినితాగినను, లేదామూత్రమునుగాని, పురీషమునుగాని పుచ్చుకొనినబ్రాహ్మణుడు, క్షత్రియుడు, వైశ్యుడు తిరిగి ఉపనయనము చేసుకొనవలసినది.

యుద్ధ విషయః

౨౨. అథాప్యుదాహరన్తి । గవార్థేబ్రాహ్మణార్థేవా వర్ణానాంవాపిసంకరే । గృహ్ణీయాతాం విప్రవిశౌ శస్త్రంధర్మవ్యపేక్షయా ॥ ౧౮ ॥

(బోధాయనధర్మసూత్రమ్. ౨. ౪)

తా ॥ మరియు నీక్రిందనుదహరించెడి వాక్యమును చెప్పుచున్నారు. ధర్మాపేక్షచేతను గోవులను బ్రాహ్మణులను రక్షించుటకుగాను లేదా వర్ణసంకరము కాకుండుటకుగాను బ్రాహ్మణుడైనను, వైశ్యుడైనను, శస్త్రముపట్టవచ్చును అనగ యుద్ధము చేయవచ్చును.

యద్యైవకదాచిదాదధ్యాచ్ఛ్రద్ధాన్వైవైనం నాతీయాత్ ॥3॥

(వైతానసూత్రే ౫)

తా ॥ అగ్నినిఆధానము చేయుటనుగురించి. బ్రాహ్మణుడు వసన్తకాలమందును, క్షత్రియుడు గ్రీష్మకాలమందును, వైశ్యుడు వర్షాకాలమందును అగ్న్యాధానమును చేయవలయును. ఈ అగ్న్యాధానమునకు మూడుపర్వములు చెప్పబడినవి-ఎప్పుడైనను అగ్న్యాధానముచేయుట సామాన్యవిధి. విశేషవిధిచేశ్రద్ధగలవాడైన పైచెప్పిన కాలములనెప్పుడతిక్రమింపగూడదు.

౨౮. సంశ్రవసేవిశ్రవసేసత్యశ్రవసేశ్రవసఇతినిధనాని॥౧౭॥సంజిత్యైవిజిత్యైసత్యజిత్యై జిత్యాఇతిక్షత్రియస్య । సమ్పుష్ట్యై విపుష్ట్యై సత్పుష్ట్యై పుష్ట్యా ఇతివైశ్యస్య ॥౧౯॥

(వైతానసూత్రే 3౦)

తా ॥ ౨౪-నంబరుగల సూత్రార్థమును జూడుము.

౨౯. గోసవవివధవైశ్యస్తోమేష్విన్ద్రం వోవిశ్వత స్పర్యాణో విశ్వానుహావ్యఇతి ॥౧౦॥ ప్రతీచీనస్తోమేత్వమిన్ద్ర ప్రతూర్తిష్వితి ॥౧౧॥

(వైతానసూత్రే 3౯)

తా॥ దీనియర్థము ౨౫-నం. సూత్రార్థమునుచూడుము.

3౦. అగ్న్యాధేయంవసన్తేబ్రాహ్మణస్య బ్రహ్మవర్చసకామస్య । గ్రీష్మేరాజన్యస్యతేజస్కామస్య । వర్షాసువైశ్యస్యపుష్టికామస్య శరదిసర్వేషామ్ ॥ ౧౦ ॥

(వైతానసూత్రే ౭3)

తా॥ బ్రహ్మవర్చస్సు కోరినబ్రాహ్మణునకు వసంత ఋతువునందును, తేజస్కాముడైన రాజునకు గ్రీష్మ ఋతువునందును, పుష్టికాముడైన వైశ్యునకు వర్షఋతువునందును, యజ్ఞముచేయడము విధింపబడినది. మరియు నీపైమువ్వురకు శరదృతువునందు సర్వసాధారణమైయున్నది.

౨౩. దక్షిణేనమార్జాలీయ మథోఽన్తర్వేది దక్షిణాముఖస్తిష్ఠే త్బహిర్వేదిశూద్రఉదఙ్ముఖః ॥ ౫ ॥

(లాట్యాయనీయె శ్రౌతసూత్రే ౪. ౩. ౫)

తా ॥ మార్జాలీయమునకు దక్షిణప్రదేశమునందు వేదిక లోపల వైశ్యుడు దక్షిణాభిముఖుడై కూర్చుండవలయును. శూద్రుడా వేదికి వెలుపల ఉదఙ్ముఖుడై కూర్చుండవలయును.

౨౪. శ్రవసఃస్థానే సఙ్కృత్యై విజిత్యైసత్యజిత్యై జిత్యాఇతి క్షత్రియస్య సమృష్ట్యై సత్యపుష్ట్యై పుష్ట్యాఇతివైశ్యస్య॥౧౯॥

(లాట్యాయనీయె శ్రౌతసూత్రే ౫. ౪. ౧౯)

తా ॥ మూర్ధాలంభనమునందు క్షత్రియునకు సఙ్కృత్యై । విజిత్యై । సత్యజిత్యై, జిత్యైఅనియు,వైశ్యునకుసమృష్ట్యై, విపుష్ట్యై, సత్యపుష్ట్యై, పుష్ట్యైఅనియు నుద్దేశింపబడినవి.

౨౫. వైశ్యంయంవిశఃస్వరాజానః పురస్కుర్వీరన్సగోసవేన యజేతామ్ ॥ ౨౨ ॥

(లాట్యాయనీయెశ్రౌతసూత్రె ౯. ౪. ౨౨)

తా ॥ రాజులును, వైశ్యులును, ఏవైశ్యుని పురస్కరింతురో అట్టివారు గోసవమను యజ్ఞమును చేయవచ్చును.

౨౬. పఞ్చమేహ నిరాయోవాజీయంబ్రహ్మసామకుర్వన్ గ్ స్తస్య స్థానేకుర్యాత్ యత్ కల్పవృత్తెనోపపన్నమ్ ॥ ౧౩ ॥

(లాట్యాయనీయె శ్రౌతసూత్రే ౧౦. ౨. ౧౩)

తా ॥ బ్రహ్మచే వైశ్యునికొఱకు రాయోవాజీయమనునది ఏది చెప్పబడినదో అది బ్రహ్మసామమనబడును. వైశ్యుడు పంచమదినమందు ఆరాయోవాజీయమనుబ్రహ్మసామమునుపఠించవలయును. మరియునీకల్పవృత్తముచేత తగినసామమును చెప్పవలయును.

౨౭. అథాగ్న్యాధేయమ్ ॥ ౧ ॥ వసన్తేబ్రాహ్మణస్య । గ్రీష్మేరాజన్యస్య । వర్షాసువైశ్యస్య । త్రీణీపర్వాణీత్యుక్తమ్ ॥ ౨॥

31. ఇహహి త్రైవర్ణికానాంసాఙ్గస్య వేదస్యాధ్యయనమామ్నా
యతే అర్థావబోధ పర్యన్తశ్చాధ్యయనవిధిః॥
(పింగళఛన్దస్సు హలాయుధవృత్తి కలకత్తాకూర్పు ౨)

తా ॥ త్రైవర్ణికులగు బ్రహ్మ క్షత్రియ వైశ్యులు అంగములతో వేదాధ్యయనము అర్థమగునంతవరకు చేయవలసినది.

ఇతి వైశ్యధర్మప్రకాశికాయాం సూత్రోక్త
ధర్మ వి వే చ న ం నా మ
ష ష్ఠో ధ్యా యః
సంపూర్ణః.

---

## అథ సప్తమోఽధ్యాయః

—*(స్మృ త్యు క్త ధ ర్మ వి వే చ న మ్)*—

### స్మృతిశాస్త్రప్రశస్త్యమ్.

1. ధర్మశాస్త్ర మధీయానో బ్రాహ్మణః క్షత్రియోథవిట్ ।
పునాతిహి పితౄన్ సర్వాన్ సప్తసప్త వరాంస్తథా॥౫॥
అమార్గేణ ప్రవృత్తానాం వ్యాకులేంద్రియ చేతసామ్ ।
నివర్తకం ధర్మశాస్త్రం వ్యాధీనామి వభేషజమ్ ॥ ౬ ॥
శ్రుతిస్మృతీ చక్షుషీద్వే ద్విజానాంన్యాయవర్త్మని । మా
ర్గముజ్ఝంతి తద్దీనాః ప్రపతంతిపథశ్చ్యుతాః ॥౭॥
(వైద్యనాథదీక్షితీయే స్మృతిముక్తాఫలే పేజి ౬)

తా॥ బ్రహ్మక్షత్రియవైశ్యులు ధర్మశాస్త్రమును అధ్యయనము చేసినయెడల తమ పూర్వీకులైనట్టియు తమకవరులైనట్టియు ఏడుగురు పితృదేవతలను తరింపచేయుచున్నారు ॥ ౫ ॥ ఈధర్మశాస్త్రము అధర్మమార్గప్రవర్తకులై వ్యాకులేంద్రియ చేతస్కులైనవారికి వ్యాధికౌషదముచందంబున దుష్టమార్గనివర్తకమగుచున్నది॥ ౬॥ ద్విజాదులకు న్యాయమార్గప్రవర్తనయందు శ్రుతిస్మృతులు నేత్రములు. ఈనేత్రములులేనివారు ధర్మమార్గమువిడుచుచున్నారు. అట్టిమార్గమునుండి తొలగినవారై పతితులగుచున్నారు ॥ ౭ ॥

## శ్రుత్యాదీనాంబలాబలనిరూపణమ్.

౧. తుల్యబలవిరోధే వికల్పఇతి ॥ ౮ ॥ టీ ॥ తుల్యబలయోః శ్రుత్యోస్స్మృత్యోశ్చవిరోధేవికల్పఇత్యర్థః ॥౯॥

(గౌతమసూత్రమ్)

తా॥ శ్రుతిస్మృతులకు పరస్పరవిరోధముగలిగి సంశయముగలిగినప్పుడు శ్రుతియేప్రమాణము.

౨. శ్రుతిస్మృతిపురాణానాంవిరోధేయత్రదృశ్యతే।
తత్రశ్రౌతంప్రమాణన్తుతయోర్ద్వైధేస్మృతిర్వరా ॥

(వ్యాససంహితాయాం ప్రథమోఽధ్యాయః.)

తా ॥ శ్రుతిస్మృతులకు పరస్పరవిరోధము గలిగినపుడు శ్రుతియేప్రమాణము స్మృతిపురాణములకు విరోధముగలిగినపుడు స్మృతియే విశేషప్రమాణముగ నెంచవలయును.

3. లోకాక్షిః—శ్రుతిస్మృతివిరోధేతుశ్రుతిరేవగరీయసీ।అవిరోధేయదాకార్యం స్మార్తం వైదికవత్తదా ॥ ౯ ॥ సంగ్రహే ॥ శ్లో॥ శ్రుతిస్మృతి పురాణేషు విరుద్ధేషుపరస్పరమ్ । పూర్వంపూర్వంబలీయస్స్యా దితిన్యాయవిదోవిదుః ॥౧౧॥ చతుర్వింశతిమతే ॥ స్మృతేర్వేదవిరోధేన పరిత్యాగోయథాభవేత్ । తథైవలౌకికంవాక్యం స్మృతిబాధాత్పరిత్యజేత్ ॥౧౨॥ ఏవంశ్రుతిస్మృత్యాచారయోర్విరోధే శ్రుతిర్బలీయసీ ॥౧౫॥

(వైద్యనాథదీక్షితీయే స్మృతిముక్తాఫలే పేజి ౭)

తా ॥ శ్రుతి స్మృతులకు విరోధము గలిగినయెడల శ్రుతియే ప్రశస్తమైనది. శ్రుతికి విరోధముగాకుండ జేయబడు స్మార్తవము వేద తుల్యమైనది ॥ ౯ ॥ శ్రుతి స్మృతిపురాణములు పరస్పరవిరుద్ధ ధర్మప్రతిపాదకము లగుచుండగ న్యాయవేత్తలు పూర్వపూర్వము (అనగ పురాణముకంటె స్మృతి, స్మృతికంటె శ్రుతి బలీయమైన

దని) గుర్తెరుగుచున్నారు ॥ ౧౧ ॥ వేదవిరుద్ధమైన స్మృతిపరిత్యాగము చేయదగినది. అలాగే స్మృతిబాధకమైన లౌకికవాక్యమును త్యజించవలయును ॥ ౧౨ ॥ శ్రుతిస్మృత్యాచారములకు పరస్పరవిరోధమందు శ్రుత్యర్థమె బలీయమైనది ॥ ౧౪ ॥

౪. ధర్మజిజ్ఞాసమానానాం ప్రమాణం ప్రథమం శ్రుతిః ।
ద్వితీయం తు స్వశాస్త్రాణి తృతీయం లోకసంగ్రహః ॥
(వృద్ధగౌతమీయె చతుర్దశోఽధ్యాయః)

తా ॥ ధర్మమును తెలుసుకొనడమునకు సమములైన శ్రుతిస్మృతిపురాణములలో మొదట శ్రుతియేప్రమాణము, రెండవది స్వశాఖోక్తములైన మానవాదిధర్మశాస్త్రములు, మూడవది లోకాచారములు ప్రమాణములైయున్నవి.

౫. వేదే తు విదితో ధర్మ స్స్మృతౌ తాదృశ ఏవ చ।
అనువాక శ్రుతి సూక్తం కార్యార్థమితి మానవాః ॥ ౨౬ ॥
(ఇతి పులస్త్యస్మృతి)

తా॥ వేదమందే ధర్మము తెలుసుకొనబడునో అదియే స్మృతియందును తెలుసుకొనబడును గాన మనుశాస్త్రప్రవర్తకులు అనువాకములనియు, శ్రుతులనియు, సూక్తములనియు కార్యానుకూలముకొరకీలాటిభేదములను విధించిరి.

౬. ఆత్మలాభసుఖం యావత్తపోధ్యానముదీరితం ।
శ్రుతిస్మృత్యాదికం ధర్మం తద్విరుద్ధం న చాచరేత్ ॥
(లఘుహారీతస్మృతౌ సప్తమోఽధ్యాయః)

తా॥ స్వలాభసౌఖ్యముకొరకు తపోధ్యానములు వచింపబడినవి. గాన శ్రుతిస్మృత్యాది ప్రతిపాదితధర్మములనే చేయవలయును గాని తద్విరుద్ధధర్మములనాచరింపగూడదు.

౭. శ్రుతిస్మృతివిహితో ధర్మః। తదలాభే శిష్టాచారః ప్రమాణమితి వశిష్ఠస్మరణాత్ ॥ వేదాద్యుపనిబన్ధత్వాత్ప్రాధాన్యం తు మనోస్స్మృతం। మన్వర్థవిపరీతా తు యా స్మృతిస్సా న శస్యతే॥
(స్మృతిరత్నాకరం పేజి. ౪)

తా ॥ ధర్మము - శ్రుతిస్మృతివిహితమైనది. అట్టిధర్మములభించని సమయమందు, విశిష్టాచారము ప్రమాణమని వశిష్టమహామునులు చెప్పిరి. శ్రుతిశ్చ్యాయద్వెకించ

మనురవదత్తద్భేషజమితి'' వేదాదులకు నిబంధములను రచించుటవల్ల మనువుకు ప్రాధాన్యముజెప్పబడినది గాన మన్వర్థమునకు విరుద్ధమైన స్మృతియేదియు ప్రశస్తమైనది గాదు ఈయర్థమునందు శ్రుతియుగలదుమనువుకొంచమైనను దేనినిజెప్పెనో అదిఔషధప్రాయము అనగా హితకరమైనది.

## వర్ణాశ్రమ ధర్మవిషయః

౧. కర్మ విప్రస్యయజనం దానమధ్యయనంతపః । ప్రతిగ్రహోఽధ్యాపనఞ్చయాజనఞ్చేతివృత్తయః ॥౨॥ క్షత్రియస్యాపియజనం దానమధ్యయనంతపః । శస్త్రోపజీవనంభూతరక్షణఞ్చేతివృత్తయః ॥ ౩ ॥ దానమధ్యయనంవాపియజనఞ్చతివైశ్యః । శూద్రస్యవార్తా శుశ్రూషా ద్విజానాం కారుకర్మచ ॥

(అత్రిసంహితపేజి ౧౧)

తా ॥ యజనము, దానము, అధ్యయనము తపస్సు, దానముపట్టడము, వేదముచెప్పడము, యజ్ఞముచేయించడము బ్రాహ్మణవృత్తులు. యజ్ఞము, దానము, అధ్యయనము, తపస్సు, శస్త్రోపజీవనము, భూతరక్షణ ఇవిక్షత్రవృత్తులు. దానము అధ్యయనము, యజనాదులు, వైశ్యవృత్తులు. శూద్రుడు బ్రహ్మక్షత్రియవైశ్యులకు శుశ్రూషచేయుట వార్తాహరణము, శిల్పపనులు చేయుట నివిశూద్రవృత్తులు.

౨. కృతోపనయనోవేదానధీయీతద్విజోత్తమః । గర్భాష్టమేవ్యష్టమేవాస్వసూత్రోక్తవిధానతః ॥ ౪ ॥ దండేచమేఖలాసూత్రేకృష్ణాజినధరోమునిః । భిక్షాహారోగురుహితోవీక్షమాణోగురోర్ముఖమ్ ॥ ౫ ॥ కార్పాసముపవీతార్థంనిర్మితంబ్రహ్మణాపురా । బ్రాహ్మణానాంత్రివృత్సూత్రం కౌశేయంవాతథాస్మృతమ్ ॥ ౬ ॥ సదోపవీతిచైవస్యాత్సదాబద్ధశిఖోద్విజః । అన్యథాయత్కృతంకర్మతద్భవత్యయథాక్రమమ్ ॥ ౭ ॥ వసేదవికృతంవాసః కార్పాసంవాకషాయకమ్ । తదేవపరిధానీయం శుక్లంవాస్యాదనుత్తమమ్ ॥

౮ ॥ ఉత్తరీయంసమాఖ్యాతంవాసఃకృష్ణాజినంశుభమ్ । అభావేభవ్యమజినం రౌరవంవావిధీయతే ॥ ౯ ॥ ఉపవీతం వామబాహుంసవ్య బాహుసమన్వితమ్ । ప్రాచీనావీతమిత్యుక్తంనివీతం కంఠలంబితమ్॥౧౦॥...అగ్న్యగారేగవాం గోష్ఠేహోమేజప్యేతథైవచ । స్వాధ్యాయభోజనేనిత్యం బ్రాహ్మణానాంచసన్నిధౌ ॥

(ఔశనస స్మృతౌ ప్రథమోఽధ్యాయః)

తా॥ బ్రహ్మ క్షత్రియ వైశ్యులు స్వశాఖోక్త గృహ్యసూత్రవిధ్యుక్త గర్భాష్టమమందు గాని జన్మాష్టమమందు గాని చేయబడిన ఉపనయన సంస్కారము గలవారై వేదవేదాంగములను జదువవలయు. వాజ్ఞియమము గలవారై దండమును, ముంజావికారమైన కటిసూత్రమును కృష్ణాజినమును ధరించినవారలై గురుహితులై భిక్షాహారులై గురుముఖమును జూచుచుండవలయును. పూర్వము బ్రహ్మచేత శ్రేష్ఠమైన ప్రత్తియజ్ఞోపవీతార్థము నిర్మింపబడినది. (ద్విజులకు) ఆయజ్ఞసూత్రము నవతంతువుగలదిగనున్న పక్షాంతరమందు పట్టువికారమైన ఉపవీతముగనున్న స్మృత్యుక్తమైయున్నది. (ద్విజాదులు) ఎల్లప్పుడు ఉపవీతముగల వారుగానున్న బద్ధకేశ సమూహముగల వారుగనుండవలయును. అట్లుండక నేకర్మ చేయబడునో అది శ్రుతిస్మృతి విరుద్ధముగనగుచున్నది. ఎల్లప్పుడు చిరగనటువంటి నూలువస్త్రమును గాని కాషాయవస్త్రమును గాని మిక్కిలి శుభ్రమైనవస్త్రమును గాని ధరించవలయును ॥ ౭ ॥ వస్త్రమునైనను శుభ్రమైన కృష్ణాజినమునైనను ఉత్తరీయముగ ధరించవలయును. శుభమైన కృష్ణాజినములేనియెడల దుప్పిచర్మము విధింపబడుచున్నది ॥ ౮ ॥ ఎడమభుజమందుగల యజ్ఞసూత్ర ముపవీతమనియు, దక్షిణభుజమందుగల యజ్ఞసూత్రము ప్రాచీనావీతమనియు, కంఠమందు వ్రేలాడుచున్న యజ్ఞసూత్రము నివీతమనియు చెప్పబడుచున్నది ॥ ౯ ॥ ఉపనీతులైన ద్విజాతులు హోమమును అగ్నిశాలయందును, జపమును గోనివాసభూమియందును వేదాధ్యయనభోజనాదులు ప్రతిదినము బ్రాహ్మణసన్నిధియందును సలుపుచుండవలయును.

3. ద్విజాతీనామధ్యయనమిజ్యాదానం॥ ౧॥ బ్రాహ్మణస్యాధికాః ప్రవచనయాజనప్రతిగ్రహాః పూర్వేషు నియమః ॥౨॥

(గౌతమసంహితాయాం దశమోఽధ్యాయః)

తా ॥ ద్విజాదులకు అధ్యయనము, యజ్ఞము, దానము, సాధారణధర్మములు ౧ ॥ బ్రాహ్మణులకు ప్రవచనముయాజనము, ప్రతిగ్రహము నీమూడునువిశేషములు॥

౪. ఉపనయనంబ్రాహ్మణస్యాష్టమే ॥౫॥ నవమేపంచమేవా ॥ ౬ ॥ కామ్యంగర్భాది స్సంఖ్యావర్షాణాం ॥ ౭ ॥ తద్ద్వితీయంజన్మ ॥ ౮ ॥ తద్యస్మాత్స ఆచార్యః ॥ ౯ ॥ వేదానువచనాచ్చ ॥ ౧౦ ॥ ఏకాదశ ద్వాదశయోః క్షత్రియవైశ్యయోః ॥ ౧౧ ॥ ఆషోడశా ద్బ్రాహ్మణస్యాపతితా ॥ ౧౨ ॥ సావిత్రీద్వావింశతేరాజన్యస్య ॥ ౧౩ ॥ ద్వ్యధికాయావైశ్యస్య ॥౧౪॥ మౌంజీజ్యా మౌర్వీసౌత్ర్యో మేఖలాఃక్రమేణ ॥ ౧౫ ॥ కృష్ణారురుబస్తాజినాని ॥ ౧౬ ॥ వాసాంసిశాణక్షౌమచీరకుతపా స్సర్వేషాంకార్పాసంచావికృతమ్ ॥ ౧౭ ॥ కాషాయ మప్యేకే ॥ ౧౮ ॥ వార్క్షరంబ్రాహ్మణస్య మాంజిష్ఠహారిద్రేఇతరయోః ॥ ౧౯ ॥ బైల్వపాలాశౌబ్రాహ్మణస్య దండావశ్వత్థపైలవౌ ॥ ౨౦ ॥ శేషేయజ్ఞియోవా ॥౨౧॥ సర్వేషామపీరితాయూపచక్రాస్సవల్కలామూర్ధలలాటనాసాగ్రప్రమాణాః ॥౨౨॥ ముణ్డజటిలశిఖాజటాశ్చ ॥ ౨౩ ॥

(గౌతమసంహిత అధ్యా-౧, శ్లో ౫-౨౪)

తా ॥ అష్టమసంవత్సరమందుబ్రాహ్మణునకుముఖ్యమైనఉపనయనకాలము॥౫॥ నవమపంచమములు కామ్యములు ॥ ౬ ॥ పైచెప్పినసంఖ్య గర్భాదిగ నుండవలయును ॥ ౭ ॥ ఉపనయనమనగ ద్వితీయజన్మ ॥ ౮ ॥ ఆ ద్వితీయజన్మను ఇచ్చుటచేతను ॥ ౯ ॥ మరియు వేదమును అను వదించుటచేతనున్ను ఆచార్యుడనిచెప్పబడుచున్నాడు ॥ ౧౦ ॥ ౧౧, ౧౨ - వత్సరముల యందు క్షత్రియ వైశ్యులకుపనయనకాలమనిచెప్పంబడినది ॥ ౧౧ ॥ పదునారవ సంవత్సరమువరకు బ్రాహ్మణునకును ॥ ౧౨ ॥ ఇరువదిరెండవసంవత్సరములవరకు రాజన్యులకును ॥ ౧౩ ॥ ఇరువదినాలుగవ సంవత్సరములవరకు వైశ్యునకును సావిత్రిపాతిత్యములేదు ॥౧౪॥ బ్రాహ్మణునకు మౌంజియు, క్షత్రియునకు వైశ్యునకు అల్లెత్రాడును, మేఖలమున్ను౦డ

వలయును ॥ ౧౫ ॥ బ్రాహ్మణునకు లేడిచర్మము, క్షత్రియునకు రురుచర్మము, వైశ్యునకు మేకచర్మము అజినముగనుండవలయును ॥ ౧౬ ॥ బ్రాహ్మణునకు తెల్లని వస్త్రము, క్షత్రియునకు సూక్ష్మమైనవస్త్రము, వైశ్యునకు నేపాళదేశపు కంబళియు లేదా అందరికి దూదితో చేయబడిన వస్త్రముగాని, శాలువుగాని యుండవలయును॥౧౭॥ కాషాయము ఉండవలయునని కొందరి తాత్పర్యము ॥ ౧౮ ॥ మరికొందరు బ్రాహ్మణునకు నార వస్త్రమనియు, క్షత్రియునకు మాంజిష్టమనియు, వైశ్యునకు హారిద్రావర్ణమనియు చెప్పినారు ॥ ౧౯ ॥ బ్రాహ్మణునకు బిల్వపాలాశములున్ను, క్షత్రియవైశ్యులకు అశ్వత్థపైలవములున్ను దండముగానుండవలయును ॥ ౨౦ ॥ వైశ్యులకు అత్తిదండమునుండవలయును ॥ ౨౧ ॥ అందరికిక్రమముగ శిరోలలాటనాసాగ్రప్రమాణము పైవల్కలములతోగూడిన యూపచక్రములు చెప్పంబడినవి ॥ ౨౨ ॥ ద్విజులు ఆశ్రమభేదములుగ యతికివపనము, బ్రహ్మచారికి, వానప్రస్థునకు, జడలును, గృహస్థుకుజుట్టును గలిగియుండవలయును.

౫. వర్ణధర్మశ్చతుర్థస్తు ఆశ్రమాణాంతథైవచ, ద్వయోస్సాధా
రణోధర్మో యశ్చాసౌద్వయశేషభాక్ । ఇజ్యాధ్యయన దా
నాని యథాశాస్త్రంసనాతనం । బ్రహ్మక్షత్రియవైశ్యానాం
సామాన్యో ధర్మఉచ్యతే ॥౨॥ యజనాధ్యయనేరాజ్ఞః భూ
తానాంచాభిరక్షణం । పాశుపాల్యంకృషిశ్చైవ వైశ్యానాం
జీవనంస్మృతం।శూద్రస్యద్విజశుశ్రూషాద్విజానామానుపూ
ర్వశః॥౩॥ అహింసాసత్యవాదశ్చసత్యంశౌచందయాక్షమా।
వర్ణినాంలింగినాంచైవ సామాన్యోధర్మఉచ్యతే ॥౧౪॥

(పులస్త్యస్మృతి)

తా॥ నాలవదగు వర్ణధర్మము, ఆశ్రమధర్మము, ఈరెంటికి ధర్మము సాధారణమైనది. ఈధర్మము చెప్పవలసినదిగా మిగిలి యున్నది. యాగము, అధ్యయనము, దానము ఇవి శాస్త్రోక్త ప్రకారముగా అనాదివై బహ్మక్షత్రియ వైశ్యులకు సమానధర్మములుగ చెప్పబడుచున్నవి. యజనము, అధ్యయనము భూతపరిపాలనము రాజునకును, పశుపాలనకృషియు వైశ్యులకును, జీవనములుగా చెప్పబడుచున్నవి. శూద్రులకు పూర్వాచారప్రకారము ద్విజాదులకు శుశ్రూషచేయుట విహితధర్మము. హింసచేయకనుండుట, సత్యముచెప్పుట, సత్యము, శుద్ధి, దయ, ఓర్పు ఇవిబ్రాహ్మణాదివర్ణములకును, సన్యాసులకును సాధారణధర్మములుగ జెప్పబడుచున్నవి॥౧౪॥

౬. గర్భాష్టమే బ్రాహ్మణో వసంత ఆత్మానముపనయేత్ । ఏకా
దశే క్షత్రియో గ్రీష్మే ద్వాదశే వైశ్యో వర్షాసు ॥ ౩ ॥ మేఖ
లాజినదండకమండలూపవీతాని ధారయేత్ ॥ ౪ ॥ వేదాన
ధీత్యశుశ్రూషాం కుర్వందృష్టార్థస్తమనుయాయాత్ ॥౫॥
సావిత్రీవేదప్రతీకోపనిషద్గోదాన త్రిసుపర్ణకవ్రతాని సం
చరేత్ ॥ ౬ ॥ గురుణానుజ్ఞాత స్స్నాయాత్ ॥౭॥ సవర్ణాంభా
ర్యాముద్వహేన్మాతృతః పితృతఃపంచమీం దశమీమస్య
గోత్రజామ్ ॥ ౮ ॥ ఋతాఉపేయాత్ ॥ ౯ ॥ యుగ్మాసుపు
త్రానుత్పాదయేత్ ॥ ౧౦ ॥ గర్భాదానపుంసవనసీమంతో
న్నయనశోష్యంతీకర్మజాతకర్మనామకరణనిష్క్రమణా
న్నప్రాశనచూడాకరణోపనయన వేదవ్రతానికారయేత్ ॥
౧౧॥అతిథీన్భోజయేద్భృత్యాన్బంధూన్పోష్యవర్గాంశ్చ॥
౧౩॥ ఆపత్కాలేఅసాధుభ్యః ప్రతిగృహ్ణీయాత్ ॥౨౧॥తద
సంభవేక్షత్రియవృత్త్యా ॥౨౨॥ నవృత్తిసంకరంకుర్యాత్॥
౨౩॥ వృత్తిసంకరాద్రక్షేత్కులశుద్ధ్యర్థమ్ ॥౨౪॥ క్షత్రి
యస్యవిజితాది ॥౨౫॥ కృషిఃపాశుపాల్యంవాణిజ్యంవైశ్యక
ర్మ ॥౨౬॥...కృతకృత్యస్యవానప్రస్థ్యం ॥౨౯॥ విరక్త
స్యప్రవ్రజ్యా॥౩౦॥ స్వధర్మానుష్ఠానంవర్ణానామాశ్రమా
ణాంచ ॥౩౧॥ విహితాకరణేప్రతిషిద్ధసేవనేనరకపాతః ॥౩౨॥

(ఇతి బుధధర్మశాస్త్రమ్)

తా ॥ గర్భజన్మాదులాదిగా బ్రాహ్మణుడు ఎనిమిదవసంవత్సరమందు వసంతఋతువున ఉపనయనము, అటులనే ఏకాదశవత్సరమందు గ్రీష్మఋతువున క్షత్రియుడు, అటువలెనే ద్వాదశసంవత్సరము వర్షఋతువునందు వైశ్యుడును, ఉపనయనము చేసుకొనవలయును. మొలనూలును కృష్ణాజినమును, దండమును కమండలమును ఉపవీతమును ధరించవలయును. గురుశుశ్రూష చేయుచు వేదములనర్థయుక్తముగ జదువుచు గురుభక్తిగలిగియుండవలయును. (ద్విజులు) సావిత్రీవ్రతమును, వేదవ్రతమును, ప్రతీకవ్రతమును, ఉపనిషద్వ్రతమును, త్రిసుపర్ణవ్రతమును చేయవలయును ॥

౬ ॥ గురువువలనయనుజ్ఞనుపొంది సమావర్తముచేయవలయును ॥ ౭ ॥ సమానప్రవర్ణనుగల తల్లి మొదలు అయిదు, తండ్రి మొదలు పదో సంతతిగానుండే టటువంటి అన్యగోత్రములో పుట్టినకన్యను వివాహముచేసుకొనవలయును ॥ ౮ ॥ ఋతుకాలమందు భార్యనుపొందవలయును ॥ ౯ ॥ సరిరాత్రులయందు కొమరులను కలుగజేయవలయును ॥ ౧౦ ॥ గర్భాదానము మొదలు వేదవ్రతపర్యంతము కర్మలను చేయవలయును. అతిథులను బంధువులను పోష్యవర్గమ్మలను భృత్యులను భుజింపచేయవలయును. ఆపత్కాలమందు దుష్టులవలననున్న దానముదీసికొనవచ్చును ॥౨౧॥ పైచెప్పిన బ్రాహ్మణవృత్తివల్ల జీవనము సంభవించకపోయిన క్షత్రియ వృత్తిచేజీవించవచ్చును ॥ ౨౨ ॥ వృత్తిసంకరము చేయకూడదు ॥ ౨౩ ॥ కులశుద్ధికొరకు అన్యవృత్తిసంబంధమునుంచి తనను కాపాడవలయును ॥ ౨౪ ॥ క్షత్రియునకుశస్త్రజయాదులు, వైశ్యునకు కృషివాణిజ్య పశుపాలనాదులుస్వవృత్తులు. వీనిలోకృతార్థులగువానికి వానప్రస్థధర్మము. దీనియందువైరాగ్యముగలవానికి సన్యాశాశ్రమము॥ ౨౫,౨౬,౨౯,౩౦॥ బ్రాహ్మణాదివర్ణములకు, బ్రహ్మచర్యాద్యాశ్రమములకును తమతమ విహితధర్మములయొక్క అనుష్ఠానము (యుక్తము)॥ ౩౧॥ విహితకర్మలుచేయక నిషిద్ధకర్మచేయుటయందు నరకప్రాప్తిగలుగుచున్నది ॥ ౩౨ ॥

౭. వర్ణధర్మాన్ప్రవక్ష్యామియత్కృతంబ్రాహ్మణాదిభిః।నిబోద్ధవ్యం
ద్విజాస్తద్వైసంక్షేపేణపృథక్పృథక్ ॥ ౧ ॥ యజనంయా
జనంవిప్రేతథాదాన ప్రతిగ్రహౌ । అధ్యాపనమధ్యయనం
కర్మాణ్యేతానిషట్ తథా ॥ ౨ ॥ ప్రజానాంరక్షణందాన
మరీణాంనిగ్రహంతథా । యజనాధ్యయనేరాజ్ఞివిషయా
సక్తివర్జనమ్ ॥ ౩ ॥ యజనాధ్యయనేదానం పాశుపాల్యంత
థాకృషిః । వాణిజ్యంచకుసీదంచకర్మషట్కంప్రకీర్తితం ॥
౪ ॥ శుశ్రూషాబ్రాహ్మణాదీనాంతేభ్యఆజీవనంతథా । ఏష
ధర్మస్స్మృతశ్శూద్రోవాణిజ్యేనచజీవనమ్॥ ౫ ॥ సర్వేషాం
జీవనంప్రోక్తం స్వధర్మేణైవకర్షణమ్ । భిన్నవృత్తిర్యథా
నస్యాత్కుర్యాద్విప్రస్తథాచతత్ ॥ ౬ ॥ కుర్వన్నుక్తాని
కర్మాణివృత్త్యావాక్షత్రియస్యచ । వృత్త్యభావే ద్విజోజీవే
ద్భిన్నవృత్తింవివర్జయేత్ ॥౭॥ క్షత్రియేప్రజాపాలత్వంశస్త్ర
భృత్త్వంప్రచండతా । నిర్జయేత్పరసైన్యాని ఏషధర్మస్స్మృ

తోనృప ॥౮॥ పుష్పంపుష్పంవిచిన్వీయాన్మూలచ్ఛేదం నకార
యేత్ । మాలాకారఇవారామే ప్రజాసుస్యాత్తథానృపః॥
౯ ॥ లోహకర్మరథానాంచ గవాంచప్రతిపాలనమ్ । గోర
క్షాకృషివాణిజ్యం వైశ్యవృత్తిరుదాహృతా॥ ౧౦॥

(ఇతిబృహత్పారాశరీయే ద్వితీయోఽధ్యాయః, పేజి-౫౦౫)

తా॥ ఓద్విజులారా బ్రాహ్మణాదులచేతనేదేదిచేయబడుచున్నదో ఆధర్మములను సంక్షేపముగ వేర్వేరుగ చెప్ప బోయెదను. మీరుచక్కగవినుడు. యజ్ఞాదిక్రతువులుచేయుట, అట్టిక్రతువులుచేయించుట దానముచేయుట, దానముస్వీకరించుట, ఇతరులకు చదువుచెప్పుట తానుచదువుకొనుట ఈ ఆరును బ్రాహ్మణ కర్మలైయున్నవి. ప్రజారక్షణము, దానము, శత్రుసంహారము, యజనము, అధ్యయనము, విషయముల యందు అభిలాష లేక పోవడము క్షత్రియవిధులైయున్నవి. యజనాధ్యయనములు, దానము, పశురక్షణము, వ్యవసాయము, వర్తకము, కుసీదము (అనగా వడ్డికిచ్చుట) ఇవి ఆరును వైశ్యధర్మములైయున్నవి. బ్రాహ్మణాదులకు శుశ్రూష వారివలన జీవించుట వాణిజ్యము ఇవి శూద్ర ధర్మములై యున్నవి. జన్మవృత్తిచేతనే అన్నివర్ణములకు జీవనమువిధింపబడినది. బ్రాహ్మణుడు సాధ్యమైనంతవరకు తనకువిధింపబడ్డ దానికంటె భిన్నవృత్తిని అవలంబించగూడదు. బ్రాహ్మణుడు పైనచెప్పిన కర్మలనాచరించుటవల్లగాని లేక వృత్త్యభావమందు క్షత్రియ వృత్తిచేగాని జీవనము చేయవచ్చును. క్షత్రియుడుప్రజాపాలనము, శస్త్రధారణము, సాహసము, పరసైన్యనాశనము అను ధర్మములు గలవాడైయుండునది. పూలమ్మువాడు చెట్లను వేరుతో పెల్లగింపక పుష్పములనుమాత్రముకోయునట్లు ప్రజలయెడ రాజు ఆప్రకారముప్రవర్తించవలెను. అనగా ఆరవభాగమునుమాత్రము తీసికొనుచు ప్రజలకుదండుగరాకుండునట్లు పాలింపవలయును. లోహకర్మరథములు గోవులు మొదలగువాటి రక్షణము, కృషివాణిజ్యములు ఇవివైశ్యవృత్తులని చెప్పబడినవి. ద్విజులయొక్క శుశ్రూషశూద్రులకుముఖ్యవృత్తిగజెప్పబడినది.

౮. మంగళ్యం బ్రాహ్మణస్యస్యాత్క్షత్రియస్య బలాన్వితమ్ । వై
శ్యస్యధనసంయుక్తం శూద్రస్యతుజుగుప్సితమ్ ॥ ౩౧ ॥
శర్మవద్బ్రాహ్మణస్యస్యాద్రాజ్ఞోరక్షాసమన్వితమ్ । వైశ్యస్య
పుష్టిసంయుక్తం శూద్రస్యప్రైష్యసంయుతమ్ ॥౩౨ ॥

(మనుధర్మశాస్త్రే ద్వితీయోధ్యాయః)

తా॥ బ్రహ్మ క్షత్రియ వైశ్యశూద్రులు క్రమముగ మంగళ, బల, ధన నిందావాచకంబులయిన శుభబలవసుదీనాది నామములుంచవలసినది ॥౩౧॥ మరియు వారలు శర్మ, వర్మ, గుప్త(భూతి), దాసాదియుపనామములను గూడచేర్చవచ్చును. ఉ, శుభశర్మ అని బ్రాహ్మణుడును, బలవర్మఅని క్షత్రియుడును, వసుభూతియని వైశ్యుడును, దీనదాసయని శూద్రుడును పిలువబడవలసినది ॥౩౨॥

౯. చూడాకర్మ ద్విజాతీనాం సర్వేషామేవ ధర్మతః । ప్రథమేబ్దే తృతీయేవా కర్తవ్యం శ్రుతిచోదనాత్ ॥ ౩౫ ॥ గర్భాష్టమేబ్దే కుర్వీత బ్రాహ్మణస్యోపనాయనమ్ । గర్భాదేకాదశే రాజ్ఞో గర్భాత్తు ద్వాదశే విశః ॥౩౬॥ బ్రహ్మవర్చసకామస్య కార్యం విప్రస్య పంచమే । రాజ్ఞో బలార్థినః షష్ఠే వైశ్యస్యేహార్థినోష్టమే ॥౩౭॥ ఆషోడశాద్బ్రాహ్మణస్య సావిత్రీ నాతివర్తతే । ఆద్వావింశాత్క్షత్ర బంధోరా చతుర్వింశతేర్విశః ॥ ౩౮ ॥ అత ఊర్ధ్వం త్రయోప్యేతే యథాకాలమసంస్కృతాః । సావిత్రీపతితా వ్రాత్యా భవంత్యార్యవిగర్హితాః ॥ ౩౯ ॥ ... కార్ష్ణరౌరవబాస్తాని చర్మాణి బ్రహ్మచారిణః । వసీరన్నానుపూర్వ్యేణ శాణక్షౌమావికాని చ ॥ ౪౧ ॥ మౌంజీ త్రివృత్సమా శ్లక్ష్ణా కార్యా విప్రస్య మేఖలా । క్షత్రియస్య తు మౌర్వీ జ్యా వైశ్యస్య శణతాంతవీ ॥ ౪౨ ॥ కార్పాసముపవీతం స్యాద్విప్రస్యోర్ధ్వవృతం త్రివృత్ । శణసూత్రమయం రాజ్ఞో వైశ్యస్యావికసౌత్రికమ్ ॥౪౪॥ బ్రాహ్మణో బైల్వపాలాశౌ క్షత్రియో వాటఖాదిరౌ । పైలవౌదుంబరౌ వైశ్యో దండానర్హంతి ధర్మతః ॥౪౫॥ కేశాంతికో బ్రాహ్మణస్య దండః కార్యః ప్రమాణతః । లలాటసమ్మితో రాజ్ఞః స్యాత్తు నాసాంతికో విశః ॥ ౪౬ ॥ బ్రాహ్మణం కుశలం పృచ్ఛేత్ క్షత్రం బంధుమనామయమ్ । వైశ్యం క్షేమం సమాగమ్య శూద్రమారోగ్యమేవ

చ ॥౧౨౭॥...విప్రాణాంజ్ఞానతోజ్యైష్ఠ్యంక్షత్రియాణాం తువీర్యతః । వైశ్యానాంధాన్యధన తశ్శూద్రాణామేవజన్మతః ॥౧౫౫॥...

(మనుధర్మశాస్త్రే ద్వితీయోఽధ్యాయః)

తా॥చూడాకరణము(జుట్టుంచుట) పుట్టిన ప్రథమసంవత్సరమందుగాని, తృతీయసంవత్సరమందుగానిద్విజసామాన్యులు చేయవలసినది॥౩౫॥ గర్భాష్టమందుబ్రాహ్మణుడును, గర్భైకాదశమందుక్షత్రియుడును,గర్భద్వాదశమందువైశ్యుడును, ఉపనయనము చేసుకొనవలసినది ॥ ౩౬ ॥ మరియుబ్రాహ్మణుడు గర్భాత్పంచమవర్షమునందుపనీతుడయిన బ్రహ్మవర్చసమున్ను, క్షత్రియుడు గర్భాష్టమునందుపనీతుడైన గజాశ్వాదిరాజబలమున్ను, వైశ్యుడు గర్భాష్టమునం దుపనీతుడైన బహుకృష్యాది వ్యాపారములను పొందుదురు ॥౩౭॥ మరియొక్కపక్షాంతరమున బ్రాహ్మణునకు పదునారవసంవత్సరమువరకును, క్షత్రియునకు నిరువదిరెండవసంవత్సరములవరకును, వైశ్యునకు ఇరువదినాలుగు సంవత్సరముల వరకు ఉపనయనకాలముగలదు ॥ ఈయనుకల్పితమయిన కాలముమించినేని బ్రహ్మ క్షత్రియ వైశ్యులు అసంస్కృతుల గుటయేగాక సావిత్రీపతితులై వ్రాత్యులగుదురు ॥ ౩౯ ॥ బ్రహ్మ క్షత్రియ వైశ్యులకు క్రమముగ కృష్ణ, రురు, ఛాగ వీట్లయొక్క చర్మములు (పైవస్త్రముగను) ఉత్తరీయముగను, శణము, తెల్లపట్టు, మేకరోమమువీట్లతో చేయబడినవి కట్టువస్త్రములుగ నుచెప్పంబడినవి ॥ ౪౧ ॥ బ్రాహ్మణునకు ముంజమును క్షత్రియునకువింటినారివంటి త్రాడును, వైశ్యునకు శణమున్ను, మొలత్రాడుగనుంచవలసినది. ఇదిమూడుమూడు పేటలుగా సమముగను మృదువుగనుండవలసినది ॥ ౪౨ ॥ బ్రాహ్మణునకు కార్పాసమున్ను, క్షత్రియునకు మౌర్వీజమున్ను, వైశ్యునకు మేక రోమములతోజేయబడిన శణమున్ను ఉపవీతముగ చెప్పంబడినవి ॥౪౪॥ దండధారణ ॥ బ్రాహ్మణుడు కేశాంతమైన బిల్వపాలాశయొక్క దండమున్ను, క్షత్రియుడు లలాటాంతమైన వట ఖదిరములయొక్క దండమున్ను, వైశ్యుడు నాసాంతమైన పైలవఉదుంబరముల యొక్క దండములను ధరించందగినది ॥ ౪౬ ॥ బ్రాహ్మణుని కుశలమాయనియు, క్షత్రియుని బంధుమ నామయమనియు, వైశ్యుని క్షేమమాయనియు, శూద్రుని యారోగ్యమాయని యడుగవలయును ॥౧౨౭॥ బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులు క్రమముగ జ్ఞాన, వీర్య, ధనధాన్య, పూర్వజన్మాదులచేజ్యేష్ఠులగుచున్నారు ॥౧౫౫ ॥

౧౦. అధీయీరంస్త్రయోవర్ణాః స్వకర్మస్థాద్విజాతయః । ప్రబ్రూయాద్బ్రాహ్మణ స్త్వేషాం నేతరావితినిశ్చయః ॥౧॥ ...

బ్రాహ్మణః క్షత్రియో వైశ్యస్త్రయో వర్ణాద్విజాతయః । చతుర్థఏకజాతిస్తు శూద్రోనాస్తితుపంచమః ॥ ౪ ॥ ...త్రయోధర్మానివర్తంతే బ్రాహ్మణాత్ క్షత్రియంప్రతి । అధ్యాపనంయాజనంచ తృతీయశ్చప్రతిగ్రహః ॥ ౭౭ ॥ వైశ్యంప్రతితథైవైతేనివర్తేరన్నితిస్థితిః । నతౌప్రతిహితాన్ధర్మాన్మనురాహప్రజాపతిః ॥ ౭౮ ॥ శస్త్రాస్త్రభృత్త్వం క్షత్రస్యవణిక్పశుకృషిర్విశః । ఆజీవనార్థంధర్మస్తుదానమధ్యయనంయజః ॥ ౭౯ ॥ వేదాభ్యాసోబ్రాహ్మణస్య క్షత్రియస్యచరక్షణమ్ । వార్తాకర్మైవవైశ్యస్యవిశిష్టానిస్వకర్మసు ॥ ౮౦ ॥...వైశ్యోఽజీవన్స్వధర్మేణ శూద్రవృత్త్యాపివర్తయేత్ । అనాచరన్నకార్యాణి నివర్తేతచశక్తిమాన్ ॥౯౮॥

(మనుస్మృతౌ దశమోఽధ్యాయః)

తా ॥ బ్రహ్మ క్షత్రియ వైశ్యులుస్వకర్మనిరతులై అధ్యయనము చేయవలయును, వారలకు బ్రాహ్మణేతరులుచేయించకూడదు ॥ ౧ ॥ బ్రహ్మక్షత్రియవైశ్యులు ద్విజాదులనియు, శూద్రుడేకజాతియనియు జెప్పంబడినది ॥ ౪ ॥ బ్రాహ్మణునకంటె క్షత్రియవైశ్యులకధ్యాపన యాజనప్రతిగ్రహంబులు నివర్తించుచున్నవి ॥ ౭౭ ॥ ప్రతిహతంబులైన యీధర్మము క్షత్రియవైశ్య లవలంబించగూడదని మనుప్రజాపతి చెప్పుచున్నాడు ॥ ౭౮ ॥ క్షత్రియునకు శస్త్రాస్త్రభరణమున్ను, వైశ్యునకుగోరక్షణ, కృషివ్యాపారాదులు జీవనార్థముగనున్ను దానాధ్యయనయాగాదులు ధర్మార్థముగనున్ను జెప్పంబడినవి ॥ ౭౯ ॥ బ్రాహణునకు నధ్యయనము, క్షత్రియునకు పాలనము, వైశ్యునకువ్యాపారము స్వవృత్తులుగ చెప్పంబడినవి ॥౮౦॥ వైశ్యుడువ్యాపారాదులచే జీవించనశక్తుడయ్యేనేనిశూద్రవృత్తినిఉచ్ఛిష్టభోజనాదులనుగ్రహించకుండ జీవించవచ్చును ॥ ౯౮ ॥

౧౧. బ్రహ్మక్షత్రియవిట్శూద్రాః వర్ణాస్త్వాద్యాస్త్రయోద్విజాః। నిషేకాద్యాః శ్మశానాంతాస్తేషాం వైమంత్రతఃక్రియాః॥౧౦॥ గర్భాధానమృతౌ పుంసస్సవనంస్పందనాత్పురా । షష్ఠేష్టమేవాసీమంతోమాస్యేతేజాతకర్మచ ॥ ౧౧ ॥ అహన్యేకాదశేనామచతుర్థేమాసినిష్క్రమః।షష్ఠేన్నప్రాశనం మా

సిచూడాకార్యాయథాకులమ్॥ ౧౨ ॥ ఏవమేనశ్శమంయాతిబీజగర్భసముద్భవమ్ । తూష్ణీమేతాఃక్రియాః స్త్రీణాంవివాహస్తుసమంత్రకః ॥ ౧౩ ॥ గర్భాష్టమేష్టమేవాబ్దేబ్రాహ్మణస్యోపనాయనమ్ । రాజ్ఞామేకాదశేసైకేవిశామేకేయథాకులమ్ ॥ ౧౪ ॥ ఉపనీయగురుశ్శిష్యం మహావ్యాహృతిపూర్వకమ్। వేదమధ్యాపయేదేనంశౌచాచారాంశ్చశిక్షయేత్॥

(యాజ్ఞవల్క్యస్మృత్యాచారకాండే. శ్లో. ౧౦-౧౫)

తా ॥ బ్రహ్మక్షత్రియవైశ్య శూద్రులను నాలుగు వర్ణములలో మొదటజెప్పంబడిన మూడువర్ణములవారు ద్విజులు. వారికిగర్భాదానము మొదలు శ్మశానపర్యంతముసమంత్రకముగ చేయదగునసుట ప్రసిద్ధము ॥ ౧౦ ॥ ఋతుకాలమందు నిషేకము, శిశువుగర్భమందు చెలించుటకు పూర్వము పుంసవనము, ఆరవ యెనిమిదవ నెలలోసీమంతమనెడికర్మయు, శిశువుగర్భమునుంచిబైటవచ్చినప్పుడుజాతకర్మయుచేయవలయును॥ ౧౧ ॥పదునొకండవదినమందు నామకరణము, నాలుగవనెలలోనిష్క్రమమనెడికర్మయు, ఆరవనెలలోనన్నప్రాశనము, కులమర్యాదప్రకారము జుట్టుంచడముచేయదగినవి ॥ ౧౨ ॥ ఈరీతిగ చేయంబడిన గర్భాధానాది కర్మలచేతను శుక్లశోణితసంబంధమైన పాపముపరిహారమగుచున్నది. స్త్రీలకు ఈపైచెప్పినక్రియలు అమంత్రముగచేయవలయును. వివాహము సమంత్రముతో చేయవలయును ॥ ౧౩ ॥ బ్రాహ్మణునకుగర్భము మొదలెనిమిదవయేటగానిలేకజననము మొదలెనిమిదవయేటను, అటులనేక్షత్రియునకుపదునొకండవయేటనువైశ్యునకుపండ్రెండవయేటను ఉపనయనము చేయవలయును ॥ ౧౪ ॥ గురువు శిష్యుని ఉపనీతునిగజేసి మహావ్యాహృతిమంత్రముతోటి వేదమును, సదాచారములనునేర్పించవలయును ॥ ౧౫ ॥

౧౨. దండాజినోపవీతాని మేఖలాంచైవ ధారయేత్ ॥ ౨౯ ॥ బ్రాహ్మణేషుచరేద్భైక్ష్యమనింద్యేష్వాత్మవృత్తయే । ఆదిమధ్యావసానేషుభవచ్ఛబ్దోపలక్షితా । బ్రాహ్మణక్షత్రియవిశాంభైక్ష్యచర్యా యథాక్రమమ్ ॥ ౩౦ ॥ కృతాగ్నికార్యోభుంజీతవాగ్యతోగుర్వనుజ్ఞయా । ఆపోశనక్రియాపూర్వం సత్కృత్యాన్నమకుత్సయన్ ॥ ౩౧ ॥ ... ఆషోడశాదాద్వావింశాచ్చతుర్వింశాచ్చవత్సరాత్ । బ్రహ్మక్షత్రవి

శాంకాల ఔపనాయనికఃపరః॥ అతఊర్ధ్వంపతంత్యే తేసర్వ ధర్మబహిష్కృతాః । సావిత్రీపతితావ్రాత్యా వ్రాత్యస్తో మాద్వృతేక్రతోః ॥ ౩౨ ॥ మాతుర్యదగ్రేజాయంతే ద్వితీయంమౌంజిబంధనాత్ । బ్రాహ్మణక్షత్రియ విశస్తస్మాదే తేద్విజాస్స్మృతాః ॥ ౪౦ ॥ యజ్ఞానాంతపసాచైవ శుభానాంచైవకర్మణామ్ । వేదఏవద్విజాతీనాంనిశ్శ్రేయసకరఃపరః॥౪౧॥

(యాజ్ఞవల్క్యస్మృతౌ ఆచారకాణ్డే. శ్లో. ౨౭. ౪౧)

తా ॥ బ్రహ్మచారిదండమును, కృష్ణాజినమును, ఉపవీతమును, మొలత్రాడును ధరించవలయును ॥ ౨౯ ॥ తన జీవనముకొరకు నింద్యులుకాని బ్రాహ్మణులలో మధుకరవృత్తినిజేయవలయును బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులయొక్క మధుకరవృత్తిఆది మధ్యాంతమందు క్రమముగ భవతిభిక్షాందేహి, భిక్షాంభవతిదేహి, భిక్షాందేహిభవతి, యను శబ్దోచ్చారణముగలదిగ నుండవలయును ॥ ౩౦ ॥ గురువుయొక్క ఆజ్ఞచేత నగ్ని కార్యము చేసినవాడై, మౌనముగలిగి ముందుగ నాపోశనము చేసి యన్నమునుసత్కరించి దోషము నెంచనివాడై భోజనము చేయవలయును ॥ ౩౧ ॥ బ్రహ్మక్షత్రియవైశ్యులకుపదునారు, ఇరువదిరెండు, ఇరువదినాలుగు సంవత్సరములవరకు ఉపనయనకాలము. ఈకాలమున కనంతరము వీరుగాయత్రీదానమున కనర్హులుగాను, సర్వధర్మముల కనధికారులుగాను, సంస్కారహీనులుగాను చెడి పోవుచున్నారు. వ్రాత్యులకేర్పడ్డక్రతువువలనదప్ప ఉపనయనాధికారము లేదు ॥ ౩౮ ॥ ముందుతల్లివలన జననము రెండవది ఉపనయనము వీట్లచే బ్రహ్మక్షత్రియ వైశ్యులు ద్విజులనిచెప్పబడుచున్నారు ॥ ౪౦ ॥ శ్రౌతస్మార్తకదేహశోషక మంగళకరమైన యుపనయనాదికర్మ (జ్ఞానముకలుగజేసెడిదిగనుక) వేదమేద్విజులకు మిక్కిలి క్షేమమును, మోక్షమునిచ్చునది ॥౪౧॥

౧౩. ...ఇజ్యాధ్యయనదానానివైశ్యస్య క్షత్రియస్యచ । ప్రతిగ్రహోధికోవిప్రేయాజనాధ్యాపనేతథా ॥ ౧౧౮ ॥ ప్రధానంక్షత్రియేకర్మ ప్రజానాంపరిపాలనమ్ । కుసీదంకృషివాణిజ్యంపాశుపాల్యంవిశస్స్మృతమ్॥ ౧౧౯ ॥ శుక్లాంబరధరోనీచకేశశ్మశ్రునఖశ్శుచిః । నభార్యాదర్శనేశ్నీయాన్నైకవాసానసంస్థితః ॥ ౧౩౧ ॥ అన్నంపర్యుషితంభోజ్యం స్నే

హాక్తంచిరసంస్థితమ్ । అస్నేహా అపిగోధూమయవగోరస విక్రియాః ॥ ౧౯ ॥ ముఖజావిప్రుషోమేధ్యాస్తథాచమన బిందవః । శ్మశ్రుచాస్యగతందంతసక్తంత్యక్త్వాతతశ్శుచిః॥

(ఇతియాజ్ఞవల్క్యస్మృత్యాచారకాణ్డే)

తా ॥ యాగము వేదాధ్యయనము, దానము క్షత్రియునకు వైశ్యునకు సాధారణధర్మములు. అటువలెనే బ్రాహ్మణునియందు, యజ్ఞముచేయించుట, వేదము నేర్పించుట ప్రతిగ్రహముచేయుట అధికము ॥ ౧౧౮ ॥ క్షత్రియునియందు ముఖ్యమైనకార్యము ప్రజారక్షణ, వైశ్యునకు వడ్డితీయుట, కృషివాణిజ్యపశుపాలనములు చెప్పంబడినవి ॥ ౧౧౯ ॥ ద్విజుడు తెల్లటివస్త్రము గలవాడై క్లిప్తమైన జుట్టుమీసము గోళ్లుగలవాడై శుద్ధుడైయుండవలయును. భార్యచూడగ భోజనము చేయకూడదు. ఏకవస్త్రముగలవాడైగాని నిలువబడిగాని భోజనముచేయకూడదు॥ ౧౩౧ ॥ ... చమురుతో చేరిన చద్ది అన్నము, చాలాకాల మున్నప్పటికి భోజనమునకు యోగ్యమైనది. చమురుతో చేరని గోధుమలుయవలు పాలు పెరుగు, భోజనమునకు యోగ్యమైనవి ॥ ౧౯ ॥ వేదముజదివెడికాలములో నోటిలోనుంచికలిగెడితుప్పరలు మేధ్యములు. అటువలెనే ఆచమనబిందువులుపవిత్రములు. నోటియందు బోయిన మీసములును పవిత్రములు. పల్లుతాకిపడిన అన్నమునుపడినచోటుననుండి తీసిన పవిత్రమగును ॥ ౧౯౬ ॥

౧౪. ఆద్యాస్త్రయోద్విజాఇత్యుక్తంతత్రహేతుమాహ॥ మాతురితి॥మాతుస్సకాశాత్ప్రథమంజాయంతేమౌంజీబంధనాచ్చ ద్వితీయం జన్మతస్మాదేతే బ్రాహ్మణ క్షత్రియవైశ్యా ద్విజా ఉచ్యన్తే ॥ ౪౦ ॥

(విజ్ఞానేశ్వరీయోక్త యాజ్ఞవల్క్యస్మృతి. పేజి. ౫)

తా ॥ ఈమొదటి ముప్పురు ద్విజులని చెప్పబడుచున్నారు. అందుకు కారణ మేమనగ మాతురితి అను శ్లోకముచే మొదట తల్లివలనను, రెండవపర్యాయముఉపనయనమువలనను జన్మించుచున్నారు. గనుక నీబ్రహ్మ, క్షత్రియ, వైశ్యులుద్విజులని చెప్పంబడుచున్నారు.

౧౫. గోరక్షాంకృషివాణిజ్యం కుర్యాద్వైశ్యోయథావిధి । దానందేయంయథాశక్త్యా బ్రాహ్మణానాఞ్చభోజనమ్ ॥ ౯ ॥ దంభమోహావినిర్ముక్తస్తత్వవాగనసూయకః । స్వదార ని

రతో౽దాంతఃపరదారవివర్జితః ॥ ౭ ॥ ధనైర్విప్రాన్భోజయి త్వాయజ్ఞకాలేతుయాజకాన్ । అప్రభుత్వంచవర్తేతధర్మే ష్వాదేహపాతనాత్ ॥ ౮ ॥ యజ్ఞాధ్యయనదానాని కుర్యా న్నిత్యమతన్ద్రితః । పితృకార్యపరశ్చైవ నరసింహార్చనాప రః ॥ ౯ ॥ ఏతద్వైశ్యస్యధర్మో౽యంస్వధర్మమనుతిష్ఠతి । ఏతదాచరతేయోహిసస్వర్గీనాత్రసంశయః। ౧౦ ॥

(లఘుహారీతస్మృతౌ ద్వితీయో౽ధ్యాయః)

తా ॥ శాస్త్రోక్తప్రకారము వైశ్యుడు గోపరిపాలన కృషివాణిజ్యములను చేయవలయును. మరియు శక్తిగొలది బ్రాహ్మణులకు భోజనమును దానమును ఇయ్యవలయును. దంభమోహమునువదలి సత్యవాదియై, అసూయారహితుడై, స్వదారనిరతుడై ఇంద్రియనిగ్రహుడై, పరదారవిముఖుడైనట్టి వైశ్యుడు ధనముచేత యజ్ఞకాలమందు ఋత్విక్కులను, బ్రాహ్మణులను భుజింపచేయుచు మరణావధి పర్యంతము ప్రభుత్వాధికారములేక ధర్మమందుండవలయును. మరియు ప్రమాదము లేనివాడై నృసింహస్వామి పూజాపరుడై పితృకార్యములయందాసక్తిగలవాడై యెల్లప్పుడు యజ్ఞదానాధ్యయనమును చేయవలయును. ఇవి వైశ్యధర్మములు. ఎవడు ఈస్వధర్మములనుచక్కగచేయునో అతడు స్వర్గమునుబొందుచున్నాడు, ఈవిషయమందు సందేహములేదు.

౧౬. వర్ణాశ్రమాచారవిధింప్రవక్ష్యామిసమాసతః । శ్రుణుధ్వ మృషయస్సర్వేభాగ్యవంతస్సమాహితాః॥ ౧ ॥ గర్భాదానాదిసంస్కారాన్ కుర్యాన్మంత్రవిధానతః । నార్యాశ్చామంత్రతః కుర్యాద్యథాకాలేయథావిధి ॥ ౩ ॥ సీమంతఃప్రథమేగర్భేచతుర్థేమాసిశస్యతే । షష్ఠేవాసప్తమేవాపిచాష్టమేవాపికారయేత్ ॥ ౪ ॥ ... అస్పష్టమర్థహీనంచ అతిగుర్వక్షరాన్వితం । నకుర్యాన్నామవిప్రేంద్రాస్తథాచవిషమాక్షరం । తృతీయవర్షకేవాపి పంచమేషష్ఠకేపివా । చౌళం కుర్యాద్విధానేనయథాకాలమతంద్రిదః ॥ ౮ ॥ సప్తమేవాష్టమేకుర్యాన్మౌంజీంగృహ్యోక్తకర్మతః । దైవయోగాదతిక్రాంతేగర్భాదానాదికర్మణి ॥ ౯ ॥ కర్తవ్యఃపాదకృఛ్రో

వై చౌలేప్యర్థం ప్రకల్పయేత్ । గర్భాష్టమేష్టమేవాబ్దే బ్రా
హ్మణస్యోపనాయనం ॥ ౧౦ ॥ ఆషోడశాబ్దపర్యంతం కాల
మాహుశ్చ గౌణతః। గర్భైకాదశవాబ్దేతు రాజన్యస్యోపనా
యనం ॥ ౧౧ ॥ ఆద్వావింశాబ్దపర్యంతం కాలమాహుర్విప
శ్చితః । విశోపనయనం ప్రోక్తం గర్భద్వాదశకేపివా । చతు
ర్వింశాబ్దపర్యంతం కాలమాహుర్మనీషిణః ॥ ౧౨ ॥ ఏత
త్కాలావధేర్యస్య ద్విజస్యాతిక్రమో యది । సావిత్రీపతితం
విద్యాన్నాలపేతం కదాచన ॥ ౧౩ ॥ ద్విజోపనయనం వి
ప్రాః ముఖ్యకాలవ్యతిక్రమే । ద్వాదశాబ్దం చరేత్కృచ్ఛ్రం ప
శ్చాచ్చాంద్రాయణం చరేత్ ॥ ౧౪ ॥ ద్వయం సాంతపనం
చైవకృత్వా కర్మ సమాచరేత్ । అన్యథా పతితం విద్యాత్కృ
త్వాపి బ్రహ్మహా భవేత్ ॥ ౧౫ ॥ మౌంజీ విప్రస్య విజ్ఞేయా ధను
ర్జ్యా క్షత్రియస్య చ । కుశాశ్చైవతు వైశ్యస్య విశుద్ధం త్వజనం

తా॥ భాగ్యవంతులైన ఓ ఋషులారా మీరందరు సావధానమనస్కులై సంక్షేపముగ చెప్పబోయెడి వర్ణాశ్రమాచారవిధిని వినుడు. యథావిధిగ ముఖ్యకాలములయందు గర్భాదానాది సంస్కారములను మంత్రవిధిగను స్త్రీలకు అమంత్రకముగను చేయవలసినది. ప్రథమ గర్భమునందు నాల్గవమాసమున సీమంతము చేయుట ప్రశస్తమైనది. అట్లు కాకపోయెనేని ౬, ౭, ౮-వ మాసములయందైనను రెండవపక్షమున చేయవలసినది. స్పష్టము కానిదియు, అర్థహీనమైనట్టియు, అతిగురువక్షరములతో కూడుకొన్నట్టియు విషమాక్షరములతో నుండునట్టియు నామకరణము చేయగూడదు. ప్రమాదరహితుడై ముఖ్యకాలాతిక్రమణము జేయక మూడవ అయిదవ ఆరవయేటను విధ్యుక్తముగ చౌలకర్మను చేయవలయును. ఏడవసంవత్సరమునగాని అష్టమసంవత్సరమునగాని స్వగృహ్యసూత్రప్రకారము (మౌంజి) ఉపనయనకర్మ చేయవలయును. దైవయోగముచే గర్భాదానాదికర్మ లతిక్రమించెనేని కృచ్ఛ్రములో నాలవభాగమును, చాలమతిక్రమించెనేని అర్థకృచ్ఛ్రమును చేయవలయును. బ్రాహ్మణునకు గర్భాష్టమమందుగాని, జన్మాష్టమందుగాని ఉపనయనము విధింపబడినది. పదునారు సంవత్సరములవరకు గౌణకాలము చెప్పబడియున్నది. గర్భైకాదశమందు రాజునకు ఉపనయనము విధింపబడినది. అతనికి ఇరువదిరెండు సంవత్సరముల పర్యంతము గౌణకాలము విధింపబడినది. వైశ్యునకు గర్భద్వాదశమునందు ఉపనయనము జెప్పబడినది. ఇరు

పదినాలుగు సంవత్సరములు పర్యంతము గౌణకాలమువిధింపబడినది. ఏద్విజులు ఈ చెప్పినకాలము లతిక్రమించెదరో వారుసావిత్రీపతితులగుదురు. వారలతో నెప్ప టికిసంభాషించజనదు. ఓబ్రాహ్మణులారా ఉపనయనమందు ముఖ్యకాలమతిక్రమించి నద్విజులు పండ్రెండుసంవత్సరముల పర్యంతము కృచ్ఛ్రవ్రతములను చేయవలయును. అటుపిమ్మట చాంద్రాయణవ్రతము చేయవలయును. అటుపిమ్మట రెండుసాంతపనవ్ర తములనుజేసి యుపనయనాదికర్మలను జేసుకొనవలయును. అట్లుచేయక ఉపనయన ముచేసుకొనువానిని పతితునిగనుత్తరుగవలయును. ఆ ఉపనయనముచేసినవాడును బ్రహ్మహత్యజేసినవాడగును. బ్రాహ్మణుడుముంజను, క్షత్రియుడు అల్లెత్రాడును, వై శ్యుడు కుశను మొలత్రాడుగ ధరించవలయును

తథా ॥ ౧౬ ॥ విప్రస్యప్రోక్తమైణేయం రౌరవంక్షత్రియ స్యతు। ఆజంవైశ్యస్యవిజ్ఞేయందండాన్వక్ష్యేయథాక్రమమ్॥ ౧౭ ॥ పాలాశంబ్రాహ్మణస్యేష్టం న్యగ్రోధంక్షత్రియస్యచ ఔదుంబరంబాదరంవావైశ్యస్యవిధిరుచ్యతే॥ ౧౮ ॥ విప్ర స్యకేశమానంస్యాదాలలాటంనృపస్యచ। నాసాగ్రాహ్యంచ వైశ్యస్యఏవమాహుర్విపశ్చితః ॥ ౧౯ ॥ ఉపనీతోద్విజోవి ప్రః పరిచర్యాపరోగురోః। వేదగ్రహణపర్యంతంనివసేద్గు రుసన్నిధౌ ॥ ౨౦ ॥ భవత్పూర్వం బ్రాహ్మణస్య భవన్మధ్యం నృపస్యతు।భవదంత్యంవిశఃప్రోక్తంభిక్షాయాహరణేద్విజాః॥ ౨౪ ॥ సాయంప్రాతశ్చాగ్నికార్యం యథాకాలంజితేంద్రి యఃకుర్యాత్ప్రతిదినంవర్ణీ బ్రహ్మయజ్ఞంచతర్పణం ॥ ౨౫ ॥ అగ్నికార్యపరిత్యక్తః పతితఃప్రోచ్యతేబుధైః। బ్రహ్మయజ్ఞ విహీనశ్చబ్రహ్మహాపరికీర్తితః॥ ౨౬ ॥ దేవతాభ్యర్చనంకు ర్యాచ్ఛిశ్రూషానుపదం గురోః।భైక్షాన్నమేవ చాశ్నీయా న్నైకస్యాన్నంకదాచన ॥ ౨౭ ॥

(ఇతి లిఖితస్మృతౌ షష్ఠోధ్యాయః)

తా ॥ బ్రాహ్మణుడు నిర్మలమయిన లేడిచర్మను, క్షత్రియుడు దుప్పిచర్మను, వైశ్యుడు మేకచర్మను ధరించవలయును. బ్రాహ్మణునకుపలాశము క్షత్రియునకుమ ఱ్ఱి, వైశ్యునకు అత్తిలేక రేగుదండమువిధింపబడినది. విద్వాంసులు బ్రాహ్మణునకు కే

శాంత ప్రమాణమైన దండమున్ను, క్షత్రియునకు లలాటపర్యంతమైన దండమున్ను, వైశ్యునకు నాసాగ్రగ్రాహ్యమైన దండమును చెప్పిరి. ఉపనీతుడైన ద్విజుడు గురుసేవారతుడై వేదములు చదువుపర్యంతము గురుసన్నిధి నుండవలయును. ఓ ద్విజులారా బ్రాహ్మణులు భవచ్ఛబ్దము పూర్వమందు గలుగునటుల, క్షత్రియుడు మధ్యమందు గలుగునటుల, వైశ్యుడు అంతమందు గలుగునటుల భిక్షాచరణము చేయవలయును. జితేంద్రియుడైన బ్రహ్మచారి ముఖ్యకాలమతిక్రమించకుండ సాయంప్రాతఃకాలములయందగ్ని కార్యమును బ్రహ్మయజ్ఞమును దేవతార్చనయు చేయవలయును. అగ్నికార్యమును వదిలిపెట్టిన ద్విజుడు పతితుడుగను. బ్రహ్మయజ్ఞము వదిలిపెట్టినవాడు బ్రహ్మహత్యను జేసినవాడుగను బుధులచే చెప్పబడుచున్నాడు. దేవతార్చనను గురుశుశ్రూషయును భిక్షాన్నమునే భుజించవలయునుగాని ఎల్లప్పుడు ఒకరియన్నమునే భుజించకూడదు.

౧౭. చత్వారో వర్ణా బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రాః । త్రయో వర్ణా ద్విజాతయో బ్రాహ్మణక్షత్రియవైశ్యాః । తేషాం,మాతురగ్రేఽధిజననం ద్వితీయం మౌంజీబన్ధనమ్ । తత్రాస్య మాతా సావిత్రీ పితా త్వాచార్య ఉచ్యతే । వేదప్రదానాత్పితేత్యాచార్య మాచక్షతే । అథాప్యుదాహరన్తి । ద్వయమిహ వై పురుషస్య రేతో బ్రాహ్మణస్యోర్ధ్వం నాభేరర్వాచీనమన్యత । తద్యదూర్ధ్వం నాభేస్తేనాస్యౌరసీ ప్రజా జాయతే యదుపనయతి యత్సాధు కరోతి । అథ యదర్వాచీనం నాభేస్తేనాస్యౌరసీ ప్రజా జాయతే జనన్యాం జనయతి తస్మాచ్ఛ్రోత్రియమనూచానమప్రజోఽసీతి న వదన్తీతి హారీతః ॥ అథాప్యుదాహరన్తి । నత్వస్య విద్యతే కిఞ్చిదా మౌంజిబంధనాద్వృత్త్యా శూద్రసమో జ్ఞేయో యావద్వేదేన జాయత ఇతి ॥ షట్కర్మాణి బ్రాహ్మణస్యాధ్యయనమధ్యాపనం యజనం యాజనం దానం ప్రతిగ్రహశ్చేతి । త్రీణి రాజన్యస్యాధ్యయనయజనం దానం శస్త్రేణ చ ప్రజాపాలనం స్వధర్మస్తేన జీవేత్ । ఏతాన్యేవ త్రీణి వైశ్యస్య కృషివాణిజ్య పాశుపాల్య కుసీదఞ్చ । ఏతేషాం పరిచర్యా శూద్రస్య ॥

(ఇతి వాశిష్ఠే ధర్మశాస్త్రే ద్వితీయోఽధ్యాయః)

తా॥ నాలుగువర్ణములనగా—బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులు. అందు ద్విజు లనగ బ్రహ్మ క్షత్రియ వైశ్యులగుచున్నారు. అద్విజులకు ప్రథమజన్మము తల్లివలనను రెండవది ఉపనయన సంస్కారమువలనను గలుగును. ఆరెండవజన్మయం దీబాలునకు తల్లి గాయత్రి, తండ్రి ఆచార్యుడనియు ఇంక వేదము చెప్పుటవల్ల ఆచార్యుడు తండ్రియనియు చెప్పబడుచున్నాడు. ఈవిషయమైమహర్షులుదృష్టాంతపూర్వకముగచెప్పుచున్నారు. అదెట్లనిన—ఈజన్మమందు పురుషునకు రేతస్సు రెండువిధములు. ఆరేతస్సు ద్విజునకు నాభికిపైనను నాభికిక్రిందిప్రదేశమందును ఉండునని తెలచబడుచున్నది. ఊర్ధ్వరేతస్సైన జ్ఞానమువలన బాలునకు ఉపనయనాది, కర్మలను చేయించుటచే నాగురువునకు నాబాలుడు అనౌరసపుత్రుడుగ నగుచున్నాడు. పిమ్మట నాభికిక్రిందిప్రదేశమందు ఏరేతస్సుగలదో ఆరేతస్సుచే గలుగుటవలన ఆపురుషున కాబాలుడు ఔరస పుత్రుడగుచున్నాడు. మహా ఋషులైన హారీతులు ఏ కారణమువలననీవు పూజ్యుడవు గావని చెప్పుచున్నారో ఆకారణమువల్ల ఎల్లప్పుడు అధ్యయనశీలుడై శ్రోత్రియుడైన అపుత్రునితల్లియందు గలిగించుచున్నాడు. ఈవిషయమై ఋషులు ఈబాలున కుపనయనమగువరకు కర్మయేమియులేదని ఉపహరించుచున్నారు. ఎంతపర్యంతము వేదసంస్కారమువల్ల రెండవజన్మము గలుగునో అంతపర్యంతమువృత్తిచేత శూద్రసముడని తెలుసుకొనదగును... బ్రాహ్మణునకు షట్కర్మలెవ్వియనగ తాను అధ్యయనముచేయడము, ఇతరులను అధ్యయనముచేయించడము, తానుయజ్ఞముచేయడము, ఇతరులచేచేయించడము, దానమివ్వడము తాను పట్టడమునై యున్నవి. రాజునకు మూడుకర్మలెవ్వియనగ తానధ్యయనము చేయడము, యజ్ఞముచేయడము దానము చేయడము మరియు శస్త్రముచేత ప్రజలను పరిపాలించుటనుఇవిరాజధర్మములుగాన అందుచేజీవించవలయును. అధ్యయనము, యజనము, దానము ఈమూడును ఇంకకృషివాణిజ్య, పశుపాలన, వడ్డీజీవనము ఇవి వైశ్యునకుముఖ్యవృత్తులైయున్నవి. శూద్రులు పైమూడువర్ణములకు శిశ్రూష చేయుట ముఖ్యకర్మ.

౧౫. ఇత్యేవమాహాన్నృణోయజ్వాయః పుత్రీబ్రహ్మచర్యవానితి। గర్భాష్టమేషుబ్రాహ్మణముపనయీతగర్భైకాదశేషురాజన్యం గర్భద్వాదశేషువైశ్యమ్ । పాలాశోదండోబైల్వోవా బ్రాహ్మణస్య న్యగ్రోధః క్షత్రియస్యవా ఔదుంబరోవా వైశ్యస్య । కృష్ణాజినముత్తరీయం బ్రాహ్మణస్యక్షత్రియస్యగవ్యం వస్తాజినంవైశ్యస్య । శుక్లమహతంవాసోబ్రాహ్మణస్య

మాంజిష్టంక్షత్రియస్యహారిద్రకౌశేయంవైశ్యస్యసర్వేషాం। వాతాన్తవమరక్తమ్। భవత్పూర్వాంబ్రాహ్మణోభిక్షాంయాచేత భవన్మధ్యాంరాజన్యోభవదన్త్యాంవైశ్యస్య। ఆషోడశాద్బ్రాహ్మణస్యానతీతఃకాల ఆద్వావింశాత్క్షత్రియస్యాచతుర్వింశాద్వైశ్యస్యాత ఊర్ధ్వంపతితసావిత్రీకాభవన్తి॥

(ఇతి వాశిష్ఠేధర్మశాస్త్రేఏకాదశోఽధ్యాయః)

తా॥ ఎవడు యజ్ఞముచేసి బ్రహ్మచర్యవ్రతముగలిగి పుత్రునిగలడయునో ఆయన పితృఋణవిముక్తుడగును॥ ఉపనయనక్రమము॥ గర్భాష్టమందు బ్రాహ్మణునకు, గర్భైకాదశమందు రాజునకు, గర్భద్వాదశమందు వైశ్యునకు ఉపనయనము చేయవలయును. దండములు—బ్రాహ్మణునకు పాలాశము లేక బిల్వముఅనగ మారేడుగాని దండములైయున్నవి. క్షత్రియునకు మఱ్ఱి, వైశ్యునకు మేడిదండము, బ్రాహ్మణునకు కృష్ణమృగము (జింక) చర్మము, క్షత్రియునకు రురుచర్మము, వైశ్యునకు గోచర్మము లేక వస్త్రముగాని అజినములు. చిరగని తెల్లవస్త్రము బ్రాహ్మణునకు, ఎఱ్ఱరంగుగలది క్షత్రియునకు, పసుపువన్నెగల పట్టువస్త్రము వైశ్యునకు, నుండవలయును. లేదా అందరికి ఎఱ్ఱరంగులేనితంతువస్త్రము యుండవచ్చును. భిక్షక్రమము బ్రాహ్మణుడు భవచ్ఛబ్దము ఆదియందును, క్షత్రియుడు మధ్యమందును, అంతమందు వైశ్యుడును, ఉచ్చరించవలయును. కాలాతిక్రమవిషయము పదునారు సంవత్సరములవరకు బ్రాహ్మణునకు ఇరువదిరెండు సంవత్సరములవరకును క్షత్రియునకు ఇరువదినాలుగు సంవత్సరములవరకు వైశ్యునకును గౌణకాలమున్నది. ఇంతకు మించెనేని పతితసావిత్రులై ప్రాయశ్చిత్తమున కర్హులగుచున్నారు.

౧౯. బ్రాహ్మణ క్షత్రియ విశస్త్రయో వర్ణాద్విజాతయః। శ్రుతిస్మృతిపురాణోక్త ధర్మయోగ్యాస్తునేతరే ॥ ౫ ॥ శూద్రోవర్ణశ్చతుర్థోపివర్ణత్వాద్ధర్మమర్హతి। వేదమన్త్రస్వధాస్వాహావషట్కారాదిభిర్వినా ॥ ౬ ॥ విప్రవద్విప్రవిన్నాసు క్షత్రవిన్నాసువిప్రవత్ । జాతకర్మాణికుర్వీత తతశ్శూద్రాసుశూద్రవత్।వైశ్యాసువిప్రక్షత్రాభ్యాం తతశ్శూద్రాసుశూద్రవత్ । అధమాదుత్తమాయాంతు జాతశ్శూద్రాధమస్మృతః॥౮॥...గర్భాదానంపుంసవనం సీమన్తోజాతక

ర్మచ । నామక్రియానిష్క్రమణేఽన్నాశనంవపనక్రియా ॥
౧౩ ॥ కర్ణవేధో వ్రతా దేశో వేదారమ్భక్రియావిధిః । కే
శాన్తస్స్నానముద్వాహో వివాహాగ్నిపరిగ్రహః ॥ ౧౪ ॥
త్రేతాగ్నిసంగ్రహశ్చేతి సంస్కారాష్షోడశస్మృతాః । న
వైతాః కర్ణవేధాన్తా మన్త్రవర్జంక్రియాస్త్రియాః ॥ ౧౫॥
వివాహోమంత్రతస్తస్యా శ్శూద్రస్యామన్త్రతో దశ । గ
ర్భాదానం ప్రథమతస్తృతీయేమాసిపుంసవః ॥ ౧౬ ॥ సీ
మన్తశ్చాష్టమేమాసిజాతేజాతక్రియాభవేత్ । ఏకాదశే
హ్నినామార్కస్యేక్షామాసిచతుర్థకే॥ ౧౭॥ షష్ఠేమాస్య
న్నమశ్నీయాచ్చూడాకర్మకులోచితమ్। కృతచూడేచబాలే
చకర్ణవేధోవిధీయతే॥౧౮॥ విప్రోగర్భాష్టమేవర్షేక్షత్రఏకా
దశేతథా । ద్వాదశేవైశ్యజాతిస్తువ్రతోపనయమర్హతి ॥
౧౯॥ తస్యప్రాప్తవ్రతస్యాయం కాలస్స్యాద్ద్విగుణాధికః ।
వేదవ్రతచ్యుతో వ్రాత్య స్సవ్రాత్యస్తోమమర్హతి ॥౨౦॥ ద్వే
జన్మనీద్విజాతీనాం మాతుస్స్యాత్ప్రథమంతయోః । ద్వితీ
యంఛందసాంమాతుర్గ్రహణాద్విధివద్గురోః ॥౨౧॥ ఏవం
ద్విజాతిమాపన్నో విముక్తోవాన్యదోషతః । శ్రుతిస్మృతిపు
రాణానాం భవేదధ్యయనక్షమః ॥౨౨॥ ఉపనీతో గురుకు
లేవసేన్నిత్యంసమాహితః । బిభృయాద్దండకౌపీనోపవీతా
జినమేఖలాః ॥౨౩॥ పుణ్యేఽహ్నిగుర్వనుజ్ఞాతః కృతమన్త్రా
హుతిక్రియః స్మృత్వోంకారఞ్చగాయత్రీ మారభేద్వేదమా
హితః ॥

(ఇతి వేదవ్యాసీయే ధర్మశాస్త్రే ప్రథమోధ్యాయః)

తా ॥ బ్రహ్మ క్షత్రియ వైశ్యులు ముగ్గురు ద్విజాదులు. వీరలు శ్రుతిస్మృతి పురాణధర్మయోగ్యులు ఇతరులుకారు ॥ ౫ ॥ శూద్రులు నాలవవర్ణము వారయినప్పటికి వర్ణములలో చేరుటవల్ల ధర్మమునకు దగినవారుగాని వేదమంత్రస్వధాస్వాహా

వషట్కారాదుల కర్హుఁడు గాఁడు ॥౬॥ బ్రాహ్మణునకు బ్రాహ్మణస్త్రీయందు క్షత్రియస్త్రీయందు వైశ్యస్త్రీయందు గలిగిన సంతానమునకు బ్రాహ్మణులవలెనే జాతకర్మలను చేయవలయును. శూద్రస్త్రీయందు గలిగినవానికి శూద్రునివలెనే జాతకర్మములను చేయవలయును ॥ ౭ ॥ బ్రహ్మ క్షత్రియులవల్ల వైశ్యస్త్రీయందుగలిగిన సంతానమునకు బ్రాహ్మణునివలెను శూద్రస్త్రీయందు గలిగినవానికి శూద్రునివలెను జాతకర్మలను చేయవలయును. తక్కువజాతివారివల్ల ఉత్తమజాతిస్త్రీయందు గలిగినవాఁడు శూద్రాధముఁడుగ చెప్పబడుచున్నాఁడు ॥ ౮ ॥ గర్భాదానము, పుంసవనము, సీమంతము, జాతకర్మము, నామకరణము, నిష్క్రమణము (పురిటింటినుంచిమార్చుట) అన్నప్రాశనము, చూడాకరణము (పుట్టువెండ్రుకలుదీయుట) కర్ణవేధ (చెవులుకుట్టుట), ఉపనయనము వేదారంభక్రియావిధి (గురుకులమునందుండి వేదవేదాంగములను, జదువుట) కేశాంతము (దీక్షావిసర్జన), స్నానము (స్నాతకవ్రతము), ఉద్వాహము (పాణిగ్రహము) వివాహాగ్ని పరిగ్రహము (ఔపోసనాగ్నినిగ్రహించుట), త్రేతాగ్నిసంగ్రహము (వైతానాగ్నిని గ్రహించుట), ఇవిషోడశకర్మలుగాచెప్పబడ్డవి. ఇందు గర్భాదానము మొదలుకొని కర్ణవేధవరకు స్త్రీలకుమంత్రవిహీనముగ క్రియలనుచేయవలయును, ఆస్త్రీకి వివాహముమాత్రము మంత్రవత్తుగాచేయవలయును. శూద్రునకు ఈపది అమంత్రములుగా జేయవలయును. మొదటగర్భాధానము, మూడవమాసమునందు పుంసవనము ఎనిమిదవమాసమందు సీమంతము, జననకాలమందు జాతక్రియ, పదునొకండవదినమందు నామకరణము, నాలవమాసమందు సూర్యదర్శనము (గృహనిష్క్రమణము) ఆరవమాసమందు అన్నప్రాశనము, కులోచితప్రకారము చూడాకర్మ, పిమ్మట బాలునకు కర్ణవేధవిధింపబడినది. బ్రాహ్మణుఁడుగర్భాష్టమమందు, క్షత్రియుఁడు గర్భైకాదశయందును, వైశ్యుడు గర్భద్వాదశమందును ఉపనయనార్హులు ఇట్లు ఈముప్పురకు ముఖ్యకాలము. ఈకాలములందుకాకపోయినేని పైచెప్పినకాలములకు ద్విగుణముగననగ బ్రాహ్మణునకు పదునారు, క్షత్రియునకు ఇరువదిరెండు, వైశ్యునకు ఇరువదినాలుగువరకు ఉపనయనమునకు గౌణకాలము. కాబట్టి ఈరెండు కాలములయందు ఉపనయనముకానివారలు వ్రాత్యులు అవ్రాత్యులు నరకపాత్రులగుదురు ॥ ౧౦ ॥ ద్విజులకు రెండుజన్మలు ఆరెండుజన్మలలో మొదటిది తల్లి రెండవది వేదమాత (అనగ గాయత్రి) ఆచార్యునివల్లగాయత్రిని, వేదములను విధివత్తుగ గ్రహించుటవల్ల ఆచార్యుడు తండ్రి ॥ ౧౧ ॥ ఈలాగునబ్రాహ్మణత్వమును బొందియు తరదోషములవల్ల విముక్తుడై శ్రుతిస్మృతి పురాణములను జదువుటకు యోగ్యుఁడగుచున్నాఁడు. ఉపనీతుఁడై స్తిమితమైన చిత్తముగలవాఁడై గురుకులమునం దెల్లప్పుడుండవలయును. దండమును, కౌపీనము, ఉపవీతమును కృష్ణాజినమును, మౌంజిని, ధరించవలయును ॥౧౩ ॥ శుభదినమందుగురునసుజ్ఞ గలవాఁడై చేయబడిన మంత్రావ్యాతి

క్రియగలవాడై చిత్తస్వాస్థ్యముగలవాడై ఓంకారమును గాయత్రినిస్మరించివేదమును ఆరంభించవలయును ॥ ౨౪ ॥

౨౮. బ్రాహ్మణఃక్షత్రియోవైశ్య శ్శూద్రశ్చేతి వర్ణాశ్చత్వారః। తేషామాద్యాద్విజాతయః। తేషాంనిషేకాద్యాశ్శ్మశానాం తోమన్త్రవత్ క్రియాసమూహః। తేషాఞ్చధర్మాఃబ్రాహ్మణస్యాధ్యయనం క్షత్రియస్య శస్త్రనిష్ఠతా। వైశ్యస్యపశు పాలనం శూద్రస్య ద్విజాతిశుశ్రూషా। ద్విజానాంయజనాధ్యయనే। అథైతేషాంవృత్తయః బ్రాహ్మణస్యబ్రాహ్మణప్రతిగ్రహః క్షత్రియస్యక్షితిత్రాణంకృషిగోరక్షవాణిజ్యకుసీదయోనిపోషణాని వైశ్యస్య, శూద్రస్యసర్వశిల్పాని। ఆపద్యనంతరావృత్తిః ॥

(ఇతి వైష్ణవే ధర్మశాస్త్రే ద్వితీయోధ్యాయః)

తా ॥ బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులను నాల్గు వర్ణములలో మొదటి మువ్వురు ద్విజాతులు వారలకు నిషేకము మొదలు శ్మశానాంతమువరకు మంత్రవత్తుగ జేయవలయును. వారలకు ధర్మములెవ్వియనగ బ్రాహ్మణున కధ్యయనము క్షత్రియునకు శస్త్రధారణము వైశ్యునకు పశుపాలనము శూద్రునకుద్విజాతిసేవయునై యున్నవి. ద్విజులకు యజనాధ్యయనములు సామాన్యధర్మములై యున్నవి. వారల వృత్తులెవ్వియనగ బ్రాహ్మణునకు ప్రతిగ్రహము క్షత్రియునకు భూపరిపాలనము వైశ్యునకు సేద్యము గోరక్షణము వర్తకము వడ్డి బంధుపోషణము. శూద్రునకు సమస్త శిల్పములుచేయడము వీరలందరికి ఆపత్కాలమందు వృత్త్యంతరముగలదు.

౨౧. గర్భస్యస్పష్టతాజ్ఞానే నిషేకకర్మస్పందనాత్పురా పుంసవనమ్ షష్ఠేఽష్టమేవా సీమంతోన్నయనమ్।జాతేచదారకేజాతకర్మ। ఆశౌచవ్యపగమనే నామధేయం ॥ మాంగళ్యం బ్రాహ్మణస్య। బలవత్ క్షత్రియస్య। ధనోపేతంవైశ్యస్య। జుగుప్సితంశూద్రస్య। చతుర్థేమాస్యాదిత్యదర్శనమ్। షష్ఠేఽన్నప్రాశనమ్। తృతీయేఽబ్దేచూడాకరణమ్। ఏతా ఏవక్రియాః స్త్రీణామమంత్రకాః।తాసాంసమన్త్రకోవివా

హః । గర్భాష్టమేఽబ్దే బ్రాహ్మణస్యోపనయనం । గర్భైకా దశేరాజ్ఞః । గర్భద్వాదశేవిశః । తేషాంముంజజ్యా బల్బ జమయ్యోమౌఞ్జ్యః । కార్పాసశణావికాన్యుపవీతానివాసాం సిచ।మార్గవైయాఘ్రబాస్తాని చర్మాణి।పాలాశఖాదిరౌదుంబ రాదండాః। కేశాంతలలాట నాసాదేశతుల్యా స్సర్వేషవా । భవదాద్యంభవన్మధ్యం భవదంతంచభైక్ష్యచరణమ్ ॥ ఆషో డశా ద్బ్రాహ్మణస్యసావిత్రీ నాతివర్తతే । ఆద్వావింశాత్క్షత్ర బంధోరా చతుర్వింశతేర్విశః ॥ ౧ ॥ అతఊర్ధ్వంత్రయోప్యే తే యథాకాలమసంస్కృతాః । సావిత్రీపతితావ్రాత్యాభ వంత్యార్య విగర్హితాః ॥ ౨ ॥ యద్యస్యవిహితంచర్మ య త్సూత్రంయాచమేఖలా । యోదండోయచ్చవసనం తత్తద స్యవ్రతేష్వపి ॥౩॥ మేఖలామజినందండముపవీతంకమండలు మ్ । అప్సుప్రాస్యవినష్టాని గృహ్ణీతాన్యానిమంత్రవత్ ॥౪॥

(ఇతి వైష్ణవే ధర్మశాస్త్రే సప్తవింశోఽధ్యాయః).

తా ॥ గర్భముస్పష్టముగ తెలిసినపిదప నిషేకమును, పిండము చలించకమును పుంసవనమును, ఆరవమాసమందుగాని లేక ఎనిమిదవమాసమందుగాని సీమన్తమును, పుట్టినవెనుకజాతకర్మను, జాతాశౌచానంతరము అనగా బ్రాహ్మణునకు శుభకరమైనట్టియు క్షత్రియునకు బలసూచకమైనట్టియు వైశ్యునకు ధనసాధనమైనట్టియు శూద్రునకు నిందితమైనట్టియు, నామములను పెట్టవలయును. నాలవమాసమందు సూర్యదర్శనమును, ఆరవమాసమందు అన్నప్రాశనమును,మూడవసంవత్సరమందు కేశఖండనము ఇవిజేయవలయును. స్త్రీలకుఅమన్త్రముగను వివాహమందు సమన్త్రకముగనుచేయవలయును. బ్రాహ్మణునకుగర్భోత్పత్తిమొదలుఎనిమిదవసంవత్సరమునందు, రాజునకు గర్భాది పదునొకండవ సంవత్సరమునందు, వైశ్యునకుగర్భాది ద్వాదశ సంవత్సరమునం దుపనయనము జేయవలయును. ఉపనీతద్విజులకు క్రమముగ ముంజనార, అల్లెత్రాడు లేకవింటిత్రాడు ఇవికటిసూత్రములుగను,ప్రత్తిజెల్లపట్టు మేకబొచ్చు వీటిచేచేయబడిన ఉపవీతములుగను, వస్త్రములుగను, ధరించవలయును. క్రమముగ కృష్ణాజినము దుప్పిచర్మము మేకచర్మము ఇవిచర్మలుగను; క్రమముగ మోదుగ చండ్ర అత్తి ఇవిదండములుగను, బ్రాహ్మణునకు కేశాంతమువరకు, క్ష

త్రియునకు లలాటమువరకు, వైశ్యునకు నాసాగ్రమువరకు, దండప్రమాణములు. బ్రాహ్మణుడు భవచ్ఛబ్దము మొదటను, క్షత్రియుడు మధ్యమునందును, వైశ్యుడు అన్తమునందునుండునటుల భిక్షాచరణము జేయవలయును. పదునారుసంవత్సరములవర్కు బ్రాహ్మణునకు, ఇరువై రెండువత్సరములవర్కు క్షత్రియునకు, ఇరువై నాల్గువత్సరములవర్కు వైశ్యునకు, ఉపనయనమునకు గౌణకాలము విధింపబడినది. ఈపైకాలములతిక్రమించిన ద్విజులు సావిత్రీపతితులుగ వ్రాత్యులుగనై పెద్దలచే నిందితులగుచున్నారు. ఉపనయనమందు ద్విజులకు చర్మము, యజ్ఞసూత్రము, కటిసూత్రము, దండము వస్త్రము ఎవ్వేవి విధింపబడెనో అవి యనుచితములు. శిథిలమైన అజిన మేఖల దండోపవీతముల నుదకమందుంచి నూతనచర్మాదులను సమన్త్రముగ గ్రహింపవలయును ॥ ౪ ॥

౨౨. యోగక్షేమార్థవృద్ధించ కుర్యాచ్ఛక్త్యాయథార్హతః । బ్రా
హ్మణాః క్షత్రియావైశ్యా శ్శూద్రావర్ణాయథాక్రమమ్ ॥
౧౪౫॥ ఆద్యాస్త్రయోద్విజాః ప్రోక్తాస్తేషాం వై మంత్రస
త్క్రియాః । సవర్ణేభ్యస్సవర్ణాసు జాయంతేహిసజాతయః ॥
౧౪౬॥ తేషాంసంకరయోగాచ్చ ప్రతిలోమానులోమజాః।
...ఏతేషాంబ్రాహ్మణాద్యాశ్చ షట్కర్మ సునియోజితాః ।
త్రికర్మసుక్షత్ర విశావేకస్మిన్ శూద్రయోనిజః ॥౧౫౩॥...
కృషిస్తుసర్వవర్ణానాం సామాన్యోధర్మఉచ్యతే । ప్రతిగ్రహ
స్తువిప్రాణాం రాజ్ఞాంత్ప్రోపాలనంతథా ॥౧౭౫॥ కుసీదంచైవ
వాణిజ్యం విశామేవప్రకీర్తితమ్ । సేవావృత్తిస్తుశూద్రాణాం
కృషిర్వాసంప్రకీర్తితా ॥౧౭౬॥

(వృద్ధహారీతసంహితాయాం చతుర్థోఽధ్యాయః)

తా ॥ బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులు వర్ణానుక్రమముగ శరీరధారణోచిత వృత్తినియథాశక్తిగ చేయవలసినది ॥ ౧౪౫ ॥ ఆనాలుగుజాతులలో బ్రహ్మ క్షత్రియ వైశ్యులు ముగ్గురు ద్విజులని చెప్పబడుచున్నారు. వారికేమంత్ర సత్క్రియలుగలవు. సమానవర్ణస్త్రీలయందు పుట్టినవారుసజాతులు. ఆసజాతులకు విషమజాతి స్త్రీపురుషుల సంయోగమువలన గలిగినవారు ప్రతిలోమానులోమజులుగనైరి. ఈసజాతిసంకరజాతులలోపల బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులు షట్కర్మలయందు నియమింపబడినవారలు. బ్రాహ్మణులు షట్కర్మాధికారులు క్షత్రియ వైశ్యులు యజనాధ్యయ

నదానములైన యీమూడుకర్మలయందు ముఖ్యాధికారులు. శూద్రుడు ఏకకర్మయగు దానమందధికారి తక్కిన వారలకు షట్కర్మాధికారములేదు. సర్వజాతులకు వ్యవసాయము సమాన్య ధర్మముగవచింపబడినది. బ్రాహ్మణునకు ప్రతిగ్రహమును, క్షత్రియునకుభూపాలనమును, వైశ్యునకువాణిజ్యముకుసీదమున్ను, శూద్రులకు సేవకావృత్తియు వ్యవసాయమున్ను, చెప్పబడినవి ॥ ౧౭౬ ॥ కృషి, భృతి (జీతముకునుండుట) పశుపాలనమందరికి నిషేధింపంబడవు (అనగ నందరుచేయవచ్చుననుట).

౨౩. యజనంయాజనందానం తథైవాధ్యాపనక్రియామ్ । ప్రతిగ్రహంచాధ్యయనం విప్రఃకర్మాణికారయేత్ ॥ ౨ ॥ దానమధ్యయనంచైవయజనంచయథావిధి । క్షత్రియస్యచ వైశ్యస్యకర్మేదంపరికీర్తితం ॥ ౩ ॥ క్షత్రియస్యవిశేషేణప్రజానాంపరిపాలనమ్ । కృషిగోరక్షవాణిజ్యం విశశ్చపరికీర్తితమ్ ॥ ౪ ॥ ...బ్రాహ్మణఃక్షత్రియోవైశ్య(స్త్ర)యో వర్ణాద్విజాతయః । తేషాంజన్మద్వితీయంతు విజ్ఞేయంమౌంజీబంధనాత్ ॥ ౬ ॥ ఆచార్యస్తుపితాప్రోక్త స్సావిత్రీజననీతథా। బ్రాహ్మణక్షత్రియ విశాంమౌంజీబంధనజన్మని ॥ ౭ ॥ విప్రాశ్చ్యాద్రసమాస్తావద్విజ్ఞేయా స్తువిచక్షణైః। యావద్వేదేన జాయంతేద్విజాజ్ఞేయా స్తతఃపరమ్ ॥ ౮ ॥

(ఇతి శ్రీశంఖస్మృతౌ ప్రథమోఽధ్యాయః)

తా॥ బ్రాహ్మణులు యజనయాజనములుచేయుటకును, దానమిచ్చుటకును, అటువలెనే అధ్యయనము చేయించుటకును, అధ్యయనము చేయుటకును, దానముతీసికొనుటకును, నియోగింపబడినారు. ॥ ౨ ॥ యథావిధిగా దానమిచ్చుట వేదపఠనము యాగముచేయుట నివి క్షత్రియ వైశ్యునకు స్వకర్మముగ జెప్పంబడినవి ॥ ౩ ॥ క్షత్రియునకు విశేషముగ ప్రజాపాలనము, వైశ్యునకు సేద్య గోరక్షణవర్తకములును వృత్తికర్మలుగ జెప్పంబడినవి ॥ ౪ ॥ బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు ఈమూడు వర్ణములవారు ద్విజాతులు (రెండోజన్మము గలిగినవారు) వారలకు రెండవజన్మము ఉపనయనమువలన నని తెలిసికొనదగినది ॥ ౬ ॥ ఆచార్యుడు బ్రాహ్మణక్షత్రియ వైశ్యులకు ఉపనయనమువలన గలిగిన జన్మమందు తండ్రిఅనిచెప్పబడెను. అటువలెనే సావిత్రీ తల్లిఅని చెప్పంబడినది ॥ ౭ ॥ మరియు బ్రాహ్మణులు దెలిసినవారివలన

ఉపనయనమగుపరకుశూద్రసములని దెలియదగినవారు. ఎంతకాలముకు వేదముచేత బుట్టుచున్నారో ఆకాలమునకు పిమ్మట ద్విజులని తెలియదగినవారు ॥౮॥

ఉపనయనవిషయః,

౨౪. రాజ్యస్థఃక్షత్రియశ్చాపి ప్రజాధర్మేణపాలయన్। కుర్యాదధ్యయనంసమ్యక్ యజేద్యజ్ఞాన్యథావిధి ॥33॥ ...గోరక్షాం కృషివాణిజ్యం కుర్యాద్వైశ్యో యథావిధి । దానందేయం యథాశక్త్యా బ్రాహ్మణానాంచభోజనమ్॥32॥ దంభమోహవినిర్ముక్తః సత్యవాగనసూయకః । స్వదారనిరతో దాంతః పరదారవివర్జితః ॥3౯॥ ...యజ్ఞాధ్యయన దానాని కుర్యాన్నిత్యమతంద్రితః । పితృకార్యపరశ్చైవ నారసింహార్చనాపరః ॥౪౦॥ ఏతద్వైశ్యస్యధర్మోయం స్వధర్మ మనుతిష్ఠతి । ఏతదాచారతేయోహి సస్వర్గే నాత్రసంశయః ॥౪౧॥

(హారీతస్మృతౌ ద్వితీయోఽధ్యాయః)

తా ॥ క్షత్రియుడు రాజ్యమందుండినవాడై లేస్సగనధ్యయనమును విధ్యుక్తముగ యజ్ఞములను జేయుచు బ్రజలను ధర్మముగ బరిపాలింపవలయును ॥ 33 ॥ వైశ్యుడు శాస్త్రోక్తముగగోరక్షణమును కృషివాణిజ్యములను జేయుచు, బ్రాహ్మణులకు శక్తికొలది దానములను భోజనములనియ్యవలయును ॥ 32 ॥ దంభమోహములనువదలి, సత్యముజెప్పువాడై యసూయారహితుడై స్వదారనిరతుడై శిక్షితుడై పరదారవిముఖుడై ప్రమాదరహితుడై పితృకార్యనిరతుడై నృసింహస్వామిని పూజించువాడై యజనాధ్యయనదానములను జేయవలయును ॥ ౪౦ ॥ ఇదివైశ్యధర్మముఈ ధర్మమును ఎవడుజేయునో వాడు స్వర్గమును బొందును సందేహములేదు.

౨౫. గర్భస్యస్ఫుటతాజ్ఞానే నిషేకఃపరికీర్తితః । పురాతుస్పందనాత్కార్యం సవనంతు విచక్షణైః ॥ ౧ ॥ షష్ఠేష్టమేవాసీమంతోజాతేవై జాతకర్మచ । ఆశౌచేతువ్యతిక్రాంతే నామకర్మవిధీయతే ॥ ౨ ॥ నామధేయంచకర్తవ్యం వర్ణానాంచసమాక్షరమ్ । మాంగల్యంబ్రాహ్మణస్యోక్తం క్షత్రియస్యబలాన్వితమ్। వైశ్యస్యధనసంయుక్తం శూద్రస్యతు

జుగుప్సితమ్ ॥ ౩ ॥ శర్మాంతం బ్రాహ్మణస్యోక్తం వర్మాంతం క్షత్రియస్యచ । ధనాంతంచైవ వైశ్యస్యదాసాన్తం చాన్త్యజన్మనః ॥ ౪ ॥ చతుర్థేమాసికర్తవ్యం బాలస్యాదిత్యదర్శనమ్ । షష్ఠేన్నప్రాశనంమాసి చూడాకార్యాయథాకులమ్ ॥ ౫ ॥ గర్భాష్టమేబ్దేకర్తవ్యం బ్రాహ్మణస్యోపనాయనమ్ । గర్భాదేకాదశేరాజ్ఞోగర్భాత్తుద్వాదశేవిశః ॥ ౬ ॥ షోడశాబ్దానివిప్రస్యరాజన్యస్య ద్వావింశతిః । వింశతిస్సచతుష్కాతు వైశ్యస్యపరికీర్తితా । నాభిభాషేతసావిత్రీమత ఊర్ధ్వంనివర్తయేత్ ॥ ౭ ॥ విజ్ఞాతన్యాస్త్రయోప్యేతేయథాకాలమసంస్కృతాః । సావిత్రీపతితావ్రాత్యాస్సర్వధర్మబహిష్కృతాః ॥ ౮ ॥ మౌంజీబంధోద్విజానాంతు క్రమాన్మౌంజ్యఃప్రకీర్తితాః । మార్గవైయాఘ్రబాస్తానిచర్మాణిబ్రహ్మచారిణామ్ ॥ ౯ ॥ పర్ణపిప్పలబిల్వానాం క్రమాద్దండాఃప్రకీర్తితాః । కేశైర్లలాటకర్ణైస్తుతుల్యాః ప్రోక్తాఃక్రమేణతు ॥ ౧౦ ॥ అవక్రాస్సత్వచస్సర్వేనాగ్నిదగ్ధాస్తథైవచ । వస్త్రోపవీతేకార్పాసక్షౌమోర్ణానాంయథాక్రమమ్ ॥ ౧౧ ॥ ఆదిమధ్యావసానేషుభవచ్ఛబ్దోపలక్షితమ్ । భైక్షస్యాచరణంప్రోక్తంవర్ణానామనుపూర్వశః ॥౧౨॥

(ఇతి శ్రీశంఖస్మృతౌ ద్వితీయోధ్యాయః)

తా ॥ ౧-మొదలు ౭-వరకు అర్థము స్మృత్యుక్త ధర్మ వివేచనము యొక్క ౨౧-లో చూడునది ॥ ౭ ॥ నిర్ణయించ బడిన కాలమం దుపనయనము కాని యీ త్రివర్ణములవారును గాయత్రీదానమునకు అయోగ్యులుగాను, సంస్కారహీనులుగను, సర్వధర్మ బహిష్కృతులుగను తెలియబడదగినవారు ॥౮॥ మూడువర్ణముల బ్రహ్మచారులకు వరుసగ కటిసూత్రములు, ముంజగడ్డి, వింటినారి, జనుపనార, నీటితోచేయబడినవిగా చెప్పబడియున్నవి. నల్లజింకసంబంధియు, వ్యాఘ్రసంబంధియు, మేకసంబంధియునైన, చర్మములు (ఉత్తరీయములు). క్రమముగ మోదుగరావి మారేడులయొక్క దండములు (ధరించదగినవిగా) చెప్పంబడి యున్నవి. వరుసగ

(దండములు) జుట్టు, నొసలు, చెవులతో సమానమగునిడివిగా చెప్పబడియున్నవి॥ ౧౦ ॥ అన్ని దండములు వంపులేనివిగ బెరడుతో చేరినవి గాను ఇంక నిప్పుచే కాలనవిగ నుండవలయును. వస్త్రము, యజ్ఞోపవీతము వరుసగ ప్రత్తిపట్టు, మృదువైనబొచ్చుతోచేయబడినవిగ నుండవలయును ॥ ౧౧ ॥ భిక్షాన్నమునదీసుకొను మంత్రము బ్రాహ్మణాదివర్ణములకు వరుసగ నాదియందు, మధ్యమందు, అంతమందు భవతియనుశబ్దముతోగూడినదిగ చెప్పబడియున్నది ॥౧౨॥

## ఉపనయనకాలాతిక్రమప్రాయశ్చిత్తవిషయః.

౨౬. దేవలః॥ *గర్భాష్టమేష్టమేబ్దేవా బ్రాహ్మణస్యోపనాయనమ్ । గర్భద్వాదశ కేరాజ్ఞో విశష్షోడశ వత్సరే ॥ తదాహగృహ్యకారః ॥ గర్భాష్టమేషుబ్రాహ్మణమ్ । గర్భైకాదశేషు రాజన్యం।గర్భద్వాదశేషువైశ్యమితి॥ ద్వాదశవర్షపర్యన్తమ్ కామ్యోపనయన కాలమాహ॥—సఏవ॥ సప్తమేబ్రహ్మవర్చసకామం అష్టమేఆయుష్కామంనవమే తేజస్కామం। దశమే ఉన్నాద్యకామంఏకాదశే ఇన్ద్రియకామం ద్వాదశేపశుకామమితి । గర్భాష్టమేషుబ్రాహ్మణమితి బహువచనం । పంచమవర్షాదారభ్య గర్భాష్టమపర్యన్తం ముఖ్యకాలః ॥ గర్భాష్టమజన్మాష్టమయోరేవమేధావీ ఆయుష్మాన్భవతివటుః ॥ గర్భాష్టమేబ్రాహ్మణమితివచనమ్। ముఖ్యకాలగౌరవాత్ ॥* —తదేవాహ గౌతమః ॥ గర్భాష్టమేకుమారాణాం వ్రతబంధోవిధీయతే । మేధావీదీర్ఘకాలాయుర్వటుర్భవతి నిశ్చయ ఇతి ॥యదిదైవాద్గర్భాష్టమాభావే జన్మాష్టమాబ్దేవాకుర్యాత్ ॥—తదేవాహమనుః॥ శిశోర్గర్భాష్టమాభావే కుర్యాజ్జన్మాష్టమేపివా దీర్ఘాయుర్బ్రహ్మవిద్వాన్ సకృతకృత్యోభవేత్తత ఇతి ॥ తతఃగర్భాష్టమ జన్మాష్టమయోరేవవిహితః । నవమే దశమేవామధ్యమః ॥ ఏకాదశద్వాదశయోః కనియ్యాన్ ॥ —తదేవాహగౌతమః॥ నవమేదశమేబ్దేచ వ్రతబన్ధస్యమధ్యమః । ఏకాదశేద్వాదశేబ్దే కనియాన్ వ్రతబన్ధనే॥ కాలఇతి

శేషః। ముఖ్యకాలేవ్రతీభూయాన్తస్యమేమధ్యమోభవేత్। నీచాబ్దేనీచతాంయాతి అష్టమాబ్దం నలంఘయేత్ ॥ అష్టమాబ్దస్యబలవత్త్వమాహ॥—పరాశరః॥ బాలస్తుబలహీనోపి గర్భిణ్యామపిమాతరి। యోయదీచ్ఛేద్ద్విజన్మత్వ మష్టమాబ్దం నలంఘయేత్ ॥ అషోడశాబ్దపర్యన్తం కాలమాహుర్మనీషిణఇతి। కాలనిరీక్షణాపేక్షయా కలౌయుగే దోషబాహుళ్యాద్దేశవిడ్వరాచ్చ పంచమవర్షాదారభ్య అష్టమాబ్దపర్యన్తం సమీచీనం। ఉతనవమదశమవర్షావా। ఏతేషాం ముఖ్యకాలాతిక్రమె దోషమాహ॥—కాత్యాయనః॥ జన్మగర్భాష్టమేరాజన్ వ్యతిక్రమ్యవిదన్నపి। గౌణకాలేపిపుత్రాణాం వ్రతబన్ధంయదాచరేత్ ॥ తదాపితౌమహాపాప మవాప్యరఘునన్దన। సపుత్రస్తత్పాపకర్మాస్యా దుభౌతౌ పాపసంభవౌ ॥ యదికామాదష్టమాబ్దం లంఘయిత్వాచరేద్వ్రతమ్। ప్రాజాపత్యమిత్యర్థః ॥ నవమేతత్పకృచ్ఛ్రంస్యా ద్దశమేచోభయం స్మృతం।ఏకాదశద్వాదశౌవాహ్యాతి క్రమ్యైన్దవంచరేత్ ॥ త్రయోదశాబ్దాదారభ్య షోడశాబ్దవ్యతిక్రమే। నసంభాష్యోనపాఙ్క్తేయ స్సర్వధర్మబహిష్కృతః। తతఃపరం యదీచ్ఛేత్తు ద్విజన్మంతంపితాత్మజే। కృత్వాస్వయంపునస్తత్కర్మచరేచ్చాన్ద్రాయణత్రయమ్ ॥ పుత్రస్య దేహశుద్ధ్యర్థంకుర్యాద్గోముఖసమ్భవం। గోముఖజననమిత్యర్థః॥ ప్రాజాపత్యత్రయంకృత్వా మౌంజీబన్ధన మాచరేత్ । అన్యథాపతితం విద్యాన్నకర్మార్హోభవేదిహ ॥ క్షత్రియస్యద్వావింశతి వత్సరాతిక్రమే వైశ్యస్యచతుర్వింశతి వత్సరాతిక్రమే చైవ మేవప్రాయశ్చిత్తం ద్విగుణంకృత్వోపనయనమాచరేత్ । అన్యథాత్రయోవర్ణాః దోషమాప్నుయుః ॥

(హేమాద్రిప్రాయశ్చిత్తకాణ్డే పుట ౧౯౩)

తా॥* దీనికిసూత్రాధ్యాయం ౧-నం చూడుము. ద్విజపుత్రులకుఉపనయనముగర్భాష్ట
మమందు విధింపబడిననది. ఏలననగబ్రహ్మచారిబుద్ధిమంతుడును, దీర్ఘాయుష్మంతుడగు
ను.ఇదినిశ్చయము. ఒకవేళదైవయోగమునగర్భాష్టమమునందుపనయనముదప్పెనేనిజ
న్మాష్టమమందైననుజేసినయెడబ్రహ్మవిద్యయు, దీర్ఘాయువుగలవాడైకృతకృత్యుడగును.
గావున గర్భజన్మాష్టమములే ఉపనయనమునకు విహితములైనకాలములనియు ౯,౧౦
సంవత్సరములయందు చేయుటమధ్యమపక్షమనియు ౧౧, ౧౨ సంవత్సరములయంద
ధమపక్షమనియు ఉపనయనమునకుగౌణకాలములేర్పడినవి. మధ్యకాలంబునజేసిన
ఫలముమధ్యమమగును, గనుకనైనిమిదవయేటను తప్పక చేయందగును. అట్లాయెనిమి
దవయేటనుజేసినబలవంతుడగుననిపరాశరులు జెప్పుచున్నారు. పిల్లవాడుబలహీనుడైన
ను, తల్లి గర్భవతియైయున్నను దప్పతదితర కారణముచేతను ద్విజన్మాపేక్షకుడు ఎ
నిమిదవయేటను చేయుటతప్పకూడదు. ఐననువిద్వాంసులు పదునారవసంవత్సరము
వరకు ఉపనయనకాలమని చెప్పుచున్నారు. ఎందువలననగ ఉపనయనమునకు సరి
యగుకాలనిరీక్షాపేక్షచేతనున్ను, కలియుగ బాహుళ్య దోషముచేతనున్ను, దేశోప
ద్రవమువల్లనున్ను, ఐదు మొదలు యెనిమిదవ సంవత్సరపర్యంతము మంచివి. మరి
యుతొమ్మిది-పదిసంవత్సరములును దగినవియే. ఈముఖ్యకాలము లతిక్రమించినదో
షముసంభవిల్లునని కాత్యాయనుడు చెప్పుచున్నాడు. మరియుజన్మాష్టమగర్భాష్టమముల
నుగుర్తెరిగి కుమాళ్లకు ఉపనయనముచేయని యెడలనున్ను, గౌణకాలమందు చేసిన
యెడలనున్ను, ఈచిన్నవానితండ్రి మహాపాపియగుటయేగాక నతని పుత్రునిం పాపి
ష్ఠునింజేసి యిద్దరునుపాపిష్ఠులగుదురు. ఒకవేళనిచ్ఛతోగాని, అజ్ఞానముచేగాని యె
నిమిదిసంవత్సరములుఅతిక్రమించినయెడల ప్రాజాపత్యకృచ్ఛ్రమనుప్రాయశ్చిత్తమును
తొమ్మిది సంవత్సరము లతిక్రమించిన తప్తకృచ్ఛ్రమను ప్రాయశ్చిత్తమును పది
సంవత్సరము లతిక్రమించినప్రాజాపత్యతప్తకృచ్ఛ్రములను రెండుప్రాయశ్చిత్తములను
జేయవలయును. పదునొకండు, పండ్రెండువత్సరములుగడచినఐందవమనుప్రాయశ్చిత్త
ముజేయవలయును. ఆపైన పదమూడు మొదలు పదునారువరకును అతిక్రమించిన
యెడల నట్టివాడు సంభాషణకును, సర్వకర్మలకును బహిష్కృతుడై పఙ్క్తిపావ
నుడుగాకయుండును. అట్టి కాలమందునతండ్రి కుమారునకు ద్విజత్వ మపేక్షించిన
యెడల పునఃకర్మజేసికొని మూడు చాంద్రాయణవ్రతములుజేసి కుమారునిదేహము శు
ద్ధమగుటకై వానిని గోముఖమందు పుట్టినట్టుగాజేసి ప్రాజాపత్యములను ప్రాయశ్చి
త్తములను మూడు చేసి యుపనయనము చేయవలయును. ఇట్లుంగాకపోయినయెడల
నాచిన్నవానిని పతితునిగ దెలసుకొనవలయును. వాడులోకమందు కర్మార్హుడుగాడు.
ఇట్లుగానే క్షత్రియవైశ్యులకు విధ్యుక్తమైనకాలములం దుపనయనము దప్పినయెడల
పైనుదహరించినట్లు బ్రాహ్మణునకంటె రెట్టింపుప్రాయశ్చిత్తములచే నుపనయనము జే

సుకొనికృతార్థులు గావలయును. అట్లు జేసుకొననియెడల బ్రహ్మక్షత్రియ వైశ్యులు పతితులై యధికదోషమును బొందుదురని యుపనయనకాలాతిక్రమప్రాయశ్చిత్తమందు చెప్పంబడినది.

బ్ర హ్మ చ ర్యా శ్ర మ వి ష య ః.

౨౭. ఔపాసనాదికామంత్రావిప్రాదీనా ముదాహృతాః । బ్రాహ్మణోవిప్రగేహేషు నృపస్తేషూత్తమేషుచ ॥ ౧౫౨ ॥ వైశ్యోవిప్రనృపస్వేషు కుర్యాద్భిక్షాం స్వవృత్తయె । ఏకాన్నంచద్విజోశ్నీయా ద్బ్రహ్మచారివ్రతేస్థితః ॥ ౧౫౩ ॥ భిక్షావ్రతంద్విజాతీనా ముపవాససమంస్మృతమ్ । ప్రతిగ్రహాన్నభిక్షాస్యా న్నతస్యాః పరపాకతా ॥౧౫౪॥ సోమపానసమాభిక్షా ఽతోశ్నీతసభిక్షయా । భిక్షయాయస్తుభుంజీత నిరాహారస్సఉచ్యతే ॥ ౧౫౫ ॥ భిక్షమన్నాభిశస్తేషు సాచారేషు ద్విజేషుచ । భిక్షేతభిక్షాంక్రమశో గురోఃకులంవివర్జయేత్॥ ౧౫౬॥ స్వసారంమాతరంచాపి మాతృస్వసారమేవచ । భిక్షేతప్రథమాంభిక్షాం యాచేతనవిమానయేత్ ॥ ౧౫౭ ॥ భవతి! భిక్షామేదేహి, భిక్షామ్భవతి దేహిమె, భిక్షాంమేదేహిభవతి, క్రమేణైత దుదాహరేత్ ॥ ౧౫౮ ॥ ...అష్టైకద్వాదశాబ్దాని సగర్భాణి ద్విజన్మనామ్। ముఖ్యకాలోవ్రతస్యైషహ్యన్య ప్రోక్తోవిపర్యయె ॥ ౧౬౨ ॥ ద్విగుణాబ్దేషుకర్తవ్యాక్రమాదుపనతిర్ద్విజే । హీనగాయత్రీచవ్రాత్యా ఉక్తకాలాదనంతరం॥౧౬౩॥నాధ్యేయోనైవచోద్వాహ్యో వ్యవహారవివర్జితః । నయాజకాశ్చ కార్యేషు ప్రయోజ్యాస్తుఇతిశ్రుతిః ॥ ౧౬౪ ॥ ...షోడశాబ్దానివిప్రస్య ద్వావింశతిర్నృపస్యచ।చతుర్వింశతిర్వైశ్యస్య వ్రాత్యాస్తేస్యు రతఃపరమ్ ॥ ౧౭౦ ॥ ...

(ఇతి బృహత్పారాశరీయే చతుర్థోఽధ్యాయః)

తా ॥ బ్రాహ్మణులకు ఔపాసనాదిమంత్రములు చెప్పబడినవి. బ్రాహ్మణుడు విప్రగృహములయందు రాజుతమగృహములయందు లేక ఉత్తమమైన బ్రాహ్మణులగృహమందు ॥ ౧౫౨ ॥ వైశ్యుడు తనగృహమందు, ఉత్తమమగు బ్రహ్మక్షత్రియగృహములయందు స్వశరీరపోషణకొరకు భిక్షాచరణము చేయవలయును. బ్రహ్మచారి వ్రతంబునయున్న ద్విజుడు ఏకాన్నము (ఒక విధమగు అన్నము)నే భుజించ వలయును ॥ ౧౫౩ ॥ ద్విజాతులకు భిక్షావ్రతము ఉపవాసముతో సమముగ చెప్పంబడినది. భిక్షాచరణము ప్రతిగ్రహము (అనగ దానముపట్టుట) గాదు. ఆభిక్షాచరణమునకుపరపాకతాదోషము లేదు ॥ ౧౫౪ ॥ భిక్షాచరణము సోమపానముతో సమమైనదిగాన బ్రహ్మచారి భిక్షాచరణచేతనే భక్షించవలయును. ఏబ్రహ్మచారి భిక్షాచరణచేత భుజించునో యతడు నిరాహారుడని చెప్పబడుచున్నాడు ॥ ౧౫౫ ॥ ఆచారముతోగూడిన ద్విజులయందే యన్నకాముడై భిక్షాచరణము చేయవలసినది. క్రమముగభిక్షాచరణముచేయుచు గురుకులవాసమును వదలిపెట్ట వలయును ॥ ౧౫౬ ॥ బ్రహ్మచారి మొదట భిక్షాచరణమును తనతోడబుట్టువువలన, తనతల్లివలన, తల్లితోడబుట్టువువలన చేయవలయును. వారలను అగౌరవించగూడదు. బ్రాహ్మణుడు భవతిభిక్షాంమేదేహీయనియు, క్షత్రియుడు భిక్షాంభవతి దేహిమేయనియు, వైశ్యుడుభిక్షాంమేదేహిభవతి యనియు, భిక్షాచరణము చేయవలయునని యుదహరింప బడినది ॥ ౧౫౭॥ మిగిలినవాటికర్థము ఇందు ౧౬ నం-లో చూడందగును.

బ్రహ్మచర్యాశ్రమప్రశంసా.

౨౭. ఉపనీయగురుశ్శిష్యం శిక్షయేచ్ఛౌచమాదితః । ఆచారమగ్నికార్యంచసంధ్యోపాసనమేవచ ॥ ౧ ॥ సగురుర్యః క్రియాః కృత్వావేదమస్మైప్రయచ్ఛతి । భృతకాధ్యాపకోయస్తు ఉపాధ్యాయస్సఉచ్యతే ॥ ౨ ॥ మాతాపితాగురుశ్చైవపూజనీయాస్సదానృణామ్ । క్రియాస్తస్యాఽఫలాస్సర్వాయస్యైతేనాదృతాస్త్రయః ॥ ౩ ॥ ప్రయతఃకల్యఉత్థాయస్నాతోహుతహుతాశనః । కుర్వీతప్రణతోభూత్వా గురూణామభివాదనమ్ ॥ ౪ ॥ బ్రహ్మావసానేప్రారంభే ప్రణవంచప్రకీర్తయేత్ । అనధ్యాయేష్వధ్యయనంవర్జయేచ్చ ప్రయత్నతః ॥ ౬ ॥ మేఖలామజినందండం ధారయేచ్చవిశేషతః అథశ్శాయీభవేన్నిత్యం బ్రహ్మచారీసమాహితః ॥ ౧౪ ॥

ఏవంవ్రతంతుకుర్వీత వేదస్వీకరణంబుధః । గురవేచధనందత్వాస్నాయాచ్ఛతదనుజ్ఞయా॥౧౫॥

(శ్రీశంఖస్మృతౌ తృతీయోఽధ్యాయః)

తా ॥ గురువుశిష్యుని యుపనయనముచేసి మొదట హస్తపాదాదిశుద్ధిని, ఆచారమును, అగ్నికార్యమును, సంధ్యావందనమును, నేర్పించవలయును ॥౧॥ ఎవడు (ఉపనయనాది) క్రియలనుచేసి వీనికొరకు వేదమును ఇచ్చుచున్నాడో వాడు గురువు. ఎవడుజీతముపుచ్చుకొని యధ్యయనము చేయించుచున్నాడో వాడుఉపాధ్యాయుడుగ చెప్పబడుచున్నాడు ॥౨॥ మనుష్యులకు తల్లి దండ్రి గురువు ఎల్లప్పుడుపూజింపదగినవారు. ఎవనికి ఈముగ్గురు ఆదరింపబడక యుంటున్నారో వానికి యన్నిక్రియలు నిష్ఫలములు ॥౩॥ ప్రాతఃకాలమందులేచి పవిత్రుడై స్నానముచేసి నవాడై హోమముచేయబడిన యగ్నికలవాడై నమ్రుడుగనుండుకొని గురువులకునమస్కారమును చేయవలయును ॥౪॥ మరియు వేదముముగించుటయందు, ఆరంభించుటయందు ప్రణవమునుచ్చరింపవలయును. మరియునధ్యయనము చేయరాని దినములలో యత్నముతోను, అధ్యయనమును విడిపించవలయును ॥౬॥ బ్రహ్మచారి జాగరూకుడై ముఖ్యముగ మొలత్రాడును, చర్మోత్తరీయమును దండమును ధరించవలయును. ప్రతిదినము నేలమీద పండుకొనవలయును ॥ ౧౪ ॥ తెలివికలవాడగుబ్రహ్మచారి వేద స్వీకారముపొందగానే గురువుకొరకు దక్షిణనిచ్చి వారిసెలవుచేత స్నాతకము చేసికొనవలయును.

౨౯. ఉపనీతోమాణవకోవసేద్గురుకులేషుచ । గురోఃకులేప్రియంకుర్యాత్కర్మణామనసాగిరా ॥ ౪౯ ॥...తస్మాద్వేదవ్రతానీహచరేత్స్వాధ్యాయసిద్ధయే । శౌచాచారమశేషంతు శిక్షయేద్గురుసన్నిధౌ ॥ ౫౨ ॥ అధీత్యచతురోవేదాన్వేదౌవావేదమేవవా । గురవేదక్షిణాందద్యాత్సంయమీగ్రామమావసేత్ ॥ ౬౧ ॥ విరక్తఃప్రవజేచ్ఛ్రీమాన్సంరక్తస్తుగృహేవసేత్ । సరాగోనరకంయాతి ప్రవ్రజన్హి ద్విజాధమః ॥ ౬౨ ॥ నవివాహోనసన్యాసఃనైష్ఠికస్యవిధీయతే । ఇమంయోవిధిమాస్థాయత్యజేద్దేహమతంద్రితః । నేహభూయోపిజాయేతబ్రహ్మచారీ దృఢవ్రతః ॥ ౬౪ ॥

(ఇతిహారీతస్మృతౌ తృతీయోఽధ్యాయః)

తా॥ ఉపనయనము చేయబడిన బ్రహ్మచారిగురువుయొక్క గృహమునందు నివసించ వలయును. కర్మ చేతను, మనస్సుచేతను, వాక్కు చేతను, గురువు యొక్క వంశమందు ప్రియమునుచేయవలయును ॥ ౪౯ ॥...గనుక వేదవ్రతములను అధ్యయనసిద్ధికొరకు ఇచ్చటచేయవలయును. గురుసన్నిధియందు యావత్తు శౌచాచారమును నేర్చుకొనవలయును ॥ ౫౦ ॥ నాలుగువేదములనుగాని, వేదద్వయమునుగాని, ఒకవేదమునుగానిచదివి గురువుకొరకు దక్షిణన్ను ఇయ్యవలయును. మంచినియమములుగలవాడై గ్రామములోవసించవలయును ॥౬॥ వేదసంపత్తిగలవాడు విరక్తుడై తేసన్యసించవలయును. ఇచ్ఛగలవాడైతే గృహమునందు నివసించవలయును. ఇచ్ఛగలవాడుసన్యసించిన, వాడుద్విజులులో నీచుడుగనుండి తుదనునరకమునుపొందుచున్నాడు॥ ౬౨॥ నైష్ఠికబ్రహ్మచారికివివాహములేదు. సన్యాసమువిధించబడలేదు. ఎవడు ఈవిధినిపాలుమాలికలేనివాడైయాశ్రయించిదేహమును విడిపించుచున్నాడో (అటువంటి) దృఢవ్రతుడైన బ్రహ్మచారి యీలోకమందు తిరిగిపుట్టడు ॥ ౬౪ ॥

విశాహవిషయః.

30. పాణిగ్రాహ్యాస్సవర్ణాసు గృహ్ణీయాత్క్షత్రియాశరమ్ । వైశ్యాప్రతోదమాదద్యాద్వేద నేత్వగ్రజన్మనః ॥ ౬౩॥ దత్తామపిహరేత్పూర్వాచ్ఛ్రేయాంశ్చేద్వర ఆవ్రజేత్ ॥౬౫॥ సోమశ్శౌచందదౌస్త్రీణాం గంధర్వశ్శుభాంగిరమ్। పావకస్సర్వమేధ్యత్వంమేధ్యావై యోషితోహ్యతః ॥ ౭౧ ॥

(యాజ్ఞవల్క్యస్మృత్యా ఆచారకాండే ప్రథమోఽధ్యాయః)

తా॥ సవర్ణముగలస్త్రీలయందు బ్రాహ్మణునియొక్క వివాహమందు చెయ్యిపట్టుకొనవలయును, రాచకన్యబాణమును పట్టుకొనవలయును, వైశ్యకన్య ఛూలుకొనిగ్రహించవలయును. ముందువచ్చినవానికంటె శ్రేష్ఠుడైనవరుడు వచ్చినట్టయితే దానమివ్వబడినదైనప్పటికి తిరిగి తీసుకొనవచ్చును ॥ ౬౫ ॥ స్త్రీలకు చంద్రుడుశుచిని గంధర్వుడుమంగళకరమైన వాక్కును, అగ్నిహోత్రుడుసమస్తపవిత్రమును ఇచ్చెను ఈకారణమువలన స్త్రీలుపవిత్రులనుటప్రసిద్ధి ॥ ౭౧ ॥

31. అథబ్రాహ్మణస్య వర్ణానుక్రమేణచతస్రోభార్యాభవన్తి । తిస్రఃక్షత్రియస్య । ద్వేవైశ్యస్య । ఏకాశూద్రస్య। తాసాంసవర్ణావేదనేపాణిగ్రాహ్యాః। అసవర్ణావేదనేశరః క్షత్రియ

కన్యయా । ప్రతోదో వైశ్యకన్యయా । వసనదశాన్తః శూద్రకన్యయా ॥

(ఇతి వైష్ణవే ధర్మశాస్త్రే చతుర్వింశో౽ధ్యాయః)

తా॥ వేదవ్రతములను సమాప్తిబొందించిన పిదప బ్రాహ్మణుడు నాల్గుజాతుల స్త్రీలను, క్షత్రియుడు మూడుజాతుల స్త్రీలను, వైశ్యుడు రెండుజాతుల స్త్రీలను, క్రమముగ (అనగా మొదట సవర్ణస్త్రీని పాణిగ్రహణముచేసి పిదప ఇతరవర్ణస్త్రీలను) గ్రహించవలయుననుట - శూద్రుడు ఒకటియైన స్వజాతిస్త్రీనే గ్రహింపవలయును. అసవర్ణావేదనమనగ విజాతిస్త్రీలను గ్రహించడము - బ్రాహ్మణుడు క్షత్రియకన్యకను బాణముచేతను, వైశ్యకన్యకను ప్రతోదముచేతను, శూద్రస్త్రీని వస్త్రుబద్దకొన చేతను గ్రహింపవలయును - ఈలాగుననే క్షత్రియవైశ్యులు, విజాతిస్త్రీలను గ్రహింపవలయును.

3౨. సవర్ణాసు బహుభార్యాసు విద్యమానాసు జ్యేష్ఠయా సహ ధర్మకార్యం కుర్యాత్ । మిశ్రాసు చ కనిష్ఠయాపి సమానవర్ణయా। సమానవర్ణాభావే త్వనంతరయైవాపది చ। న త్వేవ ద్విజః శూద్రయా । ద్విజస్య భార్యా శూద్రా తు ధర్మార్థే న భవేత్క్వచిత్ । రత్యర్థమేవ సా తస్య రాగాంధస్య ప్రకీర్తితా॥

(ఇతి వైష్ణవే ధర్మశాస్త్రే షడ్వింశో౽ధ్యాయః)

తా॥ ఏకవర్ణమును చెంది యుండెడు బహుభార్యలున్నప్పుడు జ్యేష్టభార్యతోడనే ధర్మమాచరించవలయును. భార్యలు వివిధవర్ణములను చేరియున్నప్పుడు కనిష్టురాలయినప్పటికిని సవర్ణియైన భార్యతో ధర్మమాచరించవలయును. సమానవర్ణమయిన భార్య లేనప్పుడును ఆపత్తుయందును అనంతరమగు భార్యతో ధర్మాచరణము చేయవలయును. అయితే ద్విజుడు శూద్రస్త్రీతోడ ధర్మమాచరించకూడదు. శూద్రభార్య ద్విజునకు ధర్మాచరణనిమిత్తము తగదు. అట్టి భార్య రాగాంధుడైనట్టి బ్రాహ్మణాదులకు క్రీడార్థమే యని చెప్పబడినది.

33. మాతులస్య సుతాం మూఢ్వా మాతృగోత్రాం తథైవ చ। సమానప్రవరాం చైవ త్యక్త్వా చాంద్రాయణం చరేత్ ॥ ౪ ॥ అసపిండా చ యా మాతురసగోత్రా చ యా పితుః । సా ద్విజానాం ప్రశస్తా స్త్రీ దారకర్మణి మైథునే ॥ ౫ ॥ శైలాఖ్యాం మేఘవ

ణాఞ్ఛాం మధుపింగళలోచనాం। తాదృశీం వరయేత్కన్యాం గృహార్థం సుఖమేధతే ॥ ౬ ॥ వరో వరయితవ్యో హ్యర్థః కులశీలగుణాన్వితః । రూపవాన్పండితః ప్రాజ్ఞో యువా దోషవివర్జితః ॥ ౭ ॥ హీనస్య కులశీలాభ్యాం హరన్కన్యాం న దోషభాక్। న మంత్రాః కారణం తత్ర న చ కన్యానృతం భవేత్ ॥ ౮ ॥ సమాచ్ఛిద్య బలాత్కన్యాం సా చేదక్షతయోనికా । కులశీలవతో దద్యాదితి శాతాతపోఽబ్రవీత్ ॥౯ ॥ ఉద్వాహితా తు యా కన్యా సంప్రాప్తా న చ మైథునం। భర్తారం పునరభ్యేతి యథా కన్యా తథైవ సా ॥ ౧౦ ॥ ...క్లీబే దేశాంతరస్థే చ పతితే ప్రవ్రజేపి వా । యోగశాస్త్రనియుక్తే చ న దోషః పరివేదనే॥౧౩॥ ...తస్మాద్యత్నేన కర్తవ్యం శ్రుతిస్మృత్యుదితం హితత్ । నిత్యం నైమిత్తికం కామ్యం తథా స్వర్గాదిసాధనం ॥ ౧౬ ॥

(ఇతి శాతాతపధర్మశాస్త్రే పంచమోఽధ్యాయః)

తా॥ మేనమామకుమార్తెను గాని, తల్లిగోత్రము గల కన్యను గాని తల్లిసమాన ప్రవరగల కన్యను గాని వివాహము చేసుకొనినయెడల అట్టిచిన్నదానిని విడిచి చాంద్రాయణము నెడి ప్రాయశ్చిత్తమును చేయవలసినది ॥ ౪ ॥ ఏ స్త్రీ తల్లికి అసపిండురాలుగనుంచున్నదో, ఏ స్త్రీ తండ్రికి అన్యగోత్రముగనుంచున్నదో యా స్త్రీ ద్విజులకు మిథున సంబంధమైన వివాహమునకు యోగ్యురాలు ॥ ౫ ॥ పర్వతపేరుగలిగినట్టియు, శ్యామలచ్ఛాయగలిగినట్టియు, తేనెపసపువర్ణపు నేత్రములు గలిగినటువంటి కన్యను గృహస్థాశ్రమముకొరకు వరింపవలసినది. ఇట్లు చేసిన సుఖము వృద్ధియవును ॥ ౬ ॥ కావలెనని కోరినట్టియు, మంచికులము. స్వభావము గుణము కలిగినట్టియు, మంచిరూపము గలిగినట్టియు, విద్యావంతుడైనట్టియు, యవ్వనము గలిగినట్టియు. ఏదోషము లేనట్టియు, వరుడు వరింపదగినవాడు ॥ ౭ ॥ మంచికులము, స్వభావము లేనివానికి యిచ్చినకన్యను తిరిగి తీసుకొనినయెడల నా తీసుకొనినవాడు పాపికాడు. అట్టివిషయములో మంత్రములు ప్రయోజనకారి కావు. ఇచ్చిదీసుకొంటిమనేడియన్నృతదోషము న్ను సంభవించదు ॥ ౮ ॥ కులహీనునకివ్వబడ్డ కన్యక పతిసంయోగము కాకపోయినయెడలనట్టి కన్యను బలవంతముగదాచి పెట్టి మంచికులగుణశీలునకియ్యవలసినదని శాతాతపుడు చెప్పెను॥ ౯ ॥ కన్యక వివాహమైనప్పటికి పతిసంయోగము పొందక నుంచున్నదో యట్టి కన్యక వివాహము కాని కన్యకయెట్లో నట్లుగావున తిరిగి భర్తను పొందుచున్న

ది ॥ ౧౦ ॥ జ్యేష్ఠుడునపుంసకుడైనను, దేశాంతరగతుడైనను, భ్రష్టుడైనను, సన్యసించినను, యోగాభ్యాసకుడైనను తమ్ముడు వివాహముచేసుకొనుటయందు దోషములేదు ॥ ౧౩ ॥ గనుకనేది శ్రుతిస్మృతులలో చెప్పబడుచున్నదోదాన్ని ప్రయత్నముతోటి చేయవలసినది. అటువలెనే స్వర్గాదిసాధనమైననిత్యనైమిత్తికకామ్యాదికర్మలను చేయవలసినది ॥ ౧౬ ॥

౩౪. పంచయజ్ఞవిధానంతు గృహీనిత్యంనహాపయేత్ । పంచయజ్ఞవిధానేన తత్పాపంతస్యనశ్యతి ॥ ౨ ॥ దేవయజ్ఞోభూతయజ్ఞః పితృయజ్ఞస్తథైవచ । బ్రహ్మయజ్ఞోనృయజ్ఞశ్చపంచయజ్ఞాః ప్రకీర్తితాః ॥ ౩ ॥ తస్మాత్సర్వప్రయత్నేనగృహస్థోతిథిమాగతమ్ । ఆహారశయనాద్యేన విధివత్ప్రతిపూజయేత్ ॥ ౧౪ ॥ సాయంప్రాతశ్చజుహుయాదగ్నిహోత్రంయథావిధి । దర్శంచపౌర్ణమాసంచ జుహుయాద్విధివత్తథా ॥ ౧౫ ॥

(శ్రీశంఖస్మృతౌ పంచమోఽధ్యాయః.)

తా ॥ గృహస్థుడు ప్రతిదినము పంచయజ్ఞములు చేయుడమును విడువ గూడదు. పంచయజ్ఞములను చేయుటచేతను అతనియొక్క పాపము నశించుచున్నది॥ ౨ ॥ దేవయజ్ఞము, పితృయజ్ఞము, అటువలెనే బ్రహ్మయజ్ఞము మనుష్యయజ్ఞము అనెడి యైదు యజ్ఞములు చెప్పబడియున్నవి ॥ ౩ ॥ గనుక గృహస్థుడు అన్ని ప్రయత్నములచేతను కాలమందు వచ్చిన అతిథిని యాహారశయనాదులచే శాస్త్రప్రకారము పూజింపవలయును ॥౧౪॥ సాయం ప్రాతఃకాలములయందు శాస్త్రప్రకారము అగ్నికార్యములను చేయవలయును. అటువలెనే అమావాస్య ఇష్టిని, పున్నమయిష్టిని శాస్త్రప్రకారము యజించవలయును॥౧౫॥

౩౫. గృహీతవేదాధ్యయనశ్శ్రుతశాస్త్రార్థతత్వవిత్ । అసమానార్షగోత్రాంహి కన్యాంసభ్రాతృకాంశుభామ్ । సర్వావయవసంపూర్ణాంసు వృత్తాముద్వహేన్నరః ॥ ౬౬॥ బ్రాహ్మేణవిధి నాకుర్యాత్ప్రశస్తేనద్విజోత్తమః । తథాన్యే బహవఃప్రోక్తాః వివాహావర్ణధర్మతః ॥ ౬౭ ॥ ఔపాసనంచవిధివదాహృత్యద్విజపుంగవః । సాయంప్రాతశ్చజుహు

యాత్సర్వకాలమతంద్రితః ॥ ౬౮ ॥ స్నానంకుర్యాత్తతో
నిత్యందంతధావనపూర్వకమ్ । ఉషఃకాలేసముత్థాయకృ
తశౌచోయథావిధి ॥ ౬౯ ॥

(ఇతిహారీతస్మృతౌ చతుర్థోఽధ్యాయః)

తా ॥ వేదాధ్యయనమునుగ్రహించినటువంటిన్ని, వినబడినశాస్త్రార్థతత్వమును తెలసినటువంటిన్ని వాడుభిన్నప్రవరగోత్రముగలగినట్టియు, శుభకరమైనటువంటియు, సహోదరులుగలిగినటువంటియు, కన్యను వివాహముచేసుకొనవలయును ॥ ౬౬ ॥ ద్విజపుంగవులు బ్రాహ్మవివాహవిధిచొప్పున వివాహమునుచేసు కొనవలయును. అటువలెనే ఇతరమగున నేకములైనవివాహములు వర్ణధర్మమునను సరించి చెప్పబడియున్నవి ॥ ౬౭ ॥ ద్విజశ్రేష్ఠుడు శాస్త్రప్రకారము ఔపాసనాగ్నిని కలుగజేసుకొని యెల్లకాలము పొలుమాలికలేనివాడై సాయంప్రాతఃకాలమునందు హోమముచేయవలయును ॥ ౬౮ ॥ ఉషఃకాలమందులేచి శాస్త్రప్రకారము చేయంబడిన శౌచముగలవాడైపిమ్మట ప్రతిదినము ముందుగాదంతధావనముచేసికొనినవాడై స్నానమునుచేయవలయును ॥ ౬౯ ॥

## స్నానవిషయః.

౩౬. అహాన్యహానికర్తవ్యం కర్మణాంహి క్రమాద్విధిమ్ । బ్రా
హ్మేముహూర్తేఉత్థాయ ధర్మార్థావనుచింతయేత్ ॥ ౧ ॥
కాయక్లేశాంశ్చతన్మూలాన్ వేదతత్వార్థమేవచ । ఉషఃకా
లేతుసంప్రాప్తే కృత్వాచావశ్యకంబుధః ॥ ౨ ॥ స్నాయా
న్నదీషుశుద్ధాసు శౌచంకృత్వాయథావిధి । ప్రాతస్స్నానేన
పూయంతేయేపి పాపకృతోజనాః ॥ ౩ ॥ తస్మాత్సర్వః ప్రయ
త్నేన ప్రాతస్స్నానంసమాచరేత్ । ప్రాతస్స్నానంప్రశంసం
తి దృష్టాదృష్టఫలప్రదమ్ ॥ ౪ ॥ ఋషీణాం కుర్వతాంని
త్యం ప్రాతస్స్నానంనసంశయః । ముఖేసుప్తస్యసతతం లాలా
నిత్యంస్రవంతిహి ॥ ౫ ॥ తతోనైవాచరేత్కర్మాణ్యకృత్వా
స్నానమాదితః । అలక్ష్మీకాలకర్ణీచ దుఃస్వప్నందుర్విచిం
తనమ్ ॥ ౬ ॥ ప్రాతస్స్నానేనపూయంతే సర్వపాపాన్నసంశ
యః । నహిస్నానంవినాపుం సాంప్రాశస్త్యంకర్మసుస్మృ

యాత్సర్వకాలమతంద్రితః ॥ ౬౮ ॥ స్నానంకుర్యాత్తతో నిత్యందంతధావనపూర్వకమ్ । ఉషఃకాలేసముత్థాయకృతశౌచోయథావిధి ॥ ౬౯ ॥

(ఇతిహారీతస్మృతౌ చతుర్థోఽధ్యాయః)

తా ॥ వేదాధ్యయనమునుగ్రహించినటువంటిన్ని, వినబడినశాస్త్రార్థతత్వమును తెలసినటువంటిన్నివాడుభిన్నప్రవరగోత్రముగలగినట్టియు, శుభకరమైనటువంటియు, సహోదరులుగలిగినటువంటియు, కన్యను వివాహముచేసుకొనవలయును ॥ ౬౬ ॥ ద్విజపుంగవులు బ్రాహ్మవివాహవిధిచొప్పున వివాహమునుచేసు కొనవలయును. అటువలెనే ఇతరమగున నేకములైనవివాహములు వర్ణధర్మమునను సరించి చెప్పబడియున్నవి ॥ ౬౭ ॥ ద్విజశ్రేష్ఠుడు శాస్త్రప్రకారము ఔపాసనాగ్నిని కలుగజేసుకొని యెల్లకాలము పొలుమాలికలేనివాడై సాయంప్రాతఃకాలమునందు హోమముచేయవలయును ॥ ౬౮ ॥ ఉషఃకాలమందులేచి శాస్త్రప్రకారము చేయంబడిన శౌచముగలవాడైపిమ్మట ప్రతిదినము ముందుగాదంతధావనముచేసికొనినవాడై స్నానమునుచేయవలయును ॥ ౬౯ ॥

## స్నానవిషయః.

3౬. అహన్యహనికర్తవ్యం కర్మణాంహి క్రమాద్విధిమ్ । బ్రాహ్మేముహూర్తేఉత్థాయ ధర్మార్థావనుచింతయేత్ ॥ ౧ ॥ కాయక్లేశాంశ్చతన్మూలాన్ వేదతత్వార్థమేవచ । ఉషఃకాలేతుసంప్రాప్తే కృత్వాచావశ్యకంబుధః ॥ ౨ ॥ స్నాయాన్నదీషుశుద్ధాసు శౌచంకృత్వాయథావిధి । ప్రాతస్స్నానేన పూయన్తేయేపి పాపకృతోజనాః ॥ ౩ ॥ తస్మాత్సర్వః ప్రయత్నేన ప్రాతస్స్నానంసమాచరేత్ । ప్రాతస్స్నానంప్రశంసంతి దృష్టాదృష్టఫలప్రదమ్ ॥ ౪ ॥ ఋషీణాం కుర్వతాంనిత్యం ప్రాతస్స్నానంనసంశయః। ముఖేసుప్తస్యసతతం లాలానిత్యంస్రవంతిహి ॥ ౫ ॥ తతోనైవాచరేత్కర్మాణ్యకృత్వాస్నానమాదితః । అలక్ష్మీకాలకర్ణీచ దుఃస్వప్నందుర్విచింతనమ్ ॥౬॥ ప్రాతస్స్నానేనపూయంతే సర్వపాపాన్నసంశయః । నహిస్నానంవినాపుం సాంప్రాశస్త్యంకర్మసుస్మృ

తమ్ ॥ ౭ ॥ హోమేజప్యేవిశేషేణ తస్మాత్స్నానంసమాచరేత్ । అశక్తోఽవశిరస్కంవా స్నానమాత్రంవిధీయతే॥౮॥

(ఇతి లఘువ్యాసస్మృతౌ ప్రథమోఽధ్యాయః)

తా॥ రాత్రిపగళ్లయందు చేయవలసినకర్మలయొక్కవిధిని క్రమముగజెప్పెదను. ద్విజుడు బ్రాహ్మ ముహూర్తమందునిద్రలేచి ధర్మార్థములనుచింతించవలయును. వాటినిబట్టి వచ్చినశరీరకష్టములను వేదతత్వార్థమునుగూడ విచారించవలయును. ప్రాతఃకాలము కాగానే ప్రాజ్ఞుడైనవాడు ఆవశ్యకమైనకృత్యములను చక్కబెట్టుకొని యథావిధిగా శౌచమునాచరించి పరిశుద్ధములైన నదులయందు స్నానముచేయవలయును. పాపులయినట్టి జనులు ప్రాతఃస్నానముచే పవిత్రులగుచున్నారు. అందువలన అందరును ప్రయత్నముచేత ప్రాతఃస్నానము చేయవలయును. నిత్యము ప్రాతస్స్నానము నాచరించునట్టి ఋషులకు ప్రాతఃస్నానము దృష్టాదృష్టఫలమును ఇచ్చును. ఇందుకుసందేహములేదు. ఎప్పుడునునిద్రపోవువానిముఖమునపీడయుచొంగకారుచుండును. అందువల్లనే మొదట స్నానముచేయక నేకృత్యములను చేయంగూడదు. ప్రాతఃస్నానముచే నన్నిపాపములనుండిపవిత్రము చేయబడుదురు. స్నానములేకపురుషులకు తమకర్మలయందు ప్రాశస్త్యములభించదు. గనుకనే హోమాచరణమందు ముఖ్యముగా స్నానముచేయవలయును, అశక్తుడు శిరస్సువదిలి స్నానముచేయవలయును.

౩౭. నద్యాదితీర్థస్నానేతు । స్నానవస్త్రమధస్త్యజేత్ । వాపీకూపగృహాదౌతు । స్నానదూర్ధ్వంనయేద్బుధః॥౨౨॥ శిలాదూర్వాదికేవాపి జలేవాపిస్థలేపివా । సంశోధ్యపీడయేద్వస్త్రం పితౄణాం తృప్తయేద్విజః ॥౨౩॥ ప్రాతస్సంధ్యాముపాసీత । వస్త్రసంశోధనాత్పరం । ఉపాస్య మధ్యమాంసంధ్యాం వస్త్రసంశోధనంపరం ॥౨౪॥ వస్త్రంచతుర్గుణీకృత్య పీడయేత్తుజలాద్బహిః । వామప్రకోష్ఠేనిక్షిప్య ద్విరాచమ్యవిశుధ్యతి ॥ ౨౫ ॥

(ఇతి లిఖితస్మృతౌ ప్రథమోఽధ్యాయః)

తా॥ నదిమొదలైన తీర్థములయందు స్నానముచేయునప్పుడు స్నానవస్త్రమును పాడినస్త్రమునకు క్రిందుగా విడిపించవలయును. నడభావియందు ఇంటిలో

స్నానముచేయునప్పుడు తెలసినవారు పొడివస్త్రమునకుపైగా తడివస్త్రమును తీయవలయును ॥౨౨॥ ద్విజులు పితృలకు తృప్తిచేయుటకొరకు వస్త్రమును రాతియందుగాని గరికెగడ్డిమీదనుగాని, లేకజలమందుగాని, భూమిమీదనుగాని ఉతికి పిండవలయును ॥౨౩॥ వస్త్రమును ఉతికినపిమ్మట ఉదయకాలసంధ్యను ఉపాసించవలయును. మధ్యాహ్నికసంధ్యను ఉపాసించినపిమ్మట వస్త్రక్షాళనము చేయవలయును ॥౨౪॥ వస్త్రమును నాలుగుమడతలు గలదిగాచేసి నీటికైటపిండవలయును. వస్త్రముపిండి యెడమమోచేతి క్రిందిభాగమందుంచి రెండుసార్లుఆచమనముచేసినశుద్ధుడగుచున్నాడు.

ఊర్ధ్వపుండ్రధారణవిషయః.

౩౮. సర్వవర్ణేషుమద్భక్తాః కుర్వీరన్నూర్ధ్వపుండ్రకం । బ్రాహ్మణాశ్చవిశేషేణ జపహోమపరాయణాః ॥ శ్వేతమృత్తికయావాపిశ్యామయాపీతయాపివా । ఊర్ధ్వపుండ్రంద్విజైః కార్యంవైష్ణవైశ్చవిశేషతః ॥ సింధుతీరేథవల్మీకేతులస్యాధోజలాశయే । పర్వతాగ్రేనదీతీరే మమక్షేత్రేవిశేషతః । అన్యేష్వపిచ తీర్థేషు నళినీమూలకేషుచ । స్థానేష్వేతేషు గృహ్ణీయాత్ తుఃర్యాన్నాన్యత్రమానవః । బ్రాహ్మణానాన్తుమృత్ప్రోక్తాక్షత్రియాణాంచచందనం । వైశ్యానాంతుబిల్వమూలంశూద్రాణాంభస్మచోచ్యతే శ్రౌతస్మార్తక్రియాస్సర్వాహ్యూర్ధ్వపుండ్రమ కుర్వతః । జాయంతేవిఫలా బ్రహ్మన్నాధితాశ్చ భవంతితాః । ఉపవీతం శిఖాబంధమూర్ధ్వపుండ్రంవినాకృతం । యాగోదానంజపోహోమస్స్వాధ్యాయఃపితృతర్పణం । భస్మీభవతితత్సర్వమూర్ధ్వపుండ్రంవినాకృతం । యచ్ఛరీరం మనుష్యాణామూర్ధ్వపుండ్రం వినాభవేత్ । తందృష్ట్వాగగనే సూర్యోనిరీక్ష్య స్సాధుభిస్సదా । ఏవంతదీయావిప్రాశ్చక్షత్రియావైశ్యజాతయః। మృదైవవా చందనేనకల్పితై రూర్ధ్వపుండ్రకైః । ద్వాదశైక చతుర్భిర్వాభూషితాస్స్యుస్సదాద్విజాః । భృవోరథస్తాదారభ్యకే

శాంతం ధారయేద్బుధః ॥ సాంతరాళమృజుం సౌమ్యంసుపా ర్శ్వంసుమనోహరం । యఃకరోత్యూర్ధ్వపుండ్రంసమమాతీ వప్రియోభవేత్ । యఃకరోత్యూర్ధ్వపుండ్రంతు సంధ్యావం దనకర్మసు।తస్యాహంసులభోబ్రహ్మన్నేకస్మిన్నేవజన్మని॥
(స్మృతిరత్నాకరే పేజి. ౧౨౪, ౧౨౬, ౧౨౭)

తా ॥ సమస్తవర్ణములయందుండు నాభక్తులు ఊర్ధ్వపుండ్రమును ధరింపవల యును. అందు జపహోమ పరాయణులగు బ్రాహ్మణులధికముగ ధరింపవలయును. ద్విజులు తెల్లనిమృత్తికచేతనుగాని నల్లని మృత్తికచేతనుగాని పచ్చని మృత్తికచేతను గాని ఊర్ధ్వపుండ్రమును ధరించవలయును. విష్ణుభక్తులువిశేషముగధరింపవలయును. మనుష్యుడు సముద్రతీరమందుగాని, పుట్టయందుగాని, తులసి మొదటగాని, సర స్సులయందుగాని, పర్వతాగ్రమందుగాని, నదీతీరములయందుగాని, నేనువసించుదే వాలయములయందుగాని, ఇతరతీర్థములయందుగాని, తామరదుంప మొదటయందు గాని, ఇటువంటిస్థానములయందున్న మృత్తుకను గ్రహింపవలయును. బ్రాహ్మణులకు మృత్తుకయు, క్షత్రియులకుచందనము, వైశ్యులకుబిల్వమూలము, శూద్రులకుభస్మము విధింపబడినవి. ఊర్ధ్వపుండ్రమును ధరింపకజేయబడిన శ్రౌతస్మార్తసమస్తక్రియలు, వ్య ర్థములుగాను బాధితములుగానగుచున్నవి. జంధ్యము,జుట్టుముడియు,ఊర్ధ్వపుండ్రమి విలేక జేయబడిన యజ్ఞ, దాన, జప,హోమ, స్వాధ్యాయపితృతర్పణము, ఇవియన్ని యు బూడిదయందుజేశిన హోమమువలె విఫలమగుచున్నవి. ఊర్ధ్వపుండ్రము ను ధరించనిమనుష్యుని శరీరమునుచూచిననరుడు పాపమును బోగొట్టుకొనుకొరకు, గగనమందునూర్యుని చూడవలయునని సత్పురుషులువచించిరి. అలాగున బ్రహ్మ,క్షత్రి య,వైశ్యులగు ద్విజులు - ౧ - ౨ - ౪ - ౧౦ - మార్లు - మృత్తుకచేతనైనను చం దనముచేతనైనను రచింపబడిన యూర్ధ్వపుండ్రములచే నెల్లప్పుడు నలంకరింపబడిన వారుగ కావలయును. విద్వాంసుడు కనుబొమ్మలకిందినుంచి ఫాలమున వెంట్రుకల వరకూర్ధ్వపుండ్రమును మధ్యమున యవకాశము గలుగునటులను, వంకరలేకుం డునటులను మంచి పార్శ్వములు గలుగునటులను మనోహరముగను సౌమ్యముగ నుధరింపవలయును. అటుల ధరించినయతడు నాకుప్రియుడుగ నగుచున్నాడు. ఎ వడు సంధ్యావందనకర్మలయందూర్ధ్వపుండ్రమును ధరించునో యతనికి నేనొకజన్మ యందేసులభుడ నగుచున్నాడను.

## త్రిపుండ్రధారణవిధి.

౩౯. స్నాత్వాచమ్యవిశుద్ధాత్మా ప్రాఙ్ముఖస్సోత్తరీయకః । సపవిత్ర

స్త్రిపుండ్రాంక స్సంధ్యావందనమాచరేత్ ॥ ౧ ॥ ఉద్ధూళ
ణంత్రిపుండ్రంచ ధారయేత్తుయథావిధి । పూర్వముద్ధూళ
నంకృత్వాభస్మనాథత్రిపుండ్రకం । అన్యథాచేద్రజోయావ
త్తావన్నరకమృచ్ఛతి ॥ ౨ ॥

(ఇతి లిఖితస్మృతౌ ద్వితీయోఽధ్యాయః)

తా ॥ స్నానము ఆచమనముచేసి పరిశుద్ధాత్ముడై తూర్పుముఖుడై ఉత్తరీయము వేసుకొనినవాడై పవిత్రముగలవాడై త్రిపుండ్రమునుధరించి సంధ్యావందనముచేయవలయును ॥ ౧ ॥ భస్మధూళిని త్రిపుండ్రమును ధరింపవలయును. శాస్త్రప్రకారముముందుగా భస్మమునుపూసుకొని యనంతరము బూడిదచే త్రిపుండ్రమును ధరింపవలయును. అటులచేయకపోయెనేని బూడిదెయొక్క రేణువులు ఎన్నో అంతకాలమువరకు నరకమునుపొందుచున్నాడు ॥ ౨ ॥

ఆ చ మ న వి ధి.

౪౦. ఆమణిబన్ధనాద్ధస్తౌ పాదావద్భిర్విశోధయేత్ ॥ ౧౯ ॥ అ
శబ్దాభిరనుష్ణాభిస్సువర్ణరసగన్ధిభిః । హృద్గతాభిరఫేనాభిస్త్రి
శ్చతుర్వాద్భిరాచమేత్ । పరిమృజ్యద్విరాస్యన్తు ద్వాదశా
ఙ్గానిచస్పృశేత్ ॥ ౧౯ ॥ స్నాత్వాపీత్వాతథాభుక్త్వా స్పృ
ష్ట్వాచైవద్విజోత్తమాః । అనేనవిధినావిప్ర ఆచాంతశ్శుచి
తామియాత్ ॥ ౨౦ ॥

(ఇతి సంవర్తస్మృతిధర్మశాస్త్రే)

తా ॥ మణికట్టువరకును, చేతులను పాదములను ఉదకములచేత లెస్సగా శోధించవలయును ॥ ౧౮ ॥ ధ్వనిలేనటువంటిన్ని తత్స్పర్శ కానటువంటిన్ని, శుభ్రవర్ణము మాధుర్యము గంధము గలిగినటువంటిన్ని హృదయస్థానమును పొందినటువంటిన్ని, నురుగులేనటువంటిన్ని యుదకములచే మూడు లేక నాలుగు మార్లుగాని ఆచమనము చేయుచునోటిని రెండుమార్లు ఉదకముచేతుడచి ౧౨ స్థానములను అంటవలసినది ॥౧౯॥ ఇట్లు బ్రహ్మ క్షత్రియ వైశ్యులు స్నానము చేయునప్పుడును, ఉదకపానము చేయునప్పుడును, భోజనము చేయునప్పుడును స్పృశించని వస్తువులను స్పృశించినప్పుడును ఈలాగున ఆచమనము చేయవలసినది.

సంధ్యావందనవిషయః.

౭౧. అహోరాత్రస్య యస్సంధిస్సూర్యనక్షత్రవర్జితః। సాతుసంధ్యాసమాఖ్యాతా మునిభిస్తత్వదర్శిభిః ॥ సంధ్యాత్రయంతు కర్తవ్యంద్విజేనాత్మవిదాసదా ॥ గాయత్రీ నామపూర్వాహ్ణేసావిత్రీమధ్యమేదినే । సరస్వతీచ సాయాహ్నే సైవసంధ్యాత్రిధాస్మృతా ॥ ప్రతిగ్రహాదన్న దోషాత్పాతకాదుపపాతకాత్ । గాయత్రీప్రోచ్యతేతస్మాద్గాయంతంత్రాయతేయతః ॥ సవితృద్యోతనాచ్చైవ సావిత్రీపరికీర్తితా । జగతఃప్రసవిత్రీవా వాగ్రూపత్వాత్సరస్వతీ ॥ గాయత్రీతుభవేద్రక్తాసావిత్రీశుక్లవర్ణికా । సరస్వతీతథాకృష్ణాఉపాస్యావర్ణభేదతః । గాయత్రీబ్రహ్మరూపాతుసావిత్రీరుద్రరూపిణీ । సరస్వతీవిష్ణురూపా ఉపాస్యారూపభేదతః ॥ నభిన్నాంప్రతిపద్యేతగాయత్రీంబ్రహ్మణాసహ । సోహమస్మీత్యుపాసీతవిధినాయేనకేనచిత్ ॥ ఉత్తమాతారకోపేతామధ్యమాలుప్తతారకా । అధమాసూర్యసహితాప్రాతస్సంధ్యాత్రిధామతా ॥ ఉత్తమాసంగమేప్రోక్తా । మధ్యాహ్నేమధ్యమాస్మృతా । అధమాత్వపరాహ్ణేవా సంధ్యామాధ్యాహ్నికీత్రిధా ॥ ఉత్తమాసూర్యసహితామధ్యమానుదితతారకా । అధమాతారకోపేతాసాయంసంధ్యాత్రిధామతా॥ కాలేతువందితాసంధ్యాస్వర్గమోక్షప్రదాయినీ । అకాలేవందితాసంధ్యాసాచవంధ్యావధూరివ ॥ సంధ్యాయేననవిజ్ఞాతాసంధ్యాయేనానుపాసితా।జీవమానోభవేచ్ఛూద్రోమృతశ్శ్వాభినోపిజాయతే । అనేనవిధినానిత్యంజపంకుర్యాత్ప్రయత్నతః। ప్రసన్నోవిపులాన్భోగాన్భుక్తింముక్తించవిన్దతి ॥
(పరాశరస్మృతౌ ఆచారకాండే. పేజి ౫౩)

తా॥ అహోరాత్రములయొక్క సంధికాలము సూర్యనక్షత్రములులేనిదిగనేదిగలదో అదియేతత్వవేత్తలగుమునులు సంధ్యయని జెప్పెదరు, నిత్యము ఆత్మవేత్తలగు

ద్విజులు మూడుసంధ్యలను చేయవలసినది. ఉదయమున గాయత్రియనియు, మధ్యాం దినమున సావిత్రి యనియు సాయంకాలమున సరస్వతియనియు, సంధ్యమూడువిధములుగ జెప్పంబడినది. దానము పట్టుటవలన అన్నదోషమువలన, బ్రహ్మహత్యాదిపాతకములవలన ఉపపాతకములవలన, తననుస్తుతిచేయునట్టి పురుషుని రక్షించుటచే గాయత్రియనియు, సూర్యప్రకాశంబుచే సావిత్రియనియు, శబ్దరూపముచే లోకమాతయగు సరస్వతీయనియు, జెప్పండినది. గాయత్రినిరక్తవర్ణముకలదిగాను సావిత్రి నిశుక్లవర్ణముకలదిగాను సరస్వతిని కృష్ణవర్ణము కలదిగా నుపాసింపవలయును. గాయత్రినిబ్రహ్మరూపముగను, సావిత్రిని రుద్రరూపముగను, సరస్వతిని విష్ణురూపముగ నుపాసింపవలయును. గాయత్రిని బ్రహ్మతోనభిన్నమైన దానినిగధ్యానించుచు బ్రహ్మయేతానుగనైతినని యేవిధిచేతచైననను ఉపాసింపవలయును. నక్షత్రయుక్తంబగు సంధ్యయుత్తమమనియు, లోపించిననక్షత్రములుగలసంధ్య మధ్యమమనియు, సూర్యసహితమగుసంధ్య అధమమనియు,ప్రాతస్సంధ్య మూడు విధములుగ చెప్పంబడినది. సంగమమందుత్తమమనియు, మధ్యాహ్నకాలమందు మధ్యమమనియు అపరాహ్ణకాలమందు నికృష్టమనియు, మాధ్యాహ్నికసంధ్యత్రివిధముగ జెప్పబడినది. సూర్యసహితమగు సంధ్యయుత్తమమనియు, ఉదయించుచున్న నక్షత్రములు గల సంధ్య మధ్యమమనియు నక్షత్రయుక్తమగుసంధ్యనికృష్టమనియు సాయంసంధ్య మూడువిధములుగచెప్పంబడినది. ముఖ్యకాలమందుచేయంబడినసంధ్య స్వర్గమోక్షములనిచ్చును అకాలమందుచేయంబడినసంధ్య గొడ్రాలువలెనిష్ఫలమగును. ఎవడుసంధ్యగుర్తెరుగకయు, ఉపాసించక యుండునో వాడు బ్రతికి శూద్రుడుగను, చచ్చి శునకముగానగును. గావున విధ్యుక్తముగ గాయత్రీజపమును యత్నముతో నిత్యము జేయవలయును నట్లుజేసిన పాపరహితుడై యనేకములగు భోగ భుక్తి, ముక్తులను పొందుచున్నాడు.

## సావిత్రీవిషయః.

౪౨. తస్మాద్వేదాన్విశిష్టాన్వైమనురాహప్రజాపతిః । భూర్భువస్స్వరితి బ్రహ్మాయోవేదపరమద్విజః ॥ ౨౫ ॥ తేయాంతి నరశార్దూలబ్రహ్మలోకమసంశయమ్ । సావిత్రీమాత్రసారో౽పివరో౽విప్రసుయంత్రితః ॥ ౨౬ ॥ నాయంత్రితశ్చతుర్వేదీసర్వాశీసర్వవిక్రయీ । సావిత్రీంచైవవేదాంశ్చతులయాతులయన్పురా ॥ ౨౭ ॥ దేవాబుషిగణాశ్చైవసర్వే బ్రహ్మపురస్సరాః।చతుర్ణామపివేదానాంసాహిర్తాజన్గరీయసీ॥

ణిముక్తాస్ఫాటిక పద్మాక్షరుద్రాక్షపుత్ర జీవకానామన్యతమే వాక్షమాలాంకుర్యాత్ ॥౭॥ కుశగ్రంథింకృత్వావాగణయేత్ ॥౮॥ ఆదౌదేవతర్షిచ్ఛందస్స్మరేత్ ॥౯॥ ...సవ్యాహృతింసప్రణవాంగాయత్రీంశిరసాసహ । యేజపంతిసదాతేషాంనభయంవిద్యతేక్వచిత్ ॥౧౫॥ దశజప్తాతుసాదేవీ దినపాపప్రణాశినీ । శతజప్తాతథాసాతు అబ్దపాప ప్రణాశినీ ॥౧౬॥ సహస్రజపాత్తుజనాన్పాతకేభ్యస్సముద్ధరేత్ । దశసాహస్రజపాత్తు సర్వకల్మషనాశినీ ॥౧౭॥ గాయత్రీ వేదజననీ గాయత్రీపాపనాశనీ । గాయత్ర్యాఃపరమంనాస్తి దివిచేహచపావనం ॥౨౯॥ ఉపాంశుస్స్యాచ్ఛతగుణస్సహస్రోమానసస్స్మృతః । నోచ్చైర్జప్యంబుధఃకుర్యాత్సావిత్ర్యాస్తు విశేషతః ॥ ౩౦ ॥ సావిత్రీజప్యనిరత స్స్వర్గమాప్నోతి మానవః । గాయత్రీజప్యనిరతో మోక్షోపాయంచవిందతి॥౩౧॥ తస్మాత్సర్వప్రయత్నేనస్నాతఃప్రయతమానసః । గాయత్రీంతుజపేద్భక్త్యా సర్వపాపప్రణాశినీమ్ ॥౩౨॥

(ఇతి శంఖస్మృతౌ ద్వాదశోఽధ్యాయః)

తా॥ అన్నిటికంటె గాయత్రీమంత్రము విశిష్టమైనది ॥ ౨ ॥ జపించదగినది, సావిత్రికిసమమైనదిలేదు ॥ ౪ ॥ దర్భాసనమందు కూర్చున్నవాడై, దర్భను త్తరీయముగాగలవాడై తూర్పుముఖుడై లేక సూర్యాభిముఖుడై జపమాలనుతీసుకొనిదేవతనుధ్యానము చేయుచున్నవాడై జపమును చేయవలయును॥౬॥ బంగారము నవరత్నములు, ముత్యము, స్ఫటికము, తామరపూసలు, రుద్రాక్షలు, పుత్రజీవి విత్తనములు వీనిలో నొకటిచే జపమాలను చేయవలయును ॥ ౭ ॥ దర్భముడి వేసికొనియైనను (మంత్ర ఆవర్తిని) ఎంచవలయును ॥౮॥ ఆరంభమందు దేవతనుఋషిని, ఛందస్సును స్మరించవలయును ॥౯॥ వ్యాహృతిమంత్రముతోకూడిన. ప్రణవముతోగూడిన గాయత్రీమంత్రమును, శిరోమంత్రముతోకూడ ఎవరు ఎల్లప్పుడు జపించుచున్నారో వారికి దేనియందునుభయముకలుగదు॥౧౫॥పదిమార్లుజపించబడినఆగాయత్రిదేవి ఆదినపాపమును బోగొట్టును. నూరుసార్లు జపించబడిన (గాయత్రీ) అటువలెనే ఒకసంవత్సరపాపమునుబోగొట్టును ॥౧౬॥ వెయ్యిసార్లు జపింపబడినగాయత్రీజనుల

సంవత్సరపు పాపమును పోగొట్టును ॥ ౧౬॥ వేయిసార్లుజపింపబడిన గాయత్రిజనుల నుపాపములనుండియుద్ధరించును. పదివేలమార్లుజపింపబడిన (గాయత్రి) సర్వకల్మషము లనశింపచేయును ॥౧౭॥ గాయత్రీవేదమునకు తల్లి, గాయత్రిపాపమును బోగొట్టు నది. గాయత్రికంటె శ్రేష్ఠమైన పవిత్రముచేసెడిది స్వర్గమందును, ఈలోకమందు ను లేదు ॥౨౬॥ రహస్యజపమొకటికి నూరంతలుగనగును. మానసజపమొకటికి వెయ్యంతలుగ నగుననిచెప్పబడియున్నది. తెలిసినవాడు బిగ్గరగ గాయత్రీజపము చేయకూడదు॥ ౩౦ ॥ గాయత్రీజపమందాసక్తుడైనమనుజుడు స్వర్గమునుబొందుచున్నా డు. గాయత్రీజపాసక్తుడు మోక్షసాధకమైనమార్గమును పొందుచున్నాడు ॥౩౧॥ గనుక స్నానము చేసినవాడై స్థిరమానసుడై అన్నిప్రయత్నములచేతను సమస్తపా పములనుబోగొట్టెడిగాయత్రిని భక్తితోజపించవలయును॥ ౩౨॥

గాయత్రీఛందోఋషివిషయః.

౮౮. ప్రాతర్వ్యాసస్తుగాయత్ర్యా గాయత్రీ బ్రహ్మదేవతా । విని యోగస్తర్పణేషు పురుషాదీంశ్చ తర్పయేత్ ॥౮౭॥ మధ్యం దినేతుసావిత్ర్యాః కాశ్యపస్త్రిష్టుబేవహి । దేవతావిష్ణురే వస్యా ద్భువఃపూర్వాదితర్పణం ॥౮౮॥ సాయాహ్నేతుసర స్వత్యావశిష్ఠోజగతీమతా । ఈశ్వరోదేవతాచైవస్వపూర్వాణాం శ్చైవతర్పణం ॥౮౯॥ ఇత్థంత్రిసంధ్యానుష్ఠానం లిఖితేనవిప శ్చితా । ఏవంమహర్షిణాప్రోక్తం బ్రాహ్మణ్యస్యచసిద్ధయే ॥ ఏవంద్విజానాంబ్రాహ్మణ్య సిద్ధయేభోగమోక్షయోః॥ ౯౮ ॥

(ఇతి లిఖితధర్మశాస్త్రే చతుర్థోఽధ్యాయః)

తా॥ గాయత్రీమంత్రమునకు ప్రాతఃకాలమందు (ఋషి) వ్యాసుడు, (ఛందస్సు) గాయత్రీ, (దేవత) బ్రహ్మ, తర్పణమందు వినియోగము; పురుషులనుగూర్చి తర్పణము చేయవలయును ॥ ౮౭ ॥ మధ్యాహ్నకాలమందు సావిత్రికి (ఋషి) కాశ్యపుడు, (ఛందస్సు) త్రిష్టుప్, (దేవత) విష్ణువు, అగుచున్నాడు. తర్పణము భువ ర్లోకము మొదలైనవాటినిగూర్చి (చేయవలయును). ॥౮౮॥ సాయంకాలమందు గాయత్రికి (ఋషి) వశిష్ఠుడు, (ఛందస్సు) జగతి, (దేవత) ఈశ్వరుడు, తర్పణము స్వపురుషులనుగూర్చి చేయవలయును. ఈవిధముగ మూడుసంధ్యలయొక్క అను ష్ఠానము పండితమహాఋషియైన లిఖితునివలన బ్రాహ్మణ్యసిద్ధికొరకై, బ్రహ్మక్షత్రియ వైశ్యులకు భోగమోక్షార్థంబై చెప్పబడినది ॥౯౮॥

## గాయత్రీజపవిషయః.

౯౫. గాయత్రీంతుజపేత్ప్రాతస్తిష్ఠన్నాసూర్యదర్శనాత్ ।
తథైవసాయమాసీనోజపేదాబుృక్షదర్శనాత్ ॥౧॥

(లిఖితస్మృతౌ పంచమోఽధ్యాయః)

తా॥ ప్రాతఃకాలమందు గాయత్రీమంత్రమును సూర్యదర్శనమగువరకు నిలువబడియు, అదేప్రకారము సాయంకాలమందుకూర్చుండియు, నక్షత్రదర్శనమగువరకు కూర్చుండియు జపముచేయవలయును.

౯౬. పూర్వాంసంధ్యాంసనక్షత్రాం ఉపాసీతయథావిధి । గాయత్రీమభ్యసేత్తావ ద్యావదాదిత్యదర్శనాత్ ॥౯౭॥ జపయజ్ఞస్తతఃకుర్యా ద్గాయత్రీంవేదమాతరమ్ । త్రివిధో జపయజ్ఞస్స్యాత్తస్యతత్వంనిబోధత ॥౯౯॥ వాచికశ్చఉపాంశుశ్చ మానసశ్చత్రిధాకృతః। త్రయాణామపియజ్ఞానాం శ్రేష్ఠస్స్యాదుత్తరోత్తమః ॥౧౦౦॥ యదుచ్చనీచోచ్చరితైః శ్శబ్దైస్స్పష్టపదాక్షరైః । మంత్రముచ్చారయేద్వాచా జపయజ్ఞస్తువాచికః ॥౧౦౧॥ శనైరుచ్చారయన్మంత్రం కించిదోష్ఠౌప్రచాలయేత్ । కించిచ్ఛ్రవణయోగ్యస్స్యాత్సఉపాంశురితి స్మృతః॥౧౦౨॥ ఛందోఋష్యాదివిజ్ఞాయజపేన్మంత్రమతంద్రితః। జపేదహరహర్జ్ఞాత్వాగాయత్రీంమనసాద్విజః ॥౧౦౬॥ సహస్రపరమాందేవీం శతమధ్యాందశావరాం।గాయత్రీంయోజపేన్నిత్యం నసపాపేనలిప్యతే ॥౧౦౭॥ సాయంప్రాతఃద్విజాతీనామశనంశ్రుతిచోదితమ్ । నాంతరాభోజనంకుర్యా దగ్నిహోత్రసమోవిధిః ॥౧౨౬॥

(ఇతి హారీతస్మృతౌ చతుర్థోఽధ్యాయః)

తా॥ ఉదయకాలపుసంధ్యను నక్షత్రములున్నపుడు శాస్త్రప్రకారముగనుపాసింపవలయును, సూర్యదర్శన మెప్పుడు గలుగుచున్నదోయది వరకుగాయత్రీమంత్రమును జపించవలయును ॥ ౯౭ ॥ అనంతరము వేదమాతయగు గాయత్రీ రూపమైన జపయజ్ఞమును చేయవలయును. జపయజ్ఞము మూడు

విధములుగనున్నది. దానితత్త్వము దెలసికొనుడు ॥ ౯౯ ॥ వాచికమనియు ఉపాంశ నియుమానసికమనియు మూడువిధములుగ చెప్పబడినది. మూడుయజ్ఞములలోమీద మీదది శ్రేష్ఠమైనదియగుచున్నది ॥ ౧౦౦ ॥ ఉదాత్తానుదాత్తములతో నుచ్చరింపబడు చుస్పష్టపదాక్షరములు గలిగిన శబ్దములచేతను వాక్కులచేత ఏమంత్రముచ్చరింప బడుచున్నదో యది వాచక జపయజ్ఞమని చెప్పబడుచున్నది ॥ ౧౦౧ ॥ మంత్రము ను మెల్లగ నుచ్చరించు వాడై పెదవులను కొంచెము కదిలించుచు నేదికొంచెము శ్రవణయోగ్యమగుచున్నదో యది యుపాంశుజపమని చెప్పంబడుచున్నది॥ ౧౦౨ ॥ ఛందస్సు ఋషి మొదలైనవానిని దెలసికొని పాలుమాలికలేనివాడై మంత్రమును జపించవలయును. ద్విజుడుమనస్సుచేత (ఋషి) ఛందోదేవతలను దెలుసుకొని ప్రతిదినము జపించవలయును॥౧౦౬॥ఉత్తమముగాగలసహస్రజపమును, మధ్యమము గాగల శతజపమును, అధమముగాగల దశజపమును ఎవడు ప్రతిదినముజపించుచు న్నాడో వాడు పాపముచేత పుయ్యబడడు ॥౧౦౭॥ ద్విజులకు సంధ్యోదయకాల మునందు భోజనము చెప్పబడినది. మధ్యకాలమునందు భోజనముచేయకూడదు భోజన విధి యగ్నిహోత్రవిధికి సమానము ॥౧౨౬॥

## గృహస్థనిత్యధర్మవిధి.

౭౭. పంచయజ్ఞపరిత్యాగీ బ్రహ్మహేత్యుచ్యతేబుధైః।కుర్యాదహ రహస్తస్మాత్వం చయజ్ఞాన్నమాసతః॥ ౫ ॥ దేవయజ్ఞోభూత యజ్ఞఃపితృయజ్ఞస్తథైవచ।నృయజ్ఞోబ్రహ్మయజ్ఞశ్చపంచయ జ్ఞాఃప్రకీర్తితాః ॥ ౬ ॥

(లిఖితస్మృతి పంచమోఽధ్యాయః.)

తా ॥ పంచయజ్ఞములు చేయనివాడు బ్రహ్మహత్య చేసినవాడు అని పెద్దలచే చెప్పబడుచున్నాడు. గనుకద్విజుడు ప్రతిదినము దేవయజ్ఞము, భూతయజ్ఞము, పి తృయజ్ఞము, మనుష్యయజ్ఞము, బ్రహ్మయజ్ఞము, ఈపంచయజ్ఞములను చేయవలసినది గా చెప్పబడినది ॥ ౬ ॥

## య జ్ఞ వి ష యః.

౭౮. ఓంయజ్ఞంవ్యాఖ్యాస్యామః । సత్రయాణాంవర్ణానాంబ్రాహ్మ ణరాజన్యయోర్వైశ్యస్యచ సత్రిభిర్వేదైర్విధియ్యతే ॥

(ఆపస్తంబన్యాయఖండ, ౭౧- ౧)

తా ॥ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులగు మూడువర్ణములవారికి మూడు వేద ములచేతను యజ్ఞము విధింపబడినది.

౪౯. యజధ్వమితివైశ్యాః శ్రుతిర్వాజసనేయకీ యత్రిధాకారకం కుర్యాత్ఘనస్తనయిత్నుర్ధ్వనిందివి ॥

(బృహత్పారాశరీయే చతుర్థోఽధ్యాయః.)

తా ॥ ఓ వైశ్యులారా ఆకాశమందు మేఘము త్రివిధముగ గర్జించు చందమున మీరు యాగములు చేయుడీయని వాజసనేయశ్రుతి ఘోషిల్లుచున్నది.

౫౦. యోవైశ్య స్స్యాద్బహుపశుర్హీనక్రతురసోమపః। కుటుంబాత్తస్యద్రవ్యమాహారేద్యజ్ఞసిద్ధయే ॥ ౧౨॥ నయజ్ఞార్థంధనంశూద్రాద్విప్రోభిక్షేతకర్హిచిత్ । యజమానోహిభిక్షిత్వాచండాలఃప్రేత్యజాయతే ॥ ౨౪ ॥...క్షత్రియోబాహువీర్యేణతరేదాపదమాత్మనః । ధనేనవైశ్యశూద్రౌతుజపహోమైర్ద్విజోత్తమః॥ ౩౪ ॥ తపోమూలమిదంసర్వందైవమానుషకంసుఖమ్।తపోమధ్యంబుధైఃప్రోక్తంతపోంతంవేదదర్శిభిః ॥ ౨౩౪ ॥ బ్రాహ్మణస్యతపోజ్ఞానంతపఃక్షత్రస్యరక్షణమ్ । వైశ్యస్యతు తపోవార్తా తపశ్శూద్రస్యసేవనమ్॥

(మనుస్మృతౌ ఏకాదశోఽధ్యాయః.)

తా॥ఏవైశ్యుడు బహుపశువులుగలిగియాగాదులు చేయడో వాని ద్రవ్యమునుకుటుంబమునుంచియజ్ఞార్థసిద్ధికొరకుహరించవలసినది॥౧౨॥విప్రుడుయజ్ఞార్థమై శూద్రునియొద్దనుండిధనమునుయాచించకూడదు. ఒకవేళనట్లుపుచ్చుకొనియజించినయెడలనాయజమానుడుమరణాంతరమునచండాలజన్మముబొందును ॥ ౨౪ ॥ ఆపదతటస్థించునపుడు బ్రాహ్మణుడు జపముచేతను, క్షత్రియుడు బాహుపరాక్రమముచేతను, వైశ్యశూద్రులు ధనాదులచేతను దప్పించుకొనవలసినది ॥ ౩౪ ॥ దైవమానుషశ్రైనసుఖములన్నియు తపః ప్రధానంబులైయున్నవి ॥ ౨౩౪ ॥ బ్రాహ్మణునకు జ్ఞానమే తపస్సనియు, క్షత్రియునకు పరిపాలనే తపస్సనియు, వైశ్యునకు కృషివాణిజ్య గోరక్షణే తపస్సనియు, శూద్రునకు సేవకావృత్తియె తపస్సనియు జెప్పంబడినది ॥ ౨౩౫ ॥

౫౧. గావోయజ్ఞార్థముత్పన్నాదక్షిణార్థంతథైవచ । సువర్ణంరజితంభార్యాపాత్రసంస్కారణాయచ ॥ ౭౫ ॥ దర్భాస్సృష్టాస్తువిధినారక్షసాంరక్షణాయచ। యజనార్థంద్విజాస్సృష్టాస్తా

రకాభువిదైవతాః। క్షత్రియారక్షణార్థంతువైశ్యావార్తా నిమిత్తతః॥శుశ్రూషార్థంత్రయాణాన్తుశూద్రాస్సృష్టాస్స్వయంభువా॥ ఏవమేతజ్జగత్సర్వమగ్నిహోత్రకృతేకృతమ్॥

(వృద్ధగౌతమీయేధర్మశాస్త్రే పంచదశోఽధ్యాయః)

తా॥యజ్ఞార్థముగోవులు, దక్షిణకొరకుబంగారువెండియు, పాత్రసంస్కారముకొరకుభార్యయు,రాక్షసులరక్షణకొరకుదర్భలుయజ్ఞముకొరకు ద్విజులువిధిచేసృజింపబడిరి. ఎట్లనగ తరింపచేయుటకు భూదేవతలను, లోకరక్షణకొరకు రాజన్యులను, వాణిజ్యముకొరకు వైశ్యులను, నీమూడువర్ణములకు శుశ్రూషచేయుటకొరకుశూద్రులను సృష్టించెను. గాన ఈసమస్తప్రపంచముబ్రహ్మచేనగ్నిహోత్రనిమిత్తముచేయబడినది.

౫౨. ఆరంభయజ్ఞాఃక్షత్రస్య హావిర్యజ్ఞోవిశామపి। పరిచర్యాయజ్ఞాశ్శూద్రస్తు జపయజ్ఞోద్విజోత్తమః॥

(లఘుఅత్రి ద్వితీయోధ్యాయః.)

తా॥ఓద్విజోత్తములారా ఆరంభయజ్ఞులుక్షత్రియులు,హావిర్యజ్ఞులువైశ్యులు, పరిచర్యాయజ్ఞులు శూద్రులు, జపయజ్ఞులు బ్రాహ్మణులు అనియెరుంగునది.

పవిత్ర విషయః.

౫౩. చతుర్భిర్దర్భపుంజైస్తుబ్రాహ్మణస్యపవిత్రకం।ఏకైకంన్యూనముత్సృజ్యవర్ణానాంతుపవిత్రకం ॥ ౧౫ ॥ హోమార్చనేబ్రహ్మయజ్ఞేబ్రహ్మగ్రంధిర్విధీయతే। తథామంత్రజపేనైవనాన్యత్రైవతునిర్ణయః ॥ ౧౬ ॥ వలయంద్వ్యంగుళంప్రోక్తం గ్రధిరేకాంగుళిస్తథా । చతురంగుళిమాత్రన్తు పవిత్రస్యతులక్షణం ॥ ౧౭ ॥ నాపవిత్రకరంకుర్యాచ్ఛ్రౌతంస్మార్తంచ కర్మచ। వ్యర్థంయదికృతంసర్వంస్వయమప్యశుచిర్భవేత్ ॥ ౧౮ ॥ దర్భహీనాతుయాసంధ్యాయచ్చదానంవినోదకం।అసంఖ్యాతంచయజ్ఞప్తంతత్సర్వంనిష్ఫలంభవేత్॥ ౧౯ ॥ గ్రంథియుక్తపవిత్రేణ తేననాచమనంభవేత్ । నోచ్ఛిష్టంతత్పవిత్రంతుభుక్త్వోచ్ఛిష్టంతువర్జయేత్॥ ౨౦॥ గ్రంథియుక్తపవిత్రేణన ఆచమతియోద్విజః । విసృజ్యతత్పవి

త్రంతు పునరాచమ్యశుధ్యతి॥ ౨౧॥ స్నానేదానేజపేహో
మేస్వాధ్యాయేపితృకర్మణి । పవిత్రంతుకరేకుర్యాత్స్వర్ణం
వారజతంచవా ॥ ౨౨ ॥ సౌవర్ణదర్భరజతైర భావాద్ద
క్షిణేకరే । యఆచామేతమోహాద్వా ఆచాంతోరుధిరేణ
సః ॥ ౨౩ ॥ బ్రహ్మయజ్ఞేతుయేదర్భా యేదర్భాఃపితృకర్మణి।
యజ్ఞకర్మసుయేదర్భా యేదర్భాభోజనేస్థితాః । మూత్రాది
సక్తాయేదర్భా స్తేషాంత్యాగోవిధీయతే ॥౨౪॥ ...శ్రా—

తా ॥ బ్రాహ్మణునకు నాలుగుదర్భపుల్లలచేతను పవిత్రముకావలయును. ఇత రవర్ణములకొకటితగ్గించిన పవిత్రముకావలయును ॥ ౧౫ ॥ హోమమందును, బ్రహ్మ యజ్ఞమందును, మంత్రజపముచేతనే బ్రహ్మముడి నిర్ణయించబడియున్నది. ఇతరపవి త్రములకు మంత్రజపము అక్కరలేదు. ఇదినిర్ణయసిద్ధాంతము॥౧౬॥పవిత్రముయొక్క వలయము రెండంగుళములని చెప్పంబడియున్నది. అటువలెనే బ్రహ్మముడి యొక అం గుళప్రమాణమని చెప్పబడుచున్నది. అంతాకలసి పవిత్రము నాలుగంగుళములుగలది గనుండవలయును. ఇది పవిత్రలక్షణము ॥౧౭॥ శ్రుతిస్మార్తసంబంధమైనకర్మను పవి త్రపాణిగాకుండ చేయకూడదు. పవిత్రములేక చెయ్యబడిన యాకర్మ యావత్తు వ్యర్థముగను తానపరిశుద్ధుడుగనగును ॥ ౧౮ ॥ ఏసంధ్యదర్భరహితముగ చేయబడు నో, ఏదానము ఉదకములేక నివ్వబడుచున్నదో, ఏజపము ఎంచకుండ చేయబడు చున్నదోయది యావత్తుఫలరహితముగ నగుచున్నది ॥ ౧౯ ॥ ఆబ్రహ్మముడివేసిన ప విత్రముచేత నాచమనముచేయతగినదికాదు. ఆపవిత్రముత్యాగార్హముకాదు.భుజిం చిన పిమ్మట ఉచ్ఛిష్టమైన పవిత్రమును విడిపించవలయును ॥ ౨౦ ॥ ఏద్విజుడు బ్రహ్మ ముడివేసిన పవిత్రముతో నాచమనము చేయునోవాడు ఆపవిత్రమును విడపించితిరిగి ఆచమనముచేసిన శుద్ధినిపొందుచున్నాడు ॥ ౨౧ ॥ స్నానకాలమందు, దాన కాలమందు,జపకాలమందు, హోమకాలమందు, అధ్యయనకాలమందు, పితృకర్మకా లమందు స్వర్ణముతోచేయబడినదిగాని, వెండితోచేయబడినదిగాని, పవిత్రమును చే తియందుంచవలయును ॥ ౨౨ ॥ ఎవడు శ్రద్ధయొక్క అభావము వలనగాని అజ్ఞా నమువలనగాని, కుడిచేతిలో వెండి, బంగారు, దర్భపీట్లతోచేయంబడిన యేపవిత్ర ములేక, ఆచమనము చేయునో వాడు నెత్తురుతో నాచమనము చేయువాడగును. ౨౩ ॥ బ్రహ్మయజ్ఞమందేదర్భలు, పితృకర్మయందే దర్భలు, యజ్ఞకర్మమందేదర్భలు, భోజనకాలమందేదర్భ లుపయోగింపబడునో, ఏదర్భలు మూత్రాది సంబంధము లో వాటికి త్యాగము విధింపబడుచున్నది ॥ ౨౪ ॥ శ్రాద్ధారంభమునందేదర్భ—

ద్ధారంభేషుయేదర్భాఃపాదాశౌచేవిసర్జయేత్ । అర్చనాదౌతుయేదర్భా ఉచ్ఛిష్టాంతేవిసర్జయేత్ । పార్వణాదౌతుయేదర్భా ఆఘ్రాణాంతే విసర్జయేత్ । మార్జనాదౌతుయేదర్భాఃపిండోత్థానేవిసర్జయేత్ । ఉద్వాసమంత్రేయేదర్భా దక్షిణాంతేవిసర్జయేత్ ॥ ౨౬ ॥ శ్రాద్ధతర్పణకాలేచవివాహేయజ్ఞకర్మణి । దర్భహీనంతుయద్బ్రహీణఃపుత్రదారధనక్షయం ॥ ౨౭ ॥ అచ్ఛిన్నాగ్రా అశుష్కాగ్రాః పిత్ర్యేషుహరితాస్స్మృతాః । సమూలాదేవకార్యేషునియోజ్యాస్తుపునఃపునః ॥ ౨౮ ॥ గవాంవాలపవిత్రేణసంధ్యోపాస్తింకరోతియః। సర్వపాపవినిర్ముక్తః శ్శివలోకేమహీయతే ॥ ౩౦॥ కుశమూలేస్థితోబ్రహ్మాకుశమధ్యేజనార్దనః । కుశాగ్రేశంకరస్తిష్ఠేత్త్రయోదేవా వ్యవస్థితాః ॥ ౩౧ ॥ కుశాన్కాశంచపుష్పాణిగవార్థంచతృణాదికం।నిషిద్ధేవాపిగృహ్ణీయాద—

లుపయోగింపబడుచున్నవో వాటిని పాదప్రక్షాళనకాలమందు విసర్జించవలయును. అర్చనారంభమందేదర్భలుపయోగింపబడుచున్నవో వాటిని భోజనాంతరమందువిసర్జనచేయవలయును. పిండప్రదానాదియందే దర్భలుపయోగింపబడుచున్నవో వాటిని పితృభుక్తశేషాన్నమును ఆఘ్రాణించినపిమ్మట విసర్జనచేయవలయును. పిండమార్జనారంభమందు ఏదర్భ లుపయోగింపబడుచున్నవో వాటిని పిండోద్వాసనముచేసినకాలమందు విసర్జనచేయవలయును. పిండోద్వాసన మంత్రకాలమందు ఏదర్భలుపయోగింపబడుచున్నవో వాటిని దక్షిణ యిచ్చినపిమ్మట విసర్జనచేయవలయును॥ ౨౬ ॥ శ్రాద్ధతర్పణమందు వివాహకాలమందును, యజ్ఞకర్మయందును దర్భలేక నేకర్మచేయబడునోఅదిపుత్రదారధనక్షయములనుగలిగించును॥౨౭॥విరగనికొనలు,ఎండిపోనికొనలు, ఆకుపచ్చనివర్ణముగల దర్భలు పితృకర్మయం దుపయోగింపబడవలయునని చెప్పబడియున్నది. హవ్యములయందు వ్రేళ్లతోనుండిన దర్భలనుపయోగింపబడతగినవి ॥౨౮॥ ఆవుయొక్కతోకవెండ్రుకలచే చేయంబడిన పవిత్రముతో నెవడు సంధ్యావందనమును జేయునో (వాడు) సర్వపాపవినిర్ముక్తుడై శివలోకమందుకొనియాడబడుచున్నాడు ॥౩౦॥ కుశమొదలునందు బ్రహ్మదేవుడు, కుశమధ్యమమందు విష్ణువు, కుశాగ్రమునందు శంకరుం డుంచున్నాడు. ఈ ముగ్గురు దేవతలు దర్భయందు వ్యవస్థితులైరి ॥ ౩౧ ॥ ...ద్విజుడు అమావాస్య దినమందు రెల్లును,—

మావాస్యాహనిద్విజః ॥ ౩౪ ॥ కుశాఃకాశాయవాదూర్వా శ్శాలధూమాశ్చకుందరాః । ఉశీరా వ్రీహయోమహార్వాః దశదర్భాశ్చబల్బజాః ॥ ౩౫ ॥ కుశాః కాశాఃతథాదూర్వా యవా వ్రీహయ ఏవవా । బల్బజాః పుండరీకాశ్చస ప్తథా వ్రీహిరుచ్యతే ॥ ౩౬ ॥ మంత్రాఃకృష్ణాజినందర్భా బ్రాహ్మణాహవిరగ్నయః । ఆయాతయామాన్యేతానినియోజ్యాని పునఃపునః ॥౩౭॥ కుశాగ్రైస్తర్పయేద్దేవా న్మనుష్యాన్దర్భమధ్యతః । ద్విగుణీకృత్యమూలాగ్రైః స్సంతర్పణయేద్ద్విజః ॥ ౪౦ ॥ జపేదానేచ హోమేచస్వాధ్యాయె జలతర్పణే । యజ్ఞోపవీతేమౌంజ్యాంచతథాకుశపవిత్రకే । బ్రహ్మగ్రంథింవిజానీయాదన్యత్రతుయథారుచి ॥ ౪౧ ॥ ప్రథమం లంఘయేత్పర్వద్వితీయంతునలంఘయేత్ । ద్వయోస్తుపర్వణోర్మధ్యే పవిత్రం ధారయేద్బుధః ॥ ౪౨ ॥ కాశం—

పుష్పములును, ఆవునిమిత్తము గడ్డిమొదలైనవానిని గ్రహింపవలయును. నిషిద్ధదినములందుకూడ గ్రహింపవచ్చును ॥ ౩౪ ॥ దర్భలు, రెల్లు, యవలు, గరికె, వరి, గోధుమగడ్డి, వట్టివేళ్లు, ఇతరధాన్యపుగడ్డి, వింటినారి, మోదుగకసువు ఇవిపదియు దర్భలు ॥ ౩౫ ॥ దర్భలు, రెల్లు, వరిగడ్డి, యవలు, వడ్లు, మోదుగకసువు తెల్లతామర ఇవియేడువిధములైన వ్రీహి అనిచెప్పబడుచున్నవి ॥ ౩౬॥ మంత్రములు కృష్ణాజినము, దర్భలు, బ్రాహ్మణులు, హవిస్సు, అగ్నులు, ఇవిచద్దివికావు. తిరిగియు ప్రయోగించదగినవి ॥౩౭॥ ద్విజుడు దేవతల నుద్దేశించి కుశాగ్రముచేత తర్పణముచేయవలయును. మనుష్యులనుద్దేశించి దర్భమధ్యభాగముచేతను తర్పణము చేయవలయును. పితృలనుద్దేశించి దర్భనుమడతవేసి దర్భయొక్క కొనమొదలుచేతను తర్పణముచేయవలయును ॥ ౪౦ ॥ జపకాలమందు, హోమకాలమందు, దానకాలమందు, అధ్యయనకాలమందు, జలతర్పణకాలమందు యజ్ఞోపవీతమందు, మౌంజ్యయందు అటువలెనే కుశతో చేయబడిన పవిత్రమందు బ్రహ్మముడి వేయవలయునని తెలిసికొనవలయును. ఇతరకర్మయందు ఇష్టమైనముడివేయవచ్చును ॥౪౧॥ పవిత్రము(వేలుయొక్క) మొదటిగనుపును దాటవలయును. రెండవగనుపు దాటకూడదు. రెండుగనుపులయొక్క మధ్యమందు తెలిసినవాడు పవిత్రమును ధరించవలయును॥ ౪౨॥ రెల్లుతోగాని, రాగితోగాని, వెండితోగాని, బంగారముతోగాని (చేయబడి—

పవిత్రంతాంమ్రం వారాజతంహైమమేవవా । బిభృయా ద్దక్షిణేపాణౌ పవిత్రంచోత్తరోత్తరం ॥ ౪౩ ॥ అనామికా ధృతంహేమతర్జనీరాప్యమేవచ । కనిష్ఠికాధృతం ఖడ్గం తేనపూతోభవేన్నరః ॥ మాతులాజ్జీవనంయస్య రజతంస నధారయేత్ ॥ ౪౪ ॥ భానువారేతు గృహ్ణీయా ద్వారా ద్వారంప్రయోజనం । అమాయాంమాసమాత్రంస్యా త్పక్షమాత్రంతుపర్వణి । మాసిభాద్రపదేగృహ్ణా న్షణ్మాసం తత్ప్రయోజనం । శ్రావణ్యాంవత్సరమాత్రంస్యాచ్ఛ్రాద్ధా హేదద్దినేవిధిః ॥ ౪౫ ॥ పంచాశద్భిఃకుశైర్దర్భైః బ్రహ్మ కూర్చోవిధీయతే । తదర్ధైరాసనంకుర్యా చ్ఛాండిల్యాది మునీరితం ॥ ౪౬ ॥

(ఇతి లిఖితధర్మశాస్త్రే ద్వితీయోఽధ్యాయః.)

న) పవిత్రమునుకుడిచేతిలో ధరించవలయును. పైచెప్పినవాటిలో నొకటికంటెనొ కటివిశేషపరిశుద్ధమైనది ॥ ౪౩ ॥ బంగారముతోచేయబడిన పవిత్రము అనామికచే తను వెండితో చేయబడినది తర్జని (రెండవ) వ్రేలుచేతను, ఖడ్గముతో చే యంబడినపవిత్రము చిటికినవ్రేలుతోను, ధరించదగినది. దీనిచేతను మనుజుడుశు ద్ధుడవును. ఎవనికి మేనమామవలనజీవనమువాడు వెండినిధరింపగూడదు ॥౪౪ ॥ ఆ దివారమునందు గ్రహించినదర్భ ఆదివారము మొదలు ఆదివారమువరకు, అమావా స్యయందు గ్రహించిన యెడల నొకనెలవరకును, పున్నమయందు గ్రహించినయెడల పక్షమువరకునుపయుక్తమగును. భాద్రపదమాసమునందు గ్రహించిన ఆరుమాసముల వరకు దాని ప్రయోజనము పొందుచున్నాడు. శ్రావణ మాసమునందు గ్రహించిన యెడ నొక సంవత్సరముపయోగమవుచున్నది. శ్రాద్ధ దినమందు గ్రహించినది ఆది నమందుమాత్ర ముపయోగమని విధింపబడినది॥౪౫॥ఏబదికుశలచేతనుగాని దర్భలచే తనుగ్గాని బ్రహ్మకూర్చము చేయవలయునని విధింపబడుచున్నది. దానిలోసగము ద ర్భలచేత ఆసనమును చేయవలయును. ఇటుల శాండిల్యాదు మొదలగు ఋషు లచేత చెప్పంబడినది ॥ ౪౬ ॥

## తర్పణవిషయః.

౫౪. అంగుష్ఠమూలేచతథా ప్రాజాపత్యంవిచక్షణైః । అంగు

శ్యగ్రేస్మృతం దైవం పిత్ర్యం తర్జనిమూలకే ॥ ౨ ॥
(ఇతిశంఖస్మృతౌ దశమోఽధ్యాయః)

తా ॥ బొట్టనవ్రేలడుగున బ్రహ్మతీర్థము, వ్రేళ్లకొనయందు దైవతీర్థము, తర్జనీ వ్రేలడుగున పితృతీర్థము చెప్పబడియున్నది.

౫౫. స్నాతఃకృత జప్యస్తదను ప్రాఙ్ముఖోదివ్యేన తీర్థేన దేవానుద కేనతర్పయేత్ ॥ ౧ ॥ ప్రత్యృచం పురుష సూక్తేనోదకాం జలీన్దద్యాత్ పుష్పాఞ్జలీఞ్భక్త్యా ॥ ౨ ॥ అథకృతాపసవ్యో దక్షిణాభిముఖోంతర్జానుః పిత్ర్యేణ పిత్ర్యాణాంయథాశ్రా ద్ధప్రకారం సౌవర్ణేన పాత్రేణ రాజతే నౌదుంబరేణఖడ్గపా త్రేణ అన్యపాత్రేణవా ఉదకందద్యాత్ ॥౩॥ పిత్రే పితామ హాయ మాత్రే పితామహ్యై । మాతామహాయ ప్రమాతా మహాయ, మాతామహ్యై ప్రమాతామహ్యై ఇత్యాదిస ప్తమా త్పురుషాద్యావన్నామజానీయాత్ ॥ ౪ ॥ పితృప క్షాణాం తర్పణంకృత్వా మాతృపక్షాణాంగురూణాం సంబం ధి బాంధవానాంసుహృదాంచ కుర్యాత్ భవన్తిచాత్రశ్లో కాః ॥౫॥ వినారౌప్య సువర్ణేనవినా తామ్రమతిలేనచ, వి—

తా ॥ స్నానము చేసినవాడై జపము చేసినవాడై యావలతూర్పుముఖుడై దివ్యమనుతీర్థము చే దేవతలనుజలముతోటి తర్పణము చేయవలయును ॥ ౧ ॥ పురుష సూక్తముతోటి ప్రతి ఋక్కుకు దోసిలినీళ్లను, దోసిలి పువ్వులను భక్తితోటిని య్యవలయును ॥ ౨ ॥ అనంతరము అపసవ్యము చేసికొనినవాడైదక్షిణాభిముఖుడై రెండుమోకాళ్లనడుమ రెండుచేతులు వచ్చులాగున గూర్చున్నవాడై పితృతీర్థము చేత పితృదేవతలకు శ్రాద్ధరీతి చొప్పున బంగారు పాత్రతోటిగాని, వెండిపాత్రతోటిగాని, అత్తికొయ్యపాత్రతోటిగాని ఖడ్గపాత్రతోటిగాని, ఇతరపాత్రతోటిగాని, జలమునియ్యవలయును ॥ ౩ ॥ తండ్రికొరకు, తాతకొరకు, తల్లికొరకు, అవ్వకొరకు, తల్లి తండ్రికొరకు, తల్లి తాతకొరకు, తల్లి తల్లికొరకు, తల్లి అవ్వకొరకు ఇత్యాదియేడవ పురుషునివరకు ¦ ఎంతవరకు పేర్లుదెలుసు కొనియున్నాడో అంతవరకు తర్పణము చేయవలయును ॥ ౪ ॥ తండ్రివర్గపువారికి తల్లివర్గపువారికి తర్పణమునుచేసి యాచార్యులకు, సంబంధులకు బాంధవులకు, స్నేహితులకు, తర్పణము చేయవలయును. ఈవిషయమందు ప్రమాణశ్లోకములు గలవు ॥౫॥ వెండి,బంగార—

నాదర్భైశ్చమంత్రైశ్చపితౄణాంనోపతిష్ఠతే ॥ ౬ ॥ సౌవర్ణ రాజతాభ్యాంచఖడ్గేనౌదుంబరేణవా । దత్తమక్షయతాంయాతి పితౄణాంతు తిలోదకం ॥ ౭ ॥ హేమ్నాతుసహయద్దత్తంక్షీరేణ మధునాసహ । తదప్యక్షయతాంయాతి పితౄణాంతుతిలోదకం ౮॥ కుర్యాదహరహఃశ్రాద్ధమన్నాద్యేనోదకేనవా । పయోమూలఫలైర్వాపి పితౄణాంప్రీతిమావహన్ ॥ ౯ ॥ స్నాతస్తుతర్పణం కృత్వాపితౄణాం తుతిలాంభసా । పితృయజ్ఞ మవాప్నోతి ప్రీణాతిచ పితౄంస్తథా ॥ ౧౦ ॥

(ఇతిశ్రీశంఖస్మృతౌ త్రయోదశోఽధ్యాయః)

ములేక, రాగి తిలలు లేక, దర్భలులేక మంత్రములులేక, పితృదేవతలకు తర్పణము పొందదు ॥ ౬ ॥ బంగారు పాత్రతోటిగాని. వెండిపాత్రతోటిగాని ఖడ్గపాత్రతోటిగాని అత్తికొయ్య పాత్రతోటిగాని, పితృలకునియ్యబడిన తిలోదకము అక్షయముగ నగుచున్నది॥ ౭॥ బంగారముతోడను, పాలు, తేనె, వీటితోనివ్వబడిన తిలోదకముపితృదేవతలకు అక్షయముగనగుచున్నది ॥ ౮ ॥ విశ్వాసమును వహించినవాడై ప్రతిదినము అన్నముచేతనుగాని ఉదకముచేతనుగాని, పాలచేతనుగాని, పండ్లచేతనుగాని, పితృదేవతలకు శ్రాద్ధముచేయవలయును ॥ ౯ ॥ స్నానముచేసినవాడై పితృదేవతలకు తిలోదకముచే తర్పణమిడచిన పితృయజ్ఞఫలమును పొందుచున్నాడు. అటువలెనే పితృదేవతలను తృప్తులనుగచేయుచున్నాడు.

అతిథివిషయః.

౫౬. దూరాధ్వోపగతంశ్రాంతంవైశ్వదేవముపస్థితమ్ ।అతిథించ విజానీయాన్నాతిథిఃపూర్వమాగతః ॥౪౧॥ నైకగ్రామీణమతిథిం నగృహ్ణీతకదాచన । అనిత్యమాగతోయస్మాత్తస్మాదతిథిరుచ్యతే ॥౪౨॥ అతిథిర్యస్యభగ్నాశో గృహాత్ప్రతినివర్తతే । పితరస్తస్యనాశ్నంతి దశవర్షాణిపంచచ ॥ ౪౫ ॥ అపూర్వస్సువ్రతీవిప్రోహ్యపూర్వశ్చాతిథిస్తథా । వేదాభ్యాసరతోనిత్యంత్రయః పూజ్యాదినేదినే ॥ ౪౯ ॥ వైశ్వదేవేతుసంప్రాప్తే భిక్షుకేగృహమాగతే । ఉద్ధృత్యవై

శ్వదేవార్థం భిక్షుకంతువిసర్జయేత్ ॥౫౦॥ యస్యచ్ఛత్రంహయశ్చైవకుంజరారోహమృద్ధిమత్ । ఐంద్రంస్థానముపాసీత తస్మాత్తంనవిచారయేత్ ॥౫౩॥ అకృత్వావైశ్వదేవంతుభుంజంతేయేద్విజాధమాః । సర్వేతేనిష్ఫలాజ్ఞేయాః పతంతినరకేశుచా ॥౫౪॥ వైశ్వదేవవిహీనాయే ఆతిథ్యేనబహిష్కృతాః । సర్వేతేనరకంయాంతి కాకయోనింవ్రజంతిచ॥౫౫॥

(పారాశర్యాచారకాండే ప్రథమోఽధ్యాయః)

తా॥ పగలు వైశ్వదేవాంతరమున, సాయంకాలమునయెప్పుడయినం, గ్రామాంతరమునుండి దూరగమనంబున నాకొనియు, డస్సియువచ్చినవా డతిథియనియెఱుగునది. పూర్వదినంబున వచ్చినవాడతిథిగాడు ॥౪౧॥ అన్యగ్రామమునుండి భోజనాపేక్షగలిగి వచ్చినవాడును, అనిత్యముగ వచ్చువాడును, అతిథిగచేర్చుకొనందగును. ద్రవ్యలాభమవలంబించి యతిథివేషంబున నిత్యమువచ్చువారు అతిథులుగ నవలంబించజనదు ॥ ౪౨ ॥ అతిథి యేగృహమునుండి భగ్నాశుడైమరలునో యాగృహాధిపతియొక్క యన్నమును పితృదేవతలు పదునైదేండ్లవరకు నారగింపరు॥ ౪౫॥ సువ్రతుడగుయతియు వేదాధ్యాయనరతుడగు బ్రహ్మచారియు, అతిథియునీమువ్వురు ననుదినము బూజింపదగుదురు ॥౪౯॥ వైశ్వదేవముచేయకమున్న, యతి, బ్రహ్మచారులువచ్చిన వైశ్వదేవమునకు వలయునన్నమునుభాగించి భిక్షయిచ్చియేబంపవలయును ॥ ౫౦॥ గుఱ్ఱమెక్కి ఛత్రముతోనతిథిగవచ్చినరాజునుసందేహింపక దేవతగపూజించిన గజారోహణంబును, అమృతపానసమృద్ధియుగల యింద్రరాజ్యమునుపొందును॥౫౩॥ ఏద్విజులు వైశ్వదేవముచేయక భుజించుదురో వారు అధములైనిరర్థకులై నరకమును జెందుదురు ॥౫౪॥ అతిథి సత్కారముచేయనివారును, వైశ్వదేవముచేయనివారునునరకమననుభవించి కాకులైపుట్టుదురు ॥౫౫॥

౫౭. చతుర్వర్ణాతిథిఃప్రోక్తః కాలప్రాప్తోబహుస్మృతః । అదృష్టోఽపృష్టగోత్రాదిరజ్ఞాతాచారవిద్యకః । సంధ్యామాత్రకృతాచారస్సజ్ఞేస్తోతిథిరుచ్యతే॥ ౨॥ క్షుత్తృష్ణాధ్వశ్రమశ్రాంతః ప్రాణత్రాణాన్నయాచకః । గృహిణోవైశ్వదేవాంతే గృహద్వారముపాగతః॥౩॥ విష్ణురూపోఽతిథిస్సోయం మత్తారార్థమిహాగతః । ఇతిమత్వాచభక్త్యాచ వృణుయాద్భోజనాయతమ్ ॥౪॥ త్వంశుభేనమమాయాతస్సర్వదేవ మ

యోవిధిః । నిర్దహ్యసర్వపాపానిమమాచాయుఃప్రయాస్యతి॥ ౫॥ బ్రాహ్మణైస్సహభోక్తవ్యో భక్త్యాప్రక్షాళ్యపాద్వయమ్। ఆసనార్ఘ్యోదకం దత్త్వా దత్త్వా స్రక్చందనాదికమ్ ॥ ౬ ॥ క్షత్రియోయదివాగచ్ఛేదతిథిస్తస్యవేశ్మని । భుక్తేషుసత్సు విప్రేషుకామ్యతస్తతమాశయేత్ ॥౧౩॥ వైశ్యోవాయదివా శూద్రోవిప్రగృహంసమావ్రజేత్ । తౌభృత్యైస్సహభోక్తవ్యావితిపారాశరోఽబ్రవీత్ ॥౧౪॥

(బృహత్పారాశరీయే ద్వితీయోఽధ్యాయః)

తా॥ అతిథులు నాలుగువిధములుగ చెప్పబడిరి. వారుకాలప్రాప్తుడని, బహుస్మృతుడని, అదృష్టోపుష్టగోత్రాదిఅని, అజ్ఞాతాచారవిద్యకుడని సలువురు. అతిథిధర్మమును గుర్తెరిగినవారిచే సంధ్యావందనాద్యాచారములు గలవాడతిథియని చెప్పబడుచున్నాడు ॥౨॥ గృహస్థులు; ఆకలి, దప్పిక, మార్గాయాసముచేనలసి ప్రాణార్థమై అన్నమును యాచించుటకు వైశ్వదేవాంతమందు గృహద్వారమును బొందినటువంటి అతిథిని నీవువిష్ణురూపుడవనియు, నన్ను సంసారార్ణవమునుండి తరింపచేయువాడవనియు దలచి భక్తితోటి భోజనముకొరకు ప్రార్థించవలయును ॥౩,౪॥ ఓ ఆతిథీ నాక్షేమముకొరకువచ్చినవాడవు. ఇది సర్వదేవమయమైనవిధి గాన సర్వపాపములను దహింపచేసి నాకాయుర్వృద్ధిని చేయుమా ॥౫॥ అని ఈలాగున ప్రియోక్తులతో పాదోదకంబులును, స్రక్చందనాదులిచ్చి, ఆసనార్చనాదులను సమర్పించి బ్రాహ్మణులతోకూడ భుజింపచేయవలయును ॥౬॥ బ్రాహ్మణులయొక్కగృహమునకు క్షత్రియుడు అతిథిగ వచ్చినయెడలనదివరకు నిర్దేశింపబడిన బ్రాహ్మణ భోజనాంతరమతనిని యిచ్ఛానుసారముగ భుజింపచేయవలయును. ఒకవేళ వైశ్యుడుగాని శూద్రుడుగాని అతిథిగ వచ్చినయెడల వారలను పరిచారకులతోకూడ భుజింపచేసి యావల దంపతులు భుజింపవలయుననిబృహత్పారాశరులు జెప్పిరి॥౧౪॥

౫౮. సువాసినీంకుమారీశ్చ రోగిణోగర్భిణీస్త్రియః । అతిథిభ్యోగ్రఏవైతాన్భోజయేదవిచారయన్ ॥౧౧౪॥ భుక్తవత్స్వథవిప్రేషు స్వేషుభృత్యేషుచైవహి । భుఞ్జీయాతాంతతఃపశ్చాదవశిష్టంతుదంపతీ ॥౧౧౬॥

(మనుస్మృతౌ తృతీయోఽధ్యాయః)

తా॥ అతిథి భోజనమునకు ముందుఘద్బాధకోర్వని సువాసినీలను, కుమారిక లను, రోగిణులను, గర్భిణిస్త్రీలను, నిస్సంశయముగభుజింపచేయవలయును॥౧౧౪॥ బ్రాహ్మణుడు భుజించినపిమ్మట క్షత్రియులును తరువాత అతిథులుగవచ్చిన వైశ్యశూద్రులను తమపరిచారకులతోకూడ భుజింపచేసి ఆవలమిగిలిన అన్నమును దంపతులు శేషాన్నమని సంశయింపక భుజించవలయును.

౫౯. అతిథిర్యస్యభగ్నాశో గృహాత్ప్రతినివర్తతే ।
తస్మాత్సుకృతమాదాయ దుష్కృతంతుప్రయచ్ఛతి ॥
(ఇతి వైష్ణవే ధర్మశాస్త్రే సప్తషష్టితమోఽధ్యాయః)

తా॥ అతిథి భగ్నాశుడై ఎవరియింటనుంచి వెళ్లిపోవునో యతనిపుణ్యమును స్వీకరించుకొని యతని దుష్కృతమిచ్చిపోవును.

౬౦. వైశ్వదేవేనయేహీనా ఆతిథ్యేనవివర్జితాః । సర్వేతేవృషలాజ్ఞేయాః ప్రాప్తవేదాఅపిద్విజాః ॥౨॥ అకృత్వావైశ్వదేవంతుభుంజతేయేద్విజాతయః । వృథాతేతేనపాకేనశునాంయోనౌప్రజాయతే ॥౩॥ అద్భిశ్చవాక్యైశ్చమనోరమైశ్చ పుష్పైఃఫలైరంజలిభిఃతృణైశ్చ । ఏతేనదేవానతిథీన్పితౄంశ్చహ్యభ్యర్చయేదస్యతు నాస్తిసంపత్ ॥౪॥
(ఇతి శంఖలిఖితధర్మశాస్త్రే.)

తా॥ ద్విజులు వేదవిదులైనను ఎవరు వైశ్వదేవమును చేయరో, ఎవరుఅతిథిసత్కారమును చేయరోవారందరును శూద్రులనితెలుసుకొనదగినది ॥ ౨ ॥ ఏద్విజులు వైశ్వదేవక్రియనుచేయక వ్యర్థమగుపాకముచేభుజించుచున్నారోవారుకుక్కలయొక్క గర్భమందు పుట్టుచున్నారు ॥ ౩ ॥ ఎవనికికలిమిలేదోవాడు ఉదకముచేతను, మాటలచేతను, ప్రియమైనపుష్పములచేతను, ఫలములచేతను చేమోడ్పులచేతను గడ్డి (తోచేయబడినచాప) చేతను, వీటిచేతను దేవతలను, అతిథులను పితృదేవతలను పూజింపవలయును ॥౪॥

౬౧. వైశ్వదేవేనయేహీనా ఆతిథ్యేనబహిష్కృతాః । సర్వేతే వృషలాజ్ఞేయాః ప్రాప్తవేదాఅపిద్విజాః ॥౨॥ అకృత్వావైశ్వదేవంతుభుంజంతేయేద్విజాధమాః । వృథాతేనాన్నపాకేన పాపయోనింవ్రజంతితే ॥౩॥
(ఇతి శాతాతపస్మృతౌ షష్ఠోఽధ్యాయః.)

తా ॥ ఎవరు వైశ్వదేవము అతిథిపూజ చేయరో, అట్టిద్విజులు వేదమును చదివినప్పటికి శూద్రులుగ దెలియదగినది ॥౨॥ ఏద్విజులు వైశ్వదేవమును జేయక భుజించెదరో వారు అన్నపాకముచే దుష్టజన్మను బొందుచున్నారు ॥3॥

అభివాదనప్రశంసా.

౬౨. బ్రహ్మణాః క్షత్రియాద్యైశ్చ శ్రీకామైస్సాదరం సదా । నాభివాద్యాస్తు విప్రేణాం క్షత్రియాద్యాః కథంచన॥౪౬॥...బ్రాహ్మణాస్సర్వవర్ణానాం స్వస్తికుర్యాదితి స్థితిః ॥౪౭॥ సవర్ణేష్వసవర్ణానాం కార్యమేవాభివాదనమ్॥౪౮॥

(ఔశనసస్మృతౌ ప్రథమోఽధ్యాయః.)

తా ॥ బ్రాహ్మణుడెల్లప్పుడు ప్రీతితో (శ్రీకాములై) శ్రేయస్సును కోరునట్టి క్షత్రియాదులచే నమస్కరింపదగినవాడు. గాని క్షత్రియాదులు ఏవిధముగనైనను బ్రాహ్మణులచే నమస్కరింపబడదగినవారు కారు. ... బ్రాహ్మణులు సర్వ వర్ణములకు (స్వస్తినై) దీవన నేచేయవలసినదనిమర్యాద. అసవర్ణులగు బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులలో సవర్ణమందొకరికొకరు ప్రత్యభివాదనము చేయవలసినది.

౬3. అభివాదనశీలస్య నిత్యం వృద్ధోపసేవినః। చత్వారి తస్య వర్ధంతే ఆయుర్విద్యా యశో బలమ్ ॥ ౧౨ ॥ యో న వేత్త్యభివాదస్య విప్రః ప్రత్యభివాదనమ్ । నాభివాద్యస్స విదుషః యథా శూద్రస్తథైవ సః ॥ ౧౨౬ ॥

(మనుధర్మశాస్త్రే ద్వితీయోఽధ్యాయః)

తా॥ ఎల్లప్పుడు అభివాదనశీలుడై వృద్ధులను సేవించునట్టి పురుషునకు ఆయుష్షు విద్యయు, కీర్తి బలము వృద్ధిబొందుచున్నవి ॥ ౧౨ ॥ ఏ బ్రాహ్మణుడు అభివాదనమునకు ప్రత్యభివాదనమును చేయుటగుర్తెరుగడో అతను శూద్రవతుగ విద్వాంసులచే నమస్కరింపదగినవాడు కాడు.

౬౪. అభివాదనశీలస్య నిత్యం వృద్ధోపసేవినః । జ్ఞానవృద్ధాస్తపోవృద్ధా వయోవృద్ధా ఇతి త్రయః ॥ ఆధ్యాత్మికాని దుఃఖాని నివారయతి యో గురుః । వేదశాస్త్రోపదేశేన తం పూర్వమభివాదయేత్ ॥ నాభివాద్యాశ్చ విప్రేణ క్షత్రియాద్యాః కదాచన ॥ 3౪ ॥ నాస్తికం భిన్నమర్యాదం కృతఘ్నం గ్రామయా

జకం । స్తేనంచకితవంచైవకదాచిన్నాభివాదయేత్ ॥ ౩౬॥
ఉన్మత్తంచశఠంధూర్తంధావంతమశుచింతథా । అభ్యక్త
శిరసంచైవజపంతన్నాభివాదయేత్ ॥ ౩౭ ॥ పాషండంకిత
వంవ్రాత్యం తథానక్షత్రజీవినం । తథాపాతకినంచైవకదా
చిన్నాభివాదయేత్ ॥౩౮॥ సభాయాంయజ్ఞశాలాయాందేవ
తాయతనేషుచ । ప్రత్యేకంతునమస్కారోహంతిపుణ్యంపు
రాకృతం ॥ ౩౯ ॥ పుణ్యక్షేత్రేపుణ్యతీర్థేస్వాధ్యాయసమ
యేతథా । ప్రత్యేకంతునమస్కారోహంతిపుణ్యంపురాకృ
తం॥ ౪౦ ॥ తథాశ్రాద్ధంవ్రతందానందేవతాభ్యర్చనంతథా ।
యజ్ఞంచతర్పణంచైవకుర్వంతంనాభివాదయేత్ ॥ ౪౧ ॥క
తేభివాదనేయస్తు నకుర్యాత్ప్రతివాదనం । నాభివాదస్సవిజ్ఞే
యో యథాశూద్రస్తథైవసః ॥ ౪౨ ॥

(ఇతిలిఖితస్మృతౌషష్ఠోధ్యాయః)

తా ॥ అభివాదన (పెద్దలకు పాదస్పర్శనగోత్ర నామపూర్వకముగ చేయునది) ఈలాగు అభివాదనము చేయుస్వభావముగలవానికి, పెద్దలనుసేవించువానికి, జ్ఞానవృద్ధులు తపోవృద్ధులు, వయోవృద్ధులు ఈముగ్గురు ఎల్లప్పుడు నమస్కారార్హులు, వేదశాస్త్రోపదేశమును ఆధ్యాత్మికాదివ్యసనమును నివారించువానిని, ముందుగా పాదస్పర్శనాదిపూర్వకముగ నమస్కరించవలయును. మరియుక్షత్రియవైశ్యాదులు ఎప్పుడునుబ్రాహ్మణులచేత నమస్కారార్హులుగారు, నాస్తికుని, చెడిపోయినమర్యాదగలవానిని, చేసినమేలుమరచినవానిని గ్రామపురోహితునిని, దొంగను, వంచకుని, ఎప్పుడునమస్కరించకూడదు ॥౩౬॥ ఉన్మత్తుని, మూర్ఖునిని, జూదరిని, నడుచుచుండెడివానిని, అశుచిని, అభ్యంగనము చేయబడినశిరముగలవానిని, జపిని, నమస్కరించగూడదు ॥ ౩౭ ॥ వేద బాహ్యుని గారిడి చేయువానిని సకాలోపనయనముకానివానిని జ్యోతిష్కుని పాతకునినినమస్కరించకూడదు ॥౩౮॥ సభయందును, దేవాలయమందును, ప్రత్యేక నమస్కారము చేయకూడదు. అట్లు చేసినపురాకృతపుణ్యమును హరించును.॥౩౯॥ అటులనే పుణ్యక్షేత్రములయందును వేదాధ్యయనమందును, ప్రత్యేక నమస్కారము చేయగూడదు. చేసిన పురాకృత పుణ్యముహరించును॥౪౦॥శ్రాద్ధమును, వ్రతములను, యజ్ఞములను, దానములను, తర్పణములను, చేయునట్టిద్విజులను అభివాదనచేయకూడదు ॥౪౧॥ ఎవడుఅభివాదనముపొందిప్రత్యభివాదనము చేయడో వానిని శూద్రసమునిగ గుర్తెరుగవలయును॥౪౨॥

౬౫. దక్షిణంబాహుంశ్రోత్రసమంప్రసార్యబ్రాహ్మణోభివాదయీ తోరస్సమంరాజన్యోమధ్యసమంవైశ్యోనీచైశ్శూద్రఃప్రాంజలిరితి॥ఆపస్తంబః సూ.

(వైద్యనాథదీక్షితీయేస్మృతిముక్తాఫలే, పేజి, ౮౨)

తా॥ బ్రాహ్మణుడు దక్షిణభుజమును చెవులవరకుప్రసరింపచేసియు, రాజుహృదయమునకు సమముగను, వైశ్యుడు హృదయమునకు క్రిందుగను శూద్రుడు జానువులసమముగను దోసిలినిచేర్చి నమస్కరింపవలయును.

ప్రాయశ్చిత్తవిషయః.

౬౬. నాభివాద్యస్తువిప్రేణ క్షత్రియాద్యాకథంచన । జ్ఞానకర్మగుణోపేతా యద్యప్యేతేబహుశ్రుతాః । క్షత్రంవైశ్యం చాభివాద్యప్రాయశ్చిత్తంకథంభవేత్ ॥ బ్రాహ్మణానాందశాష్టౌచ అభివాద్యవిశుధ్యతి । అభివాద్యద్విజశ్శూద్రంసచేలంస్నానమాచరేత్ । బ్రాహ్మణానాంశతంసమ్యగభి వాద్య విశుధ్యతి।అర్చయేత్పుండరీకాక్షం దేవంవాత్రిలోచనమ్॥ బ్రాహ్మణంవామహాభాగమభివాద్యవిశుధ్యతి ॥ అభివాదనే తుసర్వత్రపాదస్పర్శనమేవవా । విప్రాణాంప్రాంజలిః కార్యోనమస్కారస్సఉచ్యతఇతివృద్ధమనుః।సర్వేచాపినమస్కార్యాస్సర్వావస్థాసుసర్వదా।ఆశీర్వాచ్యానమస్కార్యైర్వాయస్యస్తుపునర్నమేదితిస్మృతిభాస్కరే॥అభివాదనేనమస్కారేతథాప్రత్యభివాదనం । ఆశీర్వాచ్యానమస్కారైర్వాయస్యస్తుపునర్నమేత్ ॥ స్త్రీయోనమస్యావృద్ధాశ్చవయసాపతిదేవతాఇతిస్మృత్యర్థసారే॥

(వైద్యనాథదీక్షితీయే స్మృతిముక్తాఫలేపేజి ౮౩)

తా॥ క్షత్రియాదులు జ్ఞానకర్మగుణోపేతులైనను బహుశాస్త్రజ్ఞులైనను బ్రాహ్మణునిచే నేవిధముగనునమస్కరింపబడదగినవారుకారు. క్షత్రియవైశ్యులను, నమస్కరించిన బ్రాహ్మణునికి ప్రాయశ్చిత్తమేలాగనిప్రశ్నచేయగ బ్రాహ్మణుడు పదిమందినిగాని లేక ఎనిమిదిమందినిగాని బ్రాహ్మణులను నమస్కరించినపరిశుద్ధిని పొందుచు

25.

న్నాడు. క్షత్రియవైశ్యులు శూద్రునకు నమస్కరించిన సచేలస్నానముసుచేసి అనంతరము నూరుగురుబ్రాహ్మణులను లెస్సగనమస్కరించిన పరిశుద్ధులగుచున్నారు. ఆవల విష్ణువుసుం ఈశ్వరునింబూజించి మహాభాగుడగు బ్రాహ్మణుని నమస్కరించిన పరిశుద్ధుడగుచున్నాడు. బ్రాహ్మణులపాదస్పర్శనము చేయుటఅభివాదనమనియు, దోసిలిచేయుట నమస్కారమనియు జెప్పంబడినది. అందరెల్లప్పుడు అన్నిసమయముల యందు నమస్కారార్హులే గావున అట్టివారలచే ఆశీర్వచనము చెప్పంబడ దగినది. స్నేహితుడు నమస్కరింపబడినవాడై మరలనమస్కరింపవలయునుగాని యాశీర్వచనము చేయకూడదు. అభివాదనమందు ప్రత్యభివాదనము (అనగ పెద్దవానికికనిష్ఠుడు అభివాదనచేయునప్పుడు ఆకనిష్ఠుని నామాంతమందున్న అకారము ప్లుతమగునటులజ్యేష్ఠునిచే ‹‹ఆయుష్మాన్ భవసౌమ్య దేవదత్తా౩ఇతి› అనిచెప్పుటప్రత్యభివాదనము. నమస్కరించినవారలకు ఆశీర్వచనము చేయవలయునని చెప్పంబడినది. స్నేహితుడైతే నమస్కరింపబడినప్పుడు దానికిబదులు నమస్కరించవలయునుగానిఆశీర్వదించంగూడదు. ఇంకవయోవృద్ధులు, పతివ్రతాస్త్రీలు నమస్కారార్హులే.

౬౭. అభివాద్యనమస్కార్యాచ్ఛిరసావంద్యఏవసః। బ్రాహ్మణఃక్షత్రియాద్యైస్తు శ్రీమద్భిస్సాదరంసదా ॥ ౪ ॥ ... సవర్ణేషుసవర్ణానాం కార్యమేవాభివాదనం। అభివాద్యోబ్రాహ్మణైస్తున్నృపతిర్నకదాచన ॥ ౭ ॥ అభివాదనమస్కారావాదయేద్వందనేకృతే । స్వస్తీత్యేవంవదేద్విప్రః క్షత్రవిట్ఛూద్రజాతిషు ॥౮॥

(శాతాతపధర్మశాస్త్రే ద్వాదశోఽధ్యాయః.)

తా॥ ఆ(పూర్వోక్తలక్షణములుగల) బ్రాహ్మణుడుశ్రీమంతులైనక్షత్రియాదులచేత నాదరముతోనెల్లప్పటికిని వందనార్హుడేగనుక (అభివాద్య)=ప్రవరచెప్పి శిరసానమస్కారముచేయతగినవాడు ॥౪॥ సమానజాతియందు సమానజాతివారలకు, అభివాదనముచేయందగినది. రాజుయెప్పుడును బ్రాహ్మణులచేత నమస్కారముచేయబడదగినవాడుకాడు ॥౭॥ బ్రాహ్మణునకు బ్రాహ్మణుడు వందనముచేసినయెడలఆశీర్వాదముగాని, నమస్కారముగానిచెయ్యవలసినది. క్షత్రవిట్ఛూద్రులునమస్కారముజేసిన క్షేమము(కలుగుగాక) అని స్వస్తివాచకము చెప్పవలసినది.

నాభివాదనవిషయః,

౬౮. మత్తంప్రమత్తమున్మత్తం ధావంతమశుచింతథా । వమ

స్తంజృంభమాణంచకుర్వంతం దంతధావనం । అభ్యక్తశి
రసంస్నానంకుర్వంతం నాభివాదయేత్ ॥ జపయజ్ఞగణస్థాం
శ్చసమిత్పుష్పకుశానలాన్ । ఉదపాత్రార్ఘ్యభైక్షాన్నంవ
హంతంనాభివాదయేత్ ॥...సభాసుచైవసర్వాసు యజ్ఞేరా
జగృహేషుచ।నమస్కారంప్రకుర్వీత బ్రాహ్మణాన్నాభివాద
యేత్ ॥ దూరస్థంజలమధ్యస్థం ధావంతంధనగర్వితం।రోగా
క్రాంతంమదోన్మత్తం షడ్విప్రాన్నాభివాదయేత్ ॥

(వైద్యనాథదీక్షితీయే స్మృతిముక్తాఫలే పేజి ౮౩)

తా॥ మత్తుని ప్రమత్తుని పిచ్చివానిని పరిగెత్తువానిని అపరిశుద్ధుని, వమనము చేయువానిని, ఆవలించువానిని, దంతధావనము చేయువానిని, అభ్యంగస్నానము చేయువానిని, జపమందు, యజ్ఞమందు, సమూహమందున్నవానిని, సమిథలను పుష్పములను కుశలను అగ్నులను ఉదకపాత్రను పూజాద్రవ్యమును, భిక్షాన్నమును, వహించినవారిని, సభలయందును రాజగృహమందుండినవారిని దూరమందు, ఉదకమందుండినవారిని, గర్విని, రోగిని ఈలాటి బ్రాహ్మణులను నమస్కరింపకూడదు.

## దానవిషయః.

౬౯. అపాత్రేవాపియద్దత్తం దహత్యాసప్తమంకులమ్ । హవ్యం
దేవానగృహ్ణన్తి కవ్యఞ్చపితరస్తథా । ఆయసేనతుపాత్రేణ
యదన్నముపదీయతే ॥ అన్నంవిష్ఠాసమంభోక్తు ర్దాతాచన
రకంవ్రజేత్ ॥

(అత్రిసంహిత)

తా॥ దానార్హుడు కానివానియందేదివ్వబడునోయది ఏడుపురుషాన్తరములపర్యంతమువంశమును కాల్చుచున్నది. అపాత్రునియందివ్వబడిన, హవ్యమును దేవతలు, కవ్యమును పితృదేవతలు గ్రహింపరు. ఇనుపపాత్రచేనివ్వబడినయన్నము భోక్తకువమనము చేయబడిన చందముగనగుచున్నది. దాతయు నరకమును పొందుచున్నాడు.

౭౦. బ్రాహ్మణాతిక్రమోనాస్తి మూర్ఖేమంత్రవివర్జితే । జ్వలం
తమగ్నిముత్సృజ్యనహి భస్మనిహూయతే ॥33 ॥...వేదవి
ద్యావ్రతస్నాతే శ్రోత్రియేగృహమాగతే । క్రీడంత్యోషధ

యన్సర్వ్వే యాస్యామఃపరమాంగతిమ్ ॥ ౫౮ ॥ నష్టశౌచే వ్రతభ్రష్టే విప్రేవేదవివర్జితే । దీయమానంరుదత్యన్నం కిమ్మయాదుష్కృతంకృతమ్ ॥ ౫౯ ॥ పితుశ్శతగుణందానం సహస్రంమాతురుచ్యతే । భగిన్యాశ్శతసాహస్రం సోదరేద త్తమక్షయం ॥౬౧॥ అమావాస్యాపితాప్రోక్తో మాతాచ ద్వాదశీమతా । అయనేచభగిన్యోద్వే వ్యతీపాతస్తుసోదరః॥ ౬౨॥ శ్రోత్రియాయకులీనాయ వినీతాయతపస్వినే । వ్రతస్థాయదరిద్రాయ సర్వభూతహితాయచ ॥ ౬౩ ॥ ఈదృశాయనరవ్యాఘ్ర దత్తమల్పంశచీపతే । కులంతారయతే దాతు స్సప్తసప్తచసప్తచ ॥౬౪॥

(ఇతి బృహస్పతిస్మృతి)

తా ॥ మంత్రహీనుడగు మూర్ఖుని విషయములో, బ్రాహ్మణాతిక్రమ దోషములేదు. జ్వలించుచున్న యగ్నినివిడచి బూడిదలో హోమముచేయుచుంద మేగదా॥ ౩౩ ॥ ... వేదవిద్యయొక్క వ్రతసమాప్తిచేసిన శ్రోత్రియుడు గృహమునకువచ్చినప్పుడు సమస్తములగు భక్ష్యణార్హములైన ద్రవ్యములు త్తమగతిని పొందెదమనిసంతోషించుచున్నవి ॥ ౫౮ ॥ శౌచరహితుడై వ్రతభ్రష్టుడై వేదముజదువని బ్రాహ్మణునికియ్యబడిన అన్నమునాచే నేమిపాపముచేయబడినదని యేడ్చుచున్నది ॥ ౫౯ ॥ అమావాస్య తండ్రియని, ద్వాదశి తల్లి యని, రెండైనములు సోదరీలని, వ్యతీపాతము సోదరుడని, చెప్పబడినది. తండ్రికిచ్చినదానము నూరుగుణములుగలదిగను, తల్లికిచ్చిన దానము సహస్రగుణములుగలదిగను సోదరీలకిచ్చినదానము నూరువేలగుణములుగలదిగను, సోదరునియందియ్యబడినదానము తరగని ఫలముగలదిగను చెప్పబడుచున్నది. శచీపతియగు ఓరాజా॥బ్రహ్మనిష్ఠుడును,సత్కులమందుజన్మించినవాడును,శిక్షితుడును, తపోవంతుడును,వ్రతస్థుడును, సర్వభూతహితుడును,ఈలాటిగుణసంపన్నుడైన, దరిద్రునికొరకు నియ్యబడినదిస్వల్పమైనను జాతసంబంధమైన ఇరువదియొక్క కులములను తరింపచేయుచున్నది.

౭౧. శ్రోత్రియాయైవదేయాని హవ్యకవ్యానినిత్యశః । అశ్రోత్రియాయదత్తానితృప్తింనాయాన్తిదేవతాః॥ యస్యచైవగృహే మూర్ఖో దూరేచైవబహుశ్రుతః । బహుశ్రుతాయ దా

తవ్యంనాస్తిమూర్ఖేవ్యతిక్రమః ॥ బ్రాహ్మణాతిక్రమోనాస్తి విప్రేవేదవివర్జితే॥జ్వలన్తమగ్నిముత్సృజ్యనహిభస్మనిహూయతే ॥ యశ్చకాష్ఠమయోహస్తీ యశ్చధర్మమయోమృగః । యశ్చవిప్రోఽనధీయాన స్త్రయస్తేనామధారకాః ॥ విద్వద్భోజ్యాన్యవిద్వాంసో యేషు రాష్ట్రేషుభుంజతే । తదన్నంనాశమాయాతి మహద్వాజాయతేభయమ్ ॥

(ఇతి వాశిష్ఠే ధర్మశాస్త్రే తృతీయోఽధ్యాయః)

తా ॥ ఎల్లప్పుడు శ్రోత్రియులకే హవ్యకవ్యములనియ్యవలయును. అశ్రోత్రియునకియ్యబడిన హవ్యకవ్యములనుగూర్చిపితృదేవతలు తృప్తినిబొందరు ...కొయ్యతోచేయంబడిన యేనుగు, హింసించనిమృగము, అధ్యయనముచేయని బ్రాహ్మణుడు ఈముగ్గురు నామధారకులు. దేశములయందు విద్వాంసులుభుజించదగినయన్నమును మూర్ఖులుభుజించుటచే యాయన్నము నాశనముబొందుటయేగాక గొప్పభయోపద్రవములను గలుగజేయుచున్నది.

౭౨. యస్యచైవగృహేమూర్ఖో దూరేచాపిగుణాన్వితః । గుణాన్వితాయదాతవ్యం నాస్తిమూర్ఖేవ్యతిక్రమః ॥ బ్రాహ్మణాతిక్రమోనాస్తివిప్రేవేదవివర్జితే । జ్వలన్తమగ్నిముత్సృజ్యనహి భస్మనిహూయతే ॥ విద్యావినయసంపన్నే బ్రాహ్మణేగృహమాగతే । క్రీడంత్యోషధయస్సర్వా యాస్యామఃపరమాంగతిమ్ ॥ ౫౦ ॥ నష్టశౌచేవ్రతభ్రష్టే విప్రేవేదవివర్జితే । దీయమానంరుదత్యన్నం భయాద్వైదుష్కృతం కృతమ్ ॥ ౫౧ ॥ వేదపూర్ణముఖంవిప్రం సుభుక్తమపిభోజయేత్ । నచమూర్ఖంనిరాహారం షడ్రాత్రముపవాసినమ్ ॥ ౫౨ ॥ యానియస్యపవిత్రాణి కుక్షౌతిష్ఠంతిభోద్విజాః। తానితస్యప్రయోజ్యాని నశరీరాణిదేహినామ్ ॥ ౫౩ ॥

(ఇతి వ్యాససంహితాయాం చతుర్థోఽధ్యాయః.)

తా॥ ఇంటియందు మూర్ఖుడుండినను, అతనినివదలి దూరమందున్న గుణవంతునకే యివ్వవలయునుగాని మూర్ఖునకుకూడదు. అందుచే మూర్ఖవ్యతిక్రమదోష

ములేదు. వేదవివర్జితుడైన బ్రాహ్మణునియందు వ్యతిక్రమ దోషములేదు. ప్రజ్వలించు చున్న యగ్నినివదలి ఆజ్యాదికమైన హవిస్సుబూడిదయందు హోమము చేయబడదు. విద్యావినయసంపన్నుడగు బ్రాహ్మణుడు ఇంటికివచ్చినయెడ గృహమందుండు పదార్థములన్నియు పరమగతిని బొందెదమని క్రీడించుచున్నవి. అపరిశుద్ధుడు, వ్రతహీనుడు, వేదహీనుడగు బ్రాహ్మణునకిచ్చినయన్నము దనకుబలాత్కారముగ దుష్టవశమై పాపగతినిబొందితిమని భయముచే ప్రలాపించుచున్నది ॥ ౫౨ ॥ వేదమురానివాడు ఆరురాత్రులుపవాసియైననుఅతనికియ్యక వేదాధ్యాయనపరుడై తృప్తిగభుజించినవాడైనను అట్టివానికేభోజన మియ్యవలయును ॥ ఓ ద్విజులారా యెవనికుక్షియందు పవిత్రములగు వేదాక్షరములు ఎన్నియుండెనో అవియన్నియు అతనికి ప్రయోజనకరములైనవిగాన ప్రాణులకు శరీరములు ప్రయోజ్యకరమైనవిగావు.

23. ...బ్రాహ్మణాతి క్రమోనాస్తి మూర్ఖేమంత్ర వివర్జితే। జ్వలంతమగ్నిముత్సృజ్య నహిభస్మనిహూయతే ॥ ౧౭ ॥ వేదవిద్యావ్రతస్నాతే శ్రోత్రియేగృహమాగతే । నదంత్యోషధయస్సర్వా యాస్యామఃపరమాంగతిం ॥౨౦॥ నష్టవేదేవ్రతభ్రష్టే విప్రేవేదవివర్జితే । రుదంత్యోషధయస్సర్వా యాస్యామోహ్యధమాంగతిం ॥ ౨౧ ॥ తత్త్వమేతత్స్మృతంయస్మాత్పాత్రదానంమహర్షిభిః। తస్మాదపాత్రమస్థానం బీజస్యేవోషరంయథా ॥ ౨౨ ॥ వేదపూర్ణముఖం విప్రంసుభుక్తమపిభోజయేత్ । నతుమూర్ఖంనిరాహారంషడ్రాత్రముపవాసినం ॥ ౨౩ ॥

(ఇతి శాతాతపస్మృతౌ షష్ఠోఽధ్యాయః)

తా ॥ ఇందు "బ్రాహ్మణాతి—గతిమ్" వరకర్థము ౭౦-నంబరులో ౫౯-వరకు చూడందగును. మహాఋషులచే సత్పాత్రదానముయొక్క తత్వము చెప్పంబడినది. ఎట్లనగ చౌసరక్షేత్రమందు పడినభీజమువలె అపాత్రునియందిచ్చినదానము నిష్ఫలమగుచున్నది ॥౨౨॥ వేదము సమగ్రముగ జదివిన బ్రాహ్మణుడు భుజించివచ్చిననుభుజింపచేయవలసినది. మూఖుడు ఆరుదినములుపస్తుపడివచ్చినను భుజింపచేయగూడనివాడుగనగుచున్నాడు.

భోజనవిషయః.

28. అన్నదానఫలంశ్రుత్వాప్రీతోస్మ్యసురసూదన । భోజనస్య విధింవక్తుం దేవదేవత్వమర్హసి ॥౧॥ భగవాన్॥ భోజనస్య

ద్విజాతీనాంవిధానంశ్రుణుపాండవ । స్నాతశ్శుచిశ్శుచౌదేశే నిర్జనేహుతపావకః ॥ ౨ ॥ మండలంకారయిత్వాతుచతురశ్చద్విజోత్తమః । క్షత్రియస్తుతతోవృత్తంవైశ్యస్తుధనుసన్నిభమ్ ॥ ౩ ॥ కూర్చపాదస్తుభుంజీయాత్ప్రాఙ్ముఖశ్చాసనేశుచౌ । పాదాభ్యాంధరణీంస్పృష్ట్వా పాదేనైకేన వాపునః ॥ నైకవాసాస్తుభుఞ్జీయాన్నైవాంతర్ధాయవైద్విజః । నభిన్నపాత్రేభుఞ్జీతపర్ణపృష్ఠేతథైవచ ॥

(ఇతి గౌత వైష్ణవధర్మశాస్త్రే) త్రయోదశోఽధ్యాయః)

తా ॥ రాక్షసనాశకుడగు ఓకృష్ణా అన్నదానఫలమునువిని సంతోషించినవాడనైతిని గాన ఓదేవదేవుడా భోజనము చేయునట్టి క్రమమును చెప్పుటకు తగుదువని యడగగ నటుమీదట భగవంతుడు ధర్మజునకు వచించినదేమనగ ఓపాండవుడా ద్విజులభోజనవిధినిచెప్పెదను వినుమా! బ్రహ్మ క్షత్రియ వైశ్యులు స్నాతులై పరిశుద్ధులై నిర్మలమగు జనరహితమైన స్థలమునందు హోమముచేసినయగ్నికలవారై క్రమముగ నాల్గుకోణములుగలదిగనున్న గుండ్రముగనున్న ధనురాకారముగను మండలములను చేసి. దర్భకూర్చ పాదములయందుగలవారలై అనగ దర్భపాదములక్రిందవేసుకొని తూర్పుముఖముగ నిర్మలాసనమందు కూర్చున్నవారై రెండుపాదములచేగాని లేక వకపాదముచేగాని భూమినిస్పృశించుచు భుజింపవలయును. ద్విజుడు ఏకవస్త్రముచేగాని వస్త్రమునుకప్పుకొనిగాని పగిలిన పాత్రయందుగానీ ఆకువెనుకతట్టుగాని భుజింపగూడదు.

మండలాధిష్ఠానదేవతాప్రశంసా.

౭౫. బ్రహ్మావిష్ణుశ్చరుద్రశ్చశ్రీహుతాశనఏవచ।మండలాన్యుపభుంజంతేతస్మాత్కుర్వంతిమండలం । యాతుధానాఃపిశాచాశ్చక్రూరాశ్చైవతురాక్షసాః ॥ హరన్తిరసమన్నస్యమండలేనవివర్జితే । గోమయంమండలంకృత్వాభోక్తవ్యమితి నిశ్చితమ్ ॥ బ్రాహ్మణాన్నందదచ్ఛూద్రః శూద్రాన్నం బ్రాహ్మణోదదత్ । ఉభావేతావభోజ్యాన్నౌభుక్త్వాచాన్ద్రాయణంచరేత్ ॥

(ఇతి లఘుఅత్రిసంహితాయాం పంచమోఽధ్యాయః.)

తా॥ బ్రాహ్మణుని మండలమునకు బ్రహ్మయు,క్షత్రియునిమండలమునకువిష్ణువు వైశ్యునిమండలమునకు రుద్రుడు, శూద్రునిమండలమునకు శ్రీహుతాశనులు, నధిదేవతలై యామండలములననుభవింతురు. గావున మండలముల నెల్లప్పుడు జేయవలయును. అట్లుజేయనియెడల రాక్షసులు పిశాచాదులు క్రూరులైనయసురులు యన్నరసమున పహరించెదరు. బ్రాహ్మణాన్నము నిచ్చునట్టిశూద్రాన్నమునుశూద్రాన్నము నిచ్చునట్టి బ్రాహ్మణాన్నమును భుజింపగూడదు. అటులభుజించినేని చాంద్రాయణ వ్రతమునుజే యవలయును.

ద్విజాదీనామన్న భేద ప్రశంసా.

౭౯. అమృతంబ్రాహ్మణస్యాన్నంక్షత్రియాన్నంపయస్మృతమ్ । వైశ్యస్యచాన్నమేవాన్నం శూద్రాన్నంరుధిరంభవేత్ ॥ ఏతత్సర్వంమయాఖ్యాతం శ్రాద్ధకాల ఉపస్థితే । వైశ్వదేవేచహోమేచ దేవతారభ్యర్చనేజపే ॥ అమృతంతేనవిప్రాన్నమృగ్యజుస్సామసంస్కృతం । వ్యవహారానుపూర్వేణ ధర్మేణబలనిర్జితమ్। క్షత్రియాన్నంపయస్తుల్యంఘృతాన్నం యజ్ఞపాలనే ॥

(ఇతి అత్రిసంహిత)

తా॥ బ్రాహ్మణాన్నము అమృతాన్నమనియు, క్షత్రియాన్నము క్షీరసమమనియు, వైశ్యాన్నము అన్నసమమనియు, శూద్రాన్నము రుధిరసమమని చెప్పంబడి నదిగననగుచున్నది. ఇదియావత్తు నాచేశ్రాద్ధకాలమందు చెప్పంబడినది. వైశ్వదేవమందు హోమమందు దేవతార్చనయందు జపమందు ఋగ్యజుస్సామవేదములచే సంస్కరింపబడిన బ్రాహ్మణాన్నము అమృతప్రాయము వ్యవహారానుపూర్వకమైనధర్మముగ, బలముచే జయింపబడిన క్షత్రియాన్నము పయస్సమమైనది యజ్ఞపాలు (వైశ్యుని యొక్క అన్నము ఘృతాన్నమనియు జెప్పంబడినది.

౮౦. ప్రశస్తానాంస్వకర్మ సుద్విజాతీనాంబ్రాహ్మణోభుఞ్జీత॥
(గౌతమసంహిత అధ్యా ౧౭, శ్లో ౧)

తా॥ స్వకర్మలయందు ప్రసిద్ధికెక్కినద్విజులు (క్షత్రియవైశ్యులు) తమగృహములయందు జరుగునట్టిహవ్యకవ్యములయందుబ్రాహ్మణులను భుజింపచేయవలయును.

౮౧. క్షత్రియశ్చాపివైశ్యశ్చ క్రియావంతౌశుచివ్రతౌ । తద్గృహేషుద్విజైర్భోజ్యం । హవ్యకవ్యేషునిత్యశః ॥౧౨॥ ఘృతం

క్షీరంతథాతైలం భక్ష్యంస్నేహేనపాచితమ్ । గత్వానదీత టేవిప్రో భుంజీయాచ్ఛూద్రభోజనమ్ ॥౧౩॥ అజ్ఞానాద్భుంజ తేవిప్ర స్సూతకేమృతకేపివా । ప్రాయశ్చిత్తంకథంతేషాం వర్ణేవర్ణేవినిర్దిశేత్ ॥ ౧౪ ॥ గాయత్ర్యష్ట సహస్రేణ శు ద్ధిస్స్యాచ్ఛూద్రసూతకే । వైశ్యేపంచసహస్రేణ త్రిసహస్రే ణక్షత్రియే॥బ్రాహ్మణస్యయథాభుంక్తే ద్వేసహస్రేతుజాపయే త్ । అథవావామదేవ్యేన సామ్నాచైకేనశుధ్యతి ॥ ౧౫ ॥

(పారాశర్య ప్రాయశ్చిత్తకాండ ఏకాదశోఽధ్యాయః)

తా॥ వేదాధ్యయనాదికర్మలు గలిగి పవిత్రులైనట్టి క్షత్రియ వైశ్యుల నింట్ల నెప్పుడుం దేవపితృకర్మములం దెల్లప్పుడు బ్రాహ్మణులు భోజనముచేయవలయును ॥ బ్రాహ్మణుడు శూద్రసంబంధియైన నెయ్యిపాలను నూనె నేయితోవండినపూరీమొదల గు భక్ష్యములనుపుచ్చుకొని యేటియొడ్డునభుజింపవలయును ॥౧౩॥జాతామృతాశౌ చములయందు బ్రాహ్మణుడు చాతుర్వర్ణములయందు అజ్ఞానముచే భుజించినవేరువేరు గ ప్రాయశ్చిత్తములు విధింపబడినవి ॥౧౬॥ శూద్రునియింటసూతకాన్నమునుభుజిం చిన నెనిమిదివేల మార్లను వైశ్యునియింట భుజించిన నైదువేల పర్యాయములను, క్షత్రియు నియింటభుజించిన మూడువేల మార్లను, బ్రాహ్మణునియింట భుజించిన రెం డువేల పర్యాయములను గాయత్రిని జపించుటచేతను, వామదేవ్యమను సామమును జపించుటచేతనుపరిశుద్ధుడగును.

౭౯. అగ్నికార్యపరిభ్రష్టాస్సంధ్యోపాసనవర్జితాః । వేదంచైవా నధీయానాస్సర్వేతేవృషలాస్స్మృతాః ॥ ౩౧ ॥ తస్మాద్వృ షలభీతేనబ్రాహ్మణేనవిశేషతః । అధ్యేతవ్యోప్యేకదేశోయ దిసర్వంనశక్యతే ॥ ౩౨ ॥ దురాచారస్యవిప్రస్యనిషిద్ధాచర ణస్యచ।అన్నంభుక్త్వాద్విజఃకుర్యాదినమేకమభోజనమ్ ॥౫౭॥

(పారశర్యప్రాయశ్చిత్తకాండే ద్వాదశోఽధ్యాయః).

తా ॥ ఔపాసనము, సంధ్యావందనము చేయనివారును, వేదము చదు వనివారును శూద్రులనబడుదురు ॥ ౩౧॥ కావున శూద్రత్వమునకు వెరచిన బ్రాహ్మ ణుడంతయు జదువసాధ్యముగాకున్న కొంతయైన వేదము ముఖ్యముగ జదువుకొన దగును ॥ ౩౨ ॥ విధ్యుక్తకర్మనుజేయక నిషిద్ధకర్మలను జేయు బ్రాహ్మణుని యింట బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులు భుజించిన యేకదినముపవాసము చేయవలయును.

26.

మ్లేచ్ఛభోజనప్రాయశ్చిత్తవిషయః.

౮౦. మ్లేచ్ఛైర్హృతానాంచోరైర్వా కాంతారేషుప్రవాసినామ్। భుక్త్వాభక్ష్యమభక్ష్యంవాక్షుధార్తేనభయేనవా । పునఃప్రాప్యస్వకందేశం చాతుర్వర్ణ్యస్య నిష్కృతిమ్ । కృచ్ఛ్రమేకంచరేద్విప్రస్తదర్థంక్షత్రియశ్చరేత్ । పాదోనంచచరేద్వైశ్యః శూద్రఃపాదేనశుధ్యతి ॥ ౩౫ ॥

(దేవలస్మృతి.)

తా ॥ మ్లేచ్ఛులచేతను లేకచోరులచేతను, కొట్టబడినటువంటిన్ని, అడవులయందు నివసించినటువంటిన్ని, లేక ఆకలి భయములచే తినతగినటువంటియు తినకూడనటువంటియు పదార్థములను భుజించితనదేశమునకు మరలవచ్చిన చాతుర్వర్ణములకు ప్రాయశ్చిత్తమును చెప్పుచున్నాము. బ్రాహ్మణుడు ఏకకృచ్ఛ్రముచేతను, క్షత్రియుడు దానిలోసగముచేతను, వైశ్యుడు ముప్పాతికకృచ్ఛ్రముచేతను, శూద్రుడు పాతిక కృచ్ఛ్రముచేతను, శుద్ధులగుచున్నారు.

శ్రాద్ధస్థలనిరూపణమ్.

౮౧. దక్షిణాప్రవణంస్నిగ్ధంవిభక్తంశుభలక్షణమ్ ॥ ౧౩ ॥ శుచిదేశంవివిక్తంచగోమయేనోపలేపయేత్ । నదీతీరేషుతీర్థేషు స్వభూమౌగిరిసానుషు ॥ ౧౪ ॥ వివిక్తేషుచతుష్యంతిదత్తేనపితరస్తథా। పరస్యభూమిభాగేతుపితౄణాంనైవనిర్వపేత్॥ ౧౫ ॥ స్వామిత్వాత్సవిహన్యేతమోహాద్యత్క్రియతేనరైః। అటవ్యఃపర్వతాః పుణ్యాస్తీర్థాన్యాయతనానిచ ॥ ౧౬ ॥ సర్వాణ్యస్వామికాన్యాహుర్నహితేషుపరిగ్రహః। తిలాంశ్చావకిరేత్తత్రసర్వతోబంధయేద్విజః ॥ ౧౭ ॥ అసురోపహతంసర్వంతిలైశ్శుధ్యత్యనేనవా॥

(ఇతి ఔశనసస్మృతౌ పంచమోధ్యాయః.)

తా॥ నిమ్నోన్నతముగాని శుభలక్షణములతో గూడుకొనినయేకాంతమైపరిశుద్ధమగుదక్షిణప్రదేశమునుగోమయముచేనలుకవలయును.ఇంకనిట్లు నదీతీరములందు, పుణ్యక్షేత్రములందు, స్వగృహమందు, పర్వతచర్యలందు, రహస్య ప్రదేశములందు,

శ్రాద్ధమును చేసినయెడల పితృదేవతలు తృప్తినిబొందుచున్నారు. ఎప్పటికిని పరగృహమందు పితృలకు శ్రాద్ధమునుచేయగూడదు. ౧౨—౧౪, ఎవడుగాని మోహముచే పరగృహంబున శ్రాద్ధమునుజేసునో అది యాగృహపితృలవలన హరింపబడుచున్నది. అడవులు, పర్వతములు, పుణ్యతీర్థములు, దేవాలయమాదిగాగలసర్వముఅస్వామికములుగావున వాటియందు చేయంబడిన శ్రాద్ధము ఇతరులచేగ్రహింపబడదు. ద్విజుడు అంతటను నువ్వులు జల్లిబంధింపవలయును. ౧౬—౧౭, నువ్వులులేని సర్వమురాక్షసులచే హరింపబడినదగును.

## శ్రాద్ధేభోక్తృపరీక్షావిషయః.

౮౨. దైవేకర్మణి బ్రాహ్మణంనపరీక్షేత ప్రయత్నాత్పిత్ర్యే పరీక్షేతఇతివిష్ణుస్మృతౌ ద్వాశీతతమోధ్యాయః ॥ బ్రాహ్మణాన్నపరీక్షేత దైవేకర్మణిధర్మవిత్ । పిత్ర్యేకర్మణిసంప్రాప్తేయుక్తమాహుఃపరీక్షణమ్ ॥ ౧ ॥ ఇతిశ్రీశంఖస్మృతౌ చతుర్దశోఽధ్యాయః ॥ తస్మాద్విప్రంపరీక్షేత శ్రాద్ధకాలేప్రయత్నతః॥

(ఇతి అత్రిసంహిత.)

తా ॥ శుభకర్మయందు బ్రాహ్మణుని పరిక్షింపగూడదు. పితృకర్మయందు ప్రయత్నముగ బ్రాహ్మణుని పరిక్షింపవలయునని విష్ణుస్మృతికారునితాత్పర్యము. ధర్మవేత్తయగువాడు దైవకర్మయందు బ్రాహ్మణులనుపరిక్షింపకూడదనియు, పితృకర్మయందు పరిక్షించడముయుక్తమనియు, మహర్షులు చెప్పిరి. ఈలాగుశంఖస్మృతికారునితాత్పర్యము. అందువలన శ్రాద్ధమందుప్రయత్నముగ బ్రాహ్మణుని పరిక్షింపవలయునని అత్రిసంహితా కారుని తాత్పర్యము.

## శ్రాద్ధేఅనిమంత్రితప్రశంసా.

౮౩. హీనాధికాఙ్గాన్వివర్జయేత్ । వికర్మస్థాంశ్చబైడాలవ్రతికాన్వృథాలిఙ్గినోనక్షత్రజీవినోదేవలకాంశ్చ చికిత్సకాన్ అనుఢాపుత్రాన్ తత్పుత్రాన్బహుయాజినో గ్రామయాజినఃశూద్రయాజినోఽయాజ్యయాజినోవ్రాత్యాంస్తద్యాజినః పర్వకారాన్సూచికాన్భృతకాధ్యాపకాన్ భృతకాధ్యాపితాన్శూద్రాన్నపుష్టాన్పతితసంసర్గాన్ అనధీయానాన్సన్ధ్యోపాసనానుష్ఠానాన్రాజసేవకాన్నగ్నాన్పితృగుర్వగ్నిస్వా

ధ్యాయత్యాగినశ్చేతి ॥ బ్రాహ్మణాపసదాహ్యేతే కథితాః పఙ్క్తిదూషకాః । ఏతాన్వివర్జయేచ్ఛ్రాద్ధకర్మణి పణ్డితః ॥

(ఇతి వైష్ణవే ధర్మశాస్త్రే ద్వ్యశీతితమోఽధ్యాయః)

తా॥ హీనాంగులను, అధికాంగులను, కర్మభ్రష్టులను, మార్జాలవ్రతస్థులను, కపటసన్యాసిని, జ్యోతిష్కులను, వేతనమునకు దేవతార్చన చేయువారిని, వైద్యుని వివాహముకాని స్త్రీయందు పుట్టినవానిని, తత్పుత్రుని, బహుయాజకుడైనవానిని, గ్రామపురోహితుని, శూద్రపురోహితుని, అయాజ్యయాజ్యకుని, గాయత్రిభ్రష్టుని వ్రాత్యులపురోహితుని, అమావాస్య చేయనివారిని పరులదోషమెంచువానిని, జీతము కట్టుకొని అధ్యయనము చెప్పువానిని కూలికి వేదపారాయణ చేయువానిని, శూద్రద్రవ్యము చే భుజించువానిని, కులభ్రష్టులసంబంధముగలవారిని, వేదవిహీనుని, సంధ్యానుష్టానములు లేనివారిని, రాజసేవకులను, తల్లి, దండ్రి, అగ్ని, వేదములను విడచినవారిని, దిగంబరిని భుజింపచేయకూడదు. ఈపైచెప్పబడిన వారలు నీచబ్రాహ్మణులుగను, అపాఙ్క్తేయులుగనుక శ్రాద్ధమందు పండితుడు త్యజింపవలయును.

శ్రాద్ధకర్తృభోక్తృనియమః

౮౪. నోద్వీక్షేత తదుచ్ఛిష్టం యావన్నాస్తంగతో రవిః । బ్రహ్మచర్యం చరేతాంతు దంపతీ రజనీంతు తామ్ ॥ ౭౭ ॥ దత్వా శ్రాద్ధం తతో భుక్త్వా సేవతే యస్తు మైథునమ్ । మహారౌరవమాసాద్య కీటయోనిం వ్రజేత్పునః । ౭౮ ॥ శుచిరక్రోధనశ్శాంతస్సత్యవాదసమాహితః । స్వాధ్యాయంచ తథాధ్యానం కర్తా భోక్తా విసర్జయేత్ ॥ ౭౯ ॥ శ్రాద్ధం దత్వా పరం శ్రాద్ధం భుఞ్జతే యే ద్విజాతయః । మహాపాతకినాతుల్యా యాంతి తే నరకాన్బహూన్ ॥ ౮౦ ॥

(ఇతి ఔశనస స్మృతౌ పంచమోఽధ్యాయః)

తా ॥ సూర్యాస్తమయపర్యంతము శ్రాద్ధశేషమగు ఉచ్ఛిష్టాన్నమని దలచక భుజింపవలయును. ఆదంపతులారాత్రియందు బ్రహ్మచర్యవ్రతమును జరుపుచుండవలయును ॥ ౭౭ ॥ శ్రాద్ధకర్తయును, భోక్తయును, మైథునమును చేసినయెడల మహారౌరవనరకమును బొంది మరల పురుగులరాశియందు బుట్టుచున్నారు ॥ ౭౮ ॥ శ్రాద్ధకర్తయు, భోక్తయు, ప

రిశుద్ధులై, క్రోధరహితులై, శాన్తులై, సత్యవాదులై, స్వస్థచిత్తులైయుండి వేదమును, ధ్యానమును, విడువవలయును ॥ ౭౭ ॥ ఏద్విజులుశ్రాద్ధమునుబెట్టి యితరశ్రాద్ధమం దుభుజించుదురో అట్టివారు మహాపాతకసములై నరకములను బొందుచున్నారు॥

౮౫. ఆమంత్రితో బ్రాహ్మణో వై యోన్యస్మై కురుతేక్షణమ్ । ఆ
మంత్రయిత్వాయోమోహా దన్యంవామంత్రయేద్ద్విజః ॥౭॥
సతస్మాదధికఃపాపీ విష్ఠాకీటోభిజాయతే । శ్రాద్ధేనిమంత్రి
తోవిప్రో మైథునంయోధిగచ్ఛతి ॥౮॥ బ్రహ్మహత్యామవా
ప్నోతి తిర్యగ్యోనిషుజాయతే । నిమంత్రితశ్చయోవిప్రోహ్య
ధ్వానంయాతిదుర్మతిః ॥౯॥ భవంతిపితరస్తస్య తన్మాంసంపాం
శుభోజనమ్ । నిమంత్రితశ్చయశ్శ్రాద్ధే ప్రకుర్యాత్కలహం
ద్విజః ॥౧౦॥ భవంతితస్యతన్మాంసంపితరోమలభోజనాః । త
స్మాన్నిమంత్రితశ్శ్రాద్ధే నియతాత్మాభవేద్ద్విజః ॥౧౧॥
(ఇతి ఔశనసస్మృతౌ పంచమోఽధ్యాయః)

తా॥ శ్రాద్ధమునందు నిమంత్రితుడై మరియొకశ్రాద్ధమందు క్షణమును గ్రహించువాడును, ఒకరినిబిలచి మోహామువలన మరియొకరిని బిలుచువాడును వీరిద్దరధిక పాపులై పురుగులరాశియందు బుట్టెదరు. ఎవడు శ్రాద్ధమునందు నిమంత్రితుడైమైథునమును చేయునో వాడు బ్రహ్మహత్యనుబొంది పశుపక్షి మృగాదులయందు జనించును. ఏదుష్టబ్రాహ్మణుడు నిమంత్రితుడై భోజనముచేసిప్రయాణముచేయునో అతని పితృదేవతలు మాంసమును మార్గధూళిని భుజించువారలగుచున్నారు. ఏద్విజుడుశ్రాద్ధమందు నిమంత్రితుడై కలహమునుచేయునో వానిపితరులు వానిమాంసమును, మలమును, భుజించువారలగుచున్నారు, అందువలన శ్రాద్ధమందు నిమంత్రితులగు ద్విజులు నియతచిత్తులై యుండవలయును ॥ ౭,౧౧॥

౮౬, వ్రతినశ్చకులీనశ్చశ్రుతిస్మృతిరతంసదా । తాదృశంభోజ
యేచ్ఛ్రాద్ధేపితౄణామక్షయంభవేత్ ॥ యావతోగ్రసతే
గ్రాసాన్ పితౄణాందీప్తతేజసామ్ । పితాపితామహశ్చైవ
తథైవప్రపితామహాః।నరకస్థావిముచ్యన్తే ధ్రువంయాన్తిత్రి
విష్టపమ్ ॥ తస్మాద్విప్రంపరీక్షేత శ్రాద్ధకాలేప్రయత్నతః ॥
(ఇతి అత్రిసంహితా)

తా ॥ నియమస్థుని, సత్కులీనుని, శ్రుతి స్మృతిరతునుని, ఇట్టివారిని శ్రాద్ధమందు భుజింపచేయవలయును. అట్లుచేసినపితృదేవతలకు అక్షయమవును, తేజోవంతులగు పితృదేవతలయొక్క శ్రాద్ధమందున్నట్టి ద్విజులు యెన్నిగ్రాసములను భుజించెదరో అంతకాలమువరకు పితృపితామహ ప్రపితామహులు నరకవిముక్తులై స్వర్గమునందుండెదరు. అందువలన బ్రాహ్మణుని శ్రాద్ధకాలమందు ప్రయత్నముగ పరిక్షించవలయును.

౧౭, విప్రః క్షయాహపూర్వేద్యుస్స్నాత్వాచైకాశనోభవేత్ । అధశ్శాయీబ్రహ్మచారీనిశివిప్రాన్నిమంత్రయేత్ ॥ ౧౪॥ దంతధావనతాంబూలతైలాభ్యంగరతింశుచిః । రత్యౌషధపరాన్నానిశ్రాద్ధకర్తావివర్జయేత్ ॥ ౧౫ ॥ అధ్వానంకలహంక్రోధంవ్యవాయంచధురంతథా। శ్రాద్ధకర్తాచభోక్తాచదివాస్వాపంచవర్జయేత్ ॥ ౧౬ ॥

(ఇతి లిఖితస్మృతౌ పంచమోఽధ్యాయః.)

తా ॥ విప్రుడు పితరుడు చనిపోయిన దినమునకు పూర్వదినమందు స్నానముచేసి యొకపూట భోజనము చేసిన వాడుగ కావలయును. రాత్రియందు భూమిమీదపండుకొని బ్రహ్మచర్యనియమముగలవాడై బ్రాహ్మణులనువరింపవలయును॥౧౪॥ శ్రాద్ధకర్తపవిత్రుడై దంతధావన తాంబూలతైలాభ్యంగములయం దాసక్తిని, రత్యౌషధపరాన్నములను, విడిపింపవలయును॥ ౧౫ ॥ శ్రాద్ధకర్తయుభోక్తయు, ప్రయాణమును, కలహమును, కోపమును, మైథునమును, బరువును, పగటినిద్రను విడిపింపవలయును ॥ ౧౬ ॥

౧౮. దంతధావనమభ్యంగం నఖకేశనికృంతనం । కర్తాచైవత్తుపూర్వేద్యు ర్భోక్తాచైవపరేహని । దంతధావనతాంబూలంక్షౌరాభ్యంగమభోజనం । రత్యౌషధపరాన్నంచశ్రాద్ధకర్తావివర్జయేత్ ॥

(ఇతి యల్లాజియ్యె)

తా ॥ శ్రాద్ధకర్తపూర్వదినమునందు శ్రాద్ధభోక్తపరదినమునందు దంత ధావనమును అభ్యంగనమును నఖకేశనికృంతనమును తాంబూలమును క్షౌరమును భోజనమును సురతమును పరాన్నమును విడువవలయును.

శ్రాద్ధేనిమంత్రితప్రశంసా.

౮౯. నిరాచారాశ్చయేవిప్రాః పితృమాతృవివర్జితాః।విద్వాంసోపి హీనాభ్యర్చ్యాఃపితృశ్రాద్ధేషుసత్తమైః।నవేదైః కేవలైర్వాపి తపసా కేవలేనచ ॥౧౪॥ సంవృత్తైఃకింతుతైః ప్రోక్తా పాత్రతాబ్రాహ్మణస్యచ । యత్రవేదాస్తపోయత్ర యత్రవృత్తం ద్విజాగ్రజే ॥౧౫॥ పితృశ్రాద్ధేషుతంయత్నా న్విద్వాన్విప్రం సమర్చయేత్ । వేదశాస్త్రార్థవిచ్ఛాంత శ్శుచిర్ధర్మమనాస్సదా ॥౧౬॥ గాయత్రీబ్రహ్మచింతాకృత్పితృశ్రాద్ధేసపావనః। రథంతరబృహజ్జ్యేష్ఠ సామవిత్త్రిసుపర్ణకః ॥ ౧౭ ॥ త్రిమధుశ్చాపియోవిప్రఃపితృశ్రాద్ధేషుపూజితః। మాతామహశ్చదౌహిత్రో భాగినేయోఽథమాతులః ॥ ౧౮ ॥ మాతృస్వస్రేయశ్చతథాతథామాతులజోఽపివా । జామాతా శ్వశురో బంధుర్భార్యాభ్రాతాచతత్సుతః ॥౧౯॥ సువృత్తాశ్చ సదాచారాయేతేశ్రాద్ధేషుపావనాః । ఋత్విగ్గురురుపాధ్యాయ ఆచార్యశ్శ్రోత్రియోఽపరః ॥౨౦॥ ఏతేశ్రాద్ధేషువై పూజ్యాః జ్ఞాతిసంబంధిబాంధవాః । అగ్నిహోత్రచయోవిప్రఆవసథ్యాగ్నికోఽపిచ ॥౨౧॥ పితృమాతృ పరావేతౌ భోక్తవ్యౌ హవ్యకవ్యయోః। కృష్యేకవృత్తిజీవీయోభోక్తామాత్రాతా॥ యోగ్యులచే పిత్రాదిశ్రాద్ధములయందు ఆచారరహితులగు పితృమాతృలను వదిలిపెట్టిన బ్రాహ్మణులు విద్వాంసులైనను పూజింప బడదగని వారలు కేవలము వేదములచేతను, తపస్సుచేతను, బ్రాహ్మణులు దానపాత్రులుగారు ॥౧౪॥ మంచిప్రవర్తనలచేతనే బ్రాహ్మణునకు పాత్రత్వము చెప్పబడినది. ఏబ్రాహ్మణునియందువేదములు, తపస్సుమంచి ప్రవర్తనయున్నదో ఆబ్రాహ్మణుని విద్వాంసుడగు శ్రాద్ధకర్తప్రయత్నముగ పితృశ్రాద్ధములయందు పూజింపవలయును. వేదశాస్త్రార్థములను గుర్తెరిగి శాంతుడై పవిత్రుడై ఎల్లప్పుడు ధర్మమునందు మనస్సుగలవాడై గాయత్రిని పరబ్రహ్మను చింతించునో వాడు శ్రాద్ధమందు పవిత్రుడగును. రథంతర సామమును బృహజ్జ్యేష్ఠసామములను గుర్తెరిగి త్రిసుపర్ణక, మధు బ్రాహ్మణమును జపించుచున్నట్టి బ్రాహ్మణుడు పితృశ్రాద్ధమందుపూజింపదగినవాడు. తల్లిదండ్రియు,దౌహిత్రుడును,—

దికేషుచ ॥౨౨॥ షట్కర్మనిరతఃపూజ్యోహవ్యకవ్యే సదైవహి । క్షత్రవృత్తి స్సదాచారో మాత్రాదిభక్తితత్పరః ॥౨౩॥ శుచిఃషట్కర్మయుక్తశ్చహవ్యకవ్యేషుపూజితః । యుగానురూపతోయస్తువిద్యాచారాదిసంయుతః ॥౨౪॥ సపూజ్యోఽనభిశస్తస్సషట్కర్మనిరతోద్విజః । ఇత్యుక్తగుణసంపన్నా న్బ్రాహ్మణాన్పూర్వవాసరే ॥౨౫॥ నిమంత్రయేత సద్భక్త్యానియోగస్థానపూర్వకమ్ । సవ్యేనదేవతార్థంతు పిత్ర్యర్థమపసవ్యవాక్ ॥౨౬॥

(బృహత్పారాశరీయే పంచమోఽధ్యాయః)

మేనల్లుడును, మేనమామయును, పిన్నతల్లికుమరుడును, మేనమామ కుమారుడును, అల్లుడును, మామగారును, బంధువులు, బావమరదియు, వానికుమురుడును; మంచి ప్రవర్తనాచారములుగలవీరందరుశ్రాద్ధమునందు పవిత్రులైనవారలు. అనగ నిమంత్రణీయులు యాజకుడు, గురువు ఉపాధ్యాయుడు, ఆచార్యుడు, శ్రోత్రియుడు, జ్ఞాతులు, సంబంధులు, బాంధవులు, వీరలు శ్రాద్ధమునందుపూజింపదగినవారలు. సోమయాజియు, నిత్యము గృహమందు ఔపాసనాగ్ని గలవాడును వీరలు తల్లిదండ్రులయందు భక్తిగలవారలయిన హవ్యకవ్యములయందు భుజింపజేయదగినవారలు. కేవలము కృషిచేతనే జీవించువాడు మాత్రాదిశ్రాద్ధములయంచు భోక్తగా నియమింపవలయును. షట్కర్మలయందాసక్తిగలవాడును, సదాచారసంపన్నుడును, మాత్రాదులయందు భక్తిగలవాడును, క్షేత్రవృత్తిచే జీవించువాడు హవ్యకవ్యములయందు బూజింపదగినవాడు. యుగానురూపములగు విద్యలను, ఆచారములనుగలిగి సూర్యోదయసమయములయందు నిద్రించని షట్కర్మనిరతుడగు ద్విజుడుశ్రాద్ధమునందుబూజింపదగినవాడు. ఈలాటిగుణసంపన్నులగు బ్రాహ్మణులను పూర్వదినమందే భక్తితోటి విశ్వేదేవ పితృస్థాన నియమపూర్వకముగ సవ్యముగ దేవతలను, అపసవ్యముగపితృదేవతలను నిమంత్రించవలయును.

౯౦. యదేకంభోజయేచ్ఛ్రాద్ధే చంధోగంతత్రపూజయేత్ ।ఋచోయజూం షిసామాని త్రితయంతత్రవిద్యతే ॥ ౨౨ ॥
భ్రాతృద్వయం నయుంజీత పితాపుత్రౌతథైవచ । అనగ్నికంనకర్తవ్యంన కుర్యాద్గర్భిణీపతిమ్ ॥ ౨౪ ॥ ...మాతామహంమాతులంచస్వస్రేయంశ్వశురంగురుం । దౌహిత్రం

విత్ప్రతించైవ ఋత్విగాదీన్స్రభోజయేత్ ॥ ౨౫॥ గాయ
త్రీనిరతంశాంతంస గోత్రంవేదపారగం । దూరస్థమపిదౌ
హిత్రంశ్రాద్ధేయత్నేనభోజయేత్ ॥ ౨౬ ॥ నిమంత్రితో
భవేద్విప్రః బ్రహ్మచారీజితేంద్రియః । నిమంత్రయే ద్ద్విజం
ప్రాజ్ఞ దర్భపాణిర్జితేంద్రియః ॥3౨॥

(ఇతి లిఖితస్మృతౌ పంచమోఽధ్యాయః)

తా ॥ శ్రాద్ధమందొక సామవేదియగు బ్రాహ్మణుని భుజింపచేయవలయును న తనినేబూజింపవలయు. వానియందు ఋగ్యజు స్సామము లుంచున్నవి ॥ ౨౨ ॥ ఇద్దరన్నదమ్ములను నిమంత్రించగూడదు. అగ్నిరహితుని, గర్భిణీపతిని, నిమంత్రించ గూడదు ॥ ౨౪ ॥ తల్లియొక్క తండ్రిని, మేనమామను మేనల్లుని, మామను, గురువును, దౌహిత్రుని, రాజును, ఋత్విక్కులను, శ్రాద్ధమందునిమంత్రించిభుజింపచేయవలయును ॥౨౫॥ గాయత్రీజపమందాసక్తిగలవానిని, శాంతుని, సగోత్రుని, వేదాధ్యయనపరుని, దూరమందుండినను దౌహిత్రుని, శ్రాద్ధమందు యత్నముతోటి నిమంత్రించిభోజనముపెట్టవలయును ॥ నిమంత్రింపబడిన బ్రాహ్మణుడు బ్రహ్మచారివ్రతము గలవాడుగను, ఇంద్రియ నిగ్రహముగలవాడుగ నుండవలయును, తెలిసినవాడు చేతియందు దర్భగలవాడై ఇంద్రియనిగ్రహుడై ద్విజులను నిమంత్రింపవలయును ॥ 3౨॥

## శ్రాద్ధభోక్తృసంఖ్యావిషయః.

౯౦. ద్వౌదైవేప్రాఙ్ముఖౌపిత్ర్యేత్రయశ్చోదఙ్ముఖాస్తథా । ఏకైకంవాభవేత్తత్ర ఏవంమాతామహేష్వపి ॥ ౨౫ ॥ ...అథనాభోజయేదేకంబ్రాహ్మణంవేదపారగమ్ । శ్రుతిశీలాదిసంపన్నమలక్షణవివర్జితమ్ ॥ ౨౭ ॥ ప్రాశ్నేదగ్నౌతదన్నంతు దద్యాచ్చబ్రహ్మచారిణే । భిక్షుకోబ్రహ్మచారీచ భోజనార్థముపస్థితః॥ ౨౯ ॥ ఉపవిష్టేషుయచ్ఛ్రాద్ధేకామంతమపిభోజయేత్॥

(ఇతి ఔశనసస్మృతౌ పంచమోఽధ్యాయః.)

తా ॥ విశ్వేదేవస్థానమందు తూర్పుముఖముగ నిద్దరిని పితృస్థానమునందుత్తర ముఖముగ ముగ్గురిని లేక వకరొకరిని నైనను తల్లిదండ్రి మొదలుగ వారిని శ్రాద్ధమునందు నిమన్త్రింపవలయును. దుర్లక్షణములులేని సద్వృత్తియుగలిగిన వేదపారగుడగు

బ్రాహ్మణుని యొకరినైనను భుజింపచేయవలయును. అవిశ్వేదేవతాస్థానమందైన అన్నమును అగ్నియందుంచవలయును. లేదా బ్రహ్మచారికినియ్యవలయును. బ్రహ్మచారిగాని సన్యాసిగాని భోజనమునకువచ్చినయెడల, బ్రాహ్మణులు శ్రాద్ధమందుగూర్చున్న పిమ్మట నాయిరువురను భుజింపచేయవలయును,

౯౨. ప్రాఙ్ముఖౌదైవికౌవిప్రౌవిప్రా(స్త్రయ ఉదఙ్ముఖాః । ఏకైకోభయత్రస్యాదసంపత్తావితిక్రమః । పాత్రంవాదైవికంకృత్వావిప్ర ఏకస్తుపైతృకే ॥ ౩౨ ॥

(బృహత్పారాశరీయే పంచమోఽధ్యాయః.)

తా ॥ విశ్వేదేవస్థానమందు తూర్పుముఖముగ నిద్దరిని పితృస్థానమునందుత్తరముఖముగ ముగ్గురిని లేక ఉభయస్థానములయందుఒకరినైనను భుజింప చేయవలయును. లేదాపితృస్థానమందు ఒకబ్రాహ్మణుని నియమించి విశ్వేదేవస్థానమందు పాత్రను వుంచి పూజింపవలయును.

౯౩. ద్వౌదైవేప్రాఙ్ముఖౌత్రీంశ్చ పిత్ర్యేచోదఙ్ముఖాంస్తథా । భోజయేద్విబుధాన్విప్రా నైకైకముభయత్రవా ॥ భోజయేదథవాప్యేకం బ్రాహ్మణంపఙ్క్తిపావనం । దైవేకృత్వాతు నైవేద్యం పశ్చాద్వహ్నౌతుతత్క్షిపేత్ ॥ ౧౦ ॥

(ఇతి శ్రీశంఖస్మృతౌ చతుర్దశోఽధ్యాయః)

తా ॥ ద్వౌ - క్షిపేత్ వరకు అర్థము ఇందు నం. ౯౧ లో చూడందగును.

౯౪. శుచీన్నిమంత్ర్యద్వౌదైవేత్రీన్విప్రాన్పితృకర్మణి । దైవే పిత్ర్యేథవైకైకంసపిండీకరణంవినా ॥ ఇతియల్లాజియ్యే ॥

తా॥ సపిండీకరణమునందు తప్ప ప్రతిసంవత్సరముచేయుం శ్రాద్ధమునందు విశ్వేదేవస్థానమందు పరిశుద్ధులగు బ్రాహ్మణుల నిద్దరిని, పితృస్థానమునందు ముగ్గురిని లేక ఒకరొకరినిగాని నియమింపవలయును.

## శ్రాద్ధబాహుళ్యనిషేధః.

౯౫. సత్క్రియాందేశకాలౌచ శౌచంబ్రాహ్మణసంపదమ్।పంచైతాన్విస్తరోహంతితస్మాన్నేహేతవిస్తరమ్ ॥ ౨౬ ॥

(ఇతి ఔశనసస్మృతౌ పంచమోఽధ్యాయః,)

తా॥ శ్రాద్ధబాహుళ్యము సత్క్రియను దేశకాలములను శౌచమును బ్రాహ్మణసంపదను ఈ ఐదింటిని ఖాదించుచున్నది. గనుక శ్రాద్ధవిస్తరము విడువవలయును.

## శ్రాద్ధవిధి.

౯౬. గోమయేనోదకైః పూర్వంశోధయిత్వా సమాహితః। సన్నిపత్య ద్విజాన్సర్వాన్ సాధుభిస్సన్నిమంత్రయేత్ ॥ ౧ ॥ శ్వో భవిష్యతి మే శ్రాద్ధం పూర్వేద్యురభివక్ష్యతి। అసంభవే పరేద్యుర్వా యథోక్తైర్లక్షణైర్యుతమ్ ॥ ౨ ॥ తస్య తే పితరశ్శ్రుత్వా శ్రాద్ధకాల ఉపస్థితే। అన్యోన్యమనసా ధ్యాత్వా సంపతంతి మనోజవాః॥ ౩ ॥ బ్రాహ్మణాస్తే సమాయాంతి పితరో హ్యంతరిక్షగాః। వాయుభూతాశ్చ తిష్ఠంతి భుక్త్వా యాంతి పరాంగతిమ్ ॥ ౪ ॥ ... తతో నివృత్తే మధ్యాహ్నే లుప్తలోమనఖాన్ద్విజాన్। అభిగమ్య యథామార్గం ప్రయచ్ఛేద్దంతధావనం। తైలమభ్యంజనం స్నానం స్నానీయం చ పృథగ్విధమ్ ౨౦॥ తత్ర స్నాత్వా నివృత్తేభ్యః ప్రత్యుత్థాయ కృతాంజలిః॥ ౨౧ ॥ పాద్యమాచమనీయం చ సంప్రయచ్ఛేద్యథాక్రమం। యే చాత్ర వివ దేరన్వై ప్రాః పూర్వం నిమంత్రితాః ॥ ౨౨ ॥ ప్రాఙ్ముఖాన్యాసనాన్యేషాం సదర్భోపహితాని చ। దక్షిణాగ్రైకదర్భాణి ప్రోక్షితాని తిలోదకైః ॥ ౨౩ ॥ తేషూపవేశయేదేతాన్ బ్రాహ్మణాన్ దేవపూర్వకాన్ ॥ ...

(ఔశనస స్మృతౌ పంచమోఽధ్యాయః.)

తా॥ శ్రాద్ధకర్త చిత్తస్వాస్థ్యము గలవాడై పూర్వదినంబున గోమయోదకములచే గృహాదులను పవిత్రముచేసి ద్విజులయొద్దకుబోయి ప్రియవాక్కులచే ప్రార్థింపవలయును ॥౧॥ ఈపని శ్రాద్ధదినమునకు పూర్వమందైనను, పరమందైనను యథోక్తలక్షణములతోకూడుకొనునట్లుగ మాతృపితృల శ్రాద్ధముకాబోవుచున్నదని చెప్పవలయును ॥౨॥ అట్టిమాటలను వాయురూపులై సంచరింపుచుండెడి పితరులు విని శ్రాద్ధము సమీపించినదని మనోవేగముగలవారలై వొండొరులు జెప్పుకొనియె

చరు ॥౩॥ అంతట నిమంత్రులగు బ్రాహ్మణులు వచ్చినపిమ్మట నాకాశంబునసంచరిం చుచుండెడి యాపితరులు వాయురూపమున వీరలపైనావహించి భుజించి యుత్తమ గతినిపొందుచున్నారు ॥౪॥ ...మధ్యాహ్నకాల మతిక్రమించినపిమ్మట తమనిత్య కృత్యములగు వైశ్వదేవాదులనుచేసుకొని తీసివేయబడిన రోమములు గోళ్లుగలనిమం త్రితులను గలసుకొని యథాశాస్త్రముగ దంతధావనమును, తైలమును, అభ్యంజన మును స్నానముచేయదగిన పదార్థములను వేరువేర్వుగ అత్తిపాత్రలచేనివ్వవలయును. అటుపిమ్మట స్నానముచేసివచ్చిన బ్రాహ్మణులకెదురుగాబోయి అంజలిబద్ధుడై పా దోదకమును ఆచమనీయమునుయథాక్రమముగ నియ్యవలయును. ఏబ్రాహ్మణులుపూ ర్వము నిమంత్రితులైవచ్చిరో నాబ్రాహ్మణులకు తిలోదకముచే ప్రోక్షింపబడినటువం టిన్ని దక్షిణాగ్రములు గలిగినటువంటిన్ని ప్రాఙ్ముఖముగనువేయంబడిన దర్భాసనము లను కల్పించి వాటియందే దేవతుల్యులైన నిమంత్రితులనుగూర్చుండ పెట్టవలయును.

౯౭. శ్రాద్ధార్థంసమనుజ్ఞాతో మండలంకారయేద్ద్వయం । చతు
రశ్రంబ్రాహ్మణస్య త్రికోణంక్షత్రియస్యచ ॥ వర్తులంచై
వవైశ్యస్యశూద్రస్యాభ్యుక్షణంస్మృతం ॥ ౩౪ ॥ బ్రాహ్మణా
నామభావేతుభ్రాతరంపుత్రమేవవా । ఆత్మానంవానియుం
జీతనవిప్రంవేదవర్జితం ॥ ౧౩ ॥ ప్రాచీనావీతినాహోమాః
కార్యోగ్నౌమునిసత్తమాః । తచ్ఛేషంవిప్రపాత్రేషు వికిరే
త్సంస్మరన్ శివమ్ ॥ ౪౦ ॥ భక్ష్యైర్భోజ్యైశ్చశాకాద్యైః
లేహ్యైర్విప్రాన్ ప్రపూజయేత్ । అన్నత్యాగంతతః కుర్యా
దుభయత్రసమాహితః ॥ ౪౧ ॥ ... ఆగచ్ఛంతుమహాభా
గావిశ్వేదేవామహాబలాః । యే అత్రవిహితాశ్శ్రాద్ధేసావ
ధానాభవంతుతే ॥ ౪౨ ॥ ఏవంపిత్రాన్నమస్కృత్యానారాయ
ణపరాయణః । దత్తంహవిశ్చతత్కర్మవిష్ణవేతత్సమర్పయేత్ ॥
౪౫ ॥ భుంజానేషుచవిప్రేషు అన్యోన్యంసంస్పృశేద్యది ।
తదన్నమత్యజన్భుక్త్వాగాయత్ర్యష్టశతంజపేత్ ॥ ౪౮ ॥ త
తస్తేబ్రాహ్మణాస్సర్వేభుంజీరన్వాగ్యతాస్తదా । హసతేవద
తేచోద్యేరాక్షసంతద్భవేద్ధవిః ॥ ౪౯ ॥ ...రాక్షోఘ్నవైష్ణ
వీశ్చైవ పైతృకాశ్చవిశేషతః । జపేచ్ఛపౌరుషంసూ

క్తంనాచికేతత్రయంతథా ॥ త్రిమధుత్రిసుపర్ణంచపావమానియజూంషిచ । సామాన్యపియథోక్తానివదేత్పుణ్యాకథాస్తథా ॥ ఇతిహాసపురాణాని ధర్మశాస్త్రాణిచైవహి । భుంజీరన్ బ్రాహ్మణాయావత్తావదేవజపేద్విజః ॥ ౫౨ ॥

(ఇతి లిఖితస్మృతౌ పంచమోఽధ్యాయః.

తా ॥ అనుజ్ఞనుపొందినవాడై శ్రాద్ధముకొరకు రెండుమండలములను చేయవలయును. బ్రాహ్మణునకు చౌకము, క్షత్రియునకు ముక్కోణము, వైశ్యునకు గుండ్రము, శూద్రునకు నీరుచల్లుట చెప్పంబడియున్నవి ॥ ౩౮ ॥ వేదముదెలసిన బ్రాహ్మణులయొక్క అభావమందు సహోదరునిగాని, కొమరునిగాని, తన్నుగాని, వరించవలయును. వేదవిహీనునివరించగూడదు ॥ ౩౫ ॥ మునిసత్తములారా యగ్నియందపసవ్యముగ హెూమమునుచేయవలయును. హోమశేషమును బ్రాహ్మణునిపాత్రయందు శిశునినిస్మరించుచునుంచవలయును ॥ ౪౦ ॥ భక్ష్యభోజ్యశాకాదులచేతను పచ్చళ్లచేతను బ్రాహ్మణులను లెస్సగ పూజింపవలయును. అనంతరము ఉభయపాత్రలయందుస్థిరచిత్తుడై అన్నదానమునుచేయవలయును॥ ౪౧॥ విశేషబలముగల, విశేషమహిమగల విశ్వదేవతలువత్తురు గాక. ఈశ్రాద్ధమందు ఎవరు నియమింపబడుచున్నారో వారు సావధానులగుదురుగాక ॥ ౪౨ ॥ ఈవిధముగ పితరులనునమస్కరించి నారాయణునియందు మనస్సుగలవాడై ఆకర్మయందు హవిస్సు ఏదిగలదో దానిని విష్ణువుకొరకు సమర్పించవలయును ॥ ౪౫ ॥ బ్రాహ్మణులు భోజనముచేయునపుడొకరినొకరు తాకినట్టయితే ఆఅన్నమును విడువకుండభోజనముచేసి ఎనిమిదినూరులు గాయత్రినిజపించవలయును ॥ ౪౭ ॥ బ్రాహ్మణులు ఎంతవరకుభుజించుచున్నారో యంతవరకు రక్షోఘ్నబుక్కులను, విష్ణుసంబంధమైన బుక్కులను, ముఖ్యముగ పితృసంబంధమైన అనువాకములను జపము చేయవలయును. పురుషసూక్తమును, నాచికేతమనెడు మూడు మంత్రములను ఆటువలెనే మధుబుక్కుత్రయమును, త్రిసుపర్ణబుక్కును, పావమానిబుక్కులను, యజుర్మంత్రములను, సామములను శాస్త్రప్రకారము ద్విజుడు జపించవలయును. అటువలెనే పుణ్యకథలను, ఇతిహాసపురాణములను, ధర్మశాస్త్రములను, చెప్పవలయును॥౫౨॥

పిండప్రదానం.

గా. ఉచ్ఛిష్టసన్నిధౌకార్యంపిండనిర్వపణంబుధైః । అభావేచతథాకార్యంపిండదానంయథావిధి॥ ౧౧॥పక్వాంయదాత్మనోగేహేభక్ష్యంవాభోజ్యమేవవా।అనివేద్యనభోక్తవ్యంపిండమూ

లేకదాచన॥ ౧౩ ॥ తోయోద్భవానిదేయాని రక్తాన్యపివిశేషతః ॥ ౧౪ ॥ ఊర్ణసూత్రంప్రదాతవ్యం కార్పాసమథవా నవం । దశావివర్జయేత్ప్రాజ్ఞో యద్యనాహతవస్త్రజాః ॥ ౧౫ ॥ ఘృతేనదీపోదాతవ్యస్తిల తైలేనవాపునః । ధూపార్థంగుగ్గులందద్యాద్ఘృత యుక్తమధూత్కటం । చందనంచతథాదద్యాత్పిష్ట్వా వాకుంకుమంసుమం ॥ ౧౬ ॥

(శ్రీశంఖస్మృతౌ చతుర్దశోఽధ్యాయః.)

తా॥ తెనిసినవారిచేత పిండదానము బ్రాహ్మణుల ఉచ్ఛిష్టపాత్ర సమీపము నందుచేయతగ్గది. ఉచ్ఛిష్టసన్నిధి లేనియెడల పిండదానము ఉచ్ఛిష్టసాన్నిధ్యమునవలెనే శాస్త్రప్రకారము చేయతగ్గది ॥౧౧॥ ...అట్టిపిండపూజయందు ఎరుపువర్ణము గలవైనను ఉదకమందుబుట్టిన పుష్పములు ముఖ్యముగ నియ్యదగినవి ॥ ౧౪ । గొర్రెబొచ్చుతో చేయబడిన పోగులేకనూతనమైననూలుపోగుఇయ్యతగ్గవి. తెలివిగలవాడు క్రొత్త వస్త్రములో మొదటిబద్దెను పిండముల మీదవేయవలయును ॥ ౧౫ ॥ నెయ్యితోగాని నువ్వులనూనెతోగానిదీపమియ్యతగినది. ధూపమునకుగాను నేతితోచేరిన, తేనెతోచేరినగుగ్గులము నియ్యవలయును. అటువలెనేకుంకుమపువ్వును కలిపినచందనమును నియ్యవలయును ॥ ౧౬ ॥

FF. బ్రాహ్మణేషుచభుక్తేషు వికిరంవిక్షిపేత్తథా । శేషమన్నంవదేచ్ఛైవంమధుసూక్తంచవైద్విజః ॥ ప్రక్షాళ్యపాణిపాదాచసమ్యగాచమ్యపండితః । ఆచాంతేషుచసర్వేషుపిండంనిర్వాపయేత్తతః ॥ స్వస్తివాచనకంకుర్యాదక్షయ్యోదకమేవచ । దత్వాసమాహితఃకుర్యాద్దాతాగోత్రాభివాదనం ॥ అచాలయిత్వాపాత్రంతుస్వస్తికుర్వంతియేద్విజాః । వత్సరంపితరస్తేషాంభవంత్యుచ్ఛిష్టభోజనాః ॥ ౫౬ ॥ దాతారోనోభివర్ధంతామిత్యాద్యైస్స్మృతిభాషితైః । ఆశీర్వాదంలభేత్తేభ్యః నమస్కారంచరేత్తతః॥ ౫౭ ॥ ద్రవ్యాభావే ద్విజాభావేఅన్నమంత్రానువాచయేత్ । పైతృకేనచసూక్తే

న హేలామం కుర్యాద్విచక్షణః ॥ ౫౭ ॥ అత్యంతద్రవ్యశూన్యశ్చేచ్ఛక్త్యాదద్యాత్తృణంగవాం । స్నాత్వాచవిధివద్విప్రః కుర్యాద్వాతిలతర్పణం ॥ ౫౮ ॥ అథవారోదనంకుర్యాదత్యుచ్చైర్విజనేవనే । దరిద్రోహంమహాపాపీవదంతీతి విచక్షణాః ॥ పరేద్యుః శ్రాద్ధకృద్విప్రః యోనతర్పయతేపితౄన్ । తత్కులంనాశమాప్నోతి బ్రహ్మహత్యాంచవిందతి ॥

(ఇతి లిఖితస్మృతౌ పంచమోఽధ్యాయః.)

తా॥ బ్రాహ్మణులు భోజనముచేసినవారుకాగానేమిగిలినఅన్నమునువికిరముగవేయవలయును. అప్పుడు ద్విజుడు (బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులలోనొక) మధుసూక్తమును చెప్పవలయును ఇది ప్రసిద్ధము పండితుడుచేతులను, పాదములను లెస్సగ కడిగికొని ఆచమనముచేసి అందరు ఆచమనముచేసినపిమ్మట పిండప్రదానము చేయవలయును. అనంతరము స్వస్తివాచనమును చెప్పవలయును అక్షయ్యోదకమును ఇచ్చి పిండదాత స్థిరచిత్తుడై గోత్రవర్ణనపూర్వకముగ నభివాదనమునుచేయవలయును. ఏద్విజులుభోజనపాత్రను కదిలించకుండ స్వస్తినిచెప్పుచున్నారో వారిపితృలు సంవత్సరముచ్ఛిష్టభోజనముచేయువారుగ నగుచున్నారు ॥ ౫౬ ॥ మాయొక్కదాతలు వృద్ధిని పొందుదురుగాక (అనే) ఇదిమొదలైన స్మృతివచనరూపకమైన ప్రశ్నలచేత నాబ్రాహ్మణులవలన ఆశీర్వాదమునుపొందవలయును. అనంతరమునమస్కారమును చేయవలయును ౫౭ ॥ ద్రవ్యములేనియెడల, బ్రాహ్మణులులేనియెడల అన్న మంత్రములను పఠించవలయును. పితృసూక్తముచేత తెలిసినవాడుహోమమును చేయవలయును॥౫౭॥ బ్రాహ్మణుడు ఏమియుద్రవ్యములేనివాడైనట్టయితే ఆవులకుశక్తికొలది గడ్డిని యియ్యవలయును లేదాశాస్త్రప్రకారము స్నానముచేసితిలతర్పణమునుచేయవలయును॥౫౮॥ నేను దరిద్రుడను విశేషపాపిని, అని విచక్షణులగులోకులు చెప్పుచున్నారు అని నిర్జనప్రదేశంబున గట్టిగరోదనము చేయవలయును ॥ ౬౦ ॥ శ్రాద్ధము చేసిన ఏ విప్రుడు మరుసటిదినమందు పితరులనుగూర్చి తర్పణముచేయడో వారి వంశము నాశనము పొందుచున్నది. ఇంక బ్రహ్మహత్యనుకూడా బొందుచున్నాడు.

ఆ మ శ్రా ద్ధ వి ధిః.

౧౦౦. పక్వద్రవ్యసమ్పాదనా సమ్భవేతుసుమన్తుః ॥ శ్లో॥ పాకాభావేఽధికారస్స్యాద్విప్రాదీనాంనరాధిప । అపత్నీనాంమహాబాహో విదేశగమనాదిభిః । సదాచైవతుశూద్రాణా

మామశ్రాద్ధంవిదుర్బుధాః । ఆత్మనో దేశకాలాభ్యాం విప్లవే సముపాగతే । ఆపద్యనగ్నౌతీర్థేచ ప్రవాసేపుత్రజన్మని । చన్ద్రసూర్యగ్రహేచైవ దద్యాదామంవిశేషతః । ఉశనా॥ శ్లో॥ అపత్నీకః ప్రవాసీచయస్య భార్యారజస్వలా । సిద్ధాన్నే ననకుర్వీతహ్యా మంతస్యవిధీయతే ॥ ఇతి జమదగ్నిః ॥ నభ వేద్యస్యసామగ్రీదారావా గృహమేవచ । ఆమశ్రాద్ధంప్రకు ర్వీత వృద్ధోబాలశ్చయోభవేత్ ॥ యావత్స్యాన్నాగ్నిసం యుక్త ఉత్పనాగ్నిరథాపివా । ఆమశ్రాద్ధంసదాకుర్యాద్ధస్తే ఽగ్నౌకరణంభవేత్ ॥ ఆమందదతుకాన్తేయ దద్యాదన్నా చ్చతుర్గుణం । సిద్ధాన్నేతువిధిర్యస్స్యా దామశ్రాద్ధేప్యసావి ధిః । ఆవాహనాదిసర్వం స్యాత్పిణ్డదానంచభారత । దద్యా ద్యచ్చద్విజాతిభ్యశ్శృతంవా ఽశృతమేవవా। తేనాగ్నౌకర ణంకుర్యాత్పిణ్డాంస్తెనైవనిర్వపేత్ । ఆమశ్రాద్ధంయదాకు ర్యా ద్విధిజ్ఞశ్శ్రాద్ధదస్సదా । హస్తేగ్నౌకరణం కుర్యాద్బ్రా హ్మణస్యవిధానతః ॥ ఇతి షట్త్రింశమతేతు ॥ శ్లో ॥ ఆమ శ్రాద్ధంయదాకుర్యా త్పిణ్డదానంకథంభవేత్ । గృహపా కాత్సముద్ధృత్య సక్తుభిఃపాయసేనవా ॥

(ఇతి వైద్యనాథీయేస్మృతి ముక్తాఫలే పేజి-౮౩౪)

తా॥ఓరాజా పాకముచేయుటకు సందర్భము కలిగినప్పుడు పత్నీరహితులును త్రైవర్ణికులు విదేశగమనాధికారణములచేత నామశ్రాద్ధాధికారులగుదురు. శూద్రు లెల్లప్పుడామశ్రాద్ధమును చేయవలయునని పెద్దలువచించిరి. తమకు దేశకాలములవల నగలిగిన యాపదయందును దైవాత్తుకలిగినయాపదయందును భార్యలేని సమయమం దును గంగాదితీర్థములయందును పరదేశనివాసమందును పుత్రోత్పత్తి యందును చ న్ద్రసూర్యగ్రహణములయందునువిశేషముగయామమునే ఇయ్యవలయును. అపత్నీ కుడు పరదేశవాసియు రజస్వలాపతియు వీరలు సిద్ధాన్నము (అనగ లబ్ధక్రీతాదిప క్వాన్నము) చేతను శ్రాద్ధమునుచేయకూడదు. ఆమముచేతనే చేయవలయునని విధిం పబడినది. ఎవనికి పదార్థ సామగ్రియు భార్యయు గృహము లెదో యతను వృద్ధు

డైనను బాలుడైనను యామశ్రాద్ధమును చేయవలయును. తనంతట నేపోయినయగ్నితో కూడియున్న వాడున్ను వదిలిపెట్టినయగ్నికలవాడున్ను సర్వదాయామము చే శ్రాద్ధమును పెట్టవలయును. అగ్నౌకరణమును హస్తమందే చేయవలయును- ఓధర్మరాజా ఆమమును అన్నముకంటె నాల్గుభాగములధికముగనియ్యవలయును. అన్నశ్రాద్ధమందేవిధికలదో యావిధియామశ్రాద్ధమందునుకలదు. గాన యావాహనాది సర్వమున్ను పిణ్డదానమున్నుకలదు. వినపడినది వినపడనదియగు ఏవస్తువుద్విజాతులకొరకివ్వబడునో యావస్తువుచేతనే అగ్నౌకరణమును పిణ్డములను చేయవలయును. విధిజ్ఞుడగుశ్రాద్ధదాతామశ్రాద్ధము నెప్పుడు చేయునోయప్పుడు విధ్యుక్తముగ బ్రాహ్మణహస్తమందగ్నౌకరణమును చేయవలయును. ఎప్పుడామశ్రాద్ధము ను చేయుచురోనట్టిసమయమునపిండదానమేలాగు చేయవలయునని ప్రశ్నకలుగుచుండగ మునులు గృహమందువండినయన్నముచే గాని లేదా పిండిచేగాని పాయసాన్నముచేగాని పిండదానము చేయవలయునని వంచిచిరి.

ఆపది బ్రాహ్మణేతర విద్యాగ్రహణం.

౧౦౧. ఆపత్కాలేఽబ్రాహ్మణస్య బ్రాహ్మణాద్విద్యోపయోగః ॥౧॥
అనుగమనంశుశ్రూషా ॥ ౨ ॥ సమాప్తేబ్రాహ్మణోగురుః॥
౩॥ యాజనాధ్యాపనప్రతిగ్రహాఃసర్వేషాం ॥౪॥

(గౌతమసంహిత అధ్యా ౭, శ్లో ౧—౪)

తా॥ ఆపత్కాలమందు (అనగ అన్యదేశరాజపరిపాలనంబైన ఈకలికాలంబున) బ్రాహ్మణుడు బ్రాహ్మణుడు కానటువంటివానియొద్ద అధ్యయనము చేయవచ్చునని టగౌణము ॥ ౧ ॥ ఆయధ్యయనకాలమందతను గురువుకు వెనుక నడుచుచు శుశ్రూషచేయనగును ౨ ॥ అధ్యయనసమాప్త్యనంతరమా బ్రాహ్మణుడు గురువుగావచ్చును. ౩ ॥ సర్వులు యజ్ఞము చేయవచ్చును, వేదమభ్యసించవచ్చును, దానముపట్టవచ్చును.

క్షత్రవైశ్యానామపి వేదాధ్యాపనవిధిః

౧౦౨. గౌతమః—కృషివాణిజ్యేవాస్వయం కృతేకుసీదంచేతి అధ్యాపనంతుక్షత్రియవైశ్యయోర్బ్రాహ్మణ ప్రేరితయోర్భవతిన స్వేచ్ఛయా ॥ ఆపత్కాలేఽబ్రాహ్మణస్య బ్రాహ్మణాద్విద్యోపయోగోఽనుగమనం గురుశుశ్రూషాసమాప్తే బ్రాహ్మ

ణోగురురితిగౌతమస్మరణాత్ ॥ ఏతాన్యనాపది బ్రాహ్మణస్య షట్కర్మాణితత్రత్రీణీజ్యాదీనిధర్మార్థాని ప్రతిగ్రహాదీనిత్రీణివృత్త్యర్థాని ॥ షణ్ణాంకర్మణాంమధ్యేత్రీణి కర్మాణిజీవికా । యాజనాధ్యాపనేచైవ విశిష్టాచ్చ ప్రతిగ్రహ ఇతి మనుస్మరణాత్ । అతఇజ్యాదీన్యవశ్యం కర్తవ్యానినప్రతిగ్రహాదీని-ద్విజాతీనామధ్యయన మిజ్యాదానంబ్రాహ్మణస్యాధికాః ప్రవచనయాజనప్రతిగ్రహాఃపూర్వేషు నియమఇతి గౌతమస్మరణాత్ ॥ ౧౧౮ ॥

(విజ్ఞానేశ్వరీయయుక్తయాజ్ఞవల్క్యస్మృతి పేజి. ౧౮)

తా ॥ వైశ్యుడు సేద్యము వర్తకము వడ్డియు ఈ మూటిని తానుచేయతగినవాడు. బ్రాహ్మణునిచే నాజ్ఞప్తులయిన క్షత్రియవైశ్యులు ఇతరులకధ్యయనము చేయించుట కధికారులు. ఆపత్కాలమునందు బ్రాహ్మణుడు బ్రాహ్మణేతరులవల్లతనవిద్యల గ్రహించుటయు బ్రాహ్మణేతరులననుసరించుటయుజేయవచ్చును. గౌతమఋషి, బ్రాహ్మణుడు గురుశుశ్రూషను సమాప్తిజేసిన పిమ్మట సర్వవర్ణములకు గురువనివచించిరి. బ్రాహ్మణుడు ఈషట్కర్మలను ఆపత్కాలము లేనప్పుడుజేయదగినవి. షట్కర్మలయందు యజనాధ్యయన దానములుమూడు ధర్మార్థనిమిత్తములయినవి. తక్కినయాజనాధ్యాపక ప్రతిగ్రహములు మూడుజీవనవృత్తి నిమిత్తములయినవి. షట్కర్మలమధ్యమునందుమూడుకర్మలు జీవనప్రదములు. అవి ఎవ్వియనగ యాజనము అధ్యాపనముశిష్టాచారసంపన్నులవల్ల ప్రతిగ్రహమనియు మనువుచెప్పినాడుగాన షట్కర్మలు ముఖ్యముగాచేయతగినవి. అయినను సాధారణముగ ప్రతిగ్రహాదులు సర్వత్రజేయ కూడదు. ద్విజులకు యజనాధ్యయన దానములు విధిచోదితములు అయినను బ్రాహ్మణునికే ప్రవచనాధ్యాపక ప్రతిగ్రహములు ముఖ్యములని పూర్వీకుల నియమము అని గౌతమస్మృతియభిప్రాయము.

### శూద్రదృష్టాన్నగ్రాహ్యవిషయః

౧౧౯. పరాశరః॥ తద్విష్ణోరితిమంత్రేణ గాయత్ర్యాచప్రయత్నతః।
ప్రోక్షయేదన్నజాతంతుశూద్రదృష్ట్యాదిశుద్ధయే॥

(నిర్ణధౌ తృతీయపరిచ్ఛేదే శ్రాద్ధనిర్ణయః పేజి ౩౭౮)

తా॥శూద్రుడన్నము చూచుటవలన కలిగినపాప నివృత్తికొరకు॥తద్విష్ణోః పరమంపదగ్ం సదాపశ్యన్తిసూరయః దివీవచక్షురాతతం । తద్విప్రాసోవిపన్యవో జాగృవాంసస్సమింధతే విష్ణోర్యత్పరమంపదమ్'' అనుమన్త్రముచేతను గాయత్రి మంత్రముచేతను ప్రయత్నముగ నన్నమును ప్రోక్షించిన శుద్ధినొందును.

### ద్విజస్పృష్ట శూద్రాన్నగ్రహణవిషయః.

౧౦౪. పరాశరః॥తావద్భవతిశూద్రాన్నంయావన్నస్పృశతిద్విజః। ద్విజాతికరసంస్పృష్టంసర్వంతన్నవిరుధ్యతే॥ విష్ణుపురాణే॥ సంప్రోక్షయిత్వాగృహ్ణీయా చ్ఛూద్రాన్నంగృహమాగతమ్ ॥ అంగిరాః ॥ పాత్రాంతరగతంగ్రాహ్యందుగ్ధంస్వగృహామాగతమ్॥నిర్ణయసింధౌ 3 అ. శ్రాద్ధనిర్ణయః పేజీ.౩౨౨

తా॥శూద్రాన్నమెంతవరకు ద్విజుడుతాకడో అంతవరకు శూద్రాన్నమగుచున్నది. ద్విజునిహస్తముచేస్పృశింపబడినదన్తయుగ్రాహ్యము. తనగృహమునకువచ్చిన శూద్రాన్నము ద్విజుడు ప్రోక్షించిగ్రహింపవచ్చును. తనయింటికితెచ్చిన శూద్రసంబంధమైనపేదియుమరియొకపాత్రయందుంచుటచేగ్రాహ్యనీయంబు. అనగశూద్రపాత్రతోగ్రహింపకూడ దనుట.

### బ్రాహ్మణవైశ్యయోశ్శస్త్రగ్రహణం.

౧౦౫. ఆత్మత్రాణేవర్ణసంకరేవా బ్రాహ్మణ వైశ్యౌశస్త్ర మాదధీయాతామ్ । క్షత్రియస్యతుతన్నిత్య మేవరక్షణాధికారాత్॥
(వశిష్ఠసంహితాయామ్ తృతీయోఽధ్యాయః)

తా॥ఆత్మరక్షణంబున,వర్ణసంకరంబున బ్రాహ్మణవైశ్యులుశస్త్రమునుపట్టవచ్చును. క్షత్రియుడుపరిపాలనాధి కారమువలన నిత్యముశస్త్రమును ధరింపవలయును.

౧౦౬. శస్త్రంద్విజాతిభిర్గ్రాహ్యం ధర్మోయత్రోపరుధ్యతే । ద్విజాతీనాంచవర్ణానాం విప్లవేకాలకారితే ॥ ౩౪౮ ॥ ఆత్మనశ్చపరిత్రాణే దక్షిణానాంచసంగరే । స్త్రీవిప్రాభ్యుపపత్తౌ చఘ్నన్ ధర్మేణనదుష్యతి ॥ ౩౪౯ ॥ గురుంవాబాలవృద్ధౌవా బ్రాహ్మణంవాబహుశ్రుతమ్ । ఆతతాయినమాయాంతం హన్యాదేవావిచారయన్ ॥ ౩౫౦ ॥ నాతతాయివధేదోషోహంతుర్భవతికశ్చన । ప్రకాశంవాప్రకాశంవా
(మనుధర్మశాస్త్రే 8 అష్టమోఽధ్యాయః)

తా ॥ ద్విజాతియైన వర్ణమునకు కాల వైపరీత్యముచే ధర్మోపరోధముగలిగిన యెడల ద్విజాదులు శస్త్రమును గ్రహింపవచ్చును ॥ ౩౪౮ ॥ స్వాత్మరక్షణార్థమందును, ధనమును గోవుల నపహరించుటయందు కలిగిన సంగరంబునను, స్త్రీ, బ్రాహ్మణరక్షణార్థమందును ధర్మయుద్ధముజేసిన ద్విజునకు దోషంబులేదు ॥ ౩౪౯ ॥ హింసాపరుడైవచ్చుచున్న ఆతతాయిబాలుడైనను, వృద్ధుడైనను, గురువైనను, బహుశ్రుతుడైనను, వధింపవచ్చును ॥ ౩౫౦ ॥ ఆతతాయిని రహస్యముగగాని ప్రకాశముగగానివధించుట యందుద్యుక్తుడైన పురుషునకు దోషములేదు॥

సర్వవర్ణానాం మంత్రాధికారనియమవిధి.

౧౦౭. సర్వేషామేవమన్త్రాణాం ప్రథమంగుహ్యముత్తమమ్ । మన్త్రరత్నంనృపశ్రేష్ఠ సద్యోముక్తిఫలప్రదమ్ ॥ సర్వైశ్వర్యప్రదంపథ్యం సర్వేషాంసర్వకామదమ్ । యస్యోచ్చారణమాత్రేణ పరితుష్టోభవేద్ధరిః ॥ దేశకాలాదినియమ మరిమిత్రాదిశోధనమ్ । స్వరవర్ణాదిదోషశ్చ పౌరశ్చరణకంనతు ॥ బ్రాహ్మణాఃక్షత్రియావైశ్యాః స్త్రియః శూద్రాస్తథేతరాః । తస్యాధికారిణఃసర్వేసత్వశీలాగుణాయది ॥ పఞ్చసంస్కారసమ్పన్నాః శ్రద్ధావన్తోఽనసూయకాః । భక్త్యాపరమయావిష్టా యుక్తాస్తస్యాధికారిణః ॥ పఞ్చవింశాక్షరోమన్త్రః పదైఃషడ్భిఃసమన్వితః । వాక్యద్వయంపరంజ్ఞేయం మన్త్రరత్నమనుత్తమం । యదాశ్రయతివిద్యాదిః సస్థితోజగతాంపతిః । తయావిద్యాఽనపాయిన్యా సంయుతఃపరమఃపుమాన్ ॥ నారాయణోఽచ్యుతఃశ్రీమాన్ వాత్సల్యగుణసాగరః । నాథఃసుశీలఃసులభః సర్వజ్ఞఃశక్తిమాన్పరః ॥ ఆపద్బన్ధుఃసదామిత్రః పరిపూర్ణమనోరథః । దయాసుధాబ్ధిఃసవితా వీర్యవాన్ద్యుతిమాన్విభుః ॥

(వృద్ధహారీతసంహితాయాం తృతీయోఽధ్యాయః.)

తా॥ హేరాజశ్రేష్ఠా! సమస్తమైన మంత్రములలో మొదటిదై రహస్యంబై స ర్వోత్కృష్టమై శ్రేష్ఠంబైన మంత్రము తక్షణమే ముక్తిఫలమును సమస్తైశ్వర్యమును, హితకరమును సర్వజాతులకు సర్వకామములనిచ్చునదిగనౌచున్నది. ఏమంత్రముచ్చరించుటచే విష్ణువుమిక్కిలి సంతసించునో అట్టిమంత్రము దేశకాలాది నియమము గలిగి ఉపాసనజేసిన శత్రుమిత్రాది దోషములను నశింపచేయునదిగనౌను. ఏమంత్రమైతే స్వరవర్ణాది లోపములుగలదియౌనో యామంత్రము ఉపాసనార్హమైనదిగాదు. ఎప్పుడు బ్రహ్మక్షత్రియవైశ్య స్త్రీశూద్రేతరులుమంచిస్వభావము, సత్వగుణముగలవారలుగనగుదురో యట్టివారామంత్రముల కధికారులు- ఇంతయేగాక పంచసంస్కారము, శ్రద్ధగలవారలై, అసూయారహితులై శ్రేష్ఠమైనభక్తితోగూడుకొనిన వారుగనుందురో వారామంత్రముల కధికారులు. అదియిరువదైదక్షరములు, ఆరుపదములు రెండువాక్యములుగల మంత్రము సర్వోత్కృష్టంబై మంత్రరాజ్యమని పేర్కొనంబడియె. ఏకారణమువలన లోకమందున్న విద్యాదులుసర్వలోకేశ్వరుని యాశ్రయించుచున్నవో అట్టితొలగని విద్యలతో గూడి యున్న పరమపురుషుడు, నాశనరహితుడు, సంపద్యుక్తుడు, దయాసముద్రుడు, సర్వలోకేశ్వరుడు మంచిస్వభావముగలవాడు, సౌలభ్యుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తిస్వరూపుడు, ప్రకృతివిలక్షణుడు ఆపద్బాంధవుడు, నిరంతరస్నేహితుడు, నిత్యానందుడు, దయామృతసముద్రుడు, సూర్యజ్యోతిరూపుడు, కాంతి మహిమలు గలవాడు, సర్వవ్యాపకుడునై క్షేమాధారంబైన ఏనారాయణమూర్తి గలడో అట్టి శ్రీమహావిష్ణుని పాదారవిందములను శరణుజొచ్చుచున్నాడను.

## మధ్యమాంసాధి నిషేధవిషయః.

౧౦౮. సురాయాః ప్రతిషేధస్తుద్విజానామేవకీర్తితః । విశిష్టస్యాపి
శూద్రస్య కేచిదిచ్ఛంతిసూరయః ॥ ౨౭౫ ॥ అనృతంమ
ద్యమాంసంచపరస్త్రీస్వాపహారణమ్ । విశిష్టస్యాపి శూద్ర
స్యపాతిత్యంమనురబ్రవీత్ ॥ ౨౭౬ ॥ సురావైమలమన్నా
నాంపాప్మాద్వైమలముచ్యతె । తస్మాద్బ్రాహ్మణరాజన్యౌ
వైశ్యశ్చనసురాంపిబేత్ ॥ ౨౭౭ ॥

(వృద్ధహారీతసంహితాయాం షష్ఠోఽధ్యాయః)

తా॥ బ్రహ్మక్షత్రియవైశ్యులకే ఈసురాపానమునిషేధమనిచెప్పుటయేగాదు కొంతమంది విద్వాంసులు సదాచారసంపన్నుడైన శూద్రునకుకూడ నిషేధమని చెప్పుచున్నారు. అనగ అపిశబ్దస్వారస్యమువల్లను మరికొన్నివిశేషస్మృతులవల్లను మద్యమాంసనిషేధమువిశిష్టుడైనశూద్రునకుకూడ చెప్పబడినది. ద్విజాదులవలెనే మరణాంతశ్రాయశ్చిత్తవిధిశూద్రునకు వచింపబడలేదుగాని తద్దోషనివారణముగోసహస్రదానముచేనివర్తింపబడుచున్నదని స్మృతులుఘోషిల్లుచున్నవి. మనువుఅనృతము,మద్యమాంసము,పరస్త్రీసంగమము,పరద్రవ్యాపహరణము, విశిష్టుడైనశూద్రునకుపాపహేతువనివచించెను. శూద్రునకేపాపహేతువనిచెప్పుటచే ద్విజాతులకుపాపమనిచెప్పుటనావశ్యకము॥౨౭॥ మనుష్యులకు సుర మాలిన్యజనకము, ఆహేతువుచే మలమనిచెప్పబడుచున్నది.అందువలన బ్రాహ్మణక్షత్రియవైశ్యులు మద్యమాంసమునుసుతరము త్రాగంగూడదు.

౧౦౯. అజ్ఞానాత్ప్రాశ్యవిణ్మూత్రం సురాసంస్పృష్టమేవచ।పునస్సంస్కారమర్హంతి త్రయోవర్ణాద్విజాతయః ॥ ౨ ॥ అజినం మేఖలాదండో భైక్షచర్యావ్రతానిచ। నివర్తంతేద్విజాతీనాం పునస్సంస్కారకర్మణి ॥ ౩ ॥

(పారాంశర్యాం ప్రాయశ్చిత్తకాణ్డేద్వాదశోఽధ్యాయః)

తా॥ బ్రాహ్మణక్షత్రియవైశ్యులు ఎరుగక మూత్రపురీషములను, కల్లును తాకిన,యన్నముదినిన,తిరిగి యుపనయనము చేయించుకొనవలయును ॥ ౨ ॥ ఇఱ్ఱిచర్మమును ముంజతృణముతోపేనినమొలత్రాడును, దండమును భిక్షయును వ్రతమును ద్విజులకుమరలచేయబడుపనయనమునకావశ్యకములుగావు ॥ ౩ ॥

తత్ప్రాయశ్చిత్తవిధి.

౧౧౦. అగ్నివర్ణాంసురాంపీత్వా సురాపానాద్విజాతయః। మరణాచ్ఛుద్ధిమృచ్ఛంతి శూద్రస్తువ్రతమాచరేత్ ॥ ౨౮ ॥

వృద్ధహారీతసంహితాయాం షష్టోధ్యాయః.

తా॥ సురాపానముచేసిన శూద్రునకు ప్రాయశ్చిత్తముకలదుగాని, ద్విజునకు కళకళకాగిన సురనుద్రాగి మృతినొందుటయే ప్రాయశ్చిత్తముగ చెప్పబడినది.

కన్యావిక్రయప్రశంసా.

౧౧౧. శుల్కేనయేప్రయచ్ఛంతి దుహితాంలోభమోహితాః। తేయాన్తినరకేఘోరే యావదాభూతసంప్లవమ్ ॥ గమనా

గమనాయోగాదేవం శుల్కే-విధీయతే । ఏవంజ్ఞాత్వాచ యుక్తింతాంకన్యావిక్రేతసత్కులమ్ ॥ నస్యాద్దైవేచపిత్రేచ దాసీస్యాదథసేవితా । క్రయక్రీతాతుసాదాసీన సాపత్నీవిధీయతే॥అగ్నిష్టోమాతిరాత్రాణాం శతంశతగుణీకృతమ్ ॥ ప్రాప్నోతిపురుషోదత్వా హోమమన్త్రైరలంకృతమ్॥ యస్తుసత్యేనధర్మేణ పితాచార్పయతేసుతామ్ ॥ సప్రేత్యలభతేస్థానం యథాదక్షఃప్రజాపతిః॥

(కశ్యపస్మృతిః.)

తా ॥ ఎవరులోభ మోహములతో కూడుకొని స్వపుత్రికను క్రయమునకు విక్రయించునో వాడు మహా ప్రళయ పరియంతము ఘోరమైన నరకమును పొందుచున్నాడు- విక్రయించుటయందు నరకమునుబొంది మరల జన్మించి మరల నరకమును పొందడమేవిధింపబడినది. ఈలాగున విక్రయించుటవలన కలిగెడిదోషమును దెలుసుకొని కన్యసత్కులమందు పుట్టిన వరుణ్ని బొందవలయును. విక్రయించిన కన్యకకు యజ్ఞములయందు, శ్రాద్ధములయందు అధికారములేదు. పురుషునిచే సేవించబడుచు దాసీగాచెప్పబడుచున్నది. విక్రయించినకన్యదాసిగాని ధర్మపత్నిగవిధించబడదు. వివాహమంత్రములచే సంస్కరింపబడిన కన్యకను ఎవడువరుణికొరకు అర్పణచేయుచున్నాడో యతను నూరుమారులుచేయబడిన అగ్నిష్టోమాదిరాత్ర క్రతుఫలములను బొందుచున్నాడు. తండ్రియైనఏపురుషుడు సత్యమైనధర్మమార్గముచే వరుణ కర్పణచేయుచున్నాడో ఆపురుషుడు దక్షప్రజాపతివలె సర్వోత్తమమైన పుణ్యలోకమును బొందుచున్నాడు.

## అర్థవిహీన వేదప్రశంసా.

౧౧౨. బ్రహ్మణాభిహితఃపూర్వ మృషీణాంభావితాత్మనామ్ । యో-
ఽన్యత్రకురుతేయత్న మనధీత్యశ్రుతింద్విజః॥౮౮॥ సవైమూ-
ఢోనసంభాష్యో వేదబాహ్యోద్విజాతిభిః । నవేదపాఠమా-
త్రేణసంతుష్టోవైద్విజోత్తమః ॥ ౮౧ ॥ పాఠమాత్రావసా-
నస్తుపంకేగౌరివసీదతి । యోఽధీత్యవిధివద్వేదం వేదాంతం

న విచారయేత్ ॥ ౮౨ ॥ ససాన్వయశ్శూద్రకల్పః సపాద్యం నప్రపద్యతే ॥

(ఔశనసస్మృతౌ తృతీయోఽధ్యాయః.)

తా ॥ యమనియమాదులచేత పరిపక్వమైన చిత్తముగల ఋషులకుపూర్వమందు బ్రహ్మచేత చెప్పబడినది ఏమనగ, ఏద్విజుడు వేదమును చదవక నితర విద్యయందు శ్రమచేయుచున్నాడో అతను మూఢుడు వేదబాహ్యుడుగానద్విజాదులచేతసంభాషింపబడదగినవాడు గాడు. ద్విజోత్తముడు వేదములను మాత్రము చదువుటచేత నేసంతోషించజనదు. మూలమును చదివినమనుజుడు ఏమి తెలియనివాడైబురదయందుపడిన గోవువలె దుఃఖించుచున్నాడు. ఎవడు యదావిధివత్తు వేదమునుచదివి వేదార్థమును విచారించడో వాడు తమవంశముతోకూడా శూద్రప్రాయుడు వాడు పాద్యనీయుడుకాడు.

౧౧౩. అశ్రోత్రియానను వాకా అనగ్నయః శూద్రధర్మేనభవన్తి। నాసౌబ్రాహ్మణోభవతి ॥ మానవంచాత్రశ్లోకముదాహరన్తి। యోఽనధీత్యద్విజోవేదమన్యత్రకురుతేశ్రమమ్ । సజీవన్నేవశూద్రత్వమాశుగచ్ఛతిసాన్వయః॥

ఇతి వాశిష్ఠే ధర్మశాస్త్రే తృతీయోఽధ్యాయః.

తా॥ బ్రహ్మనిష్ఠులుగాక, వేదముజదువక, అగ్నిహోత్రములేకనుంటున్నారో యట్టి బ్రాహ్మణుడు శూద్రప్రాయుడగుచున్నాడు. ఇందుకు మనువుచెప్పినశ్లోకముదాహరించబడును. ఏ ద్విజుడు వేదమును చదువక నితర విద్యలయందు పరిశ్రమచేయునో వాడు బ్రతికియు దనవంశముతోగూడ శీఘ్రముగ శూద్రత్వమును జెందుచున్నాడు.

ఇతి వైశ్యధర్మప్రకాశికాయాం ఉత్తరభాగే
స్మృత్యుక్తధర్మవివేచనమ్నామ
సప్తమోఽధ్యాయ
స్సంపూర్ణః.



## అథ అష్టమోధ్యాయః.

—*(పు రా ణో క్త ధ ర్మ వి వే చ న మ్.)*—



౧ ప్రతిగ్రహంచాధ్యయనం విప్రకర్మాణినిర్దిశేత్ । దానమధ్యయ
నంచైవ యజనంచయథావిధి ॥ ౭ ॥ క్షత్రియస్యసవైశ్యస్య
కర్మేదంపరికీర్తితమ్ । క్షత్రియస్యవిశేషేణ పాలనందుష్టనిగ్ర
హః ॥ ౮ ॥ కృషిగోరక్షవాణిజ్యం వైశ్యస్యపరికీర్తితమ్ ।
(శ్రీఅగ్నిపురాణే ఏకపఞ్చాశదధిక శతతమోఽధ్యాయః)

తా॥ యజనయాజనాధ్యయ నాధ్యాపకప్రతిగ్రహములు బ్రాహ్మణకర్మలుగను, యజనాధ్యయన దానములు క్షత్రియ వైశ్యులకును వచింపబడినవి. క్షత్రియునకువిశేషధర్మములుగ పరిపాలనమును దుర్జనశిక్షయును వైశ్యునకు కృషి గోరక్షణవర్తకములును జెప్పబడినవి.

౨ దానమధ్యయనంయజ్ఞోధర్మఃక్షత్రియవైశ్యయోః॥౩౯॥దణ్డో
యుద్ధంక్షత్రియస్యకృషిర్వైశ్యస్యశస్యతే । ...॥౪౦॥
కూర్మపురాణే ద్వితీయోఽధ్యాయే, పేజి. ౮.

తా॥ క్షత్రియ వైశ్యులకు యజనాధ్యయనదానములును అందు క్షత్రియులకు ప్రజాదండనాదులును,వైశ్యునకు కృషివాణిజ్యాదులును,నియతంబులైయుండె॥౪౦॥

౩ విశత్యాశుపశుభ్యశ్చ కృష్యాదానరుచిశ్శుచిః । వేదాధ్యయన
సంపన్నస్సవైశ్యఇతిసంజ్ఞికః ॥ వైశ్యస్యచప్రవక్ష్యామి యో
ధర్మోవేదసమ్మతః । దానమధ్యయనంశౌచం యజ్ఞస్యధనసంచ
యః ॥ అధ్యాపనంచాధ్యయనం షట్కర్మాణిద్విజోత్తమాః ।
దానమధ్యయనంయజ్ఞో ధర్మఃక్షత్రియవైశ్యయోః ॥
పద్మపురాణెఖండ౨౬అస్తీతితారానాథ తర్కవాచస్పత్యే
లిఖితం (పుట ౪౯౩౮)

తా॥ పశురక్షణ, కృషి వేదాధ్యయనములు వీనిచేవైశ్యుడను సంజ్ఞవచ్చినది. ఇంక దానము, కాంతి, పరిశుద్ధము, ఇవన్నియు నెవనియందుండునో వాడు వైశ్యుడనంబరగు, వైశ్యునకు వేదసమ్మతమైన దానాధ్యయన శౌచముంయజ్ఞార్థ ద్రవ్య

సంపాదనమునుం జెప్పంబడినవి. అధ్యాపనాధ్యయనాది షట్కర్మలు బ్రాహ్మణులకును, దానాధ్యయనయజ్ఞములు క్షత్రియ వైశ్యులకును గలవు.

౪ ఇజ్యాధ్యయనదానాని విహితానిద్విజన్మనాం । జన్మకర్మావదాతానాం క్రియాశ్చాశ్రమచోదితాః ॥ ౧౪ ॥ విప్రస్యాధ్యాపనాదీని తతోఽన్యస్యాప్రతిగ్రహః । రాజ్ఞోవృత్తిఃప్రజాగోప్తు రవిప్రాద్వాకరాదిభిః । వైశ్యస్తువార్తావృత్తిస్స్యాన్నిత్యంబ్రహ్మకులానుగః ॥ ౧౫ ॥

శ్రీమద్భాగవతే సప్తమస్కంధే ఏకాదశోఽధ్యాయః.

తా ॥ ఇందు ౧ నెంబరు చూడందగును

౫ ఇజ్యాధ్యయనదానానిసర్వేషాంచద్విజన్మనాం । ప్రతిగ్రహోధ్యాపనంచబ్రాహ్మణస్యైవయాజనం ॥ ౭౦ ॥

శ్రీభాగవతే ఏకాదశస్కంధే సప్తదశోఽధ్యాయః.

తా॥ ఇందు ౧ నం చూడుము.

౬ దానమధ్యయనంయజ్ఞో వైశ్యస్యాపిత్రిధైవసా । వాణిజ్యంపాశుపాల్యంచ కృషిశ్చైవాస్యజీవికా ॥౬॥

(శ్రీమార్కండేయపురాణే వర్ణాశ్రమధర్మోనామ అ. ౨౫.)

తా॥ వైశ్యులు దానాధ్యయన యజ్ఞంబులుచేయుచు కృషివాణిజ్యాదులచే బ్రతుకందగును ॥ ౬ ॥

౭ స్వాధ్యాయంయజనందానం కుసీదంపశుపాలనం । గోరక్షాం కృషివాణిజ్యం కుర్యాద్వైశ్యోయథావిధి ॥

(వరాహపురాణే పుట ౯౨)

తా॥ ఇందు ౨ నెంబరు చూడందగును.

౮. పాశుపాల్యంచవాణిజ్యం కృషించమనుజేశ్వర। వైశ్యాయజీవికాం ప్రాదదాల్లోకపితామహః ॥ ౩౦ ॥ తస్యాప్యధ్యయనంయజ్ఞోదానంధర్మశ్చశస్యతే । నిత్యనైమిత్తికాదీనామనుష్ఠానంచకర్మణామ్ ॥ ౩౧ ॥

(శ్రీవిష్ణుపురాణే తృతీయాంశే అష్టమోఽధ్యాయః.)

తా ॥ ఓ రాజశ్రేష్ఠా లోక పితామహుడగు బ్రహ్మ వైశ్యునకు జీవనవృత్తులుగ గోరక్షయును వర్తకమును కృషియునిచ్చెను ॥౩౦॥ ఆ వైశ్యునకు యజ్ఞాధ్యయన దానములున్ను మరికొన్ని ధర్మములున్ను నిత్యనైమిత్తికాది కర్మలను చేయుటయు ప్రశస్తమైయున్నవి ॥ ౩౧ ॥

### యుగవిషయః.

౯. సర్వేధర్మాఃకృతేజాతాః సర్వేనష్టాఃకలౌయుగే । చాతుర్వర్ణ్యసమాచారం కించిత్సాధారణంవదేతి ॥౧౭॥ సర్వేధర్మాః ప్రాణిభిఃకృత యుగేయథావదనుష్ఠితాభవంతి । యుగసామర్థ్యేనధర్మస్య చతుష్పదోప్యపరిక్షయః।త్రేతాదిషుక్రమేణక్షీయమాణాధర్మాఃకలియుగావసానేసర్వాత్మనావినష్టాభవంతి ॥ అన్యేకృతయుగేధర్మా స్త్రేతాయాంద్వాపరేయుగే।అన్యేకలౌయుగేనౄణాం యుగరూపానుసారతః ॥ ౨౨ ॥ తపఃపరంకృతయుగే త్రేతాయాంజ్ఞానముచ్యతే । ద్వాపరేయజ్ఞమిత్యాహుర్దానమేవకలౌయుగే ॥ ౨౩ ॥ కృతేతుమానవాధర్మా స్త్రేతాయాంగౌతమాస్స్మృతాః । ద్వాపరేశఙ్ఖలిఖితాః కలౌపారాశరాస్స్మృతాః॥ ౨౪॥ యుగేయుగేచయేధర్మా స్తత్రతత్రచయేద్విజాః । తేషాంనిందానకర్తవ్యా యుగరూపాహితేద్విజాః ॥ ౩౩ ॥ శ్రీమాధవీయయుక్తాయాం (పారాశర్యాం ఆచారకాండే ప్రథమోఽధ్యాయః)

తా ॥ కృతయుగమందు సర్వధర్మములు పూర్ణముగ ననుష్ఠింపబడి కలియుగమునందంతరించును ॥ ౧౭ ॥ ఆయాధర్మము లాయాయుగముల ననుసరించి పరస్పరవ్యావృత్తములై యుంటున్నవి ॥ ౨౨ ॥ అదెట్లనగ కృతయుగంబున జ్ఞానంబును ద్వాపరంబున యజ్ఞంబును, కలియుగంబున దానంబును ప్రధానంబులు ॥ ౨౩ ॥ కృతయుంగబున మనుధర్మంబులును, త్రేతాయుగంబున గౌతమధర్మంబులును, ద్వాపరంబునశంఖలిఖితధర్మంబులును, కలియుగంబునపరాశరధర్మంబులును ప్రచురముగ ననుష్టింపంబడును॥౨౪॥ద్విజులైనబ్రహ్మక్షత్రియవైశ్యులు ఆయాయుగ ధర్మములననుసరించి యుంటున్నారు గనుక నొకరి నొకరు నిందించుకొనగూడదు ॥ ౩౩ ॥

౧౦. జితోధర్మశ్చపాపేన అన్యృతేనతథాఋతమ్ ।శూద్రాశ్చబ్రాహ్మ
ణాచారాశ్శూద్రాచారాస్తథాద్విజాః॥౩౫॥ కృతంతుబ్రాహ్మణ
యుగంత్రేతాతుక్షత్రియంయుగమ్। వైశ్యంతుద్వాపరయుగం
కలిశ్శూద్రయుగంస్మృతమ్॥౩౬॥వసేత్తత్రద్విజాతిస్తు శూద్రా
యత్రతుతత్రతు ॥

(ఇతి బృహత్పారాశరీయే ప్రథమోధ్యాయః.

తా॥ పాపముచేతధర్మమున్ను అసత్యముచేతసత్యమున్ను జయింపబడును శూద్రులు బ్రాహ్మణాచారములుగలవారుగను ద్విజులు శూద్రాచారములుగలవారుగనుందురు. కృతయుగము బ్రాహ్మణయుగము, త్రేతాయుగము క్షత్రియయుగము,ద్వాపరము వైశ్యులయుగము, కలియుగము శూద్రయుగముగ చెప్పబడ్డది. గావున ఈకలియుగంబున శూద్రుడెక్కడనుండునో అక్కడ ద్విజుడు ఉండుటచే శూద్ర సంగముగలిగి ద్విజులు శూద్ర సములుగానుందురు.

## కలియుగప్రశంసా.

౧౧. శూద్రాణాంమంత్రయోనౌతు సమ్బన్ధోబ్రాహ్మణైస్సహ। భవి
ష్యతికలౌతస్మి న్ఛయనాసనభోజనైః ॥ ౬ ॥ రాజానశ్శూద్ర
భూయిష్ఠా బ్రాహ్మణాన్బాధయన్తిచ । బ్రూణహత్యావీరహ
త్యాః ప్రజాయన్తే ప్రజాసువై ॥ ౭ ॥ అన్యానిచైవకర్మాణి నకు
ర్వన్తిద్విజాతయః । వినిన్దన్తిమహాదేవం బ్రహ్మాణంపురుషోత్త
మమ్ ॥ ౨౪ ॥ కుర్వన్తిచావతారాణి బ్రాహణానాంకులేషు
వై । దధీచశాపనిర్దగ్ధాః పురాదక్షాధ్వరేద్విజాః ॥ ౨౫ ॥ ...
యేచాన్యేశాపనిర్దగ్ధా గౌతమస్యమహాత్మనః । సర్వేవైవిచరి
ష్యన్తి బ్రాహణాద్యాసుయోనిషు ॥ ౨౭ ॥ వినిన్దన్తిహృషీకే
శం బ్రాహణాన్బ్రహ్మవాదినః । సర్వేషూక్తంపురాణేషు వేదే
ష్వర్థంవినిన్దతి॥ ౨౮ ॥

శ్రీకూర్మపురాణే సప్తవింశోఽధ్యాయః.

తా॥ ఈ కలియుగంబున విప్రులు స్వకులాచారవిహీనులై హరిహరహిరణ్యగర్భులమువ్వర నిందించుచు వేదశాస్త్రపురాణంబుల ప్రమాణంబులని శూద్రుల

సేవజేసెదరు. విప్రభామినులకు శూద్రసంసర్గంబునం గర్భంబులగు ప్రభువులు బ్రహ్మద్వేషులై శూద్రాభిమానవర్తులగుదురు. గౌతమ దధీచి శాపయుక్తులై యిత్తెఱంగున బ్రాహ్మణులు భూమింబుట్టుచు జచ్చుచు నీచులై యుండెదరు.

౧౨. కుర్వన్తిచావతారాణి బ్రాహ్మణానాంకులేషువై । దధీచశాప నిర్దగ్ధాః పురాదక్షాధ్వరేద్విజాః ॥ ౨౫ ॥ నిన్దన్తిచమహాదేవం తమసావిష్టచేతసః। వృథాధర్మంచరిష్యన్తికలౌతస్మిన్యుగాన్తిమే ౨౬ ॥ యేచాన్యేశాపనిర్దగ్ధా గౌతమస్యమహాత్మనః। సర్వేవై విచరిష్యన్తి బ్రాహ్మణాద్యాసుయోనిషు॥ ౨౭ ॥ వినిన్దన్తిహృషీకేశం బ్రాహ్మణాన్బ్రహ్మవాదినః । సర్వేషూక్తంపురాణేషు వేదేష్వర్థంవినిన్దతి ॥

(వైద్యనాథీయే స్మృతిముక్తాఫలే పేజి-౧౧.)

తా ॥ పూర్వము దక్షాధ్వరమందు దధీచిశాపదగ్ధులగు ద్విజులు బ్రాహ్మణులందు జన్మించి కలియుగాంతమందు మూఢచిత్తులై మహాదేవుని నిందించుచు వ్యర్థ ధర్మములను జేసెదరు ॥ ౨౬ ॥ గౌతమ మహామునిచే శాపదగ్ధులగు బ్రాహ్మణులందరు జాతి వివేచనములేక బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులయందు జన్మించి విష్ణువును బ్రహ్మవేత్తలను పురాణములను వేదార్థములను నిందించెదరు॥౨౭॥౨౮॥

౧౩. తథాకలియుగస్యాన్తే శూద్రభూతాఃప్రజాస్తథా ॥ ౭౭ ॥ ... బ్రహ్మక్షత్రవిశశ్శూద్రా బీజార్థేయే ఇహస్మృతాః । కార్తే యుగభవైస్సార్థం నిర్విశేషాస్తదాభవన్ ॥౯౩॥

(మత్స్యపురాణే త్రిచత్వారింశదుత్తరశతతమోధ్యాయః)

తా॥ కలియుగాన్తమందు ప్రజలు శూద్రతుల్యులగనుందురు. బ్రహ్మ క్షత్రియ వైశ్యశూద్రులు కలియుగంబున బీజభూతులై యుండి మరల కృతయుగమందున్న వారలతో సములుగ నయ్యెదరు.

౧౪. బ్రాహ్మణాఃక్షత్రియావైశ్యా స్సర్వేధర్మపరాఙ్ముఖాః । శూద్రతుల్యాభవిష్యంతి తపస్సత్యవివర్జితాః॥ యోయోఽశ్వరథనాగాఢ్య స్సచరాజాభవిష్యతి । కింకరాశ్చభవిష్యంతిశూద్రాణాంచసదాద్విజాః । బ్రాహ్మణాఃక్షత్రియావైశ్యా శ్శూద్రాధర్మపరానరాః । ఘోరేకలియుగేప్రాప్తే ద్విజావేదపరాఙ్ముఖాః ॥

(బృహన్నారదీయే అ. ౩౮.)

తా ॥ బ్రహ్మ క్షత్రియ వైశ్యులందరు ధర్మవిముఖులై తపస్సత్యాదివివర్జితులై శూద్రతుల్యులుగ నుందురు యెవడు గజాశ్వరథములుగలవాఁడో అతనే రాజగుచున్నాఁడు. ద్విజులు యెల్లప్పుడు శూద్రభృత్యులై భయంకరమగు నీకలియందు బ్రహ్మక్షత్రియ వైశ్యులు శూద్రధర్మపరులై వేదవిముఖులగుదురు.

౧౫. బ్రహ్మక్షత్రవిశశ్శూద్రాజాత్యాచారవివర్జితాః । సంధ్యాచయజ్ఞసూత్రంచ భవేల్లుప్తంనసంశయః ॥ ౨౩ ॥ మ్లేచ్ఛాచారాభవిష్యంతి వర్ణాశ్చత్వారఏవచ । మ్లేచ్ఛశాస్త్రంపఠిష్యన్తిస్వశాస్త్రాణివిహాయచ ॥ ౨౪ ॥ బ్రహ్మక్షత్రవిశాంవంశాశ్శూద్రాణాంసేవకాఃకలౌ।సూపకారాధావకాశ్చవృషవాహాశ్చసర్వశః

(దేవీభాగతే నవమస్కంధే అష్టమోఽధ్యాయః)

తా ॥ బ్రహ్మ క్షత్రియ వైశ్యులు జాతిధర్మవిహీనులై సంధ్యయజ్ఞసూత్రములను వదిలిశూద్రతుల్యులుగనగుదురు ॥౨౩॥ నాలుగువర్ణస్థులు మ్లేచ్ఛాచారులై తమశాస్త్రములనువదిలి మ్లేచ్ఛశాస్త్రములను చదివెదరు. కలియుగమున బ్రహ్మక్షత్రియ వైశ్యులు శూద్ర సేవారతులై వంటాచార్యులుగానుపరిచారకులుగానుపుణ్యాదికర్మలనుకూలికి చేయువారలుగ నగుదురు ॥ ౨౫ ॥

బ్రహ్మక్షత్రవిశాంవంశాః భవిష్యన్తిచపాపినః ॥ ...౪౮ ॥ అన్నానాంనియమోనాస్తి యోనీనాంచవిశేషతః । ఆశ్రమాణాంజనానాంచసర్వేమ్లేచ్ఛాఃకలౌయుగే ॥ ౫౨ ॥

(దేవిభాగవతే నవమస్కంధే అష్టమోఽధ్యాయః.)

తా ॥ బ్రహ్మ క్షత్రియ వైశ్యులవంశములు పాపముగలవిగనగుచున్నవి ॥౪౮॥ ఇంక సర్వజనులు కలియుగమందు విశేషముగ అన్ననియమము యోనినియమము ఆశ్రమనియమము లేక మ్లేచ్ఛులగుచున్నారు.

## కలియుగద్విజాభావ నిషేధనమ్.

౧౬. బ్రాహ్మణాఃక్షత్రియోవైశ్యాఃశూద్రవర్ణాస్త్రయోద్విజాః।యుగేయుగేస్థితాః సర్వేకలావాద్యంతయోస్థితా ఇతి అతఃకథం ద్విజసంకరజాః ఉక్తాఃమైవంకలౌతుబీజ భూతాస్తుకేచిత్తిష్ఠన్తిభూతలే। తథైవదేవాపిపురూసాంప్రతం సమవస్థితావితివిష్ణుపురాణాద్బ్రహ్మక్షత్రవిశః శూద్రాబీజార్థేయేఇహాస్థితాః॥

(శూద్రకమలాకరం పేజి-౭౮.)

తా॥ ప్రతియుగమందున్న బ్రహ్మక్షత్రియవైశ్యులగు ద్విజులందరు కలియుగాదియందు నంతమందును శూద్రవర్ణులుగనుందురు. అయితే కొందరిమతేనకలావాద్యంతయోస్థిస్తా అనుదానికి ఆది యంతములకే స్థితియని చెప్పెనేని ద్విజసంకరులుండుట యెట్లుసంభవించు గావున విష్ణుపురాణమందు చెప్పిన చొప్పున కలియుగంబున బహ్మ క్షత్రియ వైశ్యులు దేవాపి పురూరవులవలె బీజభూతులై యుండుట నిశ్చయంబు. ఇదియునుంగాక. "ఉత్పద్యన్తితథాచైవ వైశ్యాస్సార్థంతుక్షత్రియాః । శూద్రాణాంమన్త్రయోనిస్తు సమ్బన్ధోబ్రాహ్మణైస్సహ ॥ (మత్స్య అ-౧౪౩) క్షత్రియులు వైశ్యులతోను శూద్రులు బ్రాహ్మణులతోనుకలియుగమందు మంత్రయోని సంబంధము (వివాహము) కలదని యెట్లు చెప్పంబడినది.

బ్రాహ్మణానాం గౌతమశాపః,

౧౭. కాలస్యమహిమారాజ న్వక్తుంకేనహిశక్యతే । గౌర్నిర్మితా మాయయైకా ముమూర్షుర్జరతీనృప ॥ ౫౧ ॥ జగామసాచశాలాయాం హోమకాలేమునేస్తదా । హుంహుంశబ్దైర్నివారితాసా ప్రాణాంస్తత్యాజతత్క్షణే ॥ ౫౨ ॥ గౌర్హతానేనదుష్టేనేత్యేవంతేచుక్రుశుర్ద్విజాః। హోమంసమాప్యమునినా విస్మయంపరమంగతః ॥ ౫౩ ॥ సమాధిమీలితాక్షస్సశ్చింతయామాసకారణమ్। కృతంసర్వైర్ద్విజైరేత దితిజ్ఞాత్వాతథైవసః ॥ ౫౪ ॥ దధారకోపంపరమం ప్రళయేరుద్రకోపవత్ । శశాపచబుషీన్సర్వాన్కోపసంరక్తలోచనః ॥౫౫ ॥ వేదమాతరిగాయత్ర్యాం తద్ధ్యానేతన్మనోర్జపే।భవతానున్ముఖాయూయం సర్వథాబ్రాహ్మణాధమాః ॥ ౫౬॥ వేదేవేదోక్తయజ్ఞేషుతద్వా-

తా॥ ఓ రాజా కాలమహిమ చెప్ప నెవరివశము, పూర్వము (బ్రాహ్మణులచే) సన్నిహితమృత్యువుగల నొకముసలిగోవుమాయచే సృజింపంబడె॥౫౧॥ ఆగోవుహోమముచేయుచున్న గౌతమమునియొక్క యజ్ఞశాలకుపోయియుండగనామునియొక్క హుంకారధ్వనిచే నివారింపబడినదై తత్క్షణము ప్రాణములను విడిచెను ॥ ౫౨ ॥ అప్పుడా బ్రాహ్మణులు ఈ దుష్టుడైన మునిచే గోవు చంపబడెనని నిందించుచు ఆక్రోశించిరి. ఆపలుకులనువిని ముని హోమాంతర మచ్చెరు వొందుచు నతడు యోగసమాధియందు మూయబడిన నేత్రములు కలవాడై ఆలోచించగ నిదంతయు బ్రాహ్మణులచే చేయబడిన కృత్రిమమని దెలసికొని ప్రళయకాల రుద్రునివలె నహంకారమును జెంది కన్నులెర్రజేసిన వాడై నీ బ్రాహ్మణుల నందరిని శపించెను ॥౫౩ - ౫౪ ॥ ఓ బ్రాహ్మణాధములారా! వేదమాతయగు గాయత్రియందును తన్మంత్రధ్యాన జపములయందును అన్ని విధములచే మీరు పరాఙ్ముఖులౌదురుగాక ?॥ ౫౫ ॥ఓ అధమ బ్రాహ్మణులారా! వేదమందునువేదో-

ర్తాసు తథైవచ । భవతాను న్ముఖాయూయం సర్వథాబ్రాహ్మణాధమాః ॥ ౫౭ ॥ శివే శివస్య మంత్రేచ శివశాస్త్రే తథైవచ। భవతానున్ముఖాయూయం సర్వదా బ్రాహ్మణాధమాః ॥ ౫౮ ॥ మూలప్రకృత్యాం శ్రీదేవ్యాం తద్ధ్యానే తత్కథాసుచ । భవతానున్ముఖాయూయం సర్వదా బ్రాహ్మణాధమాః ॥ ౫౯ ॥ దేవీమంత్రే తథా దేవ్యా స్థానే సుస్థానకర్మణి। భవతానున్ముఖాయూయం సర్వథా బ్రాహ్మణాధమాః ॥ ౬౦ ॥ శ్రౌతస్మార్తసదాచారే జ్ఞానమార్గే తథైవచ । భవతానున్ముఖాయూయం సర్వథా బ్రాహ్మణాధమాః ॥ ౬౧ ॥ నిత్యకర్మాద్యనుష్ఠానే ష్వగ్నిహోత్రాదిసాధనే । భవతానున్ముఖాయూయం సర్వథా బ్రాహ్మణాధమాః ॥ ౬౨ ॥ స్వాధ్యాయాధ్యయనేచైవ తథాప్రవచనేపిచ । భవతానున్ముఖాయూయం సర్వథా బ్రాహ్మణాధమాః ॥ ౬౩ ॥ గోదానాదిషు దానేషు పితృశ్రాద్ధేషుచైవహి। భవతాను న్ముఖాయూయం సర్వథా బ్రాహ్మణాధమాః ॥ ౬౪ ॥ కృచ్ఛ్రచాంద్రాయణేచైవ ప్రాయశ్చిత్తే తథైవచ । భవతా-

క్తయజ్ఞమందును ఆలాగుననే ఆ మాటలయందును పరాఙ్ముఖులౌదురుగాక? ॥౫౬॥ ఓ బ్రాహ్మణాధములారా శివునియందును శివమంత్రమందును శివశాస్త్రమందును శివస్తోత్రమందును విముఖులగుదురుగాక?॥౫౭॥ఓ బ్రాహ్మణాధములారా సాక్షాన్మూలప్రకృతియగు శ్రీదేవియందు ఆమె ధ్యానమందు ఆమె కథలయందు పరాఙ్ముఖులౌదురుగాక ? ॥ ౫౮ ॥ ఓ బ్రాహ్మణాధములారా దేవియందును తన్మంత్రమందును తత్కర్మనిష్ఠలయందును పరాఙ్ముఖులౌదురుగాక?॥ ౫౯ ॥ ఓ బ్రాహ్మణాధములారా శ్రౌత స్మార్తకర్మలయందును సదాచారములందును జ్ఞానమార్గములయందును అన్నివిధములచే పరాఙ్ముఖులౌదురుగాక? ॥ ౬౦॥ ఓ బ్రాహ్మణాధములారా నిత్యకర్మలాచరించుటయందును ఔపాసనస్థాలీపాకాది అగ్నిహోత్రక్రియలయందును అన్నివిధములచే పరాఙ్ముఖులౌదురుగాక?॥ ౬౧॥ ఓ బ్రాహ్మణాధములారా! వేదాధ్యయనమందును అధ్యాపనమందును అన్నివిధములచె పరాఙ్ముఖులౌదురుగాక?॥ ౬౨ ॥ ఓ బ్రాహ్మణాధములారా! పితృశ్రాద్ధములయందును గోదానాద్యుత్తమదానములు చేయుటయందును విముఖులగుదురుగాక?॥౬౩॥ఓ బ్రాహ్మణాధములారా కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతములందును ఇతర ప్రాయశ్చిత్త కార్యములయందును విముఖులగుదురుగాక? ॥౬౪ ॥ ఓ అధమబ్రాహ్మణులారా! కాపాలిక మతాసక్తులును బౌద్ధశా-

నున్ముఖాయూయం సర్వదా బ్రాహ్మణాధమాః ॥ ౨౧ ॥ కాపాలికమతాసక్తా బౌద్ధశాస్త్రరతాస్సదా । పాఖండాచారనిరతా భవత బ్రాహ్మణాధమాః ॥ ౨౨ ॥ పితృమాతృసుతభ్రాతృ కన్యావిక్రయిణ స్తథా । భార్యావిక్రయిణ స్తద్వద్భవత బ్రాహ్మణాధమాః ॥ ౨౩ ॥ వేదవిక్రయిణ స్తద్వ త్తీర్థవిక్రయిణ స్తథా । ధర్మవిక్రయిణ స్తద్వద్భవత బ్రాహ్మణాధమాః ॥ ౨౪ ॥ మాతృకన్యాగామినశ్చ భగినీగామిన స్తథా । పరస్త్రీలంపటాస్సర్వే భవత బ్రాహ్మణాధమాః ॥ ౨౬ ॥ యుష్మాకంవంశజాతాశ్చ స్త్రియశ్చపురుషా స్తథా। మద్దత్తశాపదగ్ధా స్తే భవిష్యంతిభవత్సమాః ౨౭ ॥ కింమయాబహునో క్తేనమూలప్రకృతిరీశ్వరీ । గాయత్రీపరమాభూయా ద్వ్యషాసు ఖలుకోపితా ॥౨౮॥ తతో విప్రైశ్శాపదగ్ధైర్విస్మృతా వేదరాశయః । గాయత్రీవిస్మృతాసర్వై స్తదద్భుతమివాభవత్ ॥ ౩౪ ॥ తేసర్వేథమిలిత్వాతుపశ్చాత్తాపయుతా స్తథా । ప్రణేముర్మునివర్యంతందణ్డవత్పతితాభువి ॥ ౩౫ ॥ నోచుఃకించనవాక్యాంతులజ్జయాథోముఖాస్థితాః। ప్రసీదేతిప్రసీదేతి ప్రసీదేతిపునఃపునః॥౩౬॥ ప్రార్థయామాసు-

స్త్రనిరతులును ఎల్లప్పటికి పాషండాచారమందాసక్తులై ఉందురుగాక ? ।౨౧।। ఓ బ్రాహ్మణాధములారా తండ్రినితల్లిని కుమారునిఅన్ననుకుమార్తెనుభార్యనువిక్రయించుకొనువారలగుదురుగాక ! ।।౨౩।। ఓబ్రాహ్మణాధములారా వేదములనుపుణ్యతీర్థములను ధర్మములను విక్రయించువారలగుదురుగాక ! ।।౨౪।। ఓబ్రాహ్మణాధములారా మాతృ-కన్యా - భగినీ-గమనము చేయువారును ఎల్లప్పుడుపరస్త్రీలయందపేక్షగలవారలగుదురుగాక? ।।౨౬।। మీవంశములో పుట్టిన స్త్రీపురుషులు సహా నాశాపదగ్ధులై మీవలెనే వారుందురుగాక! ॥౨౭॥ ఓఅధములారా నింకనాచే చెప్పవలశినదేమున్నది. మూలప్రకృతియు సంరక్షణకర్తయగు గాయత్రిమీయందు కోపించినదియాగాక ॥౨౮॥ అంతట శాపదగ్ధులగు బ్రాహ్మణులందరు వేదసముదాయములం గాయత్రినిఅత్యద్భుతముగమరచినవారైరి।।౩౪।।ఇట్లు మరచిన పిదప బ్రాహ్మణులందరుగుంపుగూడిపశ్చాత్తాపయుక్తులై భూమిమీదకట్టెలవలెబడి గౌతమమునులకు నమస్కరించిరి ।। ౩౫ ।। ఓమహాత్మా మాకొరకు నీవు ప్రసన్నుండవు కావలెనని మున్మారు నడుగుచు అధోముఖులై సిగ్గుచే మరేమియుం బలుకచాలక ।। ౩౬ ।। ఇం-

రభితః పరివార్యమునీశ్వరం । కరుణాపూర్ణహృదయోమునిస్తాన్సమువాచహ ॥ ౮౭ ॥ కృష్ణావతారపర్యంతం కుంభీపాకేభవేత్స్థితిః । నమేనాక్యంమృషాభూయాదితిజానీథసర్వధా॥ ౮౮॥ తతఃపరంకలియుగే భువిజన్మభవేద్ధివామ్। మదుక్తంసర్వమేతత్తు భవేదేవనచాన్యథా॥౮౯॥ మచ్ఛాపస్యవిమోక్షార్థంయుష్మాకం ధిషణాభవేత్ ।తర్హిసేవ్యంసదాసర్వైర్గాయత్రీపదపంకజం॥ ౯౦ వ్యాసః ॥ ఇతిసర్వాన్విసృజ్యాథగౌతమోమునిసత్తమః । ప్రారబ్ధమితిమత్వాతు చిత్తేశాంతింజగామహ ॥ ౯౧ ॥ ఏతస్మాత్కారణాద్రాజన్గతేకృష్ణేతుధామని । కలౌయుగేప్రవృత్తేతుకుంభీపాకాత్తునిర్గతాః ॥ ౯౨ ॥ భువిజాతాబ్రాహ్మణాశ్చశాపదగ్ధాఃపురాతుయే । సంధ్యాత్రయవిహీనాశ్చ గాయత్రీభక్తివర్జితాః ॥ ౯౩ ॥ వేదభక్తివిహీనాశ్చపాఖణ్డిమతగామినః । అగ్నిహోత్రాదిసత్కర్మస్వధాస్వాహావివర్జితాః ॥ ౯౪ ॥ కాపా-

ట్లు దీనులై గౌతమమునిని చుట్టుకొని అనేక విధముల ప్రార్థించగ వార్లనుచూచి కరుణారసపూరితహృదయుఁడై లెస్సగ పలికెను ॥ ౮౭ ॥ ఓ బ్రాహ్మణులారా ! మీరు కృష్ణావతారపరిసమాప్తిపర్యంతము కుంభీపాకమను ఘోరనరకమందుండవలయు. నావాక్యమెప్పటికి వ్యర్థమగునదికాదు ॥ ౮౮ ॥ నరకానంతరమున కలియుగమందీభూమిలో మీరు బ్రాహ్మణజన్మమునే బొంది నేనిప్పుడు చెప్పినప్రకారమనుభవింపకదప్పదు॥౮౯॥ అయితే నాశాపవిమోచనముచేసుకొనునిచ్ఛమీకుగలిగెనేని గాయత్రియొక్క పాదకమలమును చక్కగా సేవింపవలయు ॥ ౯౦ ॥ వ్యాసుడు చెప్పనట్లు ఈప్రకారము బ్రాహ్మణులనందరిని విడిచిపెట్టినవాడై గౌతముడు వీరల ప్రారబ్ధమిట్లున్నదని తలచి తనమనస్సున శాంతిదెచ్చుకొనియె ॥ ౯౧ ॥ ఈకారణమున కృష్ణావతారమైన పిదప కలియుగమందు కుంభీపాక నరక విముక్తులైన బ్రాహ్మణులు ॥ ౯౨ ॥ పూర్వమెందరు శాపదగ్ధులైయుండిరో వారందరు భూమియందుబుట్టి ప్రాతర్మధ్యాహ్న సాయంకాల త్రిసంధ్యలనువిడిచి గాయత్రియందు భక్తిలేనివారై ॥ ౯౩ ॥ వేదమందుభక్తిరహితులై పాషండమతప్రవిష్టులై అగ్నిహోత్రాది సత్కర్మరహితులైయుందురు ॥ ౯౪ ॥ మరియు పండితులైనను దురాచారమునం-

లికాః కౌలికాశ్చబౌద్ధాజైనాస్తథాపరే । పణ్డితాఅపి తేసర్వే దురాచారప్రవర్తకాః॥౯౬॥ లంపటాఃపరదారేషు దురాచార పరాయణాః । కుంభీపాకంపునస్సర్వేయాస్యంతినిజకర్మభిః॥౯౭॥

ఇతి దేవీభాగవతే ద్వాదశస్కన్ధే బ్రాహ్మణానాం

గౌతమశాపవర్ణన న్నామ నవమోఽధ్యాయః ॥

దే వర్తించుచు కాపాలికులుగను కౌలికాచారములుగలవారుగను బౌద్ధులుగను, జైనులుగనుండెదరు ॥ ౯౬ ॥ పరస్త్రీగమన దురాచారాసక్తులై తిరుగుచు మరల తమ కర్మలచే కుంభీపాకనరకమునకు పోయెదరు ॥ ౯౭ ॥

౧౮, ఏతత్పురాణోక్త గౌతమశాపవశాత్సర్వే బ్రాహ్మణాః వేదబాహ్యాఃకర్మహీనాఃభవన్తి। తత్సాహచర్యాత్ క్షత్రియవైశ్యావపి కర్మహీనౌభవతః। తస్మాత్ బ్రహ్మక్షత్రియవైశ్యాః "సయః కామయేత బ్రహ్మవర్చసీ స్యామితి వసంతే సఆదధీత । బ్రహ్మవై వసంతః బ్రహ్మవర్చసీ హైవభవతి ॥ అథయః కామయేత క్షత్రగ్ం శ్రియాయశసాస్యామితిగ్రీష్మేసఆదధీత । క్షత్రంవై గ్రీష్మఃక్షత్రగ్ంహైవ శ్రియాయశసాభవతి ॥ అథయఃకామయేత బహుః ప్రజయాపశుభిస్స్యామితి । వర్షాసుసఆదధీత । విడ్వై వర్షాఅన్నంవిశఃబహుర్హైవ ప్రజయాపశుభిర్భవతి । యఏవం విద్వాన్వర్షాస్వాధత్తఇతి" శతపథశ్రుత్యా వేదోక్త కర్మానుష్ఠానాధికారిణోపి కలియుగప్రభావాద్విధ్యుక్త కర్మాణినా-

తా ॥ ఈపురాణమందు చెప్పంబడిన గౌతమశాపవశముచే సమస్తబ్రాహ్మణులు వేదబాహ్యులుగాను, కర్మహీనులుగా నగుచున్నారు. వీరల సహచర్యమువలన క్షత్రియ వైశ్యు లున్నట్లుగానే యుంచున్నారు. అందువలన బ్రహ్మవర్చస్కాముడైన బ్రాహ్మణుడువసంతఋతువందును,క్షత్రతేజస్కాముడైన క్షత్రియుడు గ్రీష్మఋతువందును, విశేషసంతానము పశువులను అన్నమునుకోరువైశ్యుడువర్షఋతువందును లేదాఅందురువర్షఋతవందుగాని యాగములుచేయవలసినదిగాశతపథశ్రుతిప్రకారేణ కర్మాధికారులైనం కలియుగ ప్రభావమున విధ్యుక్తకర్మల నాచరించకపోమిని వీరలు

చరంతిస్మ । ఏతాదృశేషుకోవా బ్రాహ్మణః? కఃక్షత్రియః? కో వైశ్యః? ఇతి శంకాయాంసత్యాం “ శ్లో ॥ “యుగేయుగేచయే ధర్మా స్తత్రతత్రచ యేద్విజాః తేషాంనిందానకర్తవ్యా యుగ రూపాహితేద్విజాః” ॥ ఇత్యాది స్మృతి ప్రమాణేన కర్మరహితా అపి శాస్త్ర రీత్యాయేతు యుగధర్మ రూపాస్తిష్ఠన్తి త ఏవ బ్రహ్మ క్షత్రియ వైశ్యాఇతి జ్ఞాతవ్యం ॥ తస్మాద్ద్విజాః నిందార్హానభవంతి । కలియుగే ధర్మప్రవర్తనాయ అవతరద్భిః శ్రీభుక్క-మహారాజాస్థాన ప్రధానమంత్రిభిః శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శంకర భగవత్పాదాచార్య శ్రీశృంగేరీ పీఠస్థితైః సర్వవేదభాష్యకర్తృభిః లోకప్రసిద్ధైః మహానుభావైః శ్రీమాధవాచార్యైః కృతపరాశరమాధవీయ గ్రంథేకాదశాధ్యాయోక్తపంచాశత్శ్లోకవ్యాఖ్యానే అధ్యయన విధిస్తావదర్థజ్ఞానపర్యంతంసాంగవేదమాచష్టే । నచకలౌయుగే తాదృశంవిప్రంకంచిదప్యుపలభామహే। తథాబ్రహ్మచర్యాదిప్ర-

లోబ్రహ్మక్షత్రియ, వైశ్యులెవ్వరనిశంకకలుగుచుండ నేయేయుగమందేయేధర్మములు ఏయేద్విజులుఉందురో వారలను నిందించగూడదు. వారలు యుగరూపులని చెప్పబడినందున వేదోక్తకర్మరహితులుగనున్నం శాస్త్రరీత్యా ఎవరుయుగరూపులుగనుందురోవారలే బ్రహ్మ,క్షత్రియ, వైశ్యులని గుర్తెరుగం దగును. వారలు అనిందార్హులు. ఇందు కనుకూలముగ కలియుగమునకు ధర్మప్రవర్తకులుగ నవతరించిన శ్రీభుక్క-మహారాజా స్థాన ప్రధాన మంత్రులగు శ్రీమత్పరమహంస పరి వ్రాజకాచార్య శంకర భగవత్పాదాచార్య శృంగేరీ పీఠస్థులుం సర్వ వేద భాష్య కర్తలుం లోక ప్రసిద్ధి కెక్కిన మహాను భావులగు శ్రీమాధవా చార్యుల వారిచే పరాశర మాధవీయమను గ్రంథము నందే కాదశాధ్యాయంబున ౫౦ దవ శ్లోక వ్యాఖ్యానము నందు వివరించిన దేమనగ: — అధ్యయన విధియైతె అర్థజ్ఞాన పర్యంతము సాంగవేదమునుచదువవలయునని చెప్పంబడినది. అయితే నట్టి సాంగ వేదాధ్యాపకుడగు బ్రాహ్మణులనెవకరిం యీ కలియుగంబునపొందము. ఆలాగుననే బ్రహ్మచర్యాది ప్రకరణమందు స్మరింపంబడు ఆశ్రమాధ్యయన ధర్మములుం ఇంక సర్వధర్మములను చే-

కరణేతదాశ్రమధర్మా అధ్యయనధర్మాశ్చసహస్రశః స్మర్యంతే। న
చ తాన్ సర్వాన్యథావదను తిష్ఠన్మాణవకః కోఽప్యుపలభ్యతే। యదా
ధ్యయనస్యైవేదృశీగతిః తదా కాకథా సాంగ కృత్స్నవేదా
ర్థానుష్ఠానస్య । తథా సతి శాస్త్రీయ ముఖ్యబ్రాహ్మణ్యోపేత
స్యైకస్యాప్యభావాత్ । తథోత్తమ క్షత్రియ వైశ్యజాత్యోరభా
వాచ్చ । శుశ్రూషయితవ్యానాం ద్విజానామసంభవేత చ్ఛుశ్రూ
షకస్యముఖ్యస్యశూద్రస్యాత్యంతమనాశంకనీయత్వాత్ । కిం
చాతుర్వర్ణ్య ముద్దిశ్యప్రవృత్తం ధర్మశాస్త్రం స్వరూపేణైవా
లుప్యతాం। కింవాముఖ్యాసంభవేపి యథాసంభవంచాతుర్వర్ణ్య
మాశ్రిత్య ధర్మశాస్త్రంప్రవర్తతామితి మీమాంసాయాం స్వ
రూపలోపాద్వరం యథాసంభవానుష్ఠానమిత్యభిప్రేత్య యుగ
ప్రయుక్తాం సర్వైరప్యవర్జనీయాం మధర్మ ప్రవృత్తిమ
దోషత్వేనాభ్యుపగమ్య తేషాంనిందానకర్తవ్యేత్యుక్తం తత
స్సంభావితాధ్యయనాద్యుపేతాయాంశక్యయాంధర్మప్రవృత్తౌ-

యునట్టి బ్రహ్మచారియును కానుపింపడు. గాన వేదాధ్యయనమునకే నిట్లుండ అంగ
ములతో సమగ్రముగ వేదార్థముం చదివి యనుష్టించుట యెక్కడిమాట. ఈలాగున
నుండగ శాస్త్రీయమైన ముఖ్యబ్రాహ్మణ్యముతోగూడుకొనిన బ్రాహ్మణుండెటుల లేక
పోయెనో యాలాగుననే ఉత్తమక్షత్రియవైశ్యజాతులు లేకపోయెను. ఇట్లుశుశ్రూష చే
యించుకొనదగు ద్విజులు లేక పోయియుండ శుశ్రూషచేయదగిన ముఖ్యుడగు శూ
ద్రుడున్నాడనుట విచారింపననావశ్యకము. గాన నాలుగువర్ణములనుద్దేశించి ప్రవర్తిం
పంబడిన ధర్మశాస్త్రమున్ను స్వరూపముచేలోపించినదాయేమిలేక ముఖ్యజాతులు
లేకపోయినం యథాసంభవముగనున్న నాలుగు వర్ణముల నాశ్రయించి ధర్మశాస్త్ర
ముప్రవర్తించినదాయనెడి మీమాంసయందు స్వరూపలోపము చేయుటకంటె య
థాసంభవానుష్ఠానము శ్రేష్టమైనది. గాన యుగమునందు చేయదగినటువంటిన్ని అం
దరిచేవిడువదగనియధర్మ ప్రవృత్తిని యదోషముగ నంగీకరించి ద్విజులనిందచేయ
కూడదని చెప్పంబడినది. కాబట్టి సంభావితమయిన అధ్యయనాదులతో కూడుకొ
నిన ధర్మప్రవర్తనయందు ప్రమాదాలస్యాదులు లేనట్టి పురుషులసభయునే
క్కడనులేదు. ఇకనేమన ప్రాయశ్చిత్తము చేయబడి ప్రమాదాలస్యాదులులేని పురు-

